మాక్సింగోర్కీ

# భయస్థుడు

*(The man who was afraid*
*or*
*Foma Gordyieff)*



అనువాదం
రెంటాలగోపాలకృష్ణ




ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ

అంకితం

ఆన్‌టాన్ పి. చెకోవ్‌కు

—మాక్సిం గోర్కీ

"ఫోమా గార్డియెవ్ (The man who was afraid) గొప్ప గ్రంథం. ఒక్క రష్యాదేశ వైశాల్యమే కాదు, జీవన వైశాల్యంకూడా ఈ గ్రంథంలో విస్తృతంగా ప్రతిఫలిస్తుంది. మారుబేరాలతో, వర్తకవర్తులాలతో వికృతమై మానవత క్షీణదశకు వస్తున్న నేటి యుగంలో, ఉజ్వల మానవవ్యక్తులు ఉద్భవించి సముజ్వలజీవనోద్వేగాన్ని ప్రసరింపజేస్తారు. ఈ నవలలో ఫోమాకూడా ఇలాటి వ్యక్తే. అతనూ జీవితంతో అసంతృప్తి చెంది, జీవితంకోసం అన్వేషించి ఆవేదనపొంది అంతులేని అగాధంలో పడిపోయిన అదృష్టహీనుడు......

ఆఖరుపేజీ చదివి పుస్తకాన్ని ఆవలపెట్టగానే మన మనస్సు ఆస్పత్రిలా అల్లకల్లోలమవుతుంది. అసత్యాలతో అనిత్యాలతో తీరని ఆరని మోహ దాహాలతో వ్రణకిణాంకితమైన జీవితం సర్వాంగనగ్నంగా సాక్షాత్కరిస్తుంది. అయినా ఇది ప్రతి ఆలోచనాపరుడూ చదివితీరవలసిన గ్రంథం. సమాజ రుగ్మతను పృథక్కరించి విపులంగా చూపే గ్రంథం ఇది. నిర్దాక్షిణ్యంగా రంగురంగులముసుగులు తీసి లోకాన్ని శోకాన్ని వివృతంచేసి చూపి శ్రేయస్సుకే దోవతీస్తుంది. నిదురించే అంతరంగ దీపశిఖను ఎగదోసి ప్రజ్వలితంచేస్తుంది. సమిష్టిజీవనసమరోన్ముఖం కావిస్తుంది. మరేంకావాలి ?"

—జాక్ లండన్.

# అ భి ఖ్య

మానవాంతరాల అగాధకుహరాల్లో నిదురించే అంధ శక్తులు మేలుకుని చేసిన ఆక్రందన గోర్కీ. ఇరవయ్యో శతాబ్దం లోని బైరన్ గోర్కీ. విచలితులకు విపన్నులకు పీడిత తాడిత జనావళికి ప్రతినిధి గోర్కీ. దారినిపోయే భిక్షుకునిలా యాచించడు గోర్కీ - మహారాజులా ఆజ్ఞాపిస్తాడు కాని.

బైరన్ కవిత ఒక మహా జలపాతం. సాహస స్వాప్నికుల సరభస సంగీతం, లేమిలోనే కలిమి చూచి విషాద విషాన్ని పుక్కిటపట్టిన విపథగాముల విలయగానం బైరన్‌కవితలో అడుగడుగునా ప్రతిధ్వనించి ప్రతిస్పందిస్తాయి. పద్యంలో బైరన్ ఎలాగో గద్యంలో గోర్కీ అలాగే.

చెకోవ్ ఒడ్డుదాటని చల్లని స్రవంతి. మపాసాలోని వినతి చెకొవ్‌లో కనిపిస్తుంది. టాల్‌స్టాయ్‌కంఠస్వరం అతీత మైన అందని రోదసి. కాని గోర్కీగొంతు ఒక సింహగర్జ, ఒక భయద జలదగర్జ.

గోర్కీ పలుముఖాల జీవితాన్ని దర్శించాడు. పతితులనూ భ్రష్టులనూ తాగుబోతులనూ వ్యభిచారులనూ అవలోకించి అవగతంచేసుకున్నాడు. అంచాతనే హద్దులూ ఆనకట్టలూ లేని అనాది మానవశక్తిసముద్రఘోష గోర్కీ గొంతులో సహస్రముఖాల ద్యోతకమవుతుంది. బ్రతుకులోని అపశ్రుతులన్నీ ఒక్కమాటు ఒక్కశ్రుతిగా వినిపిస్తాయి.

విరహపూరితమైన మానవ మనోవ్యథల విలాపగానం గోర్కీ గొంతులో వినిపిస్తుంది. ప్రపంచప్రజల బాధల గాథాగీతం గోర్కీ గొంతులో వినిపిస్తుంది.

భ్రష్టులలో, బాధాసర్పదష్టులలోనే ఉత్తమ మానవతను దర్శిస్తాడు గోర్కీ. అందరి బాధా అతనిబాధ అందరి గాథా అతని గాథ. అశాంతిలో శాంతి, బాధలో సుఖం, తుఫానులో నిశ్చలత చూస్తాడు గోర్కీ. అదే పాట మనకూ వినిపిస్తాడు, ఈ గ్రంథంలో.

ఈ నవలలో నాయకుడు ఫోమా గార్డియెవ్ అనే యువకుడు. అతనూ శ్రీమంతులకడుపున పుట్టాడు. కాని ఆ సిరితోనే అతను వేగలేకపోయాడు. లుకలుకలాడే సిరిసంపదలలో శాంతిని చూడలేకపోయాడు. జీవితంతో అసంతృప్తి చెందాడు. జీవితం కోసం అన్వేషించి ఆవేదనపొందాడు. అతని అంతరంగంలో ఏదో రగిలింది, భగభగ మండింది. బయటికి పొంగింది. ఉజ్వల మానవతను ఉరితీస్తున్న సమాజాన్ని ఎదిరించాడు. నిలబడి నిజాన్ని చెప్పాడు సమాజంపై నేరం ఆరోపించాడు.

కాని, అతను భయస్థుడు; బలహీనుడు. భగ్గున మండిన దీపశిఖ చప్పున చల్లారింది. ఆ విషాన్ని, ఆ విషవిషాదాన్ని తనే తాగాడు అంతులేని అగాధంలో పడిపోయాడు.

అదృష్టహీనుడు ఫోమా. అయినా విషవర్తులాలమధ్య వికృతమై క్షీణిస్తున్న మానవతకు ఒక జీవనజ్యోతి, ఒక అమర జ్యోతి ఫోమా!

రెంటాల గోపాలకృష్ణ

# భయస్థుడు

## ఒకటో అధ్యాయం

సుమారు అరవై సంవత్సరాల క్రితం వోల్గానదీ తీరంలో సిరి కుప్పలు తెప్పలుగా కురిసి నలుదెసల విరజిమ్ము తోంది. ధనం! ధనం మూల్గుతోంది. పిలిస్తే చాలు, పలుకుతోంది దేవతా కథల్లో చెప్పుకున్నట్లు. ఎవడైనా ఒక్కమాటు అటు వెళ్ళొస్తే చాలు, ఇట్టే కోటీశ్వరుడై పోతున్నాడు. ఇగ్నాట్ గార్డియెవ్ అప్పటికింకా చిన్నవాడు. ఒక పడవమీద నీళ్ళు తోడేవాడుగా పనిచేస్తున్నాడు. ఆ పడవ ఒక భాగ్యవంతుడైన వర్తకుడిది. అతని పేరు జయెవ్.

ఇగ్నాట్ గార్డియెవ్ ఎద్దంత మనిషి. సుందరమైన విగ్రహం. కండగల్గ శరీరం. తెలివైనవాడుకూడా. అతని ముఖం చూడగానే చెప్పవచ్చు, అదృష్టశాలి అని.

అసలు కొందరు వ్యక్తులుంటారు. వారిని ఎప్పుడూ విజయం వరిస్తూ ఉంటుంది. లక్ష్మి వారివెంట నడుస్తూఉం టుంది. అందుకు కారణం వారి సామర్థ్యంకాదు. వారు కష్ట పడి పనిచేయడంవల్లనూ కాదు. వారిలో ఎప్పుడూ కొండంత శక్తి కోటకట్టుకుని ఉంటుంది. వారు ఏదొచ్చినా తొణకరు, బెణకరు. దేనినీ కాలతన్నరు. నిజానికి అలాటి స్వభావనే కాదు వాళ్ళది. వాళ్ళు తాము పట్టినపట్టు వదలరు అను కున్నది చేసితీరతారు. దాని అంతుచూస్తారు. ఒక్కోమాటు

వీరు తమ అంతరాత్మలను గురించి భయభక్తులతో మాట్లాడతారు. ఆ అంతరాత్మలతో పోరాడి నిజంగా యాతన అనుభవిస్తారుకూడా. కాని వారిలో బలహీనుడు మాత్రమే తన అంతరాత్మను జయించలేకపోతాడు. బలవంతుడు దానిని సులువుగా లొంగతీసుకుని తనకు బానిసగా చేసుకుంటాడు. దాని ద్వారా తన పనులు సాధించుకుంటాడు. ఈ పోరాటంలో అతను అనేక రాత్రులు కన్ను కూడా మూయడు. ఒకవేళ తుదకు తన అంతరాత్మ జయించడం సంభవిస్తే, ఆ అపజయం వల్ల అతని శక్తిమాత్రం ఛిద్రమైపోదు. ఎప్పటిలాగే అతను ఆ శక్తిని ఆధారంగాచేసుకుని, బలీయంగా జీవనయాత్రలో ముందుకు సాగిపోతుంటాడు. ఈ కోవకు చెందినవాడే ఇగ్నాట్ గార్డియెవ్.

...నలభై సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి ఇగ్నాట్ గార్డియెవ్ తానే మూడు స్టీమర్లకూ పన్నెండు పడవలకూ యజమాని అయ్యాడు. వోల్గానదీతీరమంతటా అతని కీర్తి వ్యాపించింది. అందరూ అతన్ని గౌరవిస్తున్నారు. కలిమికీ తెలివికీ ఇగ్నాట్‌ను మించినవారు లేరని ప్రసిద్ధిగా చెప్పుకుంటున్నారు. కాని అతనికి "చపలచిత్తుడు" అని పేరుపెట్టి అందరూ ఎగతాళి చేస్తుండేవారు. ఎంచేతనంటే సాటివారి జీవితాలకుమల్లే అతని జీవితం సాఫీగా సాగిపొయ్యేదికాదు. తిరుగుబాటుచేసే స్వభావం అతనిది. అదెప్పుడూ అతనిలో తుకతుక ఉడికిపోతూ ఉండేది. మూలస్థానంనుంచి ఒక్కమాటుగా ముందుకు దూకేది. దోవలు చీల్చుకుంటూ డబ్బు వెంటపడి పరుగెత్తేది. డబ్బు! డబ్బే అతని జీవితం. డబ్బుకోసమే అతను జీవించడం.

ఆ డబ్బు సంపాదించడంకోసం అతను తనలో ముగ్గురు ఇగ్నాట్‌లు ఉన్నట్టుగా ప్రవర్తించేవాడు. అవును. అతని దేహంలో మూడు ఆత్మలున్నాయి. అందులో ఒకటి మరింత ముఖ్యమైనది. ధనం సంపాదించడమే దాని పని. దాని నేర్పంతా అందులోనే. అది కొరడాలు పట్టుకుని ఇగ్నాట్‌ముందు నిలబడుతుంది. ఇంకేం? ఇగ్నాట్‌కు దయ్యం పట్టుతుంది. ధనపిశాచం అతన్ని ఆవహిస్తుంది. అదొక తృష్ణ. ఆ తృష్ణ అతనిలో రాత్రింబగళ్ళు మండుతూ ఉంటుంది. ఆ మంటలు అతని దేహాన్నీ ఆత్మనూ కూడా దహిస్తాయి. ఆ నిప్పుల నాల్కలు అతన్ని పట్టుకుని మింగేస్తాయి. అప్పుడతను కార్యరంగంలోకి దూకుతాడు. పరుగెత్తుతాడు. వందలూ వేలూ రూబుళ్లు పట్టుకుంటాడు. పోగుచేస్తాడు. గలగల మనే ధనం, ఖంగుఖంగున మ్రోగే బంగారం కొంగున కడతాడు. ఆ సిరి నృత్యం చేస్తుంది. ఆ తీయని మ్రోతలు ఎన్నడూ విననట్టు విని పొంగిపోతాడు. వోల్గానది మీద పైకీ క్రిందికీ పరుగులుతీస్తాడు. వలలు విసిరేస్తాడు. ఉచ్చులు బిగిస్తాడు. బంగారం పట్టుకుంటాడు. జాగ్రత్తగా పెట్టుకుంటాడు. గ్రామాలకు వెళ్ళి ధాన్యం కొంటాడు. తన పడవల్లో పోసుకుని రైబిన్స్క్ తీసుకుపోతాడు. అతను మోసాలుచేశాడు—ఒక్కొక్కమాటు తెలియక, ఒక్కొక్కమాటు తెలిసి సాహసంతోను—తను మోసంచేసిన వాళ్ళ ముఖాల్లోకి చూచి ఎప్పుడూ విజయగర్వంతో నవ్వుతాడు. చివర కతని డబ్బుసిచ్ఛ ఎందాకా వెళ్ళిందంటే, తీవ్రమైన కవితా వ్యామోహాన్నికూడా మించిపోయింది. ధనార్జనకోసం అతను ఇన్నిపాట్లు పడినప్పటికీ అతన్ని అత్యాశాపరుడని అనడానికి ఎంతమాత్రం వీల్లేదు.

అంతేకాదు. ఒక్కోమాటు అతను డబ్బాతే లెక్కలేనట్టుగా, తన ఐశ్వర్యంపట్ల తనకే ఆసక్తి లేనట్టుగా ప్రవర్తిస్తాడు.

ఒకనాడు వోల్గానదిమీద మంచుగడ్డలు ముక్కలు ముక్కలుగా పగిలిపోతున్నాయి. మంచు కరిగి తెప్పలు తెప్పలుగా నీళ్ళపై తేలుతూ వస్తోంది. అప్పుడు ఇగ్నాట్ నదిలో ఉన్న తన పడవను పరిశీలిస్తూ ఒడ్డున నిలబడిఉన్నాడు. నదిలో తేలుకుంటూ వస్తున్న మంచుమడులు పడవను తాకి నలగగొట్టేస్తున్నాయి. పడవ వచ్చి ఏటవాలుగా ఉన్న ఒక గట్టుకు గట్టిగా కొట్టుకుని ముక్కలైపోయింది. ఆ పడవ పొడుగు రెండు వందల యాభై అడుగులు. సరికొత్తపడవ. దాని పేరు "బొయారినా"

"అదీ వరస ! బాగుంది...భలేబాగుంది...మరొక్కమాటు దాన్ని పిండిపిండిచేసెయ్యి......ఊఁ......రా. నీకే చెప్పేది, మరొక్కమాటు!" అంటూ పళ్లు బిగపట్టి గొణుక్కున్నాడు ఇగ్నాట్.

"ఏమోయ్, ఇగ్నాట్! చూడబోతే ఆ మంచు నీ జేబులోంచి చల్లగా పదివేలు గుంజుకునేట్టు కనిపిస్తోంది" అన్నాడు మయకిన్. మయకిన్ ఇగ్నాట్‌కు ప్రాణస్నేహితుడు. అతని బిడ్డలకు రక్షకపితకూడాను.

"అయితే కానీయి. మరో నూరువేలు పుట్టిస్తాను. కానీ, చూడు! వోల్గానది ఏంచేస్తున్నదో చూడు ! ఆరిభగవంతుడా! ఏంశక్తి దానిది! తలుచుకుంటే అది భూదేవిని సాంతం పుక్కిటపట్టి తల్లక్రిందులుచేస్తుంది. చూడు! అదిగో, నా "బొయారినా" పడవ. పోతోంది. అది నాకు పనిచేసిందల్లా

ఒక్కబుడుతవే. అప్పుడే నాశనమైపోతోంది. సరే, అదిపోతే పోయింది దాని జ్ఞాపకార్థం ఒక గుక్కెడు తాగివద్దాం రా. ఏం, తాగుదామా?" అన్నాడు మళ్ళీ ఇగ్నాట్.

పడవ ముక్కలు ముక్కలై పోయింది ఇగ్నాట్బూ అతని స్నేహితుడు మయకినూ నదీతీరానఉన్న సారాఅంగట్లో కిటికీ ప్రక్కన కూచుని వోడ్కా తాగుతున్నారు. పగిలి మిగిలి పోయిన "బారియారినా" ముక్కలు నదీప్రవాహంలో మంచుతో కలిసి కొట్టుకపోవడంలేక పరిశీలిస్తున్నారు.

"పడవపోయిందని విచారంగా ఉందా ఇగ్నాట్?" అనడిగాడు మయకిన్.

"విచారించడంలో అర్థంలేదు. వోల్గా ఇచ్చింది, మళ్ళీ వోల్గాయే పుచ్చుకుంది, నాచేతుల్లోంచి ఏమీ లాక్కొని పోలేదే." అన్నాడు ఇగ్నాట్. "అయినప్పటికీ..."

"ఏమిటి అయినప్పటికీ? కనీసం ఇదంతా కళ్ళారాచూచే భాగ్యం కలిగింది. ఇదీ మంచిదే. ముందైనా జాగ్రత్తగా ఉండమని గుణపాఠం నేర్పింది. క్రిందటిమాటు నా "వోల్గార్" తగలబడినప్పుడు కళ్ళారా చూడలేకపోయాను. నిజానికి విచారకరం. అంత పెద్ద పడవ అర్ధరాత్రిలో తగలబడిపోయి అగ్ని జ్వాలలు లేస్తోంటే ఎంత అద్భుతంగా ఉండి ఉంటుందో! అవునా! అంతపెద్ద స్త్రీమరది."

"అదలా పాడైనందుకు కూడా నీవు విచారించడం లేదనుకుంటాను అవునా?" "ఆ స్త్రీమనుకోసమా? కాదు. ఆ మాట అనలేను. నిజంగా దానికోసం నాకు విచారం కలిగింది. కాని విచారించడం తెలివితక్కువ పని. ఏమిటి లాభం?

ఏడ్చినంతమాత్రాన—కన్నీళ్ళతో కడుపుమంట చల్లారుతుందటయ్యా? స్త్రీమర్లన్నీ దగ్ధమైపోనీ. అన్నీ ఒక్కమాటుగా దగ్ధమైపోయినా సరే, వాటి మొహాన ఛీ అని ఉమ్మేసి ఊరుకుంటాను. నాలోపల మంటలు మండుతున్నంతవరకూ నా కే విచారమూ లేదు." అన్నాడు ఇగ్నాట్.

"హు! నీ మాటల తీరే అంత. వంటిమీద చొక్కా గుడ్డ లేకపోయినా వాడు భాగ్యవంతుడు లాగా మాట్లాడుతాడు. భాగ్యవంతుడుగానే ఉంటాడు." అన్నాడు మయకిన్, ఓ చిన్న చిరునవ్వు నవ్వి.

ఇలా వేలకొద్దీ రూబుళ్ళు నాశనమైపోతున్నా పెద్ద వేదాంతిలా మాట్లాడే ఇగ్నాట్, ప్రతికోపెక్కూ ఎంత విలువైనదో ఎరక్కపోలేదు. అతను బిచ్చగాళ్ళకు డబ్బివ్వడం బహు అరుదు. ఆ ఇచ్చినప్పుడైనా ఏపనీ చెయ్యలేని నిరాధారులకు మాత్రమే ఇస్తాడు. కాస్త పని చెయ్యడానికి పనికొచ్చే బిచ్చగాడెవడైనాసరే కనిపిస్తే ఇగ్నాట్ నిర్మొహమాటంగా ఇలా అనేవాడు.

"వెళ్ళవోయి వెధవాయి! నీవేం పనిచేయలేకపోయావా? ఇదిగో, వెళ్ళి, నా కూలీలకు సహాయపడు. ఆ ఎరువు కుప్ప కాస్తా ఎత్తిపొయ్యి. నీకు రెండు కోపెక్కులిస్తాను."

ఇగ్నాట్ పూర్తిగా తన పనిలో మునిగి ఉన్నప్పుడు, అందరియెడల దయతలుస్తున్నట్టు జాలిపడుతున్నట్టు ప్రవర్తించేవాడు. కాని డబ్బుకోసం వేటాడేటప్పుడు మరింత నిర్దాక్షిణ్యంగా సంచరించేవాడు. కాని హఠాత్తుగా (ఇది సాధారణంగా వసంతఋతువులో - లోకమంతా పచ్చగా

విచ్చిన వనంలా ఉన్నప్పుడు — వినూత్న సౌందర్యంతో తొణికిసలాడుతూ ఉన్నప్పుడు—వినీల నిర్మలాకాశాన్ని వీక్షిస్తూ తన ఆత్మలో ఏవో ఆనందాలు, అనంతశక్తులు అవతరించి నప్పుడు సంభవిస్తూ ఉండేది) అతను మారిపోయేవాడు. తను తన విషయాలకు యజమానిని కాననీ, అవే తనను పాలించే యజమాని అనీ, తాను వాటికి నీచమైన బానిసననీ అనుకునే వాడు. అప్పు డతను ఆలోచనల్లో మునిగిపోయేవాడు. తన ఒత్తుగా ఉన్న కనుబొమలు ముడివైచుకుని తన్నుతాను పరిశీలించుకుంటున్నట్టూ, తన్నుతాను ప్రశ్నించుకుంటున్నట్టూ కూచునేవాడు. ఆ ప్రశ్న ఏమిటో బయటికి చెప్పలేకపోయేవాడు. అడగడానికి భయపడేవాడు. కోపం తెచ్చుకునేవాడు. ఉద్రేక పడుతూ పిచ్చివాడిలా గంటలతరబడి కూర్చుండిపొయ్యేవాడు. అప్పు డతనిలో ఉన్న మరో ఆత్మ మేల్కొనేది. భయంకర మైన తృష్ణతో మండిపోతున్న ఆత్మ అది. ఆకలిగొన్న మృగం లాంటి ఆత్మ అది. అప్పుడు మనుష్యులపట్ల మొరటుగా ప్రవ ర్తించేవాడు. అందరితోనూ కటువుగా మాట్లాడేవాడు. తాను వళ్ళు తెలీకుండా తాగేవాడు. తనచుట్టూ ఉన్నవారిని తాగించే వాడు. వెర్రి ఆనందంతో పొంగిపొయ్యేవాడు. అతని లోపల ఏదో మురికి పేరుకుని అగ్నిపర్వతంలా భగభగ మండుతూ ఉండేది. తనంతట తానే తగిలించుకున్న సంకెళ్ళను తానే పగులగొట్టడానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపించేవాడు. వాటిని పగులగొట్టడానికి భయంకరంగా ప్రయత్నించినా పాపం, అతనికి శక్తి చాలేదికాదు. అసహ్యంగా పిచ్చివాడిలా అగుపించే వాడు. తాగుడువల్ల, నిద్రలేమివల్ల అతని మొహం పొంగిఉండేది.

ళ్ళు చింతనిప్పుల్లా మండుతుండేవి. కంఠస్వరం కర్కశంగా ఉండేది. గర్జించేవాడు. బుసలు కొట్టేవాడు. రొప్పుతూ రోజుతూ. వెళ్ళినచోటుకు వెళ్ళకుండా వరుసపెట్టి సారా అంగళ్ళు చుట్టూ, సానికొంపలచుట్టూ తిరిగేవాడు. లెక్కపెట్టకుండా డబ్బు వెదజల్లేవాడు. హృదయాలు కరిగించే జానపదగీతాలు విని ఏడ్చేవాడు. వాటితో లయకలిపి నాట్యంచేసేవాడు. ఎవడు ఎదురొస్తే వాణ్ణి నిలబెట్టి వాడితో తగువుపెట్టుకునే వాడు. కాని ఇన్ని చేస్తున్నా అతనికి మనశ్శాంతి దొరికేది కాదు.

ఇలాఉండగా ఒకనాడు ఒక తమాషా జరిగింది. అన్ని విధాలా చెడిపోయిన ఒక మతగురువు ఇగ్నాట్‌ను కలుసుకోవడం సంభవించింది. అతడు లావుగా పొట్టిగా ఉంటాడు. బట్ట తల, చిరిగిన పొడుగుచొక్కా అదీను. చెప్పుకు బురద అంటుకున్నట్టు అతను ఇగ్నాట్‌ను అంటుకున్నాడు. అతను చాలా తమాషా అయిన మనిషి. తన విషయం తాను పట్టించుకోడు. వికారస్వరూపం చూస్తే రోతపుడుతుంది. అచ్చం బొమ్మలాటలో కేతిగాడిలా ప్రవర్తిస్తాడు. జనమంతా అతనిచుట్టూ చేరి, అతన్నొక వింతమృగాన్ని ఆడించినట్టు ఆడిస్తుంటారు. వెక్కిరిస్తారు. వేళాకోళంచేస్తారు. నూగుపిండి తెచ్చి అతని బట్టతలకు పూస్తారు. అతన్ని జంతువును నడిపించినట్టు ఒకోక్క మాటు చేతులమీదా, మరోమాటు కాళ్ళమీదా నడిపిస్తారు. రకరకాల బ్రాందీలు కలిపి తాగిస్తారు. కడుపుబ్బనవ్వుపుట్టించే టట్టు గంతులువేయిస్తారు. కోతిలా ఆడిస్తారు ఏంచేసినా అతను నోరు కదపడు. మొద్దులా మాట్లాడకుండా అన్ని

పనులూ చేసేవాడు. ముడతలుపడ్డ అతని మొహంలో ఒక ముష్టి నవ్వుమాత్రం కనిపిస్తూఉంటుంది. వాళ్ళు చెయ్యమన్న పనులన్నీ చేసి చివరకు చెయ్యిచాపుతాడు. అరచెయ్యి పైకెత్తి

"ఒక రూబుల్ ఇవ్వండి." అని అడుగుతాడు.

అప్పుడందరూ అతన్నిచూచి నవ్వుతారు ఒక్కొకసారి అతనికి ఇరవై కోపెక్కులిస్తారు. ఇంకోసారి ఏమీ ఇవ్వరు కూడా. ఇంకా ఎప్పుడైనా పది రూబుళ్ళు, ఇంకా అంతకంటె ఎక్కువకూడా అతని మొహాన పారేసిపోతుంటారు.

"ఛీ! పాపిష్టివాడా! ఎవరునీవు ?" అని గదమాయించి అడిగాడు ఇగ్నాట్, అతన్ని చూచి.

ఇగ్నాట్ పిలుపు వినేసరికి మతగురువు భయంతో వణికి పోయాడు. వినయంగా వంగి ఇగ్నాట్‌కు నమస్కరించి ఊరు కున్నాడు.

"నిన్నే, మాట్లాడవేం? ఎవరునీవు?" మళ్ళీ గర్జించాడు ఇగ్నాట్.

"నేను ఒక మనిషిని—తిట్లు తినడానికి పుట్టిన మనిషిని" అని జవాబు చెప్పాడు ఆ మతగురువు. అతని మాటలు విని ఆ చుట్టూ ఉన్న జనమంతా పగలబడి నవ్వసాగారు.

"నీవు ఎందుకూ పనికిరాని వెధవవా?" అడిగాడు ఇగ్నాట్, కటువుగా.

"అవును. పనికిరాని వెధవనే! అవసరంకొద్దీ, ఆత్మశక్తి లేకపోవడంబట్టే అలా అయిపోయాను." అన్నాడు మతగురువు.

"అయితే ఇలారా! వచ్చి నా ప్రక్కన కూచో." అని ఇగ్నాట్ పిలిచాడు.

మతగురువు భయంతో వణికిపోతూ మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ, మత్తెక్కి వళ్ళు తెలీకుండా ఉన్న ఆ వర్తకుడి దగ్గరికి వెళ్ళి అతని కెదురుగా నిల్చున్నాడు.

"వచ్చి నా ప్రక్కన కూచో!" అంటూ ఇగ్నాట్ భయ కంపితుడైన మతగురువు చెయ్యిపట్టుకుని తన సరసన కూచో బెట్టుకున్నాడు.

"నీవు నాకు చాల దగ్గరి చుట్టానివి. నేనూ నీలాగే వుండాకోరువెధవనే. అవసరంకొద్దీ నీ వలా అయ్యావు. ఆసక్తి వల్ల నే నలా అయ్యాను. దుఃఖంవలన నేను దురాత్ముడనై పోయ్యాను! తెలిసిందా?" అన్నాడు ఇగ్నాట్ మళ్ళీ.

"అయ్యా, తెలుస్తూనేఉంది." అన్నాడు మతగురువు నింపాదిగా.

అక్కడున్న జనమంతా వెక్కిరిస్తున్నట్టు ఇకిలించ సాగారు.

"నే నెవర్నో నీ కిప్పుడు తెలిసిందా?"

"ఆ. తెలిసింది."

"అయితే చెప్పు. 'ఇగ్నాట్! నీవు పచ్చిపుండాకోరువు!' అని చెప్పు."

కాని మతగురువు ఆ మాట చెప్పలేకపోయాడు. పెద్ద ఏనుగులా ఉన్న ఇగ్నాట్‌వంక భయంతో చూస్తూ ఆ మాట అనలేనన్నట్టుగా తల ఊపాడు. చుట్టూ ఉన్న జనం ఇప్పుడు పిడుగులు పడ్డట్టు నవ్వారు. ఆ మతగురువుచేత తిట్టించుకోలేక పోయాడు ఇగ్నాట్. తరువాత అతను ఇలా అడిగాడు.

"నీకు డబ్బివ్వనా?"

"చిత్తం, ఇవ్వండి." వెంటనే సమాధానం చెప్పాడు మతగురువు.

"ఆ డబ్బు ఎందుకు నీకు! దాంతో ఏంచేస్తావు?

దానికి అతను జవాబు చెప్పలేదు. ఇగ్నాట్ అతని చొక్కా కాలరు పట్టుకుని ఊపాడు. అప్పుడా మతగురువు అసహ్యమైననోటినుంచి మాటలు ఊడిపడ్డాయి. అతను భయంతో కంపిస్తూ మెల్లగా—దాదాపు రహస్యంగా ఇలా చెప్పసాగాడు.

"నాకో పదహారేళ్ళ కూతురుంది. ఇంకా బళ్లో చదువు కుంటోంది. దానికోసమే ఈ డబ్బంతా కూడబెడుతున్నాను. లేకపోతే అది చదువంతా పూర్తి చేసుకుని వచ్చేసరికి, వంటి మీదగుడ్డకుకూడా కరువై దిగంబరిగా తిరగాల్సివస్తుంది."

"ఓ! అదా విషయం." అంటూ ఇగ్నాట్ అతని చొక్కా కాలరు వదిలిపెట్టాడు. తరువాత చాలసేపు ఏదో దిగులుగా ఆలోచిస్తూ, మధ్యమధ్య మతగురువువంక తేరిపార చూస్తూ కూచున్నాడు. ఉండిఉండి అతని కళ్ళల్లోంచి నవ్వుల వెలుగులు విరజిమ్మాయి. అత నిలా అన్నాడు.

"అరె, త్రాగుబోతా! నీవు అబద్ధమాడడం లేదుకదా?"

మతగురువు మౌనంగా రొమ్ముమీద తలవాల్చుకుని, క్రాస్ చేసుకుంటూ దేవుణ్ణి ప్రార్థించాడు.

"అతను చెప్పింది నిజమే!" అన్నాడొకడు ఆ గుంపు లోంచి, మతగురువు మాటలు నిజమేనని బలపరుస్తూ.

"నిజం? అయితే చాలామంచిదే!" అని అరిచాడు ఇగ్నాట్ తన పిడికిలితో టేబిల్ మీద గుద్దుతూ. మళ్ళీ తానే మతగురువు నిలా అడిగాడు.

"ఏయ్, నిన్నే! నీ కూతుర్ని నాకు అమ్ముతావా? ఎంత డబ్బు తీసుకుంటావు?"

మతగురువు తలఊపి వెనక్కు తగ్గాడు.

"ఒక వెయ్యి!' అన్నాడు ఇగ్నాట్.

చన్నీళ్ళు పోసినట్టుగా మతగురువు ముడుచుకపోవడం చూచి అక్కడున్నవారంతా మళ్ళీ పక్కున నవ్వారు.

"రెండువేలు!" మెరుస్తున్న కళ్ళతో మళ్ళీ గర్జించాడు ఇగ్నాట్.

"ఏమిటయ్యా ఇది? నాకేం అర్థంకావడంలేదు." అన్నాడు మతగురువు, తన రెండు చేతులూ ఇగ్నాట్ ముందు చాచి.

"మూడువేలు !"

"ఇగ్నాట్ ! ఇగ్నాట్ ! ఇక ఊరుకో. నీకుపుణ్యముంటుంది ! ఇకచాలు. దాన్ని నీకమ్మేస్తాను ! దాని మంచి కోసమే దాన్ని అమ్మేస్తాను !" అన్నాడు మతగురువు కీచు గొంతుతో.

జబ్బుమనిషిగొంతులా అతనిగొంతు పీలపోయిన వ్పటికీ, ఎవరినో ఎదిరిస్తున్నట్టుగా వినిపిస్తోంది. అతనికళ్ళు ఎవరూ యింతకుముందు చూడనంతగా, చింతనిప్పుల్లా మండుతున్నాయి కాని తప్పతాగి మత్తెక్కివున్న అక్కడిగుంపంతా అతన్ని చూచి వెలివితక్కువగా నవ్వసాగింది.

"ఆపండీ !" అని బిగ్గరగా అరిచాడు ఇగ్నాట్, లేచి నిటారుగా నిల్చుని. అతని కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి.

"ఇక్కడ జరిగేదేమిటి ? మీరు చేసే గోలేమిటి ? ఆమాత్రం అర్థం కాదట్రా దయ్యాల్లారా ! మీరు నవ్వుతుంటే ఇతర్లకు ఏడుపొస్తుంది"

అన్నాడు మళ్ళీ ఇగ్నాట్, జనాన్ని చూస్తూ.

అతను మతగురువును సమీపించి అతనిముందు మోకాళ్ళపై కూచుని నిశ్చితమైన కంఠస్వరంతో ఇలా అన్నాడు.

"తండ్రీ, నేనెంతటి పుండాకోరునో ఇప్పటికైనా తెలిసిందా? సరే, నా ముఖాన ఉమ్మెయ్."

ఏదో వికృతము, వేళాకోళము ఆవరించింది. మతగురువు కూడా మళ్ళీ ఇగ్నాట్‌ముందు మోకరిల్లాడు. పాకుతోన్న పెద్ద తాబేలులా వచ్చి ఇగ్నాట్ పాదాలను, మోకాళ్ళను ముద్దాడి వెక్కి వెక్కి ఏడుస్తూ ఏదో అస్పష్టంగా అంటున్నాడు. ఇగ్నాట్ అతనిమీదికి వంగి అతన్ని లేవనెత్తాడు. అధికార పూర్వకంగాను, అరిస్తున్నట్టుగాను, మళ్ళీ ఇలా అన్నాడు.

"ఉమ్మెయ్! సిగ్గులేని నాకళ్ళల్లోకి సూటిగా ఉమ్మెయ్!"

ఇగ్నాట్ నిశ్చిత కంఠస్వరం విని ఆ జనసమూహమంతా కొద్ది క్షణాలు స్తబ్దంగాఉండిపోయింది. మళ్ళీ అంతలోనే సారాఅంగళ్ళపైకప్పు ఎగిరిపోయేటంతంగా పగలబడి నవ్వింది.

"నా ముఖాన ఉమ్మేస్తే నీకు వంద రూబుల్సు ఇస్తాను. ఊ! ఉమ్మెయ్!"

తన్ను తానే, ఇలా అవమానపరచమని కోరుకుంటున్న ఇగ్నాట్‌మాటలు వినేసరికి మతగురువుకు సంతోషంవల్లనో, భయంవల్లనో ఏడుపొచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చాడు.

చివరకు ఇగ్నాట్ నేలమీదనుంచి లేచి మతగురువును ఒక్క తన్ను తన్నాడు. డబ్బుసంచి ఒకటి అతని ముఖాన విసిరేస్తూ బద్ధకంగా మందహాసంచేస్తూ ఇలా అన్నాడు.

"ఛీ! అల్లరిగుంపు! ఇలాటివాళ్ళదగ్గరా నే పశ్చాత్తాప పడడం? పశ్చాత్తాపం వినడానికి కొందరు భయపడతారు. పాపిని చూచి కొందరు నవ్వుతారు. నా బరువును నేనే పూర్తిగా దించుకోవడానికి సిద్ధపడ్డాను.

కాని నా హృదయం కంపించింది, ఇక వెళ్ళిపో. ఇది తగినచోటుకాదు. ముందిక్కణ్ణుంచి వెళ్ళిపో. మళ్ళీ ఎప్పుడూ నా కంటపడకు. వింటున్నావా ?"

"ఓ ! చాలా చిత్రమైన మనిషి." అంటూ జన సమూహం అక్కణ్ణుంచి కదిలింది.

ఇగ్నాట్ ఇలా తాగుతూ గొడవలు చేస్తుండేవాడు. అతని తాగుబోతుచేష్టలనుగురించి నగరంలోవారంతా కథ లల్లి చెప్పుకునేవారు. అతని దాపుకు రావటానికి ప్రతివారూ భయపడేవారు. కాని అతను తాగడానికి రమ్మనిపిలిస్తే మాత్రం, అందరూ వెంటబడివెళ్ళేవారు. ఇలా వారాల తరబడి జీవితం సాగించేవాడు ఇగ్నాట్.

ఉండీఉండి ఎప్పుడో హఠాత్తుగా ఇంటికి వచ్చేవాడు. అతను వస్తాడనికూడా ముందుగా ఎవరికీ తెలీదు. అతని నోటి

నుంచి ఇంకా సారాకంపు వెలువడుతూనే వుండేది. కాని, మనిషి క్రుంగిపోయినట్టు మౌనంగా ఉండేవాడు. తల వ్రేలాడవేసుకుని కళ్ళు దించుకుని మెల్లగా వచ్చే వాడు. ఏదో తప్పుచేసినవాడికిమల్లే అతనిముఖంలో అవమా నం ఆవరించేది. సిగ్గుతో కళ్ళు మండుతూఉండేవి. భార్య అనే సూటిపోటు మాటలన్నీ మౌనంవహించి నిబ్బరంగా వినేవాడు గొర్రెపిల్లలా, సాధుత్వంతోనూ వినయంతోనూ. తన గదిలోకి వెళ్ళిపోయి లోపల కూచుని తలుపులేసుకునేవాడు. గదిలో గంటలతరబడి పవిత్రమైన దేవతాప్రతిమలముందు మోకరిల్లి క్రాస్ చేసుకుంటూ భగవంతుణ్ణి ప్రార్థించేవాడు. అతని తల వక్షస్థలంపై వాలి ఉండేది. చేతులు ఆధారం లేనట్టుగా వ్రేలాడు తుండేవి. పటుత్వం లేనట్టు నడుం వంగిపోయేది. మౌనంగా ఉండిపోయేవాడు. కాని ప్రార్థన చేయడానికి సాహసం చాలేది కాదు. అతని భార్య తలుపుదగ్గరికి వచ్చి తలుపు రంధ్రాలలో నుంచి లోపలికి చూచేది. అతనేమంటున్నాడో అని మునివ్రేళ్ళ మీద నిలబడి వినేది. దీర్ఘమైన నిట్టూర్పులు – జబ్బునపడి ఎత్తుపడిన గుర్రపురొప్పులా ఆమెకు వినిపించేవి.

"పరమేశ్వరా! చూస్తున్నావా?" గద్గదస్వరంతో గొణుగుకునేవాడు ఇగ్నాట్. అతని రెండు అరచేతులూ వక్షస్థలంమీద అని ఉండేవి.

ఇలా పశ్చాత్తాపంపొందుతున్న రోజులలో అతను జొన్నరొట్టె, పచ్చినీళ్ళు తప్ప మరేమీ ముట్టుకునేవాడు కాదు. ఉదయాన్నే అతని భార్య అతని గది తలుపు దగ్గర పెద్ద సీసాతో నీళ్ళు పెట్టేది. దానితోపాటు ఒక పౌనున్నర

రోజ్లూ మరికొంత ఉప్పు ఉంచేది. అతను తలుపు తెరిచేవాడు. ఈ పదార్థాలు తీసుకుని గదిలో పెట్టుకుని మళ్ళీ తలుపు బిగించేవాడు. ఈ సమయంలో ఎవరూ ఏరకంగానూ అతనికి అంతరాయం కలిగించేవారుకారు. అందరూ అతనికి దూరంగా ఉండడానికి ప్రయత్నించేవారు. అలా కొన్నాళ్ళు గడిపిన తరువాత అతను మళ్ళీ మనుష్యుల్లోపడేవాడు. తన కార్య కలాపాల్లో మునిగేవాడు. వ్యాపారకూడలికి వెళ్ళేవాడు. వర్తకులను కలిసేవాడు. అందరితోనూ నవ్వుతూ పేలుతూ మళ్ళీ మామూలు ధోరణిలో బేరసారాలు సాగించేవాడు. సరకులూ, ధాన్యం కొనడానికి అమ్మడానికి ఒప్పందాలు చేసు కునేవాడు. ఆకాశానబోవు పక్షికి ఆహారాన్ని గురించి ఎంత సూక్ష్మమైన చూపు ఉంటుందో వ్యాపార విషయాలలో అతని చూపు అంత నిశితంగా ఉండేది.

కాని, ఇగ్నాట్ జీవితం ఎన్ని మలుపులు తిరిగినా, ఎన్నడూ వీడని ఒకే ఒక తీవ్రవాంఛ అతనిలో ఉండేది. అది అతనికి పుత్రసంతానం కావాలనే వాంఛ. అతను పెరిగి పెద్ద వాడవుతున్నకొద్దీ ఈ వాంఛకూడా పెరిగి పెద్దది కాజొచ్చింది. ఈ విషయాన్ని గురించే అతనికీ అతని భార్యకూ తరుచు సంభా షణలు జరుగుతూ ఉండేవి. ఉదయం టీ తాగేటప్పుడూ, మధ్యాహ్నం భోజనంచేసేటప్పుడూ, అతను మత్తుగా తన భార్య వంక చూచేవాడు. అతని భార్య లావుగా పుష్టిగా ఉండేది. ఎర్రని ముఖం. నిద్రమత్తులో ఉన్నకళ్ళు. అతను ఆమెతో ఇలా అనేవాడు: "సరేకాని, ఇప్పటికైనా నీవేమైనా అనుకోవడం ఉన్నదా లేదా ?" అతని మాటల్లోనిభావం

ఆమెకు తెలుసు. అయినా ఆమె ఇలా జవాబు చెప్పేది. "అనుకోకుండా ఎలా ఉంటాను! మీ పిడికిళ్ళు ఇనప గుండ్లలా ఉంటాయిసుమా!"

"ఓసీ! తెలివితక్కువదానా! నేను దేన్నిగురించి మాట్లాడుతున్నానో నీకు తెలుసా?"

"తెలీకేమండీ? అలాటి పిడిగుద్దులు తినేవాళ్ళకు కడుపు రమ్మంటేమాత్రం ఎలావస్తుంది?" అనేది ఆమె.

"గుద్దులవల్లకాదు నీకు బిడ్డలుపుట్టంది. నీవు తెగ తిండి తింటావు. అందుకే బిడ్డలు పుట్టరు. అదీ ఇదీ అనకుండా అన్నిరకాల పదార్థాలూ పొట్టలో కుక్కుతావు. ఇహ అందులో బిడ్డ ఎదగడానికి చోటెక్కడ వుంటుంది!"

"నే నింతవరకు బిడ్డలనే కననట్టు మాట్లాడుతున్నారే"

"ఆడపిల్లలా? వాళ్ళసంగతి కాదు. నాకు కావలసింది కొడుకు. తెలిసిందా? ఒక కొడుకు - కులాన్ని ఉద్ధరించే కొడుకు. నేను చచ్చినతరవాత నా ఆస్తంతా ఎవరికివ్వను? నా పాపాలు పోవడానికి పూజా పునస్కారా లెవరు జరుపుతారు? ఏ సన్యాసుల మఠానికో ధర్మసత్రానికో ఇదంతా దానం చెయ్యమంటావా? ఇప్పటికే వాటికి కావలసినంత ఇచ్చాను. లేకపోతే ఇదంతా నీకురాసిచ్చి పొమ్మంటావాఏం? ఓహో! నీవెంతటి భక్తురాలివే! గుళ్ళో కూచున్నా నీవు కూటినిగురించే ఆలోచిస్తుంటావు. చర్చిలో ఉన్నా నీ మనస్సులో చేపలే మెదులుతుంటాయి. నేను చస్తే నీవు మళ్ళీ పెళ్ళిచేసుకుంటావు. నా డబ్బంతా ఏ వెధవాయకో అప్పచెబుతావు; అష్టకష్టాలుపడి ఈ సంపాదించడమంతా అందుకోసమే ననుకున్నావా?"

అతని హృదయాన్ని ఒక ఆవేదన చుట్టుముట్టేది. పుత్ర సంతతే లేకపోతే తన బ్రతుకే నిష్ఫలమని అతను విలపించేవాడు.

అతను పెళ్ళిచేసుకుని భార్యతో తొమ్మిదేండ్లు కాపురం చేశాడు. నలుగురు ఆడపిల్లలు పుట్టారు. నలుగురూ చని పోయారు. వాళ్లు చచ్చినప్పటికంటె వాళ్ళు పుట్టినప్పుడే అత నెక్కువ బాధపడేవాడు. వాళ్ళు పుట్టినా పుట్టనట్టే లెక్కవేసుకునే వా డతను. పెళ్ళయిన మరుసటి సంవత్సరం నుంచే భార్యను కొట్టడం మొదలెట్టాడు. మొదట్లో తాగి వళ్ళు తెలీక కొట్టేవాడు. అంచాత అప్పు డతనికి భార్య మీద ఎలాటి కోపమూ ఉండేదికాదు. ఏదో సామెత చెప్పినట్టు—భార్యను ప్రాణంకంటె మిన్నగా ప్రేమించు. కాని ఆపిల్ చెట్టును ఊపినట్టు ఊపు." దీనినే అతను అనుసరించే వాడు. తరువాత ఆమె గర్భవతి అయ్యేది. ప్రతిసారీ తనకు కొడుకుపుడతాడని కొండంత ఆశతో ఉండేవాడు. కాని, ఆడ పిల్ల పుట్టేది, ఆశ నిరాశయ్యేది. అలా నిరాశచెందుతున్న కొద్దీ అతనికి భార్యపై కోపం, ద్వేషం పెరగజొచ్చాయి. ఆ ద్వేషంతోనే కొట్టడానికి పూనుకునేవాడు. ఆమెను తన్ను తుంటే అతనికి ఆనందం కలిగేది ఆమె కొడుకును కనలేదని — ఆమెను కొట్టి ఆవిధంగా తన కక్ష తీర్చుకునేవాడు.

ఒకమాటు ఇగ్నాట్ తన వ్యాపారంపనిమీద సమారా రాష్ట్రానికి వెళ్ళాడు. అతనక్కడుండగా, భార్య చనిపోయిందని ఇంటిదగ్గరనుంచి అతనికి టెలిగ్రాం వచ్చింది. అప్పు డతను క్రాస్ చేసుకుని ఆమె ఆత్మశాంతికై భగవంతుణ్ణి ప్రార్థించాడు.

పిమ్మట తనస్నేహితుడైన మయకిన్‌కు ఇలా జాబు వ్రాశాడు. " నేనిక్కడ ఉండగానే ఆమెనుసమాధిచేయించు. తరువాత నా ఆస్తంతా జాగ్రత్తగా చూడు."

తరువాత అతను చర్చికివెళ్ళి చనిపోయిన తనభార్య అకులీనా ఆత్మశాంతికోసం ప్రార్థనలు జరిపించాడు. వెంటనే తాను మళ్ళీపెళ్ళిచేసుకోవడం అత్యావసరమని ఆలోచించ సాగాడు.

అప్పటికి ఇగ్నాట్‌కు నలభైమూడేండ్లు. మనిషిపొడుగ్గా ఉండేవాడు. ఎత్తయిన భుజాలు, విశాలమైన వక్షస్థలం, గంభీర మైన కంఠస్వరం. మాట్లాడుతున్నప్పుడు అతని స్వరం చర్చిలో మతగురువుల స్వరంలాగా బరువుగా, గంభీరంగా వినిపించేది. చిక్కగా అల్లుకున్న నల్లటి కనుబొమలు, వాటి క్రింద చారెడేసికళ్ళు. అతని చూపుల్లో ఎక్కడలేని తెలివీ, ధైర్యమూ అగుపిస్తూఉండేవి. దట్టమైన నల్లటివెంట్రుకలతో పెరిగినగడ్డం. భారీగాఉన్న అతనిసుందరవిగ్రహంచూస్తే ఎవరైనా, 'ఇతను అసలైన సిసలైన రష్యన్‌జాతికి చెందినవాడురా' అని అనుకుంటారు. రోగమంటే ఎటువంటిదో ఎరుగడు ఇగ్నాట్. అంతలావు శరీరాన్ని అతను ఎటుపడితే అటు మెలికలు తిప్పే వాడు. తేలికగా, హుషారుగా తిరిగేవాడు. అతను ఎక్కడ నడుస్తున్నా, ఏపనిచేస్తున్నా; అన్నివేళలా అతనిలో ఒకవిధ మైన గర్వం, గొప్పతనం, శక్తి అగుపించేవి. ఎంతో ఆత్మ విశ్వాసం కలవాడని స్పష్టమయ్యేది. అతనంటే స్త్రీలు మోజు పడేవారు. వారికి దూరంగా ఉండాలని అతనూ అనుకునేవాడు కాదు

భార్య చనిపోయిన తరువాత ఆరునెలలైనా నిండక ముందే ఇగ్నాట్, యూరల్ ప్రాంతంలో నివశిస్తోన్న ఒక కోసక్ కుమార్తెను పెళ్లాడాడు. యూరల్ ప్రాంతంలోకూడా ఇగ్నాట్ "చపలచిత్తుడని" అంతా అనుకునేవారు. ఆవిషయం పెండ్లికూతురితండ్రికికూడా తెలుసు. అయినా అతను తన కుమార్తెను ఇగ్నాట్ కిచ్చి వివాహం చేశాడు. ఆకులు రాలే కాలంలోనే ఇగ్నాట్ భార్యను వెంటపెట్టు కుని తన ఇంటికి వచ్చేశాడు. ఆ పిల్లపేరు నటాలియా. పొడుగ్గా, బాగా ఎదిగి పొంకంగాఉన్న వళ్ళు ఆమెది. చెం పకు చారెడేసి కళ్ళు, నీలాల కళ్ళు. బారెడు జుట్టు. మనిషి అన్ని విధాలా చక్కనిది. చక్కని ఇగ్నాట్‌కు తగినట్లు చక్కని చుక్క దొరికింది. అతను తన అందాల భార్యను చూచుకుని పొంగిపొయ్యేవాడు, గర్వపడేవాడు. ఆమెమీద మోజుపడే వాడు. ఆమెను మనసారా ప్రేమించేవాడు. కాని మళ్ళీ అంతలోనే ఆమెపై తన రెండు కళ్ళూ ఉంచి దీర్ఘంగా ఆలో చించేవాడు.

ఆమె మొహం కోలగా ఉండేది. గంభీరత కనిపించేది. ఆమె మొహంలో ఎప్పుడూ చిరునవ్వు చిలకరించదు. ఆమె ఎప్పుడూ దేన్ని గురించో ఆలోచిస్తుండేది — జీవితానికి దూరంగా ఎక్కడో ఏదో విషయాన్ని వెదకుతున్నట్లు ఉండేది. ఆమె ప్రశాంతవదనంలో, ఆమె నీలాల కళ్ళల్లో అప్పుడప్పు డేదో నల్లటిపొర – మానవులపై అసహ్య భావంతో వెలువడే పొర, మెరుస్తూ ఉండేది. ఆమె ఇంటిపను లన్నీ చక్కదిద్దుకునేది. తీరికవేళల్లో, ఇంట్లో ఉన్న పెద్ద గది

లోకి వచ్చి కిటికీప్రక్కన కూర్చునేది. అలా మౌనంగా రెండు మూడు గంటలసేపు కూర్చునేది. ఆమె మొహం వీధివైపు తిరిగి ఉండేది. కాని ఆమె కళ్ళుమాత్రం ప్రతివిషయానికీ వ్యతిరేకంగా ఉన్నట్లు కనిపించేవి. తన చుట్టుపట్ల జీవంతో కదులుతోన్న దేనినీకూడా చూడనట్లుగా ఉండేవి. అయినా ఆ చూపుల్లో ఒక నిశ్చయం కనిపించేది. తన అగాధమైన చూపులతో తన ఆత్మను తాను శోధించుకుంటున్నట్లుగా కనిపించేది ఆమె. అదే మిటో, ఆమె నడకతీరుకూడా విచిత్రంగా ఉండేది. ఆ పెద్ద గదిలో నటాలియా చాలా నింపాదిగా, జాగ్రత్తగా నడిచేది. ఏదో అదృశ్యమైనది తన నడకను అడ్డగిస్తున్నట్లుగా, స్వేచ్ఛగా నడవలేకపోతున్నట్లుగా నడిచేవి. ఆమెఇంటినిండాఎన్నె న్నోబరువైన సామగ్రులుండేవి. ఎన్నెన్నో విలాసవస్తువులు, చెప్పకోదగ్గ గొప్పగొప్ప వస్తువులు, ఉండేవి. ఆ ఇంట్లోవున్న ప్రతివస్తువూ తళతళ ప్రకాశిస్తుండేది. ప్రతివస్తువూ భర్త యొక్క ఐశ్వర్యాన్నీ, భోగభాగ్యాలనూ ఎలుగెత్తి చాటుతూ ఉండేది. కాని ఆ కోసక్ యువతి, విలువైన వస్తువులు, వెండిసామాగ్రులు, కంటపడితేచాలు, భయంతోను, ఎక్కడ లేని సిగ్గుతోను, అవి తనమీదపడి పీక పిసికేస్తాయేమో అన్నట్లు వాటికి దూరంగా వెళ్ళిపొయ్యేది. వ్యాపార కేంద్రంగా ఉన్న ఆ పెద్దపట్టణంలోని అలజడి జీవితం మౌనంగాఉండే ఆ అమ్మాయికి నిజంగా రుచించలేదు. తన భర్తతోకలిసి గుర్రపుబగ్గీలో బయటికి వెళ్ళినప్పుడుకూడా ఆమె బాడీవాడి వీపుతప్ప మరిదేనివంకా చూచేదికాదు. భర్తతోపాటుబంధువుల ఇళ్ళకుగాని, స్నేహితులఇళ్ళకుగాని వెళ్ళినా అక్కడకూడా ఆమె

తనఇంట్లోమాదిరిగానే విచిత్రంగా ప్రవర్తించేది. ఇంటికి అతిథు లెవరైనావచ్చినప్పుడు,గబగబావారికిఅనేకపదార్థాలుచేసిపెట్టేది. కాని వారి సంభాషణలలో ఏమాత్రం పాల్గొనేదికాదు. ఇంటికి వచ్చినవారందరినీ పెద్దా చిన్నా తారతమ్యంలేకుండా సమా నంగా చూచేది. ఇగ్నాట్ స్నేహితుడు మయకిన్ మాత్రం ఎప్పుడూ పరిహాసాలాడుతూ నవ్విస్తుండేవాడు. అం చాత అతను మాట్లాడుతున్నప్పుడు ఆమె ఎప్పుడో లెక్కపెట్టి నట్టు ఒకసారో అరసారో నవ్వేది. అదైనా నవ్వీనవ్వనట్లుండే మసక మసక చిరునవ్వు మబ్బుతెరలావచ్చేది. ఆమెనుగురించి అతనిలా చెప్పేవాడు.

"ఆమె ఆడదికాదు—అడివిమాను! కాని జీవితం తరిగి పోని కట్టెలవామి లాంటిది. మనలో ప్రతి ఒక్కరూ ఎప్పుడో ఒకప్పుడు మండిపోతూనే ఉంటాను. ఆమెకుకూడా నిప్పు తాకక మానదు. అప్పటిదాకా ఆగండి. ఆమెకు వ్యవధి ఇవ్వండి. ఇక అప్పుడు చూడండి, ఆమెను; ఎలా వికసిస్తుందో, ఏమిటో!"

"ఏమేవ్?" అంటూ ఇగ్నాట్ ఆమెను పరిహాసాలాడే వాడు. "ఏమిటే, ఒకటే ఆలోచన? పుట్టింటిమీద మనసు మళ్ళిందా ఏం? కాస్త ఉత్సాహం తెచ్చుకో."

ఆమె తన భర్తవైపు మందంగా చూస్తూ మౌనం వహించేది.

"అదేపనిగా చర్చికి వెడుతున్నావే. కాస్త తమాయిం చుకో. కొంతకాలం ఆగు. ఇప్పుడేమిటా తొందర? నీ పాప పరిహారార్థం ప్రార్థనలు చేసుకోవడానికి బోలెడంత కాలం ఉంది. అసలింతవరకు నీవు పాపాలే చెయ్యలేదుకదే – పాపం

లేనిదే పరిహారమేమిటి? కనుక ముందు పాపాలు చెయ్యి, తరువాతపశ్చాత్తాపపడుదువుగాని. ఎవరైనా వయస్సులో ఉన్నప్పుడే పాపాలు చెయ్యాలి. అదే మంచిది. నీవు పాపమే చెయ్యకపోతే నీకు పశ్చాత్తాపమే ప్రాప్తం ఉండదు. తెలిసిందా? సరే, అలా షికారు తిరిగొద్దామా?" అనేవాడు మళ్ళీ ఇగ్నాట్.

"ఇప్పుడు బయటికి వెళ్ళాలని లేదు."

అతను ఆమె సరసన కూచుని ఆమెను కౌగలించుకునేవాడు. ఆమె చన్నీళ్ళ ముద్దలా అయిపోయి నిర్జీవంగా ఉండేది. ఎప్పుడో తప్ప అతని లాలింపులకు, పాలింపులకు చలించేది కాదు. అప్పుడతను ఆమెకళ్ళలోకి సూటిగా చూస్తూ "నటాలియా! నాతో చెప్పవూ? ఎందుకంత విచారంగా ఉన్నావు? ఇప్పుడిక్కడ నాప్రక్కనవుంటేకూడా నీకు ఒంటరిగా ఉన్నట్టనిపిస్తోందా?" అని అడిగేవాడు.

"లేదండీ". ఆమె క్లుప్తంగా జవాబు చెప్పేది.

"అయితే ఇంకేమిటి మరి? మీవాళ్ళను చూడాలని మనసు మళ్ళిందా ? "

" లేదు. అదేమీకాదు. "

" మరి దేన్ని గురించి నీ ఆలోచన ? "

" నేను ఆలోచించడం లేదే. "

" అయితే ఇంకేమిటి ? "

" అయ్యో, ఏమీలేదండీ ! "

ఇలా అనేకమార్లు అడిగీ అడిగీ చివరకొక్కసారి మాత్రం ఆమెచేత పూర్తిగా సమాధానం చెప్పించగలిగాడు.

" నా హృదయంలో ఏదో కలవరపెడుతోంది. నా కళ్ళల్లోకూడా. ఈ కనిపించేదంతా నిజంకాదని నా కెప్పుడూ అనిపిస్తూ ఉంటుంది. " అని చెప్పుతూ ఆమె తన చెయ్యి ఆడిస్తూ చుట్టూవున్న బల్లలు, కుర్చీలు, గోడలు, అన్నిటినీ చూపించింది.

ఇగ్నాట్ ఆమె మాటలు పట్టించుకోలేదు. నవ్వుతూ ఇలా అన్నాడు.

" అలా అనుకోవడంవల్ల ఏమిటిలాభం ? ఇంట్లో ఉన్న ఈ వస్తువులన్నీ నకిలీ వస్తువులు కావు. అసలైన వస్తువులు. గట్టి వస్తువులు. ఎంతో ఖరీదైన వస్తువులు. నీకు నచ్చకపోతే వీటనన్నిటినీ నిప్పుల్లో పోస్తాను. ఇతర్ల కమ్మేస్తాను. లేకపోతే ఎవరికైనా ధర్మంచేస్తాను. నీకోసం మళ్ళీ కొత్తవస్తువులు పట్టుకొస్తాను. ఏమంటావు? ఆ పని చెయ్యనా?" "ఎందుకలా చెయ్యడం?" అన్నదామె నెమ్మదిగా.

క్రమక్రమంగా ఆమె పరిస్థితేమిటో అతనికి అంతుపట్టకుండాపోయింది. అయోమయంలోపడ్డాడు. ఒక్కోసారి ఆమె ప్రవర్తన తలుచుకుని నివ్వెరపాటుచెందేవాడు. "ఇంత చక్కని వయస్సులో, ఇంత ఆరోగ్యంగా ఉన్న ఈ పిల్ల, దేన్నీ పట్టించుకోదేమిటబ్బా? ఒకచోటికి వెళ్ళదు, ఒకరితో మాట్లాడదు. ఒక్క గుడికి తప్ప ఆమె కాలు బయటపెట్టదు. మనుష్యులకు వైదొలగి అహర్నిశలూ నిద్రపోతున్నట్టుగా ఉంటుందేమిటి? ఈవిధంగా ఈమె ఎలా బ్రతకగల్గుతోంది ?" అని ఆలోచించుకుంటూ ఆశ్చర్యపొయ్యేవాడు.

అప్పుడప్పుడు ఆమె నిలా బుజ్జగించేవాడు. "కొంతకా లం ఓర్చుకో. నీవు గర్భవతివి అవుతావు. మన కొక అబ్బాయి పుడతాడు. అప్పుడు మన జీవితం సాంతం మారిపోతుంది. కొత్తజీవితం మొదలవుతుంది. నీకిప్పు డేరోష్టూలేదు కనుక ఇలా విచారంగా ఉన్నావుకాని, రేపు వాడు పుడితే నిన్నొక్కనిముషంకూడా కూచోనివ్వడు. నిన్ను గందరగోళంచేస్తాడు. నా కొక్క కొడుకును ప్రసాదిస్తావుకదూ? ఏం?"

"అదంతా భగవత్కృప!" అంటూ ఆమె తలవాల్చుకునేది.

అప్పుడామెనుచూస్తే అతనికి చిరాకు, కోపము పుట్టుకొచ్చేవి.

"సరేకాని, ఎందుకలా దిగాలుపడి కూచుంటావు? అద్దం మీదనడిచినట్టు నడుస్తావు. ఎవరి ప్రాణాలో తీసినట్టు, ఎవరి జీవితమో నాశనం చేసినట్టు, ఎప్పుడూ బాధపడుతుంటావు. ఏమిటే ఇదంతా ? మనిషివిమాత్రం నిండుగా పండులాగా కనిపిస్తుంటావు. ఎప్పటికప్పుడు జీవం పుట్టుకొస్తున్నట్టుంటావు. కాని దేనిమీదా ఆసక్తి లేదా ? ఏమిటే ఇది, పిచ్చిపిల్లా !" అని అడిగేవా డతను.

ఇలా ఉండగా ఒకనాడతను మత్తుగాతాగి ఇంటికొచ్చాడు. భార్యను అదేపనిగా లాలించసాగాడు. కాని ఆమె నిరాదరణతో ముఖం తిప్పుకుంది. అప్పుడు ఇగ్నాట్ కోపంలో భగ్గుమంటూ...

" నటాలియా ! నీ పిచ్చిపిచ్చివేషాలు నాదగ్గర పనికిరావు. ఇటుచూడు ! " అరిచా డతను. ఆమె అతనివైపు

ముఖంతిప్పి మెల్లగా, శాంతంగా "అయితే ఏంచేస్తావు ?" అన్నది.

నిర్భయంగా చూస్తున్న ఆమె చూపులకూ, ఆమెఅన్న మాటలకూ ఇగ్నాట్ మరింత మండిపడ్డాడు.

"ఏదీ, మళ్ళీ అను" అంటూ హుంకరించి ఆమెను సమీపించాడు.

"నన్ను చంపాలనుకుంటున్నావా?" ఏమాత్రం చలించకుండా, కన్నుకూడా కదల్చకుండా అడిగిందామె.

తనకు కోపంవచ్చిందంటే తన ముందున్న మనుష్యులు గజగజ వణికిపోవడం ఇగ్నాట్ అనేకమార్లు చూచాడుకాని, ఇలా నిశ్చలంగా ఉన్న మనిషిని అత నెన్నడూ చూడలేదు. ఆమె అలా ఉండడంవల్ల అతనికి ఆశ్చర్యమూ, మరోవైపు ఇనుమడించిన కోపమూ కలిగాయి.

"ఓ అదా సంగతి?" అని అరుస్తూ ఆమెను కొట్టడానికి చెయ్యి పైకెత్తాడు. కాని ఆ సమయానికి ఆమె మెల్లగా, దెబ్బతగలకుండా తప్పించుకుంది. అతనిచెయ్యి పట్టుకుని దూరంగా తోసివేసింది. మళ్ళీ అదే బెదురులేని కంఠంతో

"ఇక ఎప్పుడూ నన్ను ముట్టుకోకు. అలా ముట్టుకున్నావూ అంటే దగ్గరికి కూడా చేరనివ్వను!" అన్నదామె.

ఆ మాటలంటున్నప్పుడు ఆమె కళ్ళు చిన్నవై పోయాయి. అవి ఇగ్నాట్‌ను సూదుల్లా పొడిచాయి. ఆ సూదిపోట్ల తాకిడికు అతను తట్టుకోలేకపోయాడు ఆమె ముఖనై ఖరినిబట్టి ఆమె కూడా ఒకబలమైన జంతువులాంటిదనీ, తనకేమాత్రం తీసి

పొమ్మేదికాదనీ, తలుచుకుంటే తనఊపిరిపోయినా తన్ను దగ్గరికి చేరనివ్వదనీ ఇగ్నాట్ గ్రహించాడు.

"ఊఁ!" అని హుంకరిస్తూ అతను అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

అలా ఒకమాటు పరాభవంపొందిన పిమ్మట మళ్ళీ అతను ఆమెజోలికిపోలేదు. ఒక ఆడది—అందులోనూ కట్టుకున్న పెళ్ళాం, తనకు తల ఒగ్గకపోవడంచూచి అతను సహించలేకపోయాడు. తనకు అవమానం జరిగినట్టు ఎంచుకున్నాడు. ఆరోజు లగాయతూ తన ప్రతాపమేమిటో చూపించి ఆమె ఎలా లొంగదో చూద్దామనుకున్నాడు. అందుకని ఆమెతో ఘర్షణపడడానికి మొండిపట్టుపట్టడానికే సిద్ధపడ్డాడు. ఆమ్మరోజు అతను తనలో "సరే, చూద్దాం! ఈ యుద్ధంలో ఎవరుగెలుస్తారో" అనుకున్నాడు. తన భార్యను ఆశ్చర్యంతోను, నిశ్చయంతోను పరిశీలించసాగాడు. ఆమెతో ఘర్షణపడడం ఎప్పుడా అనే కోర్కె అతని గుండెనుకోస్తోంది. త్వరలోనే తాను విజయం సాధించి, ఆనందిస్తాననుకున్నాడు.

కాని తరువాత నాలుగురోజులకు నటాలియా ఫోమినిచ్‌నా తనకు నెలతప్పిందని భర్తకు తెలియజేసింది. తత్క్షణమే ఇగ్నాట్ హృదయం ఆనందంతో పొంగిపోయింది. ఆమెను గాఢంగా కౌగలించుకున్నాడు. మెల్లగా ఇలా అన్నాడు.

"నేను చెప్పలేదుటే పిచ్చిదానా! నీవు నిజంగా బంగారుబొమ్మవే నటాషా! నీకు కొడుకు పుడితే నిలువెత్తు బంగారం నీ వంటిమీద కప్పుతాను. నిజంగా నిక్కచ్చిగా

చెపుతున్నాను. నీకు ఆ జన్మాంతం దాసుడనై నీ పాదపూజ చేస్తాను. దేవుడిమీద ఆన! నీ పాదాలముందు సాష్టాంగపడ తాను. నీ ఇష్టం. నన్ను తొక్కుతూ నామీదినుంచి నడిచిపో"

"అదంతా మనచేతుల్లోలేదు. అదంతా ఈశ్వరేచ్ఛ!" అన్నదామె మెల్లగా.

"అవును ఈశ్వరేచ్ఛ!" అంటూ ఇగ్నాట్ విచారంగా తల దించుకున్నాడు.

ఆక్షణంనుంచీ అతను తన భార్యను ఒక పసిబిడ్డలా చూచుకోసాగాడు.

"ఎందుకలా కిటికీపక్కన కూచుంటావు? ఇటుచూడు! జలుబుచేస్తుంది. జాగ్రత్త. మంచమెక్కావూ అంటే నా దుంప తెగుతుంది." అనేవాడు లాలనగా, పాలనగా. "ప్రొద్దస్తమానం ఆ మెట్లెక్కిదిగుతుంటావు. కళ్లు తిరిగి పడతావేమో! బొత్తిగా ఆహారం ముట్టుకోడంలేదు. కాస్త తిండి తిను. నీవిప్పుడు రెండుప్రాణాల మనిషివిలే పిచ్చిదానా! ఇద్దరు మనుషులు తినేతిండి తినాలి. లేకపోతే "వాడికి" సరిపోదు." అనేవాడు.

గర్భవతి అయినలగాయతూ నటాలియా మరీ విచారంతోను, మౌనంగాను ఉంటోంది. తన గర్భంలో కదులుతోన్న కొత్తప్రాణాన్ని అస్తమానం గమనిస్తూ కూచునేది. అన ఆత్మలోకి తాను మరింతలోతుగా చూచుకుంటున్నట్లు కనిపించేది. కాని ఆమె పెదవులపై కనిపించే మసక మసక చిరునవ్వు, ఇప్పుడు మరింత స్పష్టంగా కనిపించసాగింది. ఉదయభానుని తొలికిరణపు కాంతిలా ఏదో ఒక కొత్త మిలా

మిల ఆమె కళ్ళల్లో మెరిసేది ఆ మిల మిల ఏదో బెదురు బెదురుగా, చెదురు చెదురుగా ఉండేది.

చివరకామె నీళ్ళాడే రోజులొచ్చాయి. అది శిశిరంలో ఒకనాటి ఉదయం. అప్పుడే తెలతెలవారుతోంది. ఆమెకు ప్రసవవేదన ప్రారంభమైంది. ఆమె నొప్పులతో బాధపడుతూ మొదటిసారి కేకలెయ్యగానే, ఇగ్నాట్ విన్నాడు. అతనిముఖం వెలవెలపోయింది. ఏదో చెప్పబోయి ఏమీ చెప్పలేక తనలోతాను గొణిగాడు. చేతులూపుకుంటూ గదిలోంచి అవతలికి వెళ్ళిపోయాడు. గదిలో ఆ ఇల్లాలు నొప్పులు పడుతోంది. బాధతో మనిషి మెలికలు తిరిగిపోతోంది. ఇగ్నాట్ తన తల్లి బ్రతికిఉన్నప్పుడు పూజచేసుకునే గదిలోకి వెళ్ళాడు. వోడ్కా తెమ్మని ఉత్తర్వుచేశాడు. టేబిల్ ముందు కూచుని వోడ్కా తాగడం మొదలెట్టాడు. ఇంట్లో అంతా గగ్గోలుగా ఉంది. ఒకవైపు మేడమీదినుంచి భార్య మూలుగులు, ఏడ్పులు వినవస్తున్నాయి, మరోవైపు ఇంట్లో పనివాళ్ళు హడావుడిగా తిరుగుతున్నారు. గదిలో ఎదురుగా దేవుడి విగ్రహాలు మసక మసక వెలుతుర్లో కనిపిస్తున్నాయి. టేబిల్ మీద వెలిగించి వుంచిన కొవ్వొత్తి కాంతి గదిలో మసక మసగ్గా ప్రసరిస్తోంది. తన నెత్తిపైన – మేడమీద మనుషుల అడుగుల చప్పుడు. ఏదో బరువైన వస్తువు ఒక మూల నుంచి మరోమూలకు కదిలించినట్టు చప్పుడు. గిన్నెలు, పళ్ళాలు, గలగలలాడించిన చప్పుడు. తొందర తొందరగా మేడ ఎక్కుతూ దిగుతూఉన్న మనుషుల అడుగులచప్పుడు. అంతా హడావుడి. అలజడి. కాని ఎంతచేసినా కాలం కదల

డంలేదు. ఇగ్నాట్‌కు క్షణ మొక యుగంలా గడుస్తోంది. అంతలో పైనుంచి పిక నొక్కుతుంటే అరుస్తున్నట్టుగా, అరుపు వినవస్తోంది.

“ఇలా ఎంతసేపటికీ తేలేటట్టు, కనిపించదు. ఎవరినైనా గుడికి పంపండి.” అంటూ ఇంట్లో కనిపెట్టుకునిఉండే వసూష్కా మేడ దిగి ఇగ్నాట్ గదిదగ్గరికి వచ్చింది. మళ్ళీ ఏదోఅస్పష్టంగా “ఆరిదేవుడా! ఓప్రభూ! నీ అనుగ్రహామే లేదటయ్యా! ప్రసాదించు. మానవులు అసహాయులని నీ వెరుగుదువు. ఈ నీ పాద దాసిని క్షమించి కాపాడు.” అంటూ భగవంతుణ్ణి ప్రార్థించడం మొదలుపెట్టింది.

ఆతరువాత అన్నిధ్వనులనూ అణచివేస్తూ ఒకమానవాతీతమైన కేక—గంటకొట్టినట్టు, గుండెలు బ్రద్దలుచేసినట్టు వినిపించింది. ఆ కేకలోంచే ఒక మెల్లని మూలుగు ధారగా ప్రవహించి గదినిండా వ్యాపించి ఎక్కడో ఒక మూల ఆగిపోయింది. ఆ మూలలో ఇప్పుడు సంధ్యాకాంతి పడుతున్నది, ఇగ్నాటు నిబ్బరంగా దేవుడి విగ్రహాలవైపు చూచాడు ఒక బలమైన నిట్టూర్పు విడిచాడు. “ భగవంతుడా ! ఈ మాటుకూడా ఆడపిల్లే పుట్టిందాఏం ? ” అనుకున్నాడు.

అప్పుడప్పుడులేచి విగ్రహాలముందు మోకరిల్లేవాడు. క్రాస్ చేసుకుంటూ దేవుణ్ణి ప్రార్థించేవాడు. మళ్ళీ మెల్లగా టేబిల్ దగ్గరకివచ్చి వోడ్కా తాగేవాడు. ఆ తాగుడులోనే అతనికి కునుకుపట్టేది. ఆవిధంగా ఆ రాత్రీ, మర్రోజు మధ్యాహ్నందాకా గడిపాడు.

ఆఖరుకు మంత్రసాని పరుగెత్తుకుంటూ వచ్చింది, పట్టరాని ఆనందంతో "ఇగ్నాట్ మాడ్వేయిచ్ ! నీకు కొడుకు పుట్టాడు. నా అభివందనాలు తెలియచేస్తున్నాను." అని చెప్పింది. "అంతా వట్టిదే" అన్నాడు ఇగ్నాట్ బద్ధకంగా. "నీకు పిచ్చెక్కిందాఏం ? నిజం చెపుతుంటే."

తన ఊపిరంతా బిగబట్టి బలంగా నిట్టూర్పు విడిచాడు. ఇగ్నాట్ మోకాళ్ళపై నిలబడి రెండు చేతులతో ఎదుర్రొమ్మును గట్టిగాపట్టుకున్నాడు. గద్గదస్వరంతో "పరమేశ్వరా! ఇన్నాళ్ళకు నీకు నాపై కరుణకలిగింది, నాకు వంశాంకురం లేకుండా చెయ్యడం నీకిష్టంలేదు. పరమేశ్వరా! నా పాపాలన్నింటినీ పరిహరించు!" అని ప్రార్థించాడు.

తరువాత అతను అక్కణ్ణుంచి లేచి అందరికీ ఉత్తర్వులిచ్చాడు.

"ఒరేయ్! ఎవరైనా సెయింట్ నికోలస్ చర్చికివెళ్ళండి. అక్కడ మతగురువు ఉంటాడు. వెంటనే పిల్చుకురండి. ఇగ్నాట్ మాడ్వేయిచ్ రమ్మంటున్నాడని చెప్పండి, నా భార్యకోసం ప్రార్థనలు చెయ్యాలి" అన్నాడు.

అంతలో దాసీది వచ్చింది. కంగారుగా "అయ్యా ! మిమ్మల్ని నటాలియా అమ్మగారు వెంటనే రమ్మని పిలుస్తోంది. ఆమెకు ఆరోగ్యం బాగాలేదుట." అని చెప్పింది.

"ఏం ? ఎట్లాఉంది ? ఎందుకు బాగాలేదు ? అంతా కొంచెంసేపట్లో తగ్గిపోతుందిలే." అన్నాడు ఇగ్నాట్; సంతోషం పొంగి పొరలుతోన్న కళ్ళతో. "సరే ఇప్పుడే వస్తున్నానని చెప్పు. నీ అంత మంచి అమ్మాయి లేదన్నాడని చెప్పు. ఇదిగో,

వస్తున్నా. బహుమతికూడా తెస్తున్నా. ఉండుండు! ఒక్కమాట మతగురువు వస్తాడు. ఆయన కేదైనా ఫలహారాలు తయారు చెయ్యండి. మయకిన్ కోసం ఎవరినైనా పంపండి'' అన్నాడు మళ్ళీ.

ఇగ్నాటు అసలే ఎద్దంత మనిషి. ఇప్పుడు భార్య కొడుకును కన్నదనే ఆనందంలో అతని దేహం మరీ పెద్దదైపోయింది. వెర్రి ఆనందంతో, ఆవేశంతో గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. తనలో తాను పిచ్చిగా నవ్వుకుంటున్నాడు. చేతులు కట్టుకుని దేవుడి విగ్రహాలవంక చూస్తున్నాడు. క్రాస్ చేసుకుంటూ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాడు. చివరకతను తన భార్యను చూడ్డానికి వెళ్ళాడు.

అతను భార్యగదిలో ప్రవేశించగానే ముందు అతని కళ్ళకు కనిపించింది నెత్తురు ముద్దలా ఉన్న వేలెడంత శరీరం. బిడ్డకు మంత్రసాని నీళ్ళు పోస్తోంది. బిడ్డనుచూడగానే ఇగ్నాట్ మునివేళ్ళమీద నిలబడ్డాడు. చేతులు వెనక్కు పెట్టుకున్నాడు. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బిడ్డ సమీపానికి వెళ్ళాడు. పిల్లవాడు నీళ్ళ తొట్లో అటూ ఇటూ దొర్లుతూ ఊపిరాడకుండా కొట్టుకుంటున్నాడు. ఆ చిన్నారి పాపడు అలా అవస్థపడుతుంటే చూడలేకపోయాడు ఇగ్నాట్.

"జాగ్రత్త! పిల్లవాణ్ణి జాగ్రత్తగా పట్టుకో. వాడింకా నెత్తురుముద్ద. ఎముకలేనివళ్ళు'' అన్నాడు మంత్రసానితో.

మంత్రసాని బిడ్డను ఈ చేతిలోంచి ఆ చేతిలోకీ, ఆ చేతిలోంచి ఈ చేతిలోకీ నేర్పుగా ఎగరేస్తూ, తన బోసినోరంతా బయటపెట్టి నవ్వుతోంది.

" నీ భార్య దగ్గరికి వెళ్ళవయ్యా. నీపని నీవు చూచుకో. " అన్నది మంత్రసాని నవ్వుతూ.

అతను మారుపలుకకుండా భార్య మంచందగ్గరికి వెళ్ళాడు. అలా వెడుతూనే " ఏం నటాలియా ? ఎలా ఉంది వంట్లో ! " అన్నాడు. మంచందగ్గరికివెళ్ళి అడ్డంకట్టి ఉన్న తెరను తొలగించాడు.

" ఈ గండం గడిచేటట్టులేదు " అన్న దామె మెల్లగా, ఊపిరితీస్తూ.

ఇగ్నాట్ తన భార్యముఖంలోకిచూచి మౌనం వహించాడు. ఆమె-మొహం తెల్లని తలగడలో దూర్చుకుని పడుకుంది.

ఆమె నల్లటి జడలు చచ్చిన సర్పాల మాదిరి ఆమె మొహంమీద పడివున్నాయి. ఆమె కళ్ళు పచ్చగా, పాలి పోయి, నిర్జీవంగా ఉన్నాయి. విశాలంగా విప్పారి ఉన్నాయి. ఆమె మొహం చూడగానే అతనికి అదోలా అనిపించింది. చుట్టూఉన్న గోడలనుకూడా చీల్చుకుంటూ, ఎక్కడో దూరంగా చూస్తోంది ఆమె. ఆమె చూపులుకూడా భయంకరంగా కని పించాయి ఇగ్నాట్‌కు. అలాచూడడం అతనెన్నడూ ఎరగడు. ఇంతవరకూ ఆనందంతో పరవళ్ళుత్రొక్కిన అతని హృదయం ఇప్పు డేదో ప్రమాదం రానున్నట్టు అనుమానించసాగింది. హృదయచలనం మందంగా మారిపోయింది.

"మరేం భయంలేదు. ఇది మామూలే. గడిచిపోతుందిలే. భయపడకు." అన్నాడు మెల్లగా. భార్యకు ముద్దివ్వడానికని

అతను ఆమెమీదికి వంగాడు. కాని ఆమె అతనిముఖంలో ముఖంపెట్టి "ఈ గండం గడవదు." అని అన్నది.

ఆ పెదవులరంగు మారిపోయింది. చల్లగా ఉన్నాయి. తన పెదవులు ఆమె పెదవులకు తాకగానే ఇగ్నాట్ అర్థంచేసుకున్నాడు. అప్పుడప్పుడే ఆమెను మృత్యువు సమీపిస్తున్నదనీ, ఇక ఆమెలో స్థావరం ఏర్పరుచుకుంటున్నదనీ అతను వెంటనే గ్రహించాడు.

"అయ్యో, పరమేశ్వరా!" అని ఏదో అనబోయాడు. కాని భయంవల్ల అతని గొంతు పెగిలిరాలేదు.

"నటాషా! ఆ చంటివాడి గతేం కావాలి? వాణ్ణి ఏం చేసి పోతావు? వాణ్ణి పెంచేదెవరు? అయ్యో! ఏమిటే నటాషా ఇది?" అన్నాడు మళ్ళీ నిబ్బరం తెచ్చుకుంటూ.

అతనలా అంటూ దాదాపు ఏడ్వసాగాడు. మంత్రసాని ఏడుస్తున్న పిల్లవాణ్ణి పైకి ఎగరేస్తూ వళ్ళు తుడుస్తున్నది. ఇగ్నాట్‌కు ధైర్యంచెప్పసాగింది. కాని ఆమె చెపుతున్న మాటలు అతను వినుపించుకోవడంలేదు. భయంకరంగా మారిపోయిన తన భార్యముఖంవంకే చూస్తున్నాడు. దుఃఖంతో అతని పెదవులు అదురుతున్నాయి. భార్య హీనస్వరంతో ఏదో అంటున్నది. అతను వింటున్నాడు కాని అర్థంకావడంలేదు. "వాడివిషయం ఆలోచించు. నీవు లేకపోతే వాడి కెవరు దిక్కు? కళ్ళుతెరవని పసిబిడ్డ! కాస్త ధైర్యంగా ఉండు. శక్తి కూడగట్టుకో. ఇలాటి పాడు ఆలోచనలుపెట్టుకోకు." అంటున్నా డతను.

తను ఏంచెప్పినా ప్రయోజనంలేదని అతనికి తెలుసు. అతని కళ్ళల్లో నీళ్లు నిండాయి. గుండెలో బండపెట్టినంత బరువుగా బాధపెడుతోంది.

"నన్ను మన్నించు. సెలవు తీసుకుంటున్నాను. ఏ విషయాన్నీ అశ్రద్ధచేయక, జాగ్రత్తగా ఉండు. తాగబోకు." అన్నదినటాలియా. ఆమెగొంతు దాదాపు మూసుకపోతున్నది.

మతగురువు వచ్చి ఆమె ముఖాన దేవతా వస్త్రాన్ని కప్పాడు. నిట్టూరుస్తూ మెల్లగా ప్రార్థన చేయసాగాడు.

"పరమేశ్వరా! ఓ ప్రభూ! నీవు సర్వశక్తిసంపన్నుడవు! నీవు నయంచెయ్యలేని రోగమంటూ లేదు. నీ చరణదాసియైన ఈ నటాలియా జబ్బుకూడా నయంచెయ్యి. ఈమె ఇప్పుడే బిడ్డను కన్న తల్లి. ఆమెబిడ్డను కాపాడు. అన్ని కష్టాలనుంచీ, నష్టాలనుంచీ తుపానులనుంచీ, పిశాచాలనుంచి, దుర్మార్గంనుంచీ, రేయింబవళ్ళు అతన్ని కంటికిరెప్పలా కాపాడుతూఉండు." అని మతగురువు ప్రార్థించసాగాడు. మధ్యమధ్య అతని గొంతు తడబడుతోంది. వృద్ధాప్యంతో శుష్కించిన అతనిమొహం నిశ్చలంగా ఉంది. అతని దుస్తులలోంచి తామరపూలవాసనవస్తోంది.

మతగురువుప్రార్థనను ఆలకిస్తూ ఇగ్నాట్ తనలోతాను దుఃఖిస్తున్నాడు అతని కళ్ళనుంచి, ఇంతింత పెద్దకన్నీటి బిందువులు రాలి నగ్నంగాఉన్న అతని భార్యచేతిమీద పడుతున్నాయి. అయినా ఆమెకు స్పృహలేదు. ఆ చెయ్యి మొద్దుబారిపోయిఉంది ఆమె చర్మం ఏమాత్రం చలించడంలేదు.

ప్రార్థన అయిపోగానే నటాలియా అచేతనురాలైంది. ఒకరోజంతా ఆమె అలాగే పడివుంది. నోట

మాటలేదు. ఎంత మెల్లగా జీవించిందో అంతమెల్లగా మరణించింది. ఆమె అంత్యక్రియలు గొప్పగా జరిపాడు ఇగ్నాట్. పిమ్మట తన కుమారుడికి నామకరణ మహోత్సవం జరిపాడు. వాడికి 'ఫోమా' అని పేరు పెట్టాడు. మళ్ళీ ఈ పిల్లవాడికి కూడా మయికిన్‌నే సంరక్షకుడిగాను, రక్షకపితగా నియమించాడు. మయికిన్ తనకు పాత స్నేహితుడైనా ఆపని చేయడం ఇగ్నాటుకు యిష్టంలేదు. అయినా అలా చేశాడు. అంతకు పూర్వమే మయికిన్‌భార్య కూడా ఒకబిడ్డను కనిఉంది.

భార్య చావుతో ఇగ్నాట్‌కు వృద్ధాప్యం వచ్చినట్లయింది. అతని నల్లటిగడ్డంలో వెంట్రుకలు చాలాభాగం నెరిసిపోయాయి. అయినప్పటికీ అతని కళ్ళల్లో నిశ్చలమైన ప్రకాశం మాత్రం పోలేదు. అవి మరేదో కొత్తకాంతిని తెచ్చిపెడుతున్నాయి. అందులో ఏదో మెల్లని నిర్మలమైన భావం అగుపించసాగింది.

## రెండో అధ్యాయం

మయకిన్ ఒక పెద్ద రెండంతస్తుల భవంతిలో నివసిస్తున్నాడు. భవంతిచుట్టూ ఒక పెద్ద తోట. తోటలో ఏనాడో వేసిన నిమ్మచెట్లు ఏపుగా పెరిగి ఉన్నాయి. దట్టంగా అలుముకున్న నిమ్మచెట్లతో తోటంతా కళకళలాడుతూ ఉంటుంది. పొడుగ్గా పెరిగిన చెట్లకొమ్మలు భవంతి కిటికీలకు తాకి దట్టంగా కప్పుకుని ఉంటాయి. చెట్లకొమ్మల సందుల్లోంచి సూర్యకాంతి ప్రసరించి ఇంట్లో పడుతూ ఉంటుంది. ఇంట్లో

చిన్నచిన్న గదులన్నీ ఎప్పుడూ సగంసగం చీకటిలో మసక మసకగా కనిపిస్తూ ఉంటాయి. ఆ గదులనిండా రకరకాలబల్లలూ కుర్చీలు, కొయ్యసామానులు, పెద్దపెద్ద ట్రంకుపెట్టెలు, కుక్కబడి ఉంటాయి. మయకిన్ కుటుంబం దైవభక్తిగల కుటుంబం. అంచాత ఇంట్లో ఎప్పుడూ కొవ్వొత్తులు, అగరుబత్తీలు, సాంబ్రాణి పొగలు, పూలమాలలు, పూజాద్రవ్యములు, వీటి గుమగుమవాసనలు వెదజల్లుతుంటాయి. నిత్యం ప్రార్థనలు, దైవధ్యానంలో ఉండి విడిచేనిట్టూర్పులు వినవస్తుంటాయి. మత కర్మలన్నీ మహాపవిత్రంగా జరుపుతుంటారు. ఇంట్లోవారంతా భక్తిపారవశ్యంతో పరవళ్ళుతొక్కుతుంటారు ఆడవారంతా సగం చీకటిగాఉన్న ఆ గదుల్లో నిశ్శబ్దంగా, నిండుగా నడుస్తుంటారు. అంతా నల్లటి దుస్తులు, మెత్తటి స్లిప్పర్లు ధరించి దీనంగాఉన్న ముఖాలతో ఏదో తపోనిష్ఠలోఉన్నట్టు కనిపిస్తుంటారు.

యాకోవ్ తారాసొవిచ్ మయకిన్ కుటుంబం—అతనూ అతని భార్య, ఒక కూతురూ, మరి అయిదుగురు బంధుస్త్రీలూను. ఆ అయిదుగురిలోనూ చిన్న ఆమెకు ముప్ఫైరెండేండ్లు ఉంటాయి ఇంటి యజమానురాలు ఆంటోనియా ఇవానోవ్నా. అందరూ ఆమె ఆజ్ఞాబద్ధులై భయభక్తులతో సంచరిస్తుంటారు. ఆమె సన్నగా పొడుగ్గా ఉంటుంది, ముఖం నలుపు. కళ్ళు మాత్రం నిశితంగా, నిండుగాఉండి తెలివితేటల్ని వ్యక్తం చేస్తుంటాయి. మయకిన్‌కు ఒక కుమారుడుకూడా ఉన్నాడు. అతనిపేరు తారాస్. అయినా ఆఇంట్లో ఎవ్వరూ అతనిపేరెత్తరు. అతను పందొమ్మిదేండ్ల వయస్సులో చదువుకోడానికని మాస్కో

వెళ్ళాట్ట. మూడేండ్ల తరువాత, తండ్రి కిష్టంలేకుండా అక్కడే ఒక అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాట్ట. అంచాత తండ్రి అతనితో తెగతెంపులు చేసుకున్నాట్ట. ఈ విషయం వారి పరిచయస్థులకు మాత్రమే తెలుసు. తరువాత తారాస్ ఎక్కడున్నదీకూడా వారికి జాడ తెలియకుండాపోయింది. ఏదో నేరంచేసిన కారణంవల్ల అతన్ని సైబీరియా పంపారని మాత్రం పుకారు పుట్టింది.

యాకోవ్ మయకిన్‌ది విచిత్రమైన ఆకారం, వింత ప్రకృతి. సన్నగా, పొట్టిగా, ఎప్పుడూ ఉల్లాసంగా ఉంటాడు. ఎర్రటి చిన్నగడ్డం. తెలివిని కనపరచే ఆకుపచ్చని కళ్ళు. అతను ఎప్పుడూ ప్రతిఒక్కరితోనూ ఇలా అంటున్నట్టు కనుపించేవాడు. "అయ్యా! మరేంపరవాలేదు. అలా కంగారు పడకండి. మీ సంగతంతా నాకు తెలుసు. మిమ్మల్ని గురించి చాలాచాలా తెలుసు. అయినా నా జోలికిరాకుండా, నాకు హాని కలిగించకుండా ఉంటే, మీ గుట్టు బయటపెట్టను. తెలిసిందా ?"

అతని తల కోడిగుడ్డు ఆకారంలో ఉండేది. కాని దయ్యప్పుతలంత తల. ఉన్నతమైన ఫాలభాగం ముడతలుపడిఉండేది. ఆనుదురు పెరిగిపెరిగి చివరకు బట్టతలలో కలిసిపోయింది. అంచాత అతనికి నిజంగా రెండు ముఖాలున్నట్టుగా కనిపించేది. అందులో ఒకటి మేధావంతంగా పొడుగాటిముక్కుతో బయటికే కనిపించేది. దీనిపైన రెండో ముఖం, కళ్ళు నోరు లేకుండా ముడతలతో కప్పబడి వెనుక ఉండిపోయేది. కొంతకాలం మయకిన్ తన కళ్ళను, పెదవులను, దాచిపెట్టుకున్నాడా అనిపించేది. ఆ

ఈ విధంగా ఆ పిల్లలిద్దరి మధ్య చనువు, స్నేహం, పెరుగు తూవచ్చాయి.

షోమాకు రోజంతా ఒక క్రమపద్ధతిలో ఏదో భారంగా గడిచిపోయేది. ఉదయం నిద్రలేవగానే స్నానం, తరువాత బుజ్యాతోపాటు దైవప్రార్ధనలు. పిమ్మట బిస్కట్లు తినడం టి తాగడం అయిపోయేది. ఆ తరువాత వేసవికాలమైతే పిల్లలందరితో కలిసి ఆడుకోవడానికి వెళ్ళేవాడు. పిల్లలంతా ఊరవతల కనుమలోకి వెళ్ళి ఆడుకునేవారు. చీకటిగా ఉన్న ఆ కనుమను చూచినప్పుడల్లా వాళ్ళకు భయం పుట్టేది. అంచాత పెద్దవాళ్ళు. వాళ్ళను అక్కడికి వెళ్ళనిచ్చేవారు కారు. ఇక శీతాకాలం రాగానే చలి ముంచుకొచ్చేది. బయటికి వెళ్ళి ఆడుకోవడానికి వీలుండదు అందుకని పిల్లలంతా ఇంట్లోనే ఆడుకుంటూ గడిపేవాళ్ళు. మయకిన్ ఎప్పుడూ చెప్పుతుంటాడు—"మా ఇంట్లో మధ్యాహ్న భోజనం అచ్చం రష్యన్ పద్ధతిలో ఉంటుంది" అని. ఇంకేం? పిల్లలంతా అలాగే భోజనం చేసేవారు. భోజనాలదగ్గర ఎవరూ మాట్లాడరు. వీలైనంతవరకూ అందరూ మౌనం వహించి భోజనాలు చేస్తారు. మధ్య మధ్య భుక్తాయాసంవల్ల నిశ్వాసాలు విడుస్తుంటారు. పిల్లలందరికీ వేరు వేరు పాత్ర లుండేవి. ఎవరి పాత్రలో వారు తినేవారు. పెద్దవాళ్ళుమాత్రం అలాకాదు. అందరూ ఒక పాత్రముందు కూచుని భుజించేవారు. సుష్టుగా భోజనాలు కాగానే అందరికీ నిద్ర ముంచుకొచ్చేది. రెండు మూడు గంటల సేపు గురకలుపెడుతూ నిద్రపోయేవారు. ఇల్లంతా గురకలతోను బుసలతోను నిండిపోయి ఉండేది. నిద్రలేవగానే మళ్ళీ

అందరూ టీ తాగేవారు. నగరంలోని వార్తలు, విశేషాలు పెళ్ళిళ్ళ ముచ్చట్లు, విందుభోజనాలసంగతులు, సాటివర్తకులు చేసే మోసాలు, వీటన్నిటినిగురించి మాట్లాడుకునేవారు. టీ తాగినతరువాత మయకిన్ తన భార్యతో "ఇదిగో, ఆ బైబిల్ ఇలా ఇవ్వు" అని అడిగేవాడు.

తరువాత మయకిన్ బైబిల్ గ్రంథాన్ని పఠించేవాడు. అన్ని అధ్యాయాల్లోకీ ముఖ్యంగా "బుక్ ఆఫ్ జాబ్" అనే అధ్యాయంమాత్రం పలుమార్లు పఠించేవాడు. బైబిల్ చదవబోయ్యేముందు అతను వెండి ఫ్రేముతో తయారుచేసిన ఒక లావుపాటి కళ్ళజోడు పెట్టుకునేవాడు. అందరూ బైబిల్ వినడానికి వచ్చి ఎక్కడి వారక్కడ కూచున్నారో లేదో అని పరిశీలించేవాడు. అందరూ ఎవరిస్థానాల్లో వారు కూచుని ఉండేవారు. అందరి ముఖాల్లోనూ ఒకవిధమైన పవిత్రభావము భయభక్తులు కనిపిస్తుండేవి.

"ఉజ్ అనే దేశంలో ఒక మనిషి ఉండేవాడు." అంటూ మయకిన్ బైబిల్ చదవడం మొదలెట్టేవాడు. ఫోమా లూబాతో కలిసి ఆమె ప్రక్కన ఒక కుర్చీలో కూచుని వింటుండేవాడు. ఈ మొదటివాక్యం చదవగానే మయకిన్ తన బట్టతలపై చేత్తో రుద్దుకునేవాడు. ఇది అతనికి అలవాటు. రోజూ ఆ వాక్యం చదవగానే తలపై రుద్దుకుంటాడని ఫోమాకు కూడా తెలుసును. ఉజ్ దేశంలోఉన్న ఆ ఒకానొక మనిషిని గురించి ఊహించుకుంటూ కూచునేవాడు ఫోమా. ఆ మనిషి పొడుగ్గా ఉంటాడని ఫోమా ఊహ. జీసస్ క్రీస్తు విగ్రహంలో కళ్ళమాదిరి ఆమనిషి కళ్ళు కూడా చాలా

పెద్దవిగా ఉంటాయని ఊహించేవాడు. అతని గొంతు యుద్ధంలో సైనికులు ప్రయోగించే కంచు ఢక్కా మాదిరి ఉంటుందని అతను అనుకునేవాడు. అలా ఆ మనిషి పెరిగి పెరిగి పెద్దవాడై చివరకు మబ్బంత ఎత్తు పెరిగేవాడు. తన నల్లటి చేతులను మబ్బుల్లోకి పోనిచ్చి వాటిని చీల్చేసేవాడు. భయంకరమైన కంఠస్వరంతో భూమి దద్దరిల్లేలా అరిచేవాడు.

"భగవంతుడు మనిషి చుట్టూ ముళ్ళకంపతో కంచె వేశాడు. అలా నాగుడుమూతల్లో బంధింపబడిన మనిషికి వెలుగు ఇవ్వడం దేనికి? దానివల్ల ఏం ప్రయోజనం?"

ఈ అరుపు విని ఫోమా వణికిపోయేవాడు. భయం పిడుగులావచ్చి అతనిమీద పడేది. కళ్ళల్లో నిద్రమత్తు పారిపోయేది. మయకిన్ మందహాసంచేస్తూ, గడ్డం నిమురుకుంటూ "అత నెంత సాహసం కలవాడో చూచారా!" అనేవాడు.

ఆయన చెబుతున్నది ఉడ్‌లో ఉన్న మనిషిని గురించని ఫోమాకు తెలుసు. మయికిన్ చిరునవ్వుతో ఆ పసివాడిమనస్సు మళ్ళీ కుదుటపడేది. "ఆ మనిషి ఆకాశాన్ని బ్రద్దలుకొట్టడు. తన కబంధ హస్తాలతో మబ్బుల చీల్చడు." అంటూ మళ్ళీ కథసాగించేవాడు మయకిన్. మళ్ళీ ఆ వ్యక్తి ఫోమాకు కళ్ళ ముందు కనిపించేవాడు. అతను మట్టినేలమీద కూచుని ఉన్నాడు. అతని శరీరంనిండా చెదపురుగులు, ఏవో క్రిమికీటకాదులు పాకిపోతున్నాయి. వళ్ళంతా దుమ్ము, ధూళి, పెద్దపెద్ద మట్టిబెడ్డలు. మనిషి పూర్వంలా లేడు. చాలా చిన్నవాడైపోయాడు. చూస్తే అసహ్యం పుడుతున్నది. చర్చిముందు నిలబడి అడుక్కునే బిచ్చగాడిలా వున్నాడు.

మళ్ళీ అక్కడ మయకిన్ పురాణం సాగిస్తున్నాడు.

"మనిషి పరిశుభ్రంగా ఉండాలంటే, ఏంచేయాల్సి ఉంటుంది? స్త్రీకి జన్మించిన ఆ మనిషి పవిత్రుడుగా, ధర్మ పరాయణుడుగా ఉండాలంటే ఏం చేయాల్సిఉంటుంది? అని అతను పరమేశ్వరుణ్ణి అడుగుతున్నాడు" అలా చెపుతూ మయకిన్, ఆవేశంతో ఆ మాటలలోని భావం వివరించి చెపుతున్నాడు.

"రక్తమాంసాలతో జన్మించిన నేను పవిత్రంగా,ధర్మంగా ఎలా ఉండగలుగుతాను? ఎలా? అని అతను ఈశ్వరుణ్ణి ప్రశ్నిస్తున్నాడు." మయకిన్ చదువుతూ, మధ్య మధ్య ఏదో విజయ గర్వంతో శ్రోతలవంక చూచేవాడు—ఇలా నిత్యం పురాణ కాలక్షేపం జరుగుతూ ఉండేది.

మయకిన్ యింటికి ఇగ్నాట్ రోజూ వచ్చి కొడుకును చూచుకుని పోతుండేవాడు. కుమారుడికి ఆటవస్తువులు తెచ్చి ఇచ్చి అతన్ని కౌగలించుకునేవాడు. ఎతుకుని ముద్దాడేవాడు. కాని అప్పుడప్పుడు ఏదో అసంతృప్తితో.

"ఏమిరా నాయనా! ఎప్పుడూ ఇంత మందకొడిగా ఉంటావేమిట్రా! ఒక్కసారైనా నవ్వవేంరా నాయనా?" అని అడిగేవాడు.

మళ్ళీ మయకిన్‌తో "పిడూ వాళ్ళ అమ్మలాగే తయారవ్వేట్టున్నాడు. కళ్ళల్లో వెలుగే కనిపించదే!" అనే వాడు, భయంతో.

"నీవు ఊరికనే గాభరాపడుతుంటావు. ఏంలేదులే." అని సర్ది చెప్పేవాడు మయకిన్.

మయకిన్‌కుకూడా ఫోమా అంటే అమిత ప్రేమ. ఒక నాడు ఇగ్నాట్ ఫోమాను తన ఇంటికి తీసుకెడతానన్నాడు. అప్పుడు మయకిన్ చాలా విచారంతో "వాణ్ణి ఇక్కడే ఉంచ రాదూ? వాడి కిక్కడ అలవాటైపోయింది. చూడు! వాడెలా బిక్కమొహంవేశాడో!" అని బ్రతిమాలుకునేవాడు.

వాడికేం దిగుల్లేదులే; అదే పోతుంది. వాణ్ణికన్నది నీకోసమటయ్యా మయకిన్? ఇక్కడ వాతావరణం వాడికి జత పడలేదు. మీ ఇల్లు ఒక ఆశ్రమంలాగాఉంది. పసివాళ్ళకు ఇలాంటి వాతావరణం మంచిదికాదు. పైగా వాడుకూడా లేక పోతే, ఇంటిదగ్గర నాకేం తోచిచావడంలేదు. ఒంటరివాణ్ణయి పోయినట్టు బాధపడుతున్నాను. ఇంటికి వెడతానా— ఇల్లంతా బోసిపోయి ఉంటుంది. మనుషులులేనట్టు ఇల్లంతా బావురుమంటూ ఉంటుంది. ఇక నేనా - వాడికోసమని అప్పసంగా ఇక్కడికొచ్చి ఉండడానికి నాకు వీల్లేదు. వాడి కోసం. నేను కాదు మయకిన్! నాకోసమే వాడు! ఇప్పుడు నాచెల్లెలుకూడా ఇక్కడికొచ్చి నాదగ్గరే ఉంటోంది కనుక వాణ్ణికనిపెట్టి ఉండడానికి ఎవరూ లేరనే చింతలేదు." అంటూ ఇగ్నాట్ తన కొడుకును తీసుకెళ్ళాలని మయకిన్‌కు నచ్చ చెప్పాడు.

అలా ఇగ్నాట్, తనకొడుకు ఫోమాను మళ్ళీ తన ఇంటికి తెచ్చుకున్నాడు. ఫోమా ఇంట్లోకి రాగానే అత్తయ్య కనిపించింది. ఆమెది బోసినోరు. ముక్కు వ్రేలాడుతోంది. వృద్ధురాలు. చూడ్డానికి భలే తమాషాగా ఉంటుంది; చాలా పొడుగు. వంగిపోయిన నడుం. పెరుగుబుడ్డిలా నెరిసిన తల.

దానిమీాద నల్లటి పట్టు టోపీ పెట్టుకుంటుంది. ఆమె ఆకారాన్ని చూచేసరికి ఫోమాకు మొదట్లో ఆమె దగ్గరికి వెళ్ళడానికి ఇష్టంలేకపోయింది. పైగా కొంచెం భయపడ్డాడు కూడా. కాని ముడతలుపడ్డ ఆమెముఖంలోకి చూచేసరికి ఆమెనల్లటికళ్ళు కనిపించాయి. ఎంతో మృదువుగా ముచ్చటగా ఉన్నాయి ఆకళ్ళు. వెంటనే అతనికి ఆమెదగ్గరికి వెళ్లాలనిపించింది. దగ్గరికి వెళ్ళాడు. చనువుతో, ప్రేమతో తన ముఖాన్ని ఆమె మోకాళ్ళకు ఆనించి రుద్దుకున్నాడు.

"నాపిచ్చితండ్రీ! తల్లిలేని బిడ్డవురా నాయనా" అన్నదామె. ఆమె కంఠస్వరం మృదువుగా, జోలపాడుతున్నట్లున్నది. "రారా నాయనా! ఇలా దగ్గరికిరా" అంటూ పిల్లవాడి తల నిమిరింది. ఆమె అలా లాలిస్తుంటే, ఏదో హాయి అనిపించింది ఫోమాకు. ఏదో మాధుర్యం రుచి చూచాడతను. అలాంటి మాధుర్యం అత నింతకుముందు ఎప్పుడూ, ఎవరిదగ్గరా చూడలేదు. ఆశ్చర్యంగా, ఏదో అడుగుతున్నట్లుగా అతను ఆమె కళ్ళల్లోకి చూచాడు. ఆ వృద్ధురాలు అతన్ని, అతనింతవరకూ ఎరుగని ఒక కొత్త ప్రపంచంలోకి తెచ్చి పడేసింది. అతనువచ్చిన మొదటినాడే ఆమె అతన్ని పడుకోబెట్టిన తరువాత "ఒక కథ చెప్పనా బాబూ" అని అడిగింది.

ఆమె ఏదో కథ చెపుతోంది. ఫోమాకు కళ్ళముందు ఏదో అద్భుతమైన లోకం కనిపించింది. ఆమె చెప్పే మెల్లని, చల్లని మాటలు వింటూ అతను అలాగే నిద్రపోయాడు. ఇలా ప్రతిరోజూ అతను పడుకోబొయ్యే ముందు ఆమె కథలు చెపుతూ ఉండేది. ఆ కమ్మని కథలు వింటూ ఫోమా నిద్రపోయ్యేవాడు.

ఆమె చెప్పే కథలు చాలా చిత్రమైన కథలు. ఆ కథల్లో రాక్షసులు, రాజులు, రాణులు, బుద్ధిలేనివాళ్ళు గొప్పవాళ్ళవడం, రకరకాలమనుష్యులు, వింత వింత వ్యక్తులు; రాక్షసుల యుద్ధాలు; ఇవన్నీ ఉండేవి. ఈ రూపాలన్నీ అతని కళ్ళముందు కదులుతూ, గుంపులుగుంపులుగా నడిచివెళ్ళేవాళ్ళు. అతని ఊహల్లో ఏవేవో మెరిసిపొయ్యేవి. అతని ఆత్మ ఏదో నూతనశక్తితో పరిపూర్ణ సౌందర్యంతో వెలిగిపొయ్యేది. ఆ వృద్ధురాలి జ్ఞాపకశక్తికి అతను ఆశ్చర్యపడేవాడు ఏం జ్ఞాపకశక్తి! ఏం జ్ఞాపకశక్తి! అంతులేని జ్ఞాపకశక్తి ఆమెది. ఆమె మనస్సులో కథలు పుట్టలు పుట్టలుగా ఉండేవి. ఆమె ఊహాశక్తికూడా తీగెలా అలా సాగిపోతుండేది. ఒకొక్కమాటు థోమాకు కలలువచ్చేవి. ఆ కలల్లో ఆ వృద్ధురాలు ఒక చిత్రమైన మాంత్రికురాలిలా కనిపించేది. కాని ఆమె భయపెట్టే మంత్రకత్తె కాదు. దయచూపి రక్షించే మంత్రకత్తె. ఇంకొక్కప్పుడామె అందమైన స్త్రీలా, అన్నీ తెలిసిన వాసిలీసాలాగా అగుపించేది.

దొప్పల్లా విప్పారిన కళ్ళతో, ఊపిరంతా బిగపట్టుకుని గదినిండా కమ్ముకున్న చీకట్లోకి చూచేవాడు థోమా. గదిలో దేవుడి విగ్రహంముందు దీపం వెలుగుతూ ఉండేది. ఆ దీప కాంతికి చీకటి మెల్లగా వణుకుతున్నట్లు కనిపించేది. ఆ చీకట్లోకి ఎన్నెన్నో చిత్రకథల జీవితచరిత్రలు ఊదేవాడు. ఆ కథల్లోని రకరకాల రమ్యమైన, సజీవమైన నీడలు చీకటినిండా నిండిపోయేవి. ఆ నీడలు గదిగోడలమీదా, క్రిందా పైనా పాకుతూ పోయేవి. ఆ నీడల చరిత్ర వింటుంటే హాయిగానూ ఉండేది,

భయమూ పుట్టేది. వాటికి రంగులు పూసి, రూపమిచ్చి, ప్రాణంపోసి, ఒక్కక్షణంలో వాటిని మళ్ళీ ధ్వంసం చేస్తుంటే అతనికి అమిత భయము, ఆనందము కలిగేవి. ఆతని కళ్ళలో ఏదో నూత్న కాంతి తళుకులా కనిపించేది. ఆ తళుకులో వసి తనం ఉన్నదికాని గంభీరతలేదు. ఆ ఏకాంతమూ, ఆ కారు చీకటీ అతనిలో ఏదో బాధను మేల్కొలిపేది. దేనికోసమో వెదికేవాడు. ఎవరికోసమో ఎదురుచూచేవాడు; ఇలాచేస్తూ తనలో తానే ఆశ్చర్యపోయేవాడు. ఆ చీకటిమూలలకు వెళ్ళాలనిపించేది. దట్టంగా అలుముకున్న ఆ చీకటి పొరలను చీల్చి చూడాలనిపించేది. ఆ చీకటి తెరలను తెరిచి లోపల ఏమిదాగివున్నదో తెలుసుకోవాలని తీవ్రమైన వాంఛ పుట్టేది. చివర కతను వెళ్ళేవాడు. కాని ఏమీ కనిపించేదికాదు. అయినా ఏదో ఒకటి కనిపిస్తుందనే ఆశ అతన్ని వీడలేదు.

ఘోమా, తండ్రియెడల భయభక్తులతో సంచరించే వాడు. అతన్ని గౌరవించేవాడు. కాని ఇగ్నాట్ సామాన్య మైన మనిషా? అతనిది ఏనుగంత శరీరం, కంచు ఢక్కా మోగించినట్టుండే కంఠస్వరం, దట్టమైన గడ్డం, తెల్లగా పండి పోయిన తల, బలంగా పొడుగ్గా పెరిగిన చేతులు, మెరుపుల్లా మెరిసే కళ్ళు;.... ఇన్ని లక్షణాలు గల తండ్రిని చూచేసరికి అతను సరిగ్గా అత్తయ్య చెప్పిన కట్టుకథల్లోని దొంగలనాయ కుడికిమల్లే కనిపించేవాడు ఘోమాకు.

తండ్రికంఠస్వరంగాని లేక భూమి అదిరేలా నడిచే అతని అడుగుల చప్పుడుగాని ఎప్పుడు వినిపించినా ఘోమా గజ గజలాడిపోయేవాడు. కాని మళ్ళీ తండ్రి తనను నవ్వుతూ

ప్రేమగా దగ్గరికిపిలిచి, తొడలమీద కూచోబెట్టుకుని కులాసాగా ముచ్చట్లు చెప్పుతున్నా, గాలిలో పైకెగరేసి ఆడిస్తున్నా ఆ కుర్రాడి భయంకాస్తా పారిపోయేది.

ఇలాఉండగా ఒకనాడు—అప్పుడు ఫోమాకు ఎనిమిదో ఏడు—తండ్రి ఏదో దూరప్రయాణంచేసి చాలారోజులకు ఇంటికి వచ్చాడు. ఫోమా తండ్రి నిలా అడిగాడు.

"నాన్నా! ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు నాన్నా?"

"వోల్గానదీ తీరంలో."

"అక్కడ ఏంచేస్తున్నావు? దొంగతనాలుచేస్తున్నావా?" అనడిగాడు ఫోమా మెల్లగా.

"ఏమిట్రా?" దీర్ఘంతీస్తూ అడిగాడు ఇగ్నాట్. అతని కనుబొమలు ముడివడ్డాయి.

"నీవు దొంగవుకాదా నాన్నా? నాకు తెలుసు. నీవు దొంగవేలే." అన్నాడు ఫోమా, కొంటెతనంగా కను రెప్పలార్పుతూ. తన తండ్రి జీవితరహస్యాన్ని ఇదివరకే కని పెట్టేశానన్నట్టు అతనికి సంతోషమైంది.

"నేను దొంగను కాదురా. వర్తకుణ్ణి అన్నాడు ఇగ్నాట్ నిక్కచ్చిగా. కాని మళ్ళీ ఒక్కక్షణం ఆలోచించి చిరునవ్వు నవ్వాడు. దయతో ఇలా అన్నాడు. "నీవు పిచ్చి పిల్లవాడివిరా అబ్బాయి! నేను ధాన్యంవర్తకం చేస్తాను. నాకు చాలా స్టీమర్లుకూడా ఉన్నాయి. "నీవు" "ఎర్మాక్" స్టీమరును చూడలా? సరేకాని, అది నాదేరా బాబూ. నీదికూడాలే."

"అవును అది చాలా పెద్దది." అన్నాడు ఫోమా నిట్టూరుస్తూ

"సరే, నీవింకా చిన్నవాడివిగా ఉన్నప్పుడే నీకో చిన్నస్టీమరు కొనిపెడతాలే. ఏం, కొనిపెట్టనా ?"

"అలాగే" అన్నాడు ఫోమా. కాని కొంచెంసేపు మౌనంగా ఆలోచించుకుని మళ్ళీ దిగులుగా ఇలా అన్నాడు. కాని నీవొక దొంగవో లేక రాక్షసుడవో అనుకున్నాను."

"చెప్పలేదూ? నేను వర్తకుణ్ణి!" అన్నాడు మళ్ళీ ఇగ్నాట్. నిస్తేజమైన కొడుకుముఖం చూస్తుంటే అతనికేదో అసంతృప్తి, ఆవేదన కలిగాయి.

"ఫెడర్ తాతలాగా కదూ?" కొంచెంసేపు ఆలోచించి మళ్ళీ అడిగాడు ఫోమా.

"అవునుకాని, అతనికంటె నేనే ధనవంతుణ్ణి."

"నీదగ్గర చాలా డబ్బుందా?"

"ఉందికాని, నాకంటె ఎక్కువడబ్బున్నవాళ్ళుకూడా ఉన్నారు."

"ఎన్ని పీపాలనిండా ఉంది?"

"ఏమిటి, ఎన్ని పీపాలు?"

"అంటే నే ననేది డబ్బు."

"వెఱ్రివెధవ! డబ్బును పీపాలతో లెక్కవేస్తార్రా?"

"మరెలా?" అంటూ ఫోమా తండ్రివంక ఉల్లాసంతో చూచాడు. తండ్రివైపు ముఖంతిప్పి గబగబ ఇలా చెప్ప సాగాడు, "మాక్సిమ్‌కా ఒక గజదొంగ. ఒకమాటు ఒక నగ రానికి వెళ్ళి అక్కడ ఒక ధనవంతుణ్ణి దోచుకున్నాడు. ఆ

డబ్బంతా పన్నెండు పీపాలనిండా పోసుకున్నాడు. తరువాత ఇంకా ఎన్నో వెండిసామానులు దొంగిలించాడు. చర్చిమీద కూడా పడి దోపిడిచేశాడు. ఎవడో ఒక మనిషి అరవబోతోంటే అతన్ని తన కత్తితో పొడిచి క్రిందికి నెట్టేశాడు." అని ఉల్లాసంగా కథ చెప్పుకపోతున్నాడు ఫోమా.

"ఇదంతా మీ అత్తయ్య చెప్పిందా?" అన్నాడు ఇగ్నాట్ కొడుకు ఉత్సాహానికి మెచ్చుకుంటూ."

"అవును. అయితే ఏం?"

"ఏంలేదు." అన్నాడు ఇగ్నాట్ నవ్వుతూ. "అయితే ఆ కథ విని, నీ తండ్రినైన నేను కూడా దొంగనని అనుకున్నావన్నమాట?"

"నీవు పూర్వకాలంలో దొంగవైఉంటావు కదూ?" అన్నాడు ఫోమా మళ్ళీ తన కథ మొదలుపెట్టే ఉద్దేశంతో. తన తండ్రి దొంగనని ఒప్పుకుంటే బాగుండునన్నట్లుగా అతని ముఖం చెపుతూంది.

"నేను ఏకాలంలోనూ దొంగను కాను. సరే, ఇక అది పోనీ."

"ఎప్పుడూ కావా?"

"చెప్పడంలేదురా? నేనెప్పుడూ దొంగనుకాను. ఎంత చిత్రమైన కుర్రాడివిరా నీవు? దొంగలు మంచివాళ్ళట్రా పిచ్చివాడా! దొంగలంతా దుర్మార్గులు, పాపాత్ములు దేవుడిమీద వాళ్ళకు నమ్మకం లేదు. గుళ్ళు దోస్తారు. గుళ్ళల్లో పుణ్యాత్ములు వాళ్ళకు శాపంపెడతారు. చూడరా నాయనా! ఇక నుంచీ నీవు చదువు మొదలెట్టాలి. ఇప్పటికే చాలా

ఆలస్యమైపోయింది. ఇది బళ్ళోకి వెళ్ళాల్సిన ఈడు. నీకు త్వరల్లో తొమ్మిదేళ్ళు రాబోతున్నాయి. భగవంతుడి మీదభారం వేసి బాగా చదువుకోరా బాబూ. శీతాకాల మంతా చదువు నేర్చుకో. తరువాత వసంతకాలం రాగానే నిన్ను నాతోపాటు వోల్గానదిదగ్గరకు తీసుకెడతాను."

"నన్ను బడికిపంపిస్తారా?" అడిగాడు ఫోమా భయపడుతూ.

"ముందు ఇంట్లోనే మీ అత్తయ్యదగ్గర చదువుకో."

వెంటనే కుర్రాడు చదువుకోవడం మొదలుపెట్టాడు. అత్తయ్య దగ్గర కూచుని ఆమె చెబుతోంటే అతను అక్షరాలు వల్లెవేసేవాడు.

"అజ్, బుకీ, వెడీ."

మెల్లగా 'బ్రా, వ్రా, గ్రా, డ్రా' మొదలైన గుణింతాల దగ్గరకు వచ్చేసరికి కుర్రాడికి చచ్చే నవ్వొచ్చేది. నవ్వకుండా చదవలేకపోతున్నాడు. అయినా అతనూ ఎక్కువ శ్రమ పడకుండానే చదువు వస్తోంది. త్వరలోనే ఒకటోతరగతి పుస్తకం చేతపట్టాడు. దేవుడు లేడనేవారిచెంతకు పోకు. వారు చెప్పింది వినకు. అప్పుడు నిన్ను దేవుడు ఆశీర్వదిస్తాడు." అని చదువుకుపోతున్నాడు.

ఇంత త్వరలో ఫోమాకు చదువుఅబ్బుతుందనిఅత్తయ్య అనుకోలేదు. అంచాత ఆమె సంతోషంతో పొంగిపోతోంది.

"అదిరా బాబూ! అలా చదవాలి! నాయనా, ఫో ముష్కా! ఎంత బాగా చదువుతున్నావురా." అనే దామె సంతోషం పట్టలేక.

"నీవు చాలా మంచి అబ్బాయివిరా ఫోమా! వసంతం రాగానే ఆస్ట్రిఖాన్‌కు వెళ్ళి అక్కడ చేపలు పడదాం. శిశిరం రాగానే నిన్ను బడికి పంపిస్తాను!" అనేవాడు ఇగ్నాట్ కొడుకు బాగా చదువుకుంటున్నాడని విని.

ఆ పిల్లవాడి జీవితం ఇలా—కొండమీదనుంచి క్రిందికి దొర్లిపోయ్యే బంతిలాగా సాగిపోతోంది. అత్తయ్య అతనికి చదువుచెప్పే పంతులమ్మ మాత్రమే కాదు. అతనితోపాటు స్నేహితురాలిలాగా ఆడుకునేదికూడా. మధ్యమధ్య మయకిన్ కూతురు లూబా కూడా ఫోమాతో ఆడుకోవడానికి అక్కడికి వస్తుండేది. ముసలమ్మ, ఫోమా, లూబా, ముగ్గురు కలిసి దాగుడుమూతలాట ఆడుకునేవారు. అన్ఫీసా అత్తయ్య కళ్ళకు గంతలు కట్టి, వారిద్దరూ దాక్కునేవారు. పాపం ఆ వృద్ధురాలు బల్లలు, కుర్చీలు తట్టుకుంటూ పడబోతూ చేతులు చాపి "అరె, దొంగలూ! ఎక్కడున్నారా?" అంటూ తిరుగుతుండేది. పిల్లలు పకపక నవ్వుతూ ఎంతో ఆనందించేవాళ్ళు. ఆ వృద్ధురాలి ముడతలుపడ్డ శరీరంమీద ఎండ పడితే వింతగా కనిపించేది. ఆమె శరీరం అంతగా శుష్కించిపోయినా ఆమెలో ఆత్మ ఇంకా తరుణ వయస్సులోనే ఉంది. ఆ వృద్ధురాలు తన శక్తి వంచనలేకుండా ఆ ఇద్దరు పిల్లల జీవితపథాన్ని బాగుపర్చడంకోసం ప్రయత్నిస్తూ ఉంది.

ఇగ్నాట్ ప్రతిరోజూ ఉదయాన్నే మారుబేరాలు చేయడానికి బయలుదేరి వెళ్ళేవాడు. ఒక్కొక్కమాటు సాయంత్రంవరకూ ఇంటికిరాకుండా అక్కడే ఉండిపోయేవాడు సాయంత్రంవేళ పట్టణకౌన్సిల్‌కు కాని మరెక్కడికైనా కాని వెడు

తుండేవాడు. మరోసారి తాగి ఇంటికొచ్చేవాడు. మొదట మొదట ఫోమా ఇవన్నీ చూచి తండ్రికి కనిపించకుండా పరుగెత్తుకుంటూ వెళ్ళి ఎక్కడో దాక్కునేవాడు. కాని తరువాత తరువాత అతని కివన్నీ అలవాటైపోయాయి. పైపెచ్చటికంటె తాగినప్పుడే తన తండ్రికి ఇంగితజ్ఞానం ఎక్కువగా ఉంటుందని ఫోమా గ్రహించాడు. తాగినప్పుడు చాలా దయగా చూచేవాడు. మామూలుకంటె ఎక్కువ నిష్కపటంగా ఉండి మనస్సు విప్పి మాట్లాడేవాడు. అదోరకమైన గమ్మత్తుగా కనిపించేవాడు. ఒక్కో రాత్రిపూట తన కంచుగొంతుపెట్టుకొని ఇలా అరిచేవాడు.

"ఒసేయ్ అన్ఫీసా! నా చెల్లాయీ! నన్ను నా కొడుకు దగ్గరికి రానివ్వవే. నా కొడుకు – నా వారసుడిదగ్గరికి రానీ."

తండ్రి అరుపులకు ఫోమా నిద్ర చెడిపొయ్యేది.

అత్తయ్య ఏడుస్తూ " వెళ్ళి పడుకో. నిద్రపో. మళ్ళీ తాగి వచ్చావా ? " అనేది.

" అన్ఫీసా ! నా ముద్దులయ్యను ఒక కంటితో నన్నా చూడనివ్వవే ' అనేవాడు ఇగ్నాట్.

అన్ఫీసా నాన్నను లోపలకు రానివ్వదని ఫోమాకు తెలుసు. అంచాత వాళ్ళు మాట్లాడుకుంటున్నా తాను మళ్ళీ నిద్రపోయేవాడు. ఒక్కోమాటు ఇగ్నాట్ పగటిపూటకూడా తాగి వచ్చేవాడు. అలాటప్పుడు అతను ఫోమాను ఎత్తుకుని గదులన్నీ తిప్పేవాడు.

" ఫోమం ! నీకేంకావాలిరా ? చెప్పు, బహుమతులు కావాలా ? ఆటవస్తువులు కావాలా ? బొమ్మలు

కావాలా ? చెప్పు, ఏదడిగినా యిస్తాను. నీ కోసం ఈ ప్రపంచంలో ఉన్న ఏ వస్తువైనాసరే కొని తెస్తాను. నా దగ్గర లక్షలు మూలుగుతున్నాయి. ఇంకా ముందుకూడా మూల్గుతుంటాయి. ఏం ? తెలిసిందా ? ఇవన్నీ నీవే. అహ్హా హ్హా హా ! హా !" అంటూ ఇగ్నాట్ వెర్రిగా నవ్వేవాడు.

మళ్ళీ అంతట్లోకే అతని ఉల్లాసమంతా మాయమై పోయేది. గాలి దెబ్బకు దీపం ఆరిపోయినట్టు ఆరిపోయేది. అతని ముఖం ఎర్రగా, రక్తపు ముద్దలా అయ్యేది. చింతనిప్పుల్లా మండుతోన్న కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగేవి. పెదవులమీద విషాదపూరితమైన విషపు నవ్వొకటి వెక్కిరించేది.

"అన్ఫీసా ! వీడుకనుక చనిపోతే అప్పుడు నేనేం చెయ్యాలి? నాగతేంకావాలి?" అనేవాడు పొర్లుతున్న దుఃఖంతో. మళ్ళీ వెంటనే కోపావేశంతో "అప్పుడన్నీ తగల పెట్టేస్తాను. అన్నీ ధ్వంసంచేస్తాను. డైనమైట్లుపెట్టి పేల్చేస్తాను." అని భయంకరంగా గర్జించేవాడు. గదిలో ఒక చీకటి మూల వైపుకు చూస్తూ అనేవాడీ మాటలు.

"ఇక ఊరుకోరా, వెర్రివాడా! పసివాడు భయపడి పోతాడు. జబ్బుకుని జ్వరం వచ్చేను. ఇకవెళ్ళు" అనేది అన్ఫీసా.

అలా ఆమె రెండు చీవాట్లుపెట్టేసరికి అతను "సరే, వెడుతున్నానులే. ఏడ్చి గోలచేసి వాణ్ణి భయపెట్టకు." అని గొణుక్కుంటూ వెళ్ళిపొయ్యేవాడు.

ఫోమాకు ఎప్పుడైనా కాస్త వళ్ళు వెచ్చపడిందీ అంటే చాలు. ఇగ్నాట్ తన గొడవలన్నీ మానుకుని ఇంటిదగ్గరే

కొడుకుని కనిపెట్టుకుని కూచునేవాడు. ఒక్కనిముషంకూడా గడపదాటి బయటికి వెళ్ళేవాడుకాదు. చెల్లెల్నీ, కొడుకునూ ఏవేవో అర్థంలేని ప్రశ్నలువేసి, అనవసరమైన సలహాలు అడిగి వారిని విసిగించేవాడు. దిగాలుపడి నిట్టూర్పులు విడుస్తూ పిచ్చి వాడికిమల్లే ఇల్లంతా తిరిగేవాడు.

"ఎందుకా విసుకంతా? దేవుడికి కోపంవస్తుంది. నీ గొణుగుడూ సణుగుడూ ఆయన వింటూనే ఉన్నాడు. ఆయన దయామయత్వాన్ని శంకిస్తున్నందుకు నిన్నాయన శిక్షిస్తాడు సుమా." అనేది అన్ఫీసా.

"ఒసేయ్ చెల్లాయీ! ఒకవేళ అంతపనీ జరిగితే...నా బ్రతుకంతా బుగ్గిపాలవుతుంది.ఇన్నాళ్ళూ ఎందుకుబ్రతికినట్టు? ఇదంతా ఎందుకు చేసినట్టు?" అని మూలిగేవాడు ఇగ్నాట్.

తన తండ్రి మనస్సు ఒకప్పుడున్న తీరుగా ఒకప్పుడుండక - ఇలా రకరకాల అవస్థలోకి దిగిపోవడం - అతని వింతవింత మాటలు - ప్రవర్తనలు, ఇవన్నీ ఫోమాను మొదట మొదట భయపెట్టేవి. కాని రానురాను వీటన్నిటికీ అలవాటు పడిపోయాడు. తన తండ్రి బండిమీద రావడం కిటికీలోంచి చూచేవాడు. అతను బండ్లోంచి దిగలేకపోవడం గమనించేవాడు. అప్పుడు. "అత్తయ్యా! నాన్న మళ్ళీ తాగొచ్చాడు." అని కేకవేసేవాడు ఫోమా.

♦ ♦ ♦ ♦ ♦

వసంతం వచ్చింది. తాను అన్నమాటప్రకారం కొడుకును నదీతీరానికి తీసుకెళ్ళి అక్కణ్ణుంచి తనతోపాటు స్టీమర్

మీద ప్రయాణంచేయించాడు ఇగ్నాట్. ఇక్కడ థోమా కళ్ళముందు కొత్తజీవితం - వింతైన జీవితం తెరుచుకున్నది.

వారు ప్రయాణంచేస్తున్న స్టీమర్ పేరు "ఎరమాల్." అది ఇగ్నాట్ గార్డియెవ్ స్వంత స్టీమర్లలో ఒకటి. ఎంతో అందంగా, బ్రహ్మాండంగా ఉండే "ఎర్మాల్" స్టీమర్ నదివాలున తేలుకుంటూ వేగంగాపోతోంది. ఇరవైపులాఉన్న అందమైన వోల్గానదీతీరాలు వెనక్కుపోతున్నట్టుగా అగుపిస్తున్నాయి. ఎడమవైపున విశాలమైన మైదానం సూర్యరశ్మిలో జలకమాడుతున్నట్టు కనిపిస్తోంది. ఆకాశపు టంచులదాకా పచ్చటి తివాసీలా పరుచుకుని ఉన్నది. కుడివైపు నదీతీరం చాలా ఎత్తుగాఉంది. తీరమంతా చిక్కని అడవి అల్లుకునిఉంది.

రెండుతీరాలమధ్య విశాలంగా విప్పారిన వోల్గానది పరుచుకుని, గంభీరంగా, మెల్లగా, నిశ్శబ్దంగా, సింధుగా, అజేయమైన తనశక్తి తనకు తెలిసిఉన్నట్టుగా ప్రవహిస్తోంది. నదిఒడ్డుననున్న పర్వతపంక్తి నల్లటి నీడలా నీటిలో ప్రతిఫలిస్తోంది. ఎడమవైపున నదీతీరం బంగారు రజనులా ఉన్న ఇసుకతో మిలమిల మెరిసిపోతోంది. ఇంకా అవతల విశాలమైనమైదానాలు కనిపిస్తున్నాయి. కొండల మధ్య, మైదానాలమధ్య అక్కడక్కడ చిన్నచిన్న పల్లెలు చెదురుచెదురుగా కనిపిస్తున్నాయి. పల్లెగుడిసెలపైకప్పిన ఎండు గడ్డిపైన, ఇళ్ళ కిటికీ అద్దాలపైన, ఎండ పడి తళతళ మెరిసి పోతున్నాయి. పచ్చని చెట్లగుబుర్ల నడుమనుంచి చర్చి గోపురాలు కనిపిస్తున్నాయి. గోపురాలపైనున్న శిలువగుర్తులు

ఎండలో మెరుస్తున్నాయి. గాలిమరల చక్రాలు మధ్య మధ్య గాలిదెబ్బకు ఉబుసుపోనట్టు తమంతటతామే తిరిగిపోతున్నాయి. ఫ్యాక్టరీ గొట్టాలలోనుంచి పొగ నల్లనిచుట్టలుగా చుట్టుకుని ఆకాశంలోకి పోతున్నది.పల్లెల్లోఉండే పిల్లలంతా గుంపులుగుంపులుగా వచ్చి నదిఒడ్డున బార్లుతీరి నిలబడిఉన్నారు. స్టీమర్ దాపులోకి రాగానే చేతు లూపుకుంటూ సంతోషంతో వెర్రికేకలేశారు. స్టీమర్ చక్రాలక్రిందినుంచి అలలుచిందుతూ, కుర్రాళ్ళు ఎగురుతున్న ఒడ్డువైపుకు పరుగెత్తి మాయమైపోతున్నాయి. పిల్లలంతా నీలం, ఎరుపు, తెలుపు; రకరకాల రంగుచొక్కాలు వేసుకుని ఒడ్డు విరిగిపోయ్యేలా ఎగురుతున్నారు. ఒక పిల్లలగుంపు ఒక చిన్న పడవలో కూచుని అలలపై ఉయ్యాలలూగుతూ ఆడుకోవడానికై నదిమధ్యకు వెళ్ళారు. తీరాన చెట్లు బారులుతీర్చి ఉన్నాయి. కొన్ని చెట్ల కొమ్మలు నీళ్ళల్లో మునిగిఉన్నాయి. అవన్నీ చిన్నచిన్న దీవులమాదిరి కనిపిస్తున్నాయి. ఒడ్డునుంచి ఒక విషాదగీతం వినిపిస్తోంది.

“ఓహో, ఓ, ఓఓ......!”

అనేక బల్లకట్టులను దాటేస్తూ, వాటిపై నీళ్ళను చిందిస్తూ స్టీమర్ వెడుతోంది. అలలతాకిడికి దూలాలు ఎప్పుడూ ఊగుతూ కనిపిస్తున్నాయి. దూలాలపై నిలబడ్డ మనుష్యులు కూడా అటూఇటూ ఊగుతూ స్టీమరువంకచూచి నవ్వుతూ కేకలుపెడుతున్నారు. అందంగా బరువుగాఉన్న ఆ పెద్దస్టీమరు నదిలో ఒక ప్రక్కన పోతోంది. పాచిపట్టిన పచ్చనిమురికి నీటిపై స్టీమరునీడ పడుతోంది. ఒక ప్రయాణీకుల స్టీమరు ఎదురుగా వస్తూ దయ్యంలా కూతవేసింది. ఆ కూత దీర్ఘంగా

పోయిపోయి ఒడ్డునఉన్న అడవుల్లో కలిసిపోయింది. రెండు స్టీమర్లవల్ల కంపించిన అలలు డీకొన్నాయి. అప్పు డా అలలు ఉయ్యాలలూగినట్టు ఊగాయి. తీరాన లోయల్లో శీతాకాలపు ధాన్యపు పంటల పచ్చని బయలు, పరుచుకున్న పెద్ద తివాసీలా కనిపిస్తోంది. ఆ నేలలో కొంతభాగం ఎర్రరేగడి నేల, మరికొంతభాగం నల్లరేగడినేల — ఈ భూమి అంతా వచ్చే వసంతకాలపు పంటకోసం దున్ని అట్టిపెట్టారు. పైన పక్షులు చిన్నచిన్న నక్షత్రాల్లా ఎగిరెగిరిపోయి నీలాకాశాన్ని తాకుతున్నాయి. ఒకవైపు గొర్లమంద ఒకటి మెల్లగా మేస్తోంది. దూరాన్నుంచి చూస్తే అవి చాలా చిన్న విగా, చిన్నపిల్లల ఆటబొమ్మల్లాగా అగుపిస్తున్నాయి. గొర్రెల కాపరి కర్ర గడ్డాని కానించుకుని నిలబడి నదిలోకి చూస్తున్నాడు. అతనొక చిన్నపిల్లవాడికిమల్లే కనిపిస్తున్నాడు.

నీళ్ళ తళతళలు, స్వేచ్ఛ, ప్రతిచోటా కనిపిస్తున్నాయి, చుట్టూ పచ్చని పచ్చికబయళ్ళు రమ్యంగా ఉన్నాయి. పైన నీలాకాశం నిర్మలంగాఉంది. నీళ్ళ మెల్లని కదలికలో ఏదో ఒక నిగ్రహాశక్తి అంతర్లీనమైనట్టు కనిపిస్తున్నది. ఆ కదలిక మాటున ఏదోఒక అదృశ్యశక్తి దాగిఉన్నదా అని అనిపిస్తోంది. పైన ఆకాశంలో “మే” నెల సూర్యుడు ఎండనుపండించి వెదజల్లుతున్నాడు. చెట్లనుండీ, చెట్ల ఆకులనుండీ, కొత్తగా మొలిచిన చిగుళ్ళనుంచీ పరిమళాలువచ్చి గాలిలో కలిసి కమ్మని వాసనలు నిరబమ్ముతున్నాయి. చుట్టూ పరిసరాలన్నీ ఏదో నిద్రమత్తులో ఉన్నట్టు కనిపిస్తున్నాయి. పరిసరాలే కాదు. ప్రకృతి, మనుష్యులు, అన్నీ కలిసికట్టుగా బద్ధకంగా

బరువుగా జీవిస్తున్నట్టున్నాయి. అయినా ఆ బరువులో ఆ బడకంలో ఏదో విచిత్రమైన అందం ఉన్నది. వాటి వెనకాల ఏదో బ్రహ్మాండమైన శక్తి దాగిఉందా అనిపిస్తున్నది.

ఓటమిలేనిశక్తి ఒకటి-ఇంకా చైతన్యం మేల్కొనందువల్ల ఎలాంటి కోరికలుగాని, ఆశయాలుగాని స్పష్టంగా ఏర్పడనిశక్తి ఒకటి అక్కడ గర్భితమైఉన్నదా అనిపిస్తుంది. అక్కడి జీవితమంతా అర్ధనిద్రలో గడుస్తున్నది. ఈ జీవితంలో చైతన్యశక్తి లేనందువల్ల అందమైన ఆ నదీలోయఅంతా ఒక విషాదపూరితమైన నీడలో పడుకుని నిద్రిస్తున్నదా అని అనిపిస్తుంది. ఓర్పు— ఎన్నన్నా ఎదురుచెప్పని ఓర్పు, ఏదో కొత్తధనంకోసం ఆశ— బయిటికి చెప్పలేని ఆశ, అక్కడ పక్షుల కిలకిలారావములలో కూడా వినిపిస్తాయి. ఎవరినో వేడుకుంటున్నట్టు,ఎవరిసహాయమో అర్థిస్తున్నట్టు, అంతటా విషాదగీతాలు వినిపిస్తాయి ! విషాదమే కాక ఆ గీతాల్లో అప్పుడప్పుడు అంతులేని శోకం, ఆరనిఆవేదన మార్మోగుతుంటాయి. నదీమతల్లి ఆ పాటలకు వంతపాడుతుంది.

చెట్లకొమ్మల కొస ఆకులు వణుకుతున్నాయి. మధ్య మధ్య ధ్యానముద్రలో మునిగిపోతున్నాయి. అంతా నిశ్శబ్దం! నిశ్చలం!

థామా పగలంతా కెప్టెన్ వంతెనపై తన తండ్రిప్రక్కన కూర్చుని గడుపుతాడు. ఒక్కమాటైనా మాట్లాడకుండా ఇంతింత కళ్ళుచేసుకుని అంతులేని ఆ నదీతీరంవంక చూస్తూ కూర్చుంటాడు. అతని మనస్సులో ఏవేవో ఊహలు పరుగెత్తేవి. విచిత్రమైన లోకాలలో వెండిపరిచినతోవల్లో విహా

రిస్తున్నట్టనిపించేది. తన కళ్ళముందు కనిపించే అనేక దృశ్యా లను గురించీ, విషయాలనుగురించీ తన తండ్రిని అంతులేని ప్రశ్నలు వేసేవాడు. ఇగ్నాట్ కొడుకు అడిగినవాటన్నిటికీ ఓర్పుతో జవాబులు చెప్పేవాడు. అయితే క్లుప్తంగానే. అయినా ఆ కుర్రాడికి సంతృప్తి కలిగేదికాదు. అవి అతనికి అర్థమయ్యేవి కావు, ఆసక్తి కలిగించేవి కావు. తను ఏది కావాలని కోరుకునేవాడో, తను ఏది తెలుసుకోవాలని తహ తహలాడుతున్నాడో, అది అందులో ఉండేదికాదు. ఒక మాటు అతనికి తన తండ్రితో ఇలా సంభాషణ జరిగింది.

"అన్ఫీసా అత్తయ్యకు నీకంటె ఎక్కువ విషయాలు తెలుసు." అన్నాడు ఫోమా, తండ్రితో.

"ఏమిటి ఆమెకు తెలిసింది ?" అన్నాడు ఇగ్నాట్ నవ్వుతూ!

" అన్నీ తెలుసును. " అన్నాడు ఫోమా, గట్టి నమ్మకంతో.

అతని కళ్ళముందు విచిత్రాలేవీ కనిపించేవికావు. నదీ తీరానఉన్న నగరాలుమాత్రం కనిపిస్తుండేవి. తను ఉంటున్న నగరంలాంటివే అవీను. అంచాత అతనికి కొత్తగా తోచ లేదు. లేకపోతే ఈ పట్టణాలు కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. వీటిల్లో ఉండే మనుష్యులు, ఇళ్ళు, భవనాలు, చర్చిలు; అన్నీ తన ఊళ్ళో ఉన్నటువంటివే, తను ఎరిగినవే. అయినా తండ్రితోపాటు తానూ వీటినన్నిటినీ పరిశీలించేవాడు. కాని అతనికి మనశ్శాంతి కలగలేదు. తిరిగి తిరిగి అలసిపోయి, అసంతృప్తిగా మళ్ళీ స్టీమరువద్దకు చేరుకునేవాడు.

ఒకనాడు ఇగ్నాట్, తన కొడుకుతో "రేపు మనం ఆస్ట్రిఖాన్‌లో ఉంటాం." అని అన్నాడు.

"అదీ, అన్నిపట్టణాలవంటిదేగా ?"

"లేక మరి ఎలా ఉంటుందనుకున్నావు?"

"ఆస్ట్రిఖాన్‌పైన ఇంకా ఏముంది?"

"సముద్రండుంది. దానిని కాస్పియన్ సముద్రమంటారు."

"అక్కడేముంది?"

"ఏముంటాయి? చేపలు. నీళ్ళల్లో చేపలుకాక మరేం ఉంటాయనుకున్నావురా వెర్రివాడా!"

"నీళ్ళల్లో "కియజ్" అనే పట్టణం ఉంది"

"అది వేరేసంగతి! అవును. అది కియజ్. ధర్మపరులు, పుణ్యాత్ములుమాత్రమే అక్కడ జీవిస్తారు".

"అయితే ధర్మపరులు జీవించే పట్టణాలు సముద్రంమీద ఉండవా?"

"ఉండవు." అంటూ ఇగ్నాట్ కొంచెంసేపాగి మళ్ళీ

"సముద్రపునీరు ఉప్పగాఉంటుంది. కనుక ఎవరూ నోట పెట్టరు." అన్నాడు.

"సముద్రానికి అవతల ఇంకా భూమి ఉందా?"

"తప్పక ఉండితీరాలి. సముద్రానికి ఒక అంతు అంటూ ఉంటుంది."

"అయితే అక్కడ పట్టణాలుంటాయా?"

మళ్ళీ అదేప్రశ్న! ఉంటాయి. ఎందుకుండవు? కాని ఆ భూమి మనదికాదు. అది పర్షియా. నీవు పర్షియన్లను ఎప్పుడూ చూడలే? మార్కెట్‌లో పోకచెక్కలు, ఎండు

ద్రాక్షలు అమ్ముతుంటారు." "చూచాను." అంటూ ఫోమా మళ్ళీ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు.

ఒకనాడు ఫోమా తన తండ్రిని ఇలా అడిగాడు. "ఇదికాక ఇంకా భూమి చాలా ఉన్నదా?"

"భూమి చాలా పెద్దదిరా నాయనా. కాలినడకన పోతే పది సంవత్సరాలలోకూడా దాన్ని చుట్టిరాలేవు,'

ఇగ్నాట్ కొడుకుతో భూమినిగురించి చాలాచాలా విషయాలు చెప్పాడు తుదకు. "భూమి ఎంత పెద్దదో, అది ఎక్కడితో ఆఖరవుతుందో ఎవరూ చెప్పలేరు." అని చెప్పాడు.

"భూమి ప్రతిచోటా ఒకే రకంగా ఉంటుందా?" మళ్ళీ అడిగాడు ఫోమా.

"అంటే......?"

"పట్టణాలు...అన్నీను.'.

"అవును. పట్టణాలు, అన్నిచోట్లా ఒకలాగే ఉంటాయి. భవనాలు, ఇళ్లు, వీధులు, అవసరమైనవస్తువులు; ఇవన్నీకూడా అన్నిచోట్లా ఒకలాగే ఉంటాయి."

ఇలాంటి సంభాషణలు అనేకమార్లు సాగిపోతుండేవి. ఆతరువాత కుర్రవాడు వెనుకటిలాగా తరుచుగా ప్రశ్నార్థకమైన చూపులతో ఎక్కడో దూరంగా చూడడం మానేశాడు.

స్టీమర్‌లో పనివాళ్ళంతా కుర్రవాడంటే ప్రేమగా ఉండేవారు. ఫోమాకూడా వారిని ప్రేమించేవాడు. కాని గాలికీ, వానకూ, ఎండకూ చలికీ - వళ్ళంతా మాసిపోయి ఉన్న వాళ్ళంటే మరీ ఎక్కువ ప్రేమ చూపేవాడు. పనివాళ్ళంతా కుర్రాడితో కలిసి ఆడుకునేవారు. చేపలు పట్టడానికి అతనికి

వలలు తయారుచేసి ఇచ్చేవాళ్ళు. చిన్నచిన్న పడవలుచేసిచ్చే వాళ్ళు. ఇగ్నాట్ నగరంలోకి పనిమీద వెళ్ళినప్పుడు ఫోమాను పడవల్లో కూచోపెట్టుకుని తిప్పేవాళ్ళు. ఇన్ని చేస్తున్నా ఫోమా మాత్రం వాళ్ళమాటలు పట్టించుకునేవాడు కాడు. వారంతా తనతండ్రినిగురించి ఏవేవో మాట్లాడుకునేవారు కాని తాను అవి తండ్రికి చెప్పేవాడుకాదు. కాని ఒకనాడు ఆస్ట్రిఖాన్‌లో స్టీమరు కట్టెలు నింపుకుంటూ ఉండగా స్టీమరులో పనిచేసే మెకానిక్ ఇలా అనడం ఫోమా విన్నాడు.

"ఇన్ని కట్టెలు నింపమన్నాడు. వట్టి చపలచిత్తుడు. ముందేమో స్టీమరు పట్టకుండా సరుకు నింపుతాడు. తరువాత యంత్రాలు దెబ్బతింటాయని కేకలేస్తాడు. అప్పుడప్పుడు చమురు పొయ్యండీ అంటాడు."

మెకానిక్ అలా చెపుతే దానికి పైలట్ ఇలా సమాధాన మిచ్చాడు.

"అదంతా ఆశ, దురాశ. ఇక్కడ కట్టెలు కారు చౌక. అంచాత పట్టినన్ని తీసుకెళ్ళి లాభం సంపాదిస్తాడు. దురాశ."

"ఎంత ఆశ, ఎంత ఆశ!"

ఇలా అదేమాట వాళ్ళు అనేకమార్లు అనుకోవడం ఫోమా చెవులారా విన్నాడు. "దురాశ, దురాశ" తండ్రిని గురించి అన్నమాటలు అతని హృదయంలో నాటుకున్నాయి. సాయంత్రం భోజనాలు చేసేటప్పుడు అకస్మాత్తుగా తండ్రిని అడిగాడు.

"నాన్నా!"

"ఏమిట్రా?"

"నీవు ఆశపోతువా నాన్నా?"

ఆమాటవినగానే అతన్ని తండ్రి ఎన్నెన్నో ప్రశ్నలు వేశాడు. వాటికి సమాధానంగా ఫోమా పైలట్‌కూ మెకానిక్‌కూ జరిగిన సంభాషణంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అది వినేసరికి ఇగ్నాట్ ముఖం నల్లగామాడిపోయింది. కోపంతో కళ్ళు ఎర్రబడి రక్తం చిమ్మసాగాయి.

"ఓ! అదాసంగతి! సరే; ఇకమీదట నీవుమాత్రం వాళ్ళ మాటలు వినకు. వాళ్ళ అంతస్తువేరు నీ అంతస్తువేరు. వాళ్ళు నీకు సాటివాళ్ళుకారు. నీవు యజమానివి, వాళ్ళు నీ సేవకులు. ఈ ఒక్కవిషయంమాత్రం జాగ్రత్తగా తెలుసుకో. ఇదే నీ జీవితంలో ప్రధానమైనవిషయం. మనం తలచుకుంటే వాళ్ళందరినీ వెళ్ళిపొమ్మనవచ్చు. వీళ్ళు వెడితే ఇలాటివాళ్లు ఇంకా ఎంతోమంది ఎక్కడబడితే అక్కడ కుక్కల్లా దొరుకుతారు. విన్నావా? నన్నుగురించి వాళ్లు ఎన్నైనా అంటారు. ఎందుకో తెలుసా? నేను వాళ్ళకు యజమానినని వాళ్ళకు కడుపుమంట. అసలు దీనికంతకూ మూలకారణం నేను ధనవంతుణ్ణి, ఐశ్వర్యవంతుణ్ణి అదృష్టవంతుణ్ణి; కావడమే. ధనవంతుణ్ణిచూస్తే అందరికి అసూయగాఉంటుంది. సుఖపడేవాణ్ణి ఎప్పుడూఅందరూ శత్రువుగా చూస్తారురా నాయనా! అదీ విషయం." అన్నాడు ఇగ్నాట్.

ఆ తరువాత రెండురోజులకు స్టీమరులోకి క్రొత్త పైలట్, క్రొత్త మెకానిక్కూ వచ్చారు.

"ఎకోల్ ఏడి నాన్నా?" పాతవాళ్ళు కనిపించకపోవడం చూచి కుర్రాడు అడిగాడు.

"వాణ్ణి ఉద్యోగంలోంచి తీసేసి పంపించేశాను," అని చెప్పాడు ఇగ్నాట్.

"అందుకనేనా?" మళ్ళీ అడిగాడు ఫోమా, వాడు తన తండ్రిని తిట్టాడని గుర్తుకు తెచ్చుకుంటూ.

"అవును. అందుకనే."

"పెట్రోవిచ్‌నికూడా అందుకే పంపించేశావా?"

"అవును. అతన్నీ అందుకోసమే తీసేశాను."

తనతండ్రి ఇంత త్వరత్వరగా మనుష్యులను మార్చ గలగడం చూచి ఫోమాకు ఆశ్చర్యము, ఆనందము కలిగాయి. తండ్రివంకచూచి చిరునవ్వునవ్వాడు. డెక్‌మీాదినుంచి ఇవతలి కొచ్చి, క్రింద తాడు పేనుకుంటూకూర్చున్న ఒక నావికుడు దగ్గరికి వెళ్ళాడు. అతనితో

"కొత్త పైలెట్‌ను తెప్పించాం." అన్నాడు ఫోమా.

"నాకు తెలుసు ఫోమా ఇగ్నాటిచ్! సరేకాని, బాగు న్నావా?" అనడిగాడు నావికుడు.

"కొత్త మెకానిక్‌నుకూడా"

"అవును. పెట్రోవిచ్ వెళ్ళిపోయాడు. అందుకు నీకు విచారంగా లేదూ?"

"లేదు"

"లేదూ? అతను నీ వంటే ఎంతో ప్రేమగా ఉండేవాడు కదా!"

"అవును. అయితేమాత్రం అతను మా నాన్నను ఎందుకు తిట్టాలి?"

"ఓ! అదా సంగతి, మీ నాన్నను తిట్టాడా?"

"అవును. నేను నా చెవులతో విన్నాను"

"ఊ! మీ నాన్న విన్నాడా?"

"ఆయన వినలేదు. నేనే ఆయనతో చెప్పాను."

"నీవు......ఓ!...అలాగా..." అంటూ నావికుడు మెల్లగా ఊరుకున్నాడు. మళ్ళీ తనపని తాను చూచుకో సాగాడు.

"నాన్న నాతో 'నీ విక్కడ యజమానివి. నీవు తలుచు కుంటే అందర్నీ పంపెయ్యొచ్చు' అని చెప్పాడు." అన్నాడు మళ్ళీ థామా.

"ఓ! అలాగా!" అన్నాడు నావికుడు, తన అధికారాన్ని గురించి, తన్నుతాను పొగడుకుంటోన్న ఆ కుర్రవాణ్ణి అదోలా చూస్తూ.

ఆనాటినుంచి పనివాళ్ళు తనను వెనుకటిమాదిరిగా చూడకపోవడం థామా గమనించాడు. కొందరు మరీ వినయ విధేయతలతో మెలగుతున్నారు. మరికొందరు తనతో అసలు మాట్లాడడమే మానేశారు. ఎప్పుడైనా మాట్లాడితే కోపంగా, ద్వేషం వెళ్ళగక్కుతూ మాట్లాడుతున్నారు. మొత్తానికి స్టీమర్‌లో ఎవరూ తనతో పూర్వంలాగా కులాసాగా మాట్లా డడంలేదు.

స్టీమరుడెక్‌ను నీళ్ళతో కడుగుతున్నప్పుడు థామా అక్కడికి వెళ్ళి ఇష్టంగా చూచేవాడు. పనివాళ్ళు, కూలీల్కు

మోకాళ్ళపైకి లాగులు మడుచుకుని, పెద్దపెద్ద కుంచెలు తీసుకుని బక్కెట్లతో నీళ్ళుపోస్తూ డెక్‌ను కడుగుతూఉండేవారు. అటూ ఇటూ పరుగెత్తుతూ, క్రిందపడుతూ లేస్తూ, కేకలేస్తూ, నవ్వుతూ, అంతా కోలాహలంగా ఉంటుంది, డెక్ కడిగే టప్పుడు. అందుకని ఫోమాకు మహాసరదా. పెట్రోవిచ్, ఎకో వెళ్ళిపోయినతరువాత అందరూ తనను దూరదూరంగా ఉంచుతున్నారు. తనను ఎవరూ ఆప్యాయంగా దగ్గరకి పిలవడంలేదు. తనతో ఆడుకోవడంలేదు. ఎవరూ సరిగా మాట్లాడడంలేదు కూడా. ఇందుకు అతనికి ఆశ్చర్యము, భయము కలిగాయి. డెక్ మీద ఒక్కక్షణంకూడా నిలుచోబుద్ధిపుట్టడంలేదు. చక్రం వద్దకువెళ్ళి నేరస్తుడిలా బాధపడుతూ అక్కడ కొంతసేపు కూచున్నాడు. దూరంగా కనిపిస్తున్నతీరం, దాని అవతలఉన్న అడివి, చూస్తూ కూచున్నాడు. డెక్ క్రింద నీటిఅలలు, కిలకిల శబ్దంచేస్తూ పిల్లల్లా ఆడుకుంటున్నాయి. నావికులు సంతోషంతో నవ్వుకుంటున్నారు. డెక్ దిగి వాళ్ళదగ్గరకి వెళ్ళాలనిపించింది ఫోమాకు. కాని మళ్ళీఏదో అతని మనస్సును వెనక్కులాగింది.

"వాళ్ళకు వీలైనంత దూరంగాఉండు. నీవువాళ్ళకు యజమానివి." అని తండ్రి అన్నమాటలు అతనికి గుర్తుకొచ్చాయి. వెంటనే తన తండ్రి కేకవేసినట్టు అధికారపూర్వకంగా, వాళ్ళను కేకవేసి పిలవాలనిపించింది అతనికి. ఏమంటే బాగుంటుందో అని చాలాసేపు ఆలోచించాడు. కాని ఏమన డానికి పాలుపోలేదు. అలా రెండు మూడురోజులు గడిచాయి. పనివాళ్ళల్లో ఒక్కరికికూడా తనపై ఇష్టంలేదని ఫోమాకు పూర్తిగా అర్థమైంది. ఫోమాకు అంతమందిఉన్న స్టీమర్‌లో

కూడా తాను ఒంటరిగానే ఉన్నట్టనిపించింది. అతనికి ఎన్నెన్నో ఊహలు పుట్టుకొచ్చాయి. అన్‌ఫీసా అత్త ఆకారంకూడా అతని కళ్ళముందు కనిపించింది. ఆమె చెప్పినకథలూ, ఆమె నవ్వులూ, ఆమె చూపే దయా; ఇవన్నీ జ్ఞాపకంవచ్చాయి. అవి తలుచుకునేసరికి అతనికెంతో ఆనందంకలిగింది. అతనింకా ఆ విచిత్రకథల వింతలోకంలోనే విహరిస్తున్నాడు, కాని వాస్తవ లోకపు కబంధహస్తంఅదృశ్యంగాఉండేకఠోరహస్తం—అతను అంతకుముందు తన చుట్టూవున్న ప్రతివస్తువునూ ఏ చక్కని తెరలచాటునుంచి చూస్తూ వచ్చాడో, ఆ చక్కని తెరలను చీల్చివేయడం ప్రారంభించింది. మెకానిక్‌తోను, పైలట్‌తోను, జరిగిన సంఘటన తన చుట్టూఉన్న వాస్తవ పరిస్థితులను గుర్తించేటట్టుచేసింది. అతని చూపు వెనుకటికంటె నిశితమైంది. అతని కళ్ళల్లో ఒక అన్వేషణ చైతన్యంతోకూడినఅన్వేషణ, అగుపించసాగింది. మానవులను ప్రధానంగా ఏది నడిపిస్తున్నదో తండ్రి నడిగి తెలుసుకుందామనే కోరిక పుట్టింది.

ఒకనాడు ఫోమా ఒక దృశ్యం చూడడం తటస్థించింది. నావికులు కట్టెలు మోసుకునిపోతున్నారు. వాళ్ళల్లో ఒక కుర్రాడు కోపంతో, బిగ్గరగా ఇలా అరవసాగాడు.

“మీరెన్నైనా చెప్పండి. అతనికి అంతరాత్మ అనేదే లేదు. నేను కట్టెలు మొయ్యడానికి ఒప్పందంలేదు నావికుడు ఏంపనిచెయ్యాలో అందరూ ఎరిగినదే. కాని నాచేత ఈపని ఎందుకు చేయించాలి? ఒప్పందంలోలేని ఈపని నాకు మధ్యలో తెచ్చి ఎందుకు తగిలించాలి? అంటే, దీనికి అర్థమేమిటి? నా చర్మాన్నికూడా నేను ఒలిచి ఇవ్వాలన్నమాట, అబ్బ!

ఆత్మలేని మనిషి! మన ప్రాణాలు తీస్తూ తాను గొప్పపని చేస్తున్నానని ఆనందిస్తుంటాడు."

ఫోమా ఈ మాటలు విన్నాడు. ఈ మాటలు తన తండ్రిని గురించి అంటున్నవే అని అతనికి తెలుసును. ఎఫిమ్, ఇలా గొణుక్కుంటూనే అందరికంటె ఎక్కువగా కట్టెలుమోస్తున్నాడు. ఊపిరాడకుండా అటూ ఇటూ వేగంగా పరుగిడుతున్నాడు. ఎఫిమ్ అలా గొణుగుతున్నా పనివాళ్ళెవరూ అతనికి జవాబు చెప్పడంలేదు. అతనితో కలిసి పనిచేస్తున్నవాళ్లు కూడా మౌనంవహించి ఉన్నారు. స్ట్రెచర్ మీద కట్టెలు పేరుస్తూ ఉంటే మధ్యమధ్య అడ్డువచ్చి "ఇకచాలు! గుర్రం మీద మోపువేసినట్టు వేస్తున్నావు. నేనూ గుర్రాన్ని అనుకున్నావా ఏమిటి?" అని అంటున్నాడు మెల్లగా.

"అనవసరంగా మాట్లాడకు. ఇకఊరుకో. బండికికట్టాను. బండిలాగు. అంతేకాని, మకురుచెయ్యకు. నీ నెత్తురు కళ్ళ చూస్తారు. చూచినా కిమ్మనకు. హు! ఊరుకోక ఏం చేస్తావు?" అని మరో పనివాడు అతనికి జవాబు చెపుతున్నాడు.

అంతలో ఇగ్నాట్ అక్కడికొచ్చాడు. నావికుడిదగ్గరికి వెళ్ళి "ఏమిటి నీ వంటున్నది?" అనిఅడిగాడు, కర్కశకరంతో.

"నేను...నేను...ఒప్పందంలో లేని పని...అని ఏదో గొణిగాడు ఎఫిమ్.

"నెత్తురు పీలుస్తారన్నావు. ఎవరు నెత్తురు పీల్చేది?" మళ్ళీ అడిగాడు ఇగ్నాట్, గడ్డం సవరించుకుంటూ.

తనను ఇగ్నాట్ పట్టుకున్నాడని నావికుడు హఠాత్తుగా గ్రహించాడు. ఇహ అతనికి తప్పించుకునేమార్గం కనిపించలేదు.

చేతిలో ఉన్న కర్రలు క్రిందపడేశాడు. అరచేతులు లాగుకు తుడుచుకున్నాడు. ఇగ్నాట్ వంకచూస్తూ కొంచెం ధైర్యం తెచ్చుకుని—

"నేనన్నది నిజంకాదా? నెత్తురు పీల్చేది నీవు!" అని అన్నాడు.

"నేనా?"

"అవును. నీవే."

తనతండ్రి అతనిమీదికి చెయ్యివిసరడం థోమా కళ్ళారా చూచాడు. ఒక పెద్ద దెబ్బ—ఫెళ్లున మ్రోగింది. నావికుడు కర్రలమండెమీద పడిపోయాడు. మళ్ళీ వెంటనే లేచి మారు పలకకుండా గొడ్డులా పనిచేయడం మొదలెట్టాడు. అతని ముఖాన గాయంపడింది. నెత్తురు కారి కట్టెలమీద బొట్లుబొట్లు పడుతున్నది. చొక్కాతో ముఖాన నెత్తురు తుడుచుకున్నాడు. ఆ నెత్తురు కంటితో ఒకమాటు చూచుకుని ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. మళ్ళీ తన పనిలో నిమగ్నుడయ్యాడు. తరువాత అతను థోమాముందునుంచి వెళ్ళిపోయాడు. అప్పు డతనికళ్ళ నుండి రెండు కన్నీటిచుక్కలు—పెద్దగింజలంత కన్నీటిచుక్కలు అతని ముఖంమీద, ముక్కుపైన పడుతూఉండడం థోమా కళ్ళారా చూచాడు.

ఆనాడు భోజనముందు థోమా అదోలా ఉన్నాడు. ఏదో దిగులుగా, పరధ్యాన్నంగా ఉన్నాడు. ఏడుస్తున్నట్టు న్నాడు. మధ్యమధ్య తండ్రివంక చూస్తున్నాడు.

"ఏమిటిరా అలా ఉన్నావు?" అడిగాడు తండ్రి నింపాదిగా.

"ఎలా ఉన్నాను?"

"వంట్లో సుస్తీగా ఉందా?"

"ఊహు!"

"జాగ్రత్త. వంట్లో బాగాలేకపోతే చెప్పు."

"నీకు చాలా బలం ఉంది." అన్నాడు ఫోమా, ఉండీ ఉండి.

"నాకా? అవును. భగవంతుడు నాకు కావల్సినంత బలం ఇచ్చాడు."

"వాణ్ణి ఎంత పెద్దదెబ్బ కొట్టావూ?" అన్నాడు ఫోమా, మెల్లగా, తలవంచుకుని.

ఇగ్నాట్ అప్పుడే ఒక రొట్టెముక్క నోట్లో పెట్టుకో బోతున్నాడు. తన కొడుకుమాట వినేసరికి నోటిదగ్గర చెయ్యి నోటిదగ్గరే ఆగిపోయింది. తలవంచుకుని కూర్చున్న ఫోమా ముఖంలో ఏదో ప్రశ్నార్థకంగా చూచాడు.

"నీవు చెప్పేది ఎఫిమ్ విషయంకదూ? అవునా ?" అని అడిగాడు.

"అవును. వాడిముఖం నెత్తురుతో నిండిపోయింది. తరువాత ఎలా నడిచాడనుకున్నావు? ఎలా ఏడ్చాడో తెలుసా? పాపం!" అన్నాడు ఫోమా మెల్లనిగొంతుతో.

"ఊఁ. అయితే వాడికోసం నీవు విచారిస్తున్నావన్న మాట?" అన్నాడు ఇగ్నాట్.

"పాపం!" అన్నాడు మళ్ళీ ఫోమా. కన్నీళ్ళు గుండెకు ఎగతట్టి అతను మాట్లాడలేకపోయాడు.

"అవునురా. నీవు అలాటివాడివే. నాకు తెలుసు. నీది జాలిగుండె!" అన్నాడు ఇగ్నాట్.

తరువాత కొంచెంసేపు ఇద్దరూ మౌనంగా ఉన్నారు. ఇగ్నాట్ ఒక గ్లాసులో ద్రాక్షరసం పోసుకుని తాగాడు. మళ్ళీ ఒక నిశ్చితమైన కంఠస్వరంతో కొడుకును మందలిస్తున్నట్లుగా ఇలా అన్నాడు :

"నీవు అతనికోసం జాలిపడవలసిన అవసరంలేదు. కాస్త మకురుచేయబోయాడు, చురక అంటించాను, అంతే! వాడు మంచివాడే. నాకు తెలుసు. వళ్ళువంచి పనిచేస్తాడు. గట్టిశరీరం. తెలివైనవాడుకూడా. కాని వాదించడం వాడి పని కాదు. నేను వాదనకు దిగవచ్చు. అవును. నేను యజమానిని. యజమానిపనంటే ఏమనుకున్నావు? మనం అనుకున్నంత తేలికైన పనికాదు. ఒక చిన్న దెబ్బతగిలినంతమాత్రాన వాడేం చావడు. కాస్త బుద్ధితెచ్చు కుంటాడు. ఒకేయ్ ఫోమా! నీ వింకా పసివాడివి. నీకీ విషయాలు తెలియవు. ప్రపంచంలో ఎలా బ్రతకాలో నేను నీకు నేర్పాలి. నేర్పుతాను. నేనిక ఎంతోకాలం ఈ భూమి మీద ఉండబోను."

ఇగ్నాట్ మళ్ళీ కొంచెంసేపు ఊరుకున్నాడు. ఇంకా కొంచెం వోడ్కా తాగాడు. తిరిగి ఇలా చెప్పడం మొదలెట్టాడు.

"మనుష్యులపట్ల జాలిచూపటం అవసరమే. నీవలా జాలిపడడం న్యాయంకూడా. కాని జాలిపడేటప్పుడు కాస్త తెలివిగా ఉండాలి. మొదట నీవు జాలిపడేమనిషి ఎలాటివాడో

చూడాలి. అతనిలో ఏమాత్రం మంచిఉందో, అతనివల్ల ఎలాటి ఉపయోగం ఉంటుందో కనుక్కోవాలి. అప్పు డతను శక్తి సామర్థ్యాలుకలవాడని తెలిస్తే అతనిపై జాలిదలచి సహాయం చెయ్యాలి. అలాకాక అతను బలహీనుడు, పనికిమాలినవాడూ అయితే, వాణ్ణి జాలిదలచకూడదు. వాడికి దూరంగా తొలిగి పోవాలి. ఒక్క విషయంమాత్రం జాగ్రత్తగా జ్ఞాపకముంచుకో— ప్రతిదానిలోనూ తప్పుపట్టేవాడూ, ఎప్పుడూ నిరాశతో నిట్టూర్పులువిడుస్తూ మూల్గుతుండేవాడూ, ఎందుకూ కొరగాని వాళ్ళని తెలుసుకో. అలాటివాడిపై జాలిచూపినా ప్రయోజనం ఏమాత్రం ఉండదు. అందు కతను అర్హుడుకాడుకూడా. పైగా అలాటివాళ్ళను జాలితలిస్తే వాళ్ళు మరింతపాడై పనికి రాకుండాపోతారు. మరీ బద్ధకస్తులవుతారు. నీ రక్షకపితమయ కిన్ ఉన్నాడే, అతనిఇంట్లో నీవు అనేకరకాల మనుష్యులను చూచిఉంటావు. ఇతర్లమీద ఆధారపడి జీవించేవాళ్ళనూ, అదృష్టహీనులైన యాత్రీకులనూ— ఎందరో రకరకాలమనుష్యులను చూచిఉంటావు. వాళ్ళందరినీ మరిచిపో. వాళ్ళు మనుష్యులుకారు. ఎందుకూపనికిరాని వట్టి గుల్లలాంటివాళ్లు. వాళ్ళవల్ల ఏంలాంభం? చెదపురుగులు, క్రిమికీటకాదులు, నల్లులూ; వీటన్నితోనిండిఉండే పెంటకుప్పలు, దిబ్బలుఉంటాయి చూచావూ? అలాటివాళ్లు. పోనీ వాళ్ళేమైనా దైవభక్తులా అంటే, అదీకాదు. వాళ్ళకు దేవుడులేడు, దయ్యమూలేదు. ఊరికే భగవంతుడిపేరు చెప్పుకుని బ్రతుకుతుంటారు. తమపట్ల ఇతర్లకు జాలిపుట్టించాలనే ఉద్దేశంతోమాత్రమే భగవన్నామం ఉచ్చరిస్తుంటారు. అలా చేయకపోతే వాళ్ళపొట్టలు నిండవు.

వాళ్ల బ్రతుకంతా ఒక్క పొట్టకోసమే. మరి దేనికీకాదు. అంటే వాళ్ళబ్రతుకుకు అర్థంలేదన్నమాట. తినడం, తాగడం, మూలగడం, నిద్రపోవడం—ఇవి తప్ప మరేం చెయ్యలేరు. మరి ఎందుకూ కొరగారు. ఆత్మను మాత్రం రోజురోజుకు క్షీణింప చేసుకుంటారు. ఇదే వాళ్ళు సాధించేది. వాళ్ళు నీ దోవకు అడ్డుతగులుతారు. నీ దోవకు రాళ్ళలా అడ్డం నిలబడతారు. వాళ్ళ దరిచేరకు. వాళ్ళకు దూరంగా—చాలాదూరంగా తొలిగిపో! ఒకవేళ ఎవడైనా ఒక్క మంచివాడు వాళ్ళ మధ్య ఉన్నా ప్రయోజనంలేదు. కుళ్ళిపోయిన పది పండ్లమధ్య ఒక మంచి పండు చెడిపోయినట్టు చెడిపోతాడు. నీవింకా పసివాడివి. అదే ఇప్పుడొచ్చిన చిక్కు. నా మాటలు నీ తలకెక్కవు. ఎంత కష్టంలోనైనా ఎవడైతే దిటవుగా నిలబడతాడో— వాడికిమాత్రమే సహాయంచెయ్యి. అలాటివాడు నిన్ను సహాయం కోరడానికి తగినవాడు. కాని వాడు నీ సహాయం అర్థించకపోవచ్చు. అందుకని — నీ అంతట నీవే ముందుగా ఆలోచించుకుని వాడికి తోడ్పడు. ఒకవేళ వాడు అభిమానంకలవాడై నీ సహాయానికి నొచ్చుకుంటూ ఉంటే — అప్పుడు నీవు సహాయంచేస్తున్నట్టు వాడికి తెలియనియ్యకు. తెలియకుండా సహాయంచెయ్యి. ఇతర్లకు సహాయపడవలసినపద్ధతి ఇదిరా నాయనా. ఒక చిన్న ఉదాహరణ చెపుతాను చూడు; ఇక్కడ రెండు చెక్కలున్నాయనుకో. అవి రెండూ బురదలో కూరుకుపోతాయనుకో. ఆ రెంటిలో ఒకటి మంచిది, ఒకటి చెడిపోయింది. అప్పుడు నీవు ఏం చేయాలి చెప్పు? చెడిపోయిన చెక్కను తీసుకుంటావా?

లేక మంచి చెక్కను తీసుకుంటావా? ఊ! చెడిపోయిన చెక్క వల్ల లాభమేముంది? కనుక దానిని అలా బురదలో కుళ్ళిపోనియ్యి. నీ కాలికి ఆ బురద అంటుకోనీయకుండా దానిమీద నడిచిపో. ఇక మంచి చెక్క ఉంది చూచావు? దానిని బురదలోంచి తీసి ఎండపెట్టు. నీకు పనికిరాకపోయినా, అది మరొకరికైనా పనికివస్తుంది. ఇదిరా అబ్బాయీ పరిస్థితి! నే చెప్పిన మాటలన్నీ జ్ఞాపకంపెట్టుకో. ఎఫిమ్‌ను ఎందుకు జాలిదలచాలో నా కర్థంకావడంలేదు. వాడు సమర్థుడు. శక్తివంతుడు. వాడి విలువ వాడికి తెలుసు. ఒక్కదెబ్బకే తల్లక్రిందులైపోడు. ఒక వారంరోజులపాటు చూచి వారికి పెద్ద పని ఇస్తాను. వాడి మీద నాకు బాగా నమ్మకం—వాడు పెద్ద పైలట్ అవుతాడు. తరువాత కెప్టెన్ పని ఇచ్చినా వాడు ధైర్యం చెడగొట్టుకోడు. తెలివిగా మసులుకుంటాడు. మనుష్యులు వృద్ధిలోకి వచ్చేది ఇలాగేరా నాయనా. ఈ పాట్లన్నీ నేను పడవాణ్ణేరా బాబూ! ఆ వయస్సులో నాకు దెబ్బలు తగిలాయి. తల బొప్పులు కట్టింది. జీవితం ఉంది చూచావు? అది మనవంటివాళ్ళందరికీ చల్లని కన్నతల్లిలాంటిది. కాదురా నాయనా! అది మనలను వేధించి, బాధించి మన ప్రాణాలు తోడే ఉంపుడుకత్తెలాంటిది!''

ఇగ్నాట్ ఇలా రెండుగంటలసేపు మాట్లాడాడు. తాను చిన్నతనంలో పొందిన అనుభవాలు, తాను పడిన శ్రమలు, బాధలు, తన గాథలు, మనుష్యుల తీరూ, తెన్నూ, వాళ్ళ తరహా—అన్నీ కొడుక్కు బోధించాడు. మనుష్యులలో ఉండే మహత్తరశక్తిని గురించి, వాళ్ళలోఉండే దౌర్భాగ్యమైన బల

హీనతనుగురించీ-రెంటినిగురించీ చెప్పారు. మనుష్యులు ఎలా జీవిస్తారో, ఇతర్ల డబ్బుతో బ్రతకడానికి మధ్యమధ్య అదృష్ట హీనులైనట్టు ఎలా నటిస్తారో వివరంగా చెప్పాడు. తరువాత తననుగురించి చెప్పాడు. తాను మొదట్లో ఒక చిన్న పని వాడుగా ఉండి క్రమక్రమంగా ఒక పెద్ద వ్యాపారసంస్థకు ఎలా యజమాని అయిందీ చెప్పాడు. పసివాడు ఫోమా, తండ్రి చెప్పిన ప్రతిమాటా - ప్రతి అక్షరం విన్నాడు. ఆయనవంక తేరిపారచూచాడు. తండ్రి తనకు దగ్గరదగ్గరగా వస్తున్నట్టనిపించిందతనికి. అన్ఫీసా అత్తయ్య చెప్పే కథల్లోని అందం, తన తండ్రి చెప్పే కథల్లో కనిపించకపోయినా-వీటిల్లో ఏదో కొత్తదనం అతనికి కనిపించింది. వాటికంటె ఏదో పరిశుభ్రమైనదీ, ఎక్కువ అవగతమవుతున్నదీ, వీటిల్లో కనిపించింది. కాని వినడానికి అవీ ఇవీ-రెండూ ముచ్చటగానే ఉన్నాయి.ఏదోఎరుగని బలీయమైనశక్తి-ఒక వేడి-ఆపసివాడి గుండెల్లో కొట్టుకలాడసాగింది. ఆ పసివాణ్ణి తండ్రి ఆకర్షించాడు. ఇగ్నాట్ తనకొడుకు కళ్ళను పరిశీలించాడు. ఆ కళ్ళనుబట్టి వాడిభావాలుగ్రహించుకున్నాడు. వెంటనే అక్కణ్ణుంచి లేచి కొడుకును దగ్గరికి తీసుకుని తన గుండెలకు గట్టిగా హత్తుకున్నాడు. ఫోమా, తండ్రి మెడ కౌగలించుకుని తండ్రిచెక్కిలికి తన చెక్కిలిచేర్చి, తీవ్రమైన వేగంతో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తూ మౌనంగా ఉండిపోయాడు.

"నా తండ్రీ! నా ముద్దులయ్యా! నా ఆనందం నీవేరా నాయనా! నేను బ్రతికుండగానే అన్నీ నేర్చుకో. బ్రతకడం చాలా కష్టంరా బాబూ." అన్నాడు ఇగ్నాట్, క్షీణస్వరంతో.

తండ్రి అలా అనేసరికి పిల్లవాడిగుండెలు కంపించాయి.

పండ్లు గట్టిగా బిగించుకున్నాడు. కళ్ళనుండి వెచ్చని కన్నీరు ఉబికివచ్చింది.

ఇంతవరకూ ఇగ్నాట్ ఎన్నడూ తన కొడుకు హృదయాన్ని ఇలాకదిలించలేదు. తండ్రికి అలవాటుపడ్డాడు కొడుకు. తండ్రికి మచ్చికఅయినాడు కొడుకు. తండ్రియొక్క—ఆజానుబాహు విగ్రహాన్నిచూచి అలసిపోయేవాడు. కాని తను ఏదడిగితే అది ఇస్తాడనీ, తన కోరికలన్నీ తీరుస్తాడనీ తెలుసుకున్నాడు. ఒక్కొక్కమాటు ఇగ్నాట్ ఇంటికి రాకుండా రోజులు, వారాలు, నెలల తరబడి ఉండిపోయేవాడు. అయినా అతను లేడని ఫోమా అంతగా గుర్తించేవాడుకాదు. అన్ఫీసా అత్త లాలింపులలో మునిగిపోయి ఆ విషయమే గమనించేవాడుకాదు. ఇగ్నాట్ ఇంటికి తిరిగిరాగానే అతనికి సంతోషం కలిగేది. కాని తన తండ్రిరాకవల్ల సంతోషం కలిగిందో, లేక అతను తెచ్చి ఇచ్చిన రకరకాల ఆటవస్తువులు, విలువైన బొమ్మలు, వీటివల్ల సంతోషంకలిగిందో అతను సరిగా చెప్పలేకపోయేవాడు. ఏమైనా ఇప్పుడుమాత్రం తండ్రి కనిపించగానే అతను పరుగెత్తుకుంటూ వెళ్ళి తండ్రిచేతులు పట్టుకుని నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూస్తున్నాడు. రెండుమూడు గంటలు తండ్రి కనిపించకపోతే అతనికేదో చిరాగ్గా, విసుగ్గా ఉంటున్నాడు. తండ్రికి కూడా ఇప్పుడు కుర్రవాడిపట్ల ఆసక్తి ఎక్కువైంది. వాడిమీద ఒక రకమైనప్రేమ,గౌరవంకూడా ఏర్పడ్డాయి. ఇద్దరూ ఎప్పుడు కలిసి ఉన్నా—పసివాడు తండ్రి నిలా ప్రార్థించేవాడు.

"నాన్నా! నిన్నుగురించి ఇంకా చెప్పవూ?"

◆ ◆ ◆ ◆ ◆

ఇప్పుడు స్టీమరు వోల్గానదికి పైవాలుగా పోతోంది. అది జూలై నెలలో ఒకనాటిరాత్రి. ఎక్కడా గాలిలేదు. ఉక్క పోస్తూ ఊపిరాడకుండా ఉంది. బాగామబ్బుపట్టిఉంది. ఆకాశంలో నల్లనిమేఘాలు దట్టంగా అలముకుని ఉన్నాయి. వోల్గానదీ తీర మంతా ఏదో అవ్యక్తమైన ప్రశాంతితో నిండిఉంది. కాజాన్ చేరి ఉస్లాన్ సమీపంలో స్టీమరు లంగరేసుకుంది. లంగరు గొలుసుల గలగల చప్పుళ్ళకు, పనివాళ్ళ కేకలకు ఫోమాకు మెలకువవచ్చింది. కిటికీలోంచి దూరంగా చూచాడు. చిన్న దీపాలు మినుకుమినుకుమంటూ చిత్రంగా కనిపిస్తున్నాయి. స్టీమరుక్రింద నీళ్ళు నల్లగా చిక్కగా నూనెలాగా ఉన్నాయి. అంతకుమినహా అతనికేం కనిపించడంలేదు. ఆ పసి వాడిగుండె బాధతో కొట్టుకోసాగింది. చెవులు నిక్కపొడిచి వినడం మొదలెట్టాడు. ఎక్కడో దూరంనుంచి ఒక విషాదగీతం అస్పష్టంగా వినవస్తోంది. ఆ గీతం చాలాదీర్ఘంగా దుఃఖపూరితంగాఉంది. ఎడారి యాత్రికులు పాడుకునేగీతంలా ఉంది. అంతలో ఆవిరి వదులుతూ స్టీమరుకోసం బుస్సుమని శబ్దంచేసింది. నదీజలాలు మెల్లగా, దీనంగా ఓడల అంచులకు కొట్టుకుని గలగలమంటున్నాయి. కళ్ళల్లో వత్తులుపెట్టుకుని చూస్తున్నట్టుగా, దట్టంగా అలముకుని ఉన్న ఆ చీకట్లోకి నిశ్చ లంగాచూచాడు ఫోమా. ఏవేవో భయంకరమైన రూపాలు అతని కళ్ళముందు ప్రత్యక్షమైనట్టు కనిపించాయి.

"ఓ...ఓ...ఓ—" దూరంనుంచి ఒకపెద్దఅరుపువచ్చి, సన్నని మూలుగులా వినిపించింది.

ఎవరో డెక్ మీదుగా నడుస్తూ స్టీమరుచివరకు వెళ్ళారు.

"ఓ...ఓ...ఓ—" మళ్ళీ అదేఅరుపు. ఈమాటు యింకా దగ్గిరిగా వినిపించింది.

"ఎఫిమ్ ! ఎఫిమ్కా!" డెక్ మీదనుంచి ఎవరో మెల్లగా పిలిచారు.

"ఊఁ."

"ఒరే మొద్దా ! లే లే ! స్టీమరుకొక్కెంతీసుకో."

"ఓ...ఓ...ఓ...ఓ — " మళ్ళీ ఎవరో దాపులో మూలిగారు. ఫోమా గజగజ వణుకుతూ కిటికీ దగ్గర్నుంచి ఒక అడుగు వెనక్కువేశాడు. ఆ విచిత్రమైన ధ్వని రానురాను దగ్గరికి వచ్చి పెద్దదైంది. వెక్కివెక్కి ఏడ్చినట్టుగా వినిపించి తరువాత చీకటిలో అణగిపోయింది. మళ్ళీ ఈలోపల డెక్ మీద ఎవరో ఆదుర్దాగా గుసగుసలాడడం వినిపించింది.

"ఎఫిమ్కా ! లేరా ! ఎవరో ప్రయాణీకుడు నీళ్ళల్లో తేలుతున్నాడు!"

"ఎక్కడ?" అని ఆదుర్దాగా అవతలవాడు ప్రశ్నిస్తున్నాడు. తరువాత డెక్ మీద అడుగులచప్పుడు, ఏదో రొద వినిపించాయి. రెండు పడవకొక్కాలు కుర్రాడి కళ్ళముందు నుంచి క్రిందికి నీళ్ళల్లోకి జారాయి.

"ఎవరో ప్రయాణీకుడు!" దగ్గరలోనే ఎవరో ఏడుస్తూ, ఏడుపు ఆపుకుంటూ అంటున్నారు.

ఆ పిల్లవాడు భయంతో వణికిపోయాడు. కిటికీదగ్గర్నుంచి చేతులు ఇవతలికి తీయలేకపోయాడు. నీళ్ళవంక అలాగే చూస్తూ నిలబడ్డాడు.

"లాంతరు వెలిగించు. లేకపోతే ఏమీ కనిపించదు."

"సరే."

లాంతరు వెలుతురు మందంగా నీళ్ళమీదపడింది. నీళ్ళు మెల్లగా అటూఇటూ ఊగుతూ ఉండడం ఫోమా చూచాడు. అక్కడ నీరు బాధతో మెలికలు తిరుగుతున్నట్టు సుడితిరిగి పోతోంది.

"చూడు! చూడు!" డెక్ మీదనుంచి ఏదో భయంతో మెల్లని గొంతుల గొణుకుడు.

అదే సమయంలో ఒక భయంకరమైన మానవవదనం తెల్లనిపళ్ళు బిగబట్టి ఆ వెలుతుర్లో కనిపించింది. అది నీటిలో తేలుతూ అటూఇటూ కొట్టుకుంటున్నది. ఆ పళ్ళవరుస ఫోమా వంకకు తేరిపారచూస్తూ చిరునవ్వునవ్వుతూ

"ఏయ్ అబ్బాయ్! అబ్బాయ్! చలిగాఉంది. సెలవు!" అని అంటున్నట్టుగాఉంది.

పడవ లంగర్లు పైకి గాలిలోకి లేచి మళ్ళీ అటూఇటూ ఊగుతూ నీళ్ళలోకి దిగాయి. తరువాత దేనినో మెల్లగా జాగ్రత్తగా అవతలికి నెట్టాయి.

"అతన్నొత్తి అవతల తోసెయ్యి! తోసెయ్యి! చక్రం క్రిందపడకుండా చూడండి"

"అయితే నీవే అతన్ని అవతల తోసెయ్యి."

మళ్ళీ పడవ లంగరుగొలుసులు పండ్లుకొరికినట్టు చప్పుడు చేసుకుంటూ పక్కకు దిగాయి. ఫోమా వాటిని చూస్తూ కళ్ళు మూసుకోలేకపోయాడు. డెక్ మీద మళ్ళీ ధణధణమని

అడుగుల చప్పుడు, మళ్ళీ ఎవడో చచ్చిపోయిన మనిషి కోసం ఏడుపు వినిపించాయి.

"ఎవరో ప్ర - యా - ణీ - కుడు !"

"నాన్నా!" ఫోమా, చెవులు చిల్లులుపడేటట్టు అరిచాడు. "నాన్నా!"

తండ్రి ఎగిరి దూకి ఒక్కఉరుకులో కొడుకు దగ్గరికొచ్చిపడ్డాడు.

"ఏమిటది? అక్కడ వాళ్ళేమిటి చేస్తున్నది?" మళ్ళీ బిగ్గరగా అరిచాడు ఫోమా.

ఇగ్నాట్ భయంకరంగా గర్జిస్తూ కాబిన్‌లోంచి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ బయటికిదూకి వెళ్ళాడు. తరువాత వెంటనే తిరిగొచ్చాడు. ఆపాటికి ఫోమాకు కళ్ళు తిరిగాయి కాని పడిపోకుండా తండ్రిపక్కకొచ్చి నిలబడ్డాడు.

"వాళ్ళు నిన్ను భయపెట్టారుకదూ? ఏమీలేదులే," అంటూ ఇగ్నాట్ కొడుకును ఎత్తుకున్నాడు.

"నీవు నాదగ్గర పడుకో." అన్నాడు మళ్ళీ.

"ఏమిటది?" అడిగాడు మళ్ళీ ఫోమా, మెల్లగా.

"ఏమీలేదు నాయనా! మునిగిపోయిన ఒక మనిషి. ఒక మనిషి నీళ్ళల్లోపడి తేలుతున్నాడు. అంతే! భయపడకు. అప్పుడే చనిపోయి తేలిపోయాడుకూడా."

"వాణ్ణి నీళ్ళల్లో ఎందుకు తోశారు?" అడిగాడు కుర్రవాడు. తండ్రిని గట్టిగా కరుచుకుని భయంతో కళ్ళుకూడా గట్టిగా మూసుకున్నాడు.

"అలా చెయ్యాల్సినఅవసరంవచ్చింది. లేకపోతే స్టీమరు చక్రంక్రింద పడేవాడు. మనచక్రంక్రింద పడినట్టయితే, పోలీసులు రావడం, మనకు చిక్కు వస్తుంది. అందుకనే వాణ్ణి తోసేశాం. ఎలాఅయితేనేం? చనిపోయాడు. ఇక వాడికి బాధలేదు. వాడి వల్ల బ్రతికున్నవాళ్ళు బాధపడతారు. నీవు నిద్రపో నాయనా!"

"అయితే ఆ మనిషి అలా తేలుతూ ఉంటాడా?"

"అలా తేలుతూ పోతాడు. ఎక్కడో ఒకచోట బయటికితీసి అతన్ని పూడ్చివేస్తారు."

"అయితే అతన్ని చేప మింగుతుందా?"

"చేపలు మనుష్యుల శరీరాలు తినవు. ఎండ్రకాయలైతే తింటాయి. మనుష్యుల శరీరాలంటే ఎండ్రకాయలకు ఇష్టం."

ఫోమా, తనతండ్రిపక్కన పడుకున్నాడు. తండ్రిని కరుచుకుని పడుకున్నాడు. ఆ వెచ్చదనానికి అతనిభయం మెల్లమెల్లగా కరిగిపోనారంభించింది. కాని అతని కళ్ళముందు నీటిలో అటూ ఇటూ ఊగుతూ పళ్ళికిలిస్తున్న ఆ భయంకర మానవవదనం మాత్రం కనిపిస్తూనేఉంది.

"అయితే అత నెవరు?" మళ్ళీ తండ్రినడిగాడు ఫోమా.

"ఎవరో ఆదేవుడికే తెలియాలి! అతనిఆత్మశాంతికోసం నీవు "ఓ ప్రభూ! అతని ఆత్మకు శాంతి ప్రసాదించు!" అని భగవంతుణ్ణి ప్రార్థించు."

"ఓ ప్రభూ! అతని ఆత్మకు శాంతి ప్రసాదించు!" తండ్రి అన్నవాక్యం తిరిగీ ఉచ్చరించాడు ఫోమా మెల్లగా.

"అదీ! ఇక నిద్రపో, భయంలేదు. ఇప్పుడు వాడు దూరంగా వెళ్ళిపోయాడు! ఎక్కడో తేలుకుంటూ పోతుం

టాడు. ఇదిగో ఇటుచూడు. నీ వెప్పుడూ పడవపక్కకు కొసకు వెళ్ళకు. జాగ్రత్త. చక్కలమీదనుంచి జారిపడిపోతావు. తెలిసిందా?" "అయితే అతనుకూడా పడవకొసకు వెళ్ళాడా? చక్కలమీదనుంచి జారిపడ్డాడా?"

"అయిఉండొచ్చు. బహుశా బాగా తాగిఉంటాడు. ఇంకేముంది? దాంతో ఆఖరు వాడు! వాడంతటవాడే నీళ్ళలో పడిఉంటాడు. నీళ్ళలోపడి చచ్చిపోయ్యే మనుషులున్నారు. వాళ్ళంతటవాళ్ళే వెళ్ళి నీళ్ళలోపడతారు. మునిగిపోతారు. జీవితం నాయనా! కొందరికి అలాఉంటుంది. ఒక్కొక్కడికి చావే సెలవురోజులా కనిపిస్తుంది. ఒక్కోమాటు అందరికీ, చావు చల్లని ఆశీస్సులా కనిపిస్తుంది."

"నాన్నా!"

"నిద్రపో, నిద్రపోరా నాయనా."

## మూడో అధ్యాయం

థోమా బళ్ళోచేరాడు. బళ్ళోకివెళ్ళిన మొదటినాడే; ఆ పిల్లలగోల, కేకలు, కేరింతలు, ఆటలు, పాటలు, ఇవన్నీ అతనికి విచిత్రంగా కనిపించాయి. అతనికెంతో ఉల్లాసం కలిగించాయి. పిల్లలు జట్లుజట్లుగా బళ్ళోకి వచ్చిపోతున్నారు. ఆ జట్లలో ఇద్దర్నిమాత్రం తనకుస్నేహితులుగా ఎంచుకున్నాడు థోమా. తక్కిన పిల్లలకంటె ఈ ఇద్దరిలో ఏదోవిశేషం ఉన్నట్టు థోమాకనిపెట్టాడు. ఒకఅబ్బాయి తనముందు కూచునే వాడు. వెడల్పైన వెన్ను, నిండైనమెడ. పెద్దచెవులు, సన్నగా

కత్తిరించినజుట్టు ఎర్రగాఉంటుంది. ఫోమా ఆ కుర్రవాడివంక అనుమానాస్పదంగా చూచాడు.

పంతులుగారిది బట్టతల. క్రిందిపెదవి వేలాడుతూ ఉంటుంది. "ఒకేయ్ స్మోలిన్ ఆఫ్రికన్ !" అని పంతులుగారు పిలవగానే ఎర్రజుట్టుగల కుర్రవాడులేచి అడుగులోఅడుగు వేసుకుంటూ ఆయన దగ్గరికి వెళ్ళాడు. పంతులుగారు చెప్పినలెక్క విన్నాడు. పిమ్మట జాగ్రత్తగా ఆ లెక్క సుద్దముక్కతో బ్లాకుబోర్డుమీద వెయ్యడం మొదలెట్టాడు. తాటికాయంత అంకెలు వేస్తున్నాడు.

"సరే, ఇక చాల్లే. ఒకేయ్, యెజేవ్ నికొలాయ్ ! ఇక నీవు రా!" అన్నాడు పంతులు.

యెజేవ్ అనే కుర్రవాడు ఫోమా సరసనే కూచున్నాడు. చాలా చిన్నకుర్రవాడు. చిన్న ఎలుకపిల్లకళ్ళంత కళ్ళు. పంతులుగారు పిలవగానే ఉలికిపడి లేచాడు. బల్లలు, కుర్చీలు, కొట్టుకుంటూ దిక్కులుచూస్తూ మెల్లగా బ్లాకుబోర్డు దగరికి వెళ్ళాడు. మునివ్రేళ్ళమీద నిల్చుని సుద్దముక్కచప్పుడు చేస్తూ అంకెలు వెయ్యడం మొదలెట్టాడు.

"అలా చప్పుడు చేస్తావేంరా?" అన్నాడు పంతులు.

వెంటనే యెజేవ్ గబగబ బిగ్గరగా మాట్లాడాడు.

"మొదటి వర్తకుడికి 17 కో పెక్కులు లాభం.

"ఇక చాల్లే. గార్డియేవ్! రెండోవ రకుడికి ఎంత లాభం వస్తుందో మనం కనుక్కోవాలి. ఎలా కనుక్కుంటావో చెప్పు." అన్నాడు పంతులుగారు.

ఈ ప్రశ్న హఠాత్తుగా వెయ్యడంవల్ల ఫోమాకు ఏం సమాధానం చెప్పాల్సిందీ తోచలేదు. అందుకని మౌనంగా ఊరుకున్నాడు.

"నీకు తెలియదూ? సరే, ఏయ్ స్మోలిన్! నీవు చెప్పరా!" అన్నాడు మళ్ళీ పంతులుగారు.

స్మోలిన్ మెల్లగా తన రెండుచేతులూ చొక్కాకు తుడుచుకుని ఆ లెక్క చేసి చూపించాడు. లెక్కఅయిపోగానే మళ్ళీ వచ్చి ఫోమా ప్రక్కన కూచుంటూ "ఆ లెక్క నీకు తెలియదూ? మొత్తం లాభం ఎంత? ముప్ఫయి కోపెక్కులు. ఇద్దరు వర్తకులున్నారు. అందులో ఒకడికి పదిహేడు కోపెక్కులొచ్చాయి. రెండోవాడికి ఎంత వచ్చిందో మనం కనుక్కోవాలి." అన్నాడు.

"నాకు తెలుసు.' అన్నాడు ఫోమా నింపాదిగా. యొజోవ్, ఫోమా కాలు మెల్లగా గిల్లాడు.

"నీవు ఎవరి అబ్బాయివి? గార్డియెవ్‌ల అబ్బాయివి కదూ?" అని అడిగాడు.

"అవును." అని సమాధాన మిచ్చాడు ఫోమా.

"నీకెప్పుడూ లెక్కలు అందిస్తూ ఉండమంటావా?"

"ఊఁ."

"మరి నాకేం ఇస్తావు?"

ఫోమా ఒక క్షణం ఆలోచించి "నీకు అన్నీ తెలుసునా?" అని అడిగాడు.

అంతలో పంతులుగారు "ఒరేయ్ యొజోవ్! ఏమిటి మీ ఇద్దరు మాట్లాడుతున్నారు?" అని కేకవేశాడు.

యెజోవ్ ఉలిక్కిపడిలేచి నిలబడ్డాడు. ధైర్యం తెచ్చుకుని "నేను కాదండీ. ఇవాన్ ఆంద్రేవిచ్—గార్దియేవ్." అని అన్నాడు.

"ఇద్దరూ గుసగుసలాడుతున్నారు. నేచూస్తూనేఉన్నా." అని స్మోలిన్ చెప్పాడు. అది విని పంతులుగారు ముఖం చిట్లించాడు. విసుగుతో అందరినీ చీవాట్లుపెట్టాడు.

'సరే, స్మోలిన్! నామీద పంతులుగారితో పితుర్లు చెప్పావుకదూ? జ్ఞాపకంఉంచుకో." అన్నాడు యెజోవ్.

"మరి తప్పంతా ఆ కొత్తపిల్లవాడిమీద ఎందుకు పెట్టావు?" అని అడిగాడు స్మోలిన్.

"సరే, సరే." అన్నాడు యెజోవ్.

ఫోమా ఏమీమాట్లాడకుండా ఊరుకున్నాడు. మధ్యలో విశ్రాంతికోసం బడి వదిలిపెట్టారు. తరువాత స్మోలిన్‌కూడా భాగ్యవంతులబిడ్డేనని ఫోమా తెలుసుకున్నాడు. అవును. యెజోవ్ ఆవిషయం ఫోమాకు చెప్పాడు.

యెజోవ్‌మాత్రం పేదవాడు. అతని తండ్రి కోర్టులో కాపలావాడుగా పనిచేస్తున్నాడు. యెజోవ్ వేసుకునే బట్టలనుబట్టే అతను పేదవాడని తెలుస్తుంది. అతుకులువేసిన బట్టలు వేసుకున్నాడు. ముఖం చూస్తే ఆకలికి నకనకలాడుతున్నాడని తెలుస్తుంది. బక్కచిక్కిన శరీరం, ఎముకలుతప్ప కండ అన్నమాట కనిపించదు. అతను మాట్లాడేటప్పుడు చేతులాడిస్తూ, ముఖభావాలు మార్చుకుంటూ మాట్లాడతాడు. కాని అతను మాట్లాడేమాటలు అతనికితప్ప మరెవ్వరికీ అర్థంకావు.

"ఇకనుంచి మనం స్నేహితులుగా ఉందాం?" అన్నాడు ఫోమా, యెజోవ్‌తో. "నామీద పంతులుగారికి ఎందుకు చాడీలు చెప్పావు.?" అని అడిగాడు, అతనివంక అనుమానాస్పదంగా చూస్తూ. "చెపితేఏం ? ఇప్పుడు ముంచుకొచ్చిన ముప్పేమీ లేదు. నీవు కొత్తగా వచ్చిన కుర్రాడివి. అందులోనూ కలవారి బిడ్డవు. కలవారిబిడ్డను పంతులుగారేమీ అనడు. నేను లేనివాణ్ణి. అందుకే పంతులుగారికి నేనంటే ఇష్టంలేదు. ఆయనకు నే నెప్పుడూ బహుమతులు తెచ్చివ్వను. కాని నే నింకా తెలివిగల విద్యార్థిని కనుక నన్నిప్పటిదాకా బళ్ళో ఉంచారు. లేకపోతే ఎప్పుడో వెళ్ళగొట్టి ఉండేవాళ్లే." అన్నాడు యెజోవ్.

"నీ వింతకష్టపడి చదువుకోవడం దేనికి?"

"నేను పేదవాణ్ణి కనుక పేదవాళ్ళు భాగ్యవంతులు కావాలంటే కష్టపడి చదువుకోవాలి. కష్టపడిచదువుకుంటే డాక్టర్లు, ఆఫీసర్లు అవుతారు. అంచాత నేనూ అవుతాను. మరి నీవో?"

"నేనేమవుతానో నాకే తెలీదు" అన్నాడు ఫోమా. స్నేహితుడివంక పరీక్షగాచూస్తూ.

"నీకంత అవసరమేమిటి? నీవేమీ కానక్కర్లేదు. సరే కానీ, నీకు ఎన్ని గుర్రా లున్నాయి"?

"మూడు. ఎందుకివ్వన్నీ ఆరాతీస్తున్నావు?"

"ఎందుకంటే నేను పేదవాణ్ణి. తెలుసుకోవాలని కుతూహలం. పోతే నీకు పావురాళ్ళంటే ఇష్టమేనా?"

"ఊఁ"

"నీ కెన్ని పావురాళ్ళున్నాయి?"

"లేవు."

"అరె. ఇంత పెద్ద భాగ్యవంతుడివి! నీకు పావురాళ్ళే లేవా? నాదగ్గరే మూడు పావురాళ్ళున్నాయే! మానాన్న భాగ్యవంతుడైనట్టయితే నాకు వంద పావురాళ్ళు తెచ్చిచ్చే వాడు. పగలల్లా వాటిని పై కెగరేస్తూ హాయిగా కూచునేవాణ్ణి. స్మోలిన్‌కుకూడా పావురాళ్ళున్నాయి' చాలా బాగుంటాయి! మొత్తం పద్నాలుగు పావురాళ్ళు! ఒకటి నాకు బహుమతిగా ఇచ్చాడుకూడా. వాడు కొంచెం ఆశపోతు. అంతే; భాగ్య వంతు లందరికీ కొంచెం అత్యాశఉంటుంది. మరి నీకు? అత్యాశ ఉందా?"

"నాకు తెలియదు" అన్నాడు ఫోమా, ఏమీ నిశ్చ యించుకోలేక.

"సరే, స్మోలిన్ ఇంటికి రా. ముగ్గురం కలిసి పావు రాళ్ళను ఎగరేద్దాం."

"వస్తాను. కాని మావాళ్ళు నన్ను వెళ్ళనిస్తారా?"

"ఏం? మీ నాన్నకు నీవంటే ఇష్టంలేదా?"

"ఇష్టమే."

"అయితే ఇంకేం? తప్పకుండా వెళ్ళనిస్తాడు. కాని నేను కూడా నీతో వస్తున్నానని ఆయనతో చెప్పకు. నాతో కలిసి నిన్ను వెళ్ళనివ్వడేమో. స్మోలిన్ ఇంటికి వెళ్ళానని చెప్పు. సరి పోతుంది. అడుగో, స్మోలిన్ వస్తూనేఉన్నాడు!"

బొద్దుగాఉన్న స్మోలిన్ వాళ్ళదగ్గరికొచ్చాడు. యెజోవ్ వాణ్ణిచూచి "ఏంరా? నీ సహవాసం పట్టకూడదురా" అన్నాడు—

"నన్నెందుకు తిడతావు?" అన్నాడు స్మోలిన్, మెల్లగా ఫోమావంక పరీక్షగా చూస్తూ.

"నేను నిన్ను తిట్టడంలేదు. నిజంచెపుతున్నాను— సరే అది పోనీలే. ఆదివారం ప్రార్థన అయిపోయినతరువాత మీా ఇంటికి వస్తాం." అన్నాడు యెజోవ్.

"సరే, రండి." అన్నాడు స్మోలిన్, తలఊపుతూ.

"సరే వెడతాం. త్వరలోనే గంటకూడా కొడతారు. నాకు పనుంది. వెళ్ళాలి." అంటూ యెజోవ్ తన జేబులోంచి ఒక కాగితపు పొట్లం బయటికి తీశాడు.

అందులో ఏదో ప్రాణంఉన్న జంతువుకదులాడుతోంది. వెంటనే అతను అక్కణ్ణుంచి పాదరసంలా పరుగెత్తాడు.

" భలే తమాషాఅయిన పిల్లవాడు!" అన్నాడు ఫోమా యెజోవ్ చమత్కారానికి చకితుడై. తరువాత స్మోలిన్‌వంక ప్రశ్నార్థకంగా చూచాడు.

"వాడెప్పుడూ అంతే. చాలా తెలివైన కుర్రాడు." అన్నాడు స్మోలిన్.

" అవును. ఎప్పుడూ సరదాగా ఉంటాడు " అన్నాడు ఫోమా.

"అవును. సరదాగా ఉంటాడు." స్మోలిన్‌కూడా ఒప్పుకున్నాడు.

తరువాత ఇద్దరూ ఒకరినొకరు చూచుకుని మాట్లాడకుండా ఊరుకున్నారు.

" అతనితోపాటు మాఇంటికి వస్తావా ?" అడిగాడు స్మోలిన్.

"ఆ."

"రా. మా ఇంట్లో చాలా బాగుంటుంది

ఆ మాటకు ఫోమా ఏమీ జవాబు చెప్పలేదు.

"నీకు చాలామంది స్నేహితులున్నారా?" అని అడిగాడు స్మోలిన్, కొంచెం ఆగి.

"లేరు." చెప్పాడు ఫోమా.

"నాకూ కూడా బళ్ళోకి వెళ్ళకముందు స్నేహితులెవరూ లేరు. బంధువులుమాత్రమే ఉండేవాళ్ళు. ఇకనుంచి నీకు ఇద్దరు స్నేహితులుంటారు."

"అవును." అన్నాడు ఫోమా.

"అందుకు నీకు సంతోషంగా లేదూ?"

"ఉంది."

"చాలామంది స్నేహితు లున్నప్పుడు నీకు కులాసాగా ఉంటుంది. చదువుకూడా సాఫీగా సాగుతుంది. నీకు తెలియనప్పుడు ఏదైనా వాళ్లు అందిస్తుంటారు."

"నీవు మంచి విద్యార్థివేనా?" అడిగాడు ఫోమా.

"ఆ. పాఠాలన్నీ చక్కగా అప్పచెపుతాను." అన్నాడు స్మోలిన్ మెల్లగా.

అంతలో బడిగంట కొట్టారు. బళ్ళో చేరినతరువాత ఫోమాకు కొంచెం స్వేచ్ఛ దొరికినట్టుగా హాయిగాఉంది. తన స్నేహితులకు తక్కినకుర్రాళ్ళకు గల తేడా ఏమిటా అని పరిశీలించుకున్నాడు. ఆ బడి మొత్తంలో అంత మంచి కుర్రాళ్లు లేరని త్వరలోనే గ్రహించుకోగలిగాడు. ఆ కుర్రాళ్ళంటే అందరూ ఇష్టంగా ఉండడంకూడా చూచాడు.

అంతాకలిసి బడినుంచి ఇళ్ళకుమళ్ళారు. మధ్యలో ఒక చిన్నసందుదగ్గర యెజోవ్ చీలిపోయాడు. స్మోలిన్‌మాత్రం ఫోమాతో కలిసి వాళ్ళఇంటిదాకా వెళ్ళాడు.

"మీఇంటికీ మా ఇంటికీ ఒకటేదోవ." అన్నాడు స్మోలిన్.

ఫోమా కొత్తగా బడికివెళ్ళొచ్చాడని ఇంట్లోఅందరూ అతన్ని గారాబంగా చూచారు. తండ్రి ఒక పెద్ద వెండిచెంచా బహుమతిగా యిచ్చాడు. అన్‌ఫీసా అత్త తను స్వయంగా కుట్టిన చేతిరుమాలొకటియిచ్చింది. ఇగ్నాట్ బహూకరించిన వెండిచెంచామీద ఫోమా పేరుకూడా చెక్కించారు. భోజనంలోకి అతనికిష్టమైన రకరకాల పదార్థాలుచేసి అతనెప్పుడొస్తాడా అనికనిపెట్టుకుకూచున్నారు. అతనురాగానే పైనున్న కోటు తీసేసివచ్చి వాళ్లమధ్య కూచున్నాడు. వాళ్లతన్ని గుచ్చిగుచ్చి ప్రశ్నలడగడం మొదలెట్టారు.

"బళ్ళో ఎలాఉందిరానాయనా?"—అడిగాడుఇగ్నాట్ కొడుకుముఖంవంక ప్రేమతోచూస్తూ.

"బాగుంది", అన్నాడు ఫోమా.

"ఒరే అబ్బాయ్! బళ్ళో స్నేహితులతో జాగర్తగా ఉండు సుమా! నిన్ను వాళ్ళేమైనాఅంటే పంతులుగారితో చెప్పు" అన్నది అత్తయ్య.

"ఇంకా ఏంచెప్పాలోకూడా వాడికిచెప్పవే",అన్నాడు ఇగ్నాట్ నవ్వుతూ.

"ఎప్పటికీ ఆపనిచెయ్యకు. పంతులుతో చెప్పకుండా నీ స్వహస్తంతోనే వాళ్లకు బుద్ధిచెప్పు. మీ బళ్ళోపిల్లలు

మంచివాళ్ళేనా?"— అన్నాడు ఇగ్నాట్ మళ్ళీ కొడుకుతో.

"ఇద్దరున్నారు" అని చెప్పాడు ఫోమా. అలా చెబుతుంటే మధ్యలో యెజోవ్ జ్ఞాపకానికి వచ్చి నవ్వుకున్నాడు. "ఇద్దరిలో ఒకడు మాంచి ధైర్యంగలవాడు.

"మామూలు ధైర్యంకాదు. కొండంత ధైర్యం."

"ఎవరతను?"

"ఒక కాపలావాని కొడుకు"

"ఊ ధైర్యశాలి అని చెప్పావుకదూ?"

"అవును కొండంత ధైర్యం"

"ఇంకా ఎంతమంది ఉన్నారు?"

"ఇంకో కుర్రాడు. అతనిపేరు స్మోలిన్"

"ఓ. వాడా! వాడు నాకు తెలుసులే. మిట్రి ఇవానోవిచ్ కొడుకు. వాడి స్నేహం ఎన్నటికీ వదిలిపెట్టకు. వాడు మంచి కుర్రాడు. మిట్రి మంచి తెలివిగల రైతు. కొడుకు కూడా అలాంటివాడవుతే మంచిదే. సరే. మరో అబ్బాయి కూడా ఉన్నాడని చెప్పావుకదూ. వాళ్ళిద్దరినీ ఒక ఆదివారం నాడు మనింటికి పిలు. కుర్రాళ్ళు ఎలాంటివాళ్ళో చూద్దాం."

"ఆదివారంనాడు స్మోలిన్ నన్ను వాళ్ళింటికి రమ్మన్నాడు నాన్నా", అంటూ ఫోమా వెళ్ళమంటావా అన్నట్టుగా తండ్రివంక చూచాడు.

"అయితే, తప్పకుండా వెళ్ళు. లోకంలో ఎలాంటిమనుష్యులుంటారో వాళ్ళ తరహాలన్నీ కనిపెట్టు. స్నేహితులూ స్నేహమూ లేకుండా ఒంటరిగా జీవితం గడపడం కష్టం. నీ రక్షకపిత మయకిన్ నేనూ ఇరవై సంవత్సరాలబట్టి ప్రాణస్నేహితులం.

అతని లోకజ్ఞానం, అతని సలహాలు నాకెంతో ఉపకరించాయి. అంచాత నీవుకూడా నీకంటే తెలివైనవాళ్ళతోటి మంచి వాళ్ళతోటి స్నేహంచెయ్యడం నేర్చుకో. ఒక రాగిడబ్బు ఒక వెండిడబ్బును దాచుకున్నట్టుగా మంచివాణ్ణి దాచుకుని తిరుగు. కొంతకాలానికి నీవే వెండి నాణెంగా చలామణి అయిపోతావు! అంటూ ఇగ్నాట్ తన సామెతకు తానే నవ్వి మళ్ళీ ఇలా అన్నాడు. "ఊరికే తమాషాకు అంటున్నానురా. అలా నటించ డానికి ప్రయత్నించకు. నీ సహజగుణాన్ని పోగొట్టుకోకు. ఎంతో కొంత—ఇంగితజ్ఞానాన్ని ఉంచుకో. కాని అది నీ స్వంతదై ఉండాలి. ఎరువు తెచ్చుకోకు. మీ బళ్ళో మరిన్ని పాఠాలు చెబుతున్నారా?"

"ఓ. చాలా", అంటూ నిట్టూర్పు విడిచాడు ఫోమా. వెంటనే అత్తయ్యకూడా గట్టిగా నిట్టూర్పు విడిచింది.

"సరే, చదువుకో. బళ్ళో ఎవరి పిల్లలకంటె తీసికట్టుగా ఉండకు. అయినా ఒకమాట చెబుతున్నాను. మీ బళ్ళో ఇరవై అయిదు తరగతులున్నా వ్రాయడం, చదవడం, లెక్కలు తప్ప ఇంకేమీ చెప్పరు. నీకేమైనా దురలవాట్లు పట్టుపడతా యేమో జాగ్రత్త! అలాటివి పట్టుబడ్డవీఅంటే నే నూరుకునే వాణ్ణికాదు. చెబుతున్నా, డొక్క చీలుస్తాను. చుట్టలుకాల్చేవు. చుట్టలు కాల్చావంటే పెదవులు కత్తిరించేస్తాను." అన్నాడు మళ్ళీ ఇగ్నాట్.

"దేవుణ్ణి మరువకునాయనా. ప్రభువును ప్రార్థిస్తూ ఉండు" అన్నది అత్తయ్య.

"ఆవిషయంకూడా నిజమే. ఈశ్వరుణ్ని, కన్నతండ్రిని గౌరవించు; కానీ మరోమాట చెపుతాను. బళ్ళో చదివే పుస్తకాలు అంత లెక్కలోనివి కావు. వడ్రంగికి పనిముట్లు అవసరమయినట్టే, మనిషికి ఇవీ అవసరం. అవివట్టిపనిముట్లు మాత్రమే. తమను ఎలా ఉపయోగించుకోవాలో అవి చెప్పలేవు. చెప్పతాను చూడు. ఒక వడ్రంగి ఉన్నాడనుకో. దూలం కొలవడానికి అతనికి స్కేలు ఇస్తారు. అంతటితో పనంతా ముగిసినట్టు కాదు. దూలం చెక్కేటప్పుడు బాడిత కాలికి తగలకుండా ఉండడంకూడా నేర్చుకోవాలి. నీకు వ్రాయడం, చదవడం నేర్పారు దాన్నిబట్టి నీవు జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలి ఈ విషయంలో ఒక్క పుస్తకజ్ఞానంమాత్రమే చాలదు. పుస్తకాలనుకూడా ఉపయోగించుకోవలసినమాట నిజమే. కాని అంతకంటె ముఖ్యమైనది సామర్థ్యం. ఈ మెలుకువ—దీన్నిగురించి పుస్తకాల్లో ఎక్కడా కనిపించదుకూడా. ఫోమా! దీన్ని జీవితం నుంచే నేర్చుకోవాలి. దీనికి జీవితమే గురువు. పుస్తకమన్నది ఒక మృతవస్తువు. దానికిజీవం ఉండదంటావా? దాన్ని నీవేమైనా చెయ్యొచ్చు. దాన్నిచింపు, అవతల పారెయ్యి. అదేం కాదనదు. కానీ, నీవు జీవితంలో ఒక్క తప్పటడుగు వేశావా అంటే, కోటి కంఠాలతో జీవితం ఘోషిస్తుంది. నిన్ను దెబ్బ తీస్తుంది. నీవు కూలిపోతావు."

ఫోమా టేబిల్‌మీద వంగి తండ్రి మాటలు శ్రద్ధగా విన్నాడు. తీవ్రతరమైన తండ్రి కంఠస్వరం వింటూఉంటే, దూలాన్ని కొలుస్తున్న వడ్రంగి, చేతులుచాచి మెల్లగా ఏదో ఒక బ్రహ్మాండమైనదానిదగ్గరకు వెడుతున్నతను, ఆ భీకర

మైన వస్తువును గ్రహించాలని ఘర్షిస్తున్న తను—తనకళ్ళముందు బొమ్మకట్టారు.

"మనిషి ఒక కార్యాన్ని సాధించాలంటే తన్నుతాను సంరక్షించుకోవాలి. పడవలో చుక్కాని తిప్పేవాడిలాంటివాడు మనిషి. తరుణవయస్సు వరదవాలున వెళ్ళినట్టు సరాసరివెళ్ళు! నీ కెక్కడా ఎదురనేది ఉండదు. బెదురనేదిఉండదు. ఎటు కన్ను తెరిచినా దోవేకనిపిస్తుంది. కాని యేసమయంలో పడవను మలుపులు తిప్పాలో సరిగా తెలుసుకోవాలి. ఒక్కోసారి నీరు కానరాకుండాపోతుంది. ఇసుక, ఒడ్డు, రాళ్ళు, రప్పలే కనిపి స్తాయి. అప్పుడు భద్రంగా వెళ్ళాలి. లేకపోతే తీరానికి క్షేమంగా చేరవు" అన్నాడు ఇగ్నాట్.

"చేరుతాను." అన్నాడు కుర్రాడు, తండ్రివంక సగర్వం గాను, విశ్వాసంతోను చూస్తూ.

"అరె! చాలా ధైర్యంగా చెప్పావే!" అంటూ ఇగ్నాట్ బిగ్గరగా నవ్వాడు. అత్తయ్యకూడా నవ్వసాగింది,

తండ్రితో కలిసి వోల్గాప్రయాణం చేసివచ్చినప్పటి నుంచీ ఫోమా కాస్త హుషారుగా ఉంటున్నాడు. తండ్రితో, అత్తయ్యతో, మయకిన్‌తో, ఎక్కువగా మాట్లాడుతున్నాడు కూడా. అయినా బజారుకువెళ్ళినప్పుడు కాని, కొత్తచోటుకు వెళ్ళినప్పుడు కాని, పరిచయం లేనివారిముందు కాని, ఎప్పుడూ దిగులుదిగులుగా ఉంటాడు. నలుదిక్కులు కలయచూస్తాడు. ప్రతిచోటా తనకు వ్యతిరేకత ఉన్నట్టు, తనకు కనిపించకుండా దాగి ఎవరోతనమీద నిఘాఉన్నట్టు, చుట్టూ కలయచూస్తాడు.

రాత్రిళ్ళు అతను ఒక్కోమాటు ఆకస్మికంగా నిద్ర లేస్తాడు. విప్పారిన కళ్ళతో చీకట్లోకి నిశ్చలంగా చూస్తూ తన చుట్టూనిండిన నిశ్శబ్దాన్ని వింటూ చాలాసేపు అలాగే మేల్కొని ఉంటాడు. తన తండ్రి చెప్పిన కథలన్నీ కళ్ళముందు బొమ్మలవలె కనిపిస్తాయి. తనకు తెలియకుండానే ఆ కథలు, తన అత్తయ్య చెప్పిన కథలు కలగాపులగం జేస్తాడు. అలా చిత్రచిత్రమైన ఊహాగాథల విచిత్రవర్ణాలు వాస్తవలోకపు కఠోర ఛాయలతో సమ్మిళితంపొంది కలాగాపులగంగా కలిసిపోతాయి. తన కళ్ళముందు అలా ఊహాజగత్తు, వాస్తవజగత్తు కలిసిన ఒక విచిత్రనూతనజగత్తును సృష్టించుకుంటాడు. అతనికిదంతా అయోమయంగా, అగమ్యగోచరంగా కనిపిస్తుంది. కళ్ళుమూసుకుని ఆ చిత్రాన్ని పారదోలి, తనను భయపెట్టే భావోన్మాదాన్ని అరికట్టాలని యత్నిస్తాడు. నిద్రించడానికి యత్నిస్తాడుకాని నిద్ర పట్టదు. గదిలో నలుమూలలా నీడల్లాంటి ఆ చీకటి చిత్రాలు మరింత దట్టంగా గుమికూడుతాయి. మెల్లగా అత్తయ్యను నిద్ర లేపుతాడు.

"అత్తా! అత్తా!"

"ఏమిటి బాబూ? జీసస్ నిన్ను కాపాడుగాక."

"నేను నీదగ్గరికొచ్చి పడుకుంటాను." మెల్లగాఅంటాడు థోమా.

"ఎందుకూ? నిద్రపో బాబూ, నిద్రపో."

"నాకు భయంవేస్తోంది," థోమా నిజంచెప్పాడు.

"ప్రభువును తలుచుకో నాయనా! ప్రభువుమళ్ళీలేస్తాడు అని అనుకో. భయం పోతుంది."

ఫోమా కళ్లు తెరుచుకుని ప్రార్థిస్తాడు. గంభీరమైన ఆరాత్రి లోని శాంతి, అతనిముందు పరుచుకున్న అనంతమైన, నల్లని నిశ్చలమైన నీటిమడుగులా కనుపిస్తుంది. ఆ విశాల జలాశయం అంతటినీముంచి తనలో దాచుకుంది. నిశ్చలంగా ఉంది. ఒక్క బుడగకాని, ఒక్క కదలికకాని లేదు. అంధకారంలోనుంచి ఈ మృతజలాశయంవంకచూస్తే భయంతో వళ్ళు గగుర్పొడుస్తుంది. దూరంగా ఎక్కడో కావలావానిపాట వినిపిస్తోంది. నీరు కదలుతున్నట్టుగాఉంది. చిన్నచిన్న నీటిబుడగలు బంతుల్లాగా నీటిమీద నృత్యంచేస్తున్నాయి. దూరంగా చర్చిగోపురపు గంట వినిపిస్తోంది. నీళ్ళు అల్లకల్లోలమైపోతాయి. ఆ శబ్దానికి నీరు వణుకుతుంది. ఆ నీటిమీద ఒక పెద్దవెలుగుపొడ వణుకుతోంది ఆ వెలుతురు ఎక్కడోదూరంగా చీకట్లోంచి వస్తోంది. ఆచివర పల్చబడి శూన్యంలో కలిసిపోతోంది. తరువాత చీకటి! ఈ నల్లని ఎడారిలో విరతిపొందిన మృత్యుతుల్యమైన నైశ్చల్యం ఆవరిస్తోంది.

"అత్తా!" అంటాడు ఫోమా, ప్రాధేయపడుతున్నట్టు.

" ఏం బాబూ ?"

" నీ దగ్గరికి వస్తున్నాను,"

"రా, నాయనా."

ఫోమా ఆమెదగ్గరికివెళ్ళి పడుకుంటాడు. భయంతో ఆమెను గట్టిగా కరుచుకుని పడుకుంటాడు.

"ఏదైనా చెప్పు."అని అడుగుతాడు.

"అర్ధరాత్రిలో ఏం కథలురా?"

"చెప్పు అత్తయ్యా."

అతను ఎంతోసేపు బ్రతిమాలుకోడు. ఆవులిస్తూ కళ్ళు మూసుకుని, నిద్రమత్తుతో, బరువైన కంఠస్వరంతో అత్తయ్య కథ చెప్పడం మొదలెడుతుంది.

"సరే, విను బాబూ, విను. అనగా అనగా ఒక పెద్ద రాజ్యం. ఆ రాజ్యంలో మరో చిన్న రాజ్యం. అక్కడ ఒక భార్య ఒక భర్త నివసించేవారు. ఎంతో పేదవాళ్ళు. కడుపుకు తిండి కూడా ఉండదు. అడుక్కోవడానికి వెళ్ళేవాళ్ళు. ఎవరైనా పాసిపోయిన రొట్టె పడేసేవాళ్ళు. అదే తిని కొంతకాలం జీవయాత్ర గడిపారు. తరువాత కొంతకాలానికి భార్య గర్భం దాల్చింది ఒక బిడ్డను కన్నది. బిడ్డకు పేరుపెట్టాలన్నా, పండగ చేసుకోవాలన్నా, డబ్బులుకావాలి. కాని, వాళ్ళు పేదవాళ్ళవడం వల్ల పండగా చేసుకోలేరు. అతిథుల్నీ పిలుచుకోలేరు. పిల్లాడికి పేరుపెట్టించడానికి ఎంతో ప్రయత్నంచేసిచూచారు. కాని ఎవరూ రాలేదు. తరువాత "భగవంతుడా! భగవంతుడా!" అని దేవుణ్ణి ప్రార్థించడం మొదలెట్టారు."

ఘోరమైన ఈ కథ ఫోమాకు తెలుసు. పేరులేని ఆ శిశువు భగవంతుడి శిశువని తెలుసు. ఎన్నోసార్లు విన్నదే ఈ కథ. ఆ శిశువు తెల్లని గుర్రంపై కూచుని తన తల్లిదండ్రులైన ఈశ్వరుని దగ్గరికి, ఆయన భార్యదగ్గరికే వెళుతున్నట్లు ఫోమా తన కళ్ళముందు చిత్రించుకున్నాడు. ఆ శిశువు చీకట్లో వెళుతున్నాడు. ఎడారిలో వెళుతున్నాడు. పాపాత్ములు అనుభవించే భీకర యాతనలన్నీ అక్కడ ఉన్నాయి. నూతిలోగొంతుకల్లాంటి వాళ్ళ మూలుగులు, ప్రార్థనలు వినిపిస్తున్నాయి. "మానవుడా! ఇంకా ఇక్కడ మేం ఎంతకాలం మ్రగ్గిపోవాలి.

ఈశ్వరుణ్ణి అడిగితెలుసుకో." అంటున్నారు. తరువాత థోమాకు తనే ఆ తెల్లనిగుర్రం ఎక్కి వెడుతున్నట్టనిపించింది. వాళ్ళందరూ తననే ప్రార్థిస్తున్నట్టుగా తోచింది. అతని హృదయం అర్థంకాని అవ్యక్తవాంఛతో కుంచించుకుంది. దుఃఖం అతని హృదయాన్ని అడకత్తెరలో ఒత్తింది. అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కళ్ళు మూసుకున్నాడు. ఇక తెరవాలంటే భయంవేసింది. పక్కమీద అటూ ఇటూ నిద్రపట్టక పొర్లుతున్నాడు.

"నిద్రపో, బాబూ! జీసస్ నిన్ను కాపాడుతాడుగాక!" అంటుంది వృద్ధురాలు.

రాత్రి గడుస్తుంది. థోమా హాయిగా నిద్రలేస్తాడు, త్వరగా స్నానంచేసి దుస్తులు ధరించి పరుగెత్తుకుంటూ బడికి వెడతాడు. తియ్యటి కేకులు కట్టి ఇస్తారు. యొజోవ్ ఎప్పుడూ వాటికోసం ఎదురు చూస్తుంటాడు.

"తినడానికేం తెచ్చావోయ్?" అంటాడు యొజోవ్, థోమాతో.

"ఏదీ, చూపించు. నేనేమీ తినకుండా వచ్చాను. రాత్రి పొద్దుపోయిందాకా చదువుకున్నాను. మరి నీ లెక్కలు చేశావా?" అని అడిగేవాడు.

"ఉహు. నేను చెయ్యలా."

"ఆరి సోమారీ. ఏదీ, ఇలా ఇవ్వు. నే చేసిస్తాను.

సన్నని పళ్ళతో కేకులు నములుతూ లెక్కలు చేసి పెట్టేవాడు యొజోవ్. మధ్యమధ్య థోమాతో "చూడు! ఎనిమిది బక్కెట్ల నీరు ఒక గంటలో కారిపోతుంది. ఆరుగంటల్లో ఎంత నీరు కారిపోతుందో చెప్పు. మీరు ఇంట్లో భలే

రుచిగల పదార్థాలు తింటూంటే!—అంటే, ఆయన ఎనిమిదిచేత గుణించాలన్నమాట. ఉల్లిగడ్డలతోచేసిన కేకంటే నీ కిష్టమేనా? ఆరుగంటల్లో నల్భై ఎనిమిది బకెట్ల నీరు కారి మొదటి తొట్టిలోంచి కారిపోతుంది. తొట్టిలో ఉన్న మొత్తం నీళ్ళు తొంభై బకెట్లు. పోతే మిగతా లెక్క తెలిసిందా?" అనేవాడు యొజోవ్.

ఫోమాకు స్మోలిన్‌కంటె యొజోవ్ అంటేనే ఎక్కువ ఇష్టం. కాని స్మోలిన్‌తో ఎక్కువ స్నేహంచేసేవాడు. ఆ పిల్లవాడి శక్తి సామర్థ్యాలు అతనికి ఆశ్చర్యం కలిగించేవి. యొజోవ్ తనకంటె మంచివాడని, తెలివైనవాడని ఫోమాకు తెలుసు. అంచాత అతనంటే అసూయగా ఉండేదికూడా. తను బాధపడేవాడుకూడా. కాని కడుపునిండా తిని కూచున్నవాడు, తిండిలేక ఆకలితో అలమటిస్తున్నవాణ్ణి ఒక రకమైన కనికరంతో చూచినట్టుగా చూచేవాడు. ఆ కనికరంవల్లనే కావచ్చు అతను యొజోవ్‌కు స్మోలిన్ కిచ్చిన స్థానాన్ని ఇవ్వలేకపోయాడు.

యొజోవ్ తన ఇద్దరు మిత్రుల్ని చూచి నవ్వుతూ "మీ శరీరాలు కేకులతో నిండిన చెట్లబోదెల్లా ఉన్నాయి." అనేవాడు.

అతని పరిహాసాలకు ఫోమాకు కోపంవచ్చేది. ఒకనాడు కొంచెం బాధపడి "నీవు అడుక్కుతినేవాడివి. తిండికిలేని దరిద్రుడివి" అని అన్నాడు.

ఆమాట వినేసరికి యొజోవ్‌ముఖం నల్లని నీడ కమ్మినట్టయింది. "సరేలే. ఇకమీదట నేను నీకు లెక్కలు అందిం

చను. నీవు రాయిలా కూచోవలసివస్తుంది.” అని మెల్లగా జవాబు చెప్పాడు.

ఆ తరువాత ఇద్దరికీ మూడు రోజులు మాటలు లేవు.

ఈ మూడు రోజుల్లో పంతులుగారు చాల విచార పడుతూ తను ఎంతో గౌరవిస్తున్న ఇగ్నాట్ మిట్యావిచ్ కొడుకునకు తక్కువమార్కు లివ్వవలసివచ్చింది.

రెయొజోవ్‌కి ఎక్కడెక్కడి విషయాలన్నీ తెలుసు. బడికి కార్యదర్శిగా ఉండే అతనిపరిచారిక పిల్లల్ని ఎలా కన్నదీ బళ్ళో పిల్లలందరికీ చెప్పేవాడు. కార్యదర్శి భార్య, అతనిమీద వేడి వేడి కాఫీ పోసిందని చెప్పేవాడు. పక్షులకూ, పిట్టలకూ వలలూ గూళ్ళు ఎలా చెయ్యాల్సిందీ అతనికి తెలుసును. ఎప్పుడో ఒక సైనికుడు తనంతటతానే ఉరిపోసుకుని చచ్చాడని—ఆ వివరాలన్నీ తెలియచేసేవాడు. ఆనాడు ఏపిల్లవాడి తల్లిదండ్రులు పంతులుగారికి బహుమతి పంపించిందీ, అది ఎలాటి బహుమతి అయిందీ అతనికి తెలుసును.

స్మోలిన్ విషయంలో అలా కాదు. అతనికి తెలిసిన విషయాలు బహుస్వల్పం. అతనికోరికలు కూడా స్వల్పమైనవే. అవైనా కేవలం వర్తకులజీవితానికి పనికివచ్చేవిమాత్రమే. అంతే కాదు. ఎవరు ఎవరికంటె ఎక్కువధనవంతులో, ఎవరికి ఎక్కువ సిరిసంపదలున్నవో, గుర్రాలు, సామాగ్రి, భవనాలు, ఎవరికెన్నెన్ని ఉన్నాయో; ఇలాటివి చెప్పడమంటే అతను ముందుకుదూకుతాడు. ఇలాటి విషయాల్లో అతను కొట్టిన పిండి. వీటినిగురించి మాట్లాడుతున్నప్పుడు మహదానందాన్ని పొందేవాడు. ఫోమాను చూచినట్టుగానే రెయొజోవ్‌ను గొప్ప

కొద్దీ తారతమ్యంతో చూచే దయతో చూచేవాడు. కాని అంతకంటె ఇంకొంచెం అప్పుడిలాగా, సమానహోదాలో వారిని చూచినట్టుగా చూచుకునేవాడు. ఫోమా, యెజోవ్ ఎప్పుడైనా తగువులాడుకుంటే, వాళ్ళను సద్ది, రాజీ కుదర్చ డానికి యత్నించేవాడు.

ఒకనాడు స్మోలిన్ ఫోమాతో కలిసి ఇంటికి వెళ్ళుతూ "ఎప్పుడూ యెజోవ్‌తో పోట్లాడతావెందుకు? అని అడిగాడు.

" అవును. అతను పట్టి కొండముచ్చురకం " అన్నాడు ఫోమా కోపంగా.

"నీకు పాఠాలురావు. లెక్కలురావు. అతనెప్పుడూ నీకు సహాయంచేస్తుంటాడు. అందుకే అతనికంతగర్వం. అతను తెలివికలవాడైకూడా పేదవాడైనాడు. అది అతనితప్పా? ఏపనైనా ఇష్టపడి నేర్చుకోగల సమర్థుడు. ముందుముందు డబ్బు సంపాదించి భాగ్యవంతుడవుతాడు." అన్నాడు స్మోలిన్.

"అతను దోమలాంటివాడు. చప్పుడుచేస్తూ చుట్టూ తిరిగితిరిగి ఉన్నట్టుండి ఎప్పుడో కరుస్తాడు." అన్నాడు ఫోమా, నిరసనభావంతో.

ఇలా ఈ ముగ్గురుపిల్లల్లో ఒక వైపున బోలెడంత వ్యత్యాసమున్నది. అయినా రెండోవైపున వీరిని ఒకచోటచేర్చి ముడివేసేది. వారి జీవితాలలోనే ఏదో ఉన్నది. తమ తరగతులు, తమస్వభావాలు, తమఅంతస్తులు వేరనేమాటపూర్తిగా మరచిపోయి—అందరూ ఒకేఆత్మగా సంచరించిన సమయాలు లేకపోలేదు.

ఆదివారం బడికి శెలవు. ఆనాడు అందరూ స్మోలిన్ ఇంట్లోగుమికూడేవారు. ఇంటిచూరుపైకెక్కేవారు. చూరుమీద ఒక పెద్ద పావురాళ్ళగూడు ఉండేది. గూడు తెరచి అందులోంచి పావురాళ్ళను బయటికి వదిలిపెట్టేవాళ్ళు. మంచులాగా తెల్లగా మెరుస్తున్న రెక్కలు రెపరెపలాడిస్తూ అవి ఒక్కొక్కటే బయటికివచ్చేవి. పావురాళ్ళు బాగా బలిసి అందంగాఉండేవి. చూరుకొసన వరుసలుతీరి కూచునేవి. ఎండలో తళతళమెరుస్తూ కూతలుకూస్తూ ఆ కుర్రవాళ్ళముందు కులుకుతూ కూచునేవి

"వాటిని బెదరగొట్టండి!" అనేవాడు యెజోవ్ వాటిని చూడలేకపోతునట్టుగా.

అప్పుడు స్మోలిన్ ఒక కర్రతీసుకుని వాటిమీద విసిరేసేవాడు, ఈలవేసేవాడు. పావురాళ్ళు భయపడి ఆకాశంలోకి తుర్రున ఎగిరిపోయేవి. వాటిరెక్కలచప్పుడు నలుదెసల వ్యాపించేది. గుండ్రంగాతిరుగుతూ తేలిగ్గా పైపైకి పోయేవి. రెక్కలువిచ్చుకుని, నిశ్చలంగా నీలాలనింగిని తాకాలని యత్నించేవి. మళ్ళీ కొంతసేపటికి క్రిందికి దిగేవి. మళ్ళీ అంతలో బాణాల మాదిరి దూసుకుని పైకిపోయేవి.

ఇప్పుడు పావురాళ్ళ గుంపంతా ఆకాశం పట్టుకుని వ్రేలాడుతున్నట్టు కనిపిస్తున్నది. ఆ గుంపు క్రమక్రమంగా చిన్నదై చివరకు ఆకాశంలో అదృశ్యమైపోతున్నది. కుర్రాళ్ళంతా తలలు పైకెత్తి గగనంలో పావురాళ్ళ గమనాన్ని తిలకిస్తూ వళ్ళు పులకరించేలా ఆనందిస్తున్నారు. వాటినుంచి దృష్టి మరల్చుకోలేకుండా ఉన్నారు. అలా చూచి చూచి అలసిపోయినవారి కళ్ళు ఏదో ప్రశాంతమైన ఆనందంతో పార్లి

పోతున్నాయి. కాని భూమిమీదనుంచి, నిర్మల నిశ్చల నీలాకాశంలోకి ఎగిరిపోయిన ఆ పక్షులను చూస్తే, వారి కొక విధమైన అసూయ జనిస్తోంది. అయినా అసూయ వారి కళ్ళల్లో ఛాయామాత్రంగానే కనిపిస్తోంది. ఇక ఇప్పుడు పక్షులు చిన్న చిన్న నక్షత్రాల్లా అయిపోతాయి కనుచూపుకు అందీ అందనట్టుంటాయి. ఈ పక్షుల విచిత్ర గమనం ఆ పసివాళ్ళ హృదయాలలో చిత్ర విచిత్ర భావనలను పరుగులెత్తించింది. అందరి భావనను యెజోవ్ ఇలా వెల్లడించాడు.

"ఆ పక్షులమాదిరిగానే మనంకూడా ఎగిరిపోవాలి" అన్నాడు.

పైకిపోయ్యే మానవాత్మలు తరుచుగా పావురాళ్ళ రూపాలు ధరిస్తాయని ఫోమాకు తెలుసు. అతని హృదయంలో ఒక తీవ్రమైన వాంఛ జ్వాలలాగా పైకెగసినట్టు తోచింది. ఇలా ఆ కుర్రాళ్ళంతా సంతోషంతో ఒక లైపోయేవాళ్ళు. తమ తమ తరగతులు, తారతమ్యాలు మరిచిపోయేవాళ్ళు. ఒకరినొకరు కరుచుకుని నిలబడేవారు. ఆకాశపు అగాధాల్లోంచి పక్షులు మళ్ళీ ఎప్పుడు తిరిగొస్తాయాఅని కాచుకనిఉండేవారు. అవి రానంతవరకూ, అవి భూమికి దూరమైనట్టే, వారూ తమ జీవిత పరిసరాలనుంచి దూరమైపోయేవారు. ఆ నిముషాన ఇక వారిని జీవితం అంటుకునేదికాదు దానికి దూరంగా నిలబడేవారు. సర్వామూవిడనాడి ఒకరి కొకరు చేరువఅయ్యారు. ప్రకాశవంతమైన కనుచూపులతోనే, హృదయాలలోని లోతులు కొలుచుకునేవారు. వినువీధిలో విహరించు పక్షుల మాదిరిగానే వీరూ ఆనందంగా హాయిగా ఉండేవారు.

పావురాళ్ళన్నీ మళ్ళీ చూరుమీదికి వచ్చి వాలేవి. పాపం, ఎంతెంతదూరమో ఎగిరి ఎగిరి అలసి సొలసి ఉండేవి. వాటిని మళ్ళీ గూటిలోకి చేర్చేవారు.

"స్నేహితులారా! ఇకమనం ఆపిల్‌పండ్లకోసం వెడదాం పదండి." అనేవాడు యొజేవ్.

ఆటపాటలలో ఇతనే పిల్లలనాయకుడు. అతని గొంతు వినిపించేసరికి, అప్పటిదాకా పావురాళ్ళవలన కలిగిన శాంతి, ఒక్కమాటుగా చెదిరిపోతుంది. తరువాత, ఆపిల్‌పండ్లకోసం బయలుదేరతారు. దొంగల్లా, ఏమాత్రం అలికిడి వినపడ్డా ఉలిక్కిపడుతూ అడుగులో అడుగులు వేసుకుంటూ అతిజాగ్రత్తగా, దొడ్డిదోవల తోటల్లోకి వెళ్ళేవారు.

వారిని రెండు విషయాలు వేధిస్తుంటాయి. ఒకవైపున ఎవరైనా వచ్చి పట్టుకుంటారేమో అని భయం, మరోవైపున ఎవరికంటాపడకుండా పండ్లు దొంగిలిస్తాముకదా అని ఆశ. దొంగిలించడంకూడా ఒక విద్యే. సరిగ్గా చేతకాకపోతే ఈ పనిలో ప్రమాదంకూడావస్తుంది. ఏమైనా స్వయంగా సంపాదించింది, కష్టార్జితం ఎంత తీయగావుంటుంది! ఎంత ఎక్కువగా కష్టపడి ఒక వస్తువును సంపాదించుకుంటే, అంత ఎక్కువ తీయగాఉంటుంది ఆవస్తువు. కుర్రవాళ్ళు జాగ్రత్తగా తోటగోడ కెగబ్రాకుతూ, ఆపిల్‌చెట్లదగ్గరికి చేరుకుంటారు. ఎవరైనా ఉన్నారేమో అని భయంతో దిక్కులు చూస్తారు. వారి హృదయాలు భయంతో వణికిపోతాయి. ఏమాత్రంఅలికిడైనా చాలు. గుండెలు జారిపోతాయి. ఎవరైనా వచ్చిపట్టుకుంటారని అందరికీ భయం. పట్టుకుంటే తమను గుర్తిస్తారని భయం;

ఒక్కొక్కరు ఒక్కొక వైపు వెడతారు. మళ్ళీ అంతా కలుసుకుంటారు. అప్పు డందరి కళ్ళూ, ధైర్యంతో, ఆనందంతో ప్రకాశిస్తుంటాయి. తాము ఎలా భయపడిందీ, చిత్ర విచిత్రాలుగా ఒకరికొకరు చెప్పుకుంటారు. ఎవరో వెంటపడి తరుముతున్నట్టుగా ఉన్నదని, ఆ పరుగులో కాళ్ళక్రింద భూమి పగుళ్ళు వారినట్టున్నదనీ ఒకరితో ఒకరు చెప్పుకునేవారు. ఇలాటి ఆటలు వచ్చినప్పుడు థోమాదే పైచెయ్యి. ఇలాటి ఆటల్లో అతను అమిత సాహసం చూపేవాడు. అతని సాహసం చూచి అతని స్నేహితులు ఆశ్చర్యపోయేవారు. కోపంకూడ తెచ్చుకునేవారు. పరాయివాళ్ళ తోటల్లో కావాలనే అజాగ్రత్తగా సంచరించేవాడు. పక్కవాడితో బిగ్గరగా మాట్లాడేవాడు. చెట్ల కొమ్మలు ఫెళ్ళున విరిచి పెద్దచప్పుడు చేసేవాడు. ఆపిల్ పండ్లకోసే టప్పుడు పురుగులు పడి కుళ్ళిపోయిన పండు చేతికివస్తే దానిని ఆతోట యజమాని ఇంటివైపు విసిరేసేవాడు. ఇలాచేస్తుండేవాడు థోమా. ఆ పనులు చేస్తున్నప్పుడు తనను ఎవరైనా పట్టుకుంటారేమో అనేభయం అతనికేమాత్రం ఉండేదికాదు. పైగా ఆ భయమే అతన్ని పురికొల్పేది. అతనికళ్ళు మరింత నల్లగామారిపోయేవి పట్టుదలతో పళ్ళు బిగించుకునేవాడు. ముఖంలో గర్వము కోపము తాండవించేవి. అతన్నిచూచి స్మోలిన్ "ఏమిటోయ్ ఇదంతా. ఇంతపెద్దగొడవ చేస్తున్నావే?" అని అడిగేవాడు.

"నేనేం పిరికివాణ్ణికాను." అన్నాడు థోమా.

"ఆసంగతి నాకూ తెలుసులే. నీవు పిరికివాడవని ఎవరూ అనలేదు. కాని ముందుగానే దానిని గురించి ఎందుకంత గర్వ

పడతావు? ఎవరైనా ఒక పనిచేస్తున్నప్పుడు వారు దానిని గురించి గర్వపడవలసిన అవసరంలేదు.” అనేవాడు స్మోలిన్.

అప్పుడు యెజోవ్ మరోరకంగా ఫోమాను నిందించేవాడు.

“ఇతన్ని పట్టుకున్నా పరవాలేదని, అలా పట్టుబడాలనే నీ కోరిక అయితే — ఇక నేను చెప్పాల్సిందేమీలేదు. అది నీ ఇష్టం. దాంతో నాకేమాత్రం సంబంధంలేదు. వాళ్ళు నిన్ను పట్టుకుని మీనాన్నదగ్గరకుతీసుకెడితే ఆయన నిన్నేమీ అనడు. కాని మరి నేనలా కాదే. నన్ను మానాన్న సున్నంలోకి ఎముకలేకుండా నలగొడతాడు.” అనేవాడు.

“పట్టిపిరికిపంద!” అనేవాడు ఫోమా, నిశ్చితంగా, నిర్భయంగా.

ఇలా ఉండగా ఒకనాడు ఆపిల్‌పండ్లు కోస్తున్నప్పుడు ఫోమా పట్టుబడడం సంభవించింది. ఆపట్టుకున్నవాడు చుమ్‌కోవ్ అనే వృద్ధుడు. పొట్టిగా బక్కపల్చగా ఉంటాడు; వెనుకనుంచి మెల్లగా వచ్చాడు. ఫోమా ఆపిల్‌పండ్లు దొంగిలించి జేబుల్లో కుక్కుకుంటూ ఉంటే అతన్ని పట్టుకున్నాడు. అతని భుజాలు గట్టిగా పట్టుకుని

“ఇదిగో చూచావా? దొంగనుపట్టాను దొంగవాడా!” అని బిగ్గరగా అరిచాడు.

అప్పుడు ఫోమాకు సుమారు పదిహేనేళ్ళుంటాయి. పట్టుపడ్డా ఆముసలాడి చేతుల్లోంచి తెలివిగా తప్పించుకున్నాడు. అంతే అక్కణ్ణుంచి పారిపోలేదు. కనుబొమలు చిట్లించాడు. ళ్ళు బిగించాడు. చేతులు పైకెత్తి పిడికిళ్ళు బిగపట్టాడు.

"నన్ను ముట్టుకుంటావా?" అన్నాడు.

"ముట్టుకోను, పోలీసులకు అప్పచెప్పుతాను. ఎవరబ్బాయివినీవు" అన్నాడు వృద్ధుడు.

ఫోమా ఇంతలో ఇంతప్రమాదం ముంచుకొస్తుందని అనుకోలేదు. అతని ధైర్యసాహసాలు ఒక్కమాటుగా దిగజారి పోయాయి.

పోలీసుస్టేషన్‌కు వెడితే ఇంకేమైనాఉందా? తన తండ్రి తనను ఎన్నటికీ క్షమించడు. పెద్దనేరస్థుడుగా ఉండవలసివస్తుంది.

ఫోమా భయంతో కంపిస్తూ

"నేను గార్డియెవ్ కొడుకును" అన్నాడు.

"ఇగ్నాట్ గార్డియెవ్?"

"అవును."

ఆ పేరు వినీవినగానే వృద్ధుడు వెనక్కు తగ్గాడు. నిటారుగా నిలబడి రొమ్ము విరుచుకున్నాడు. గొంతు సవరించుకున్నాడు. పిమ్మట కుర్రాడిమీదికి వంగి అనునయిస్తున్నట్లు

"అయ్యో, ఎంతసిగ్గుమాలిన పని! అంత గొప్పవాడి కొడుకువేమిటి? ఈ పనేమిటి? ఇలాంటి పనులు నీలాంటివాడు చేయదగినవి కావు నాయనా! ఇవి నీ అంతస్తుకు తగవు. ఇక నీవు వెళ్లు. కాని ఇకముందెప్పుడూ ఇలాంటి పని చెయ్యకు. చేస్తే మీ నాన్నగారితో చెప్పాల్సివస్తుంది. మీ నాన్నగారిని నేను అడిగానని చెప్పు. ఆయనకు నా నమస్కారాలు అందచెయ్యి." అన్నాడు వృద్ధుడు.

తన తండ్రిఅంటే ముసలాడికి అమితభయమని ఫోమా అతని ముఖకవళికలనుబట్టి వెంటనే గ్రహించాడు. ముసలాడు

వెళ్ళిపొమ్మన్నా థోమా వెళ్ళకుండా నిలబడిఉన్నాడు.

"నీవు ఇక వెళ్ళొచ్చు." అన్నాడు వృద్ధుడు

"మరి పోలీసుల సంగతేమిటి?" అనడిగాడు థోమా. దానికేంసమాధానం చెప్పతాడో అని థోమా భయంతో నిల బడి ఉన్నాడు.

"ఊరికే తమాషాకన్నాను—నిన్ను భయపెడదామని-అంతేకాని పోలీసులూలేరు ఎవరూలేరు." అన్నాడు మళ్ళీ ముసలాడు.

"నేనేం భయపడను. నీవే మానాన్ననుచూచి భయ పడుతున్నావు." అంటూ థోమా వెనక్కుమళ్ళి తోటలోంచి వెళ్ళిపోతున్నాడు.

"నేను భయపడ్డానా ? సరే" అన్నాడు మళ్ళీ వృద్ధుడు.

అతని కంఠస్వరాన్నిబట్టి అతనికి కోపంవచ్చిందని గ్రహిం చాడు థోమా. అతనికి దిగులూ, విచారం, సిగ్గూ, అన్నీ ఒక్క మాటే కలిగాయి.

ఆ మధ్యాహ్నమంతా థోమా ఇంటికి వెళ్ళకుండా ఎక్కడెక్కడో తిరుగుతూఉన్నాడు. ఇంటికివచ్చినతరువాత తండ్రి అతన్నిచూస్తూ సూటిగా ప్రశ్నించాడు.

"థోమా! నీవు చుమ్‌కోవ్ తోటలోకి వెళ్ళావా?"

"అవును." అన్నాడు కుర్రాడు చలించకుండా తండ్రి కళ్ళలోకిచూస్తూ.

కొడుకు కిలా నిర్భయంగా తనతో సమాధానం చెపుతా డని ఇగ్నాట్ ఊహించలేదు. నిర్విణ్ణుడై గడ్డం దువ్వుకుంటూ కొంతసేపు మౌనంగా ఉన్నాడు.

"వెర్రినాయనా! అలాటిపని ఎందుకుచేశావు? నీకు ఆపిల్‌పండ్లు కరువైనాయట్రా?" అన్నాడు.

అందుకు జవాబుచెప్పకుండా ఫోమా నేలమీదికి చూస్తూ మాట్లాడకుండా నిల్చున్నాడు.

"చూడు! ఎంత సిగ్గుమాలినపనిచేశావో! రెయుజోవ్ నిన్నీపనికి పురికొల్పిఉంటాడు. వాడు రానీ చెప్తాను. లేదా మీ ఇద్దరి స్నేహం ఇంతటితో అంతమొందిస్తాను." అన్నాడు తండ్రి మళ్ళీ.

"ఇందులో ఎవరి ప్రోద్బలమూలేదు. నా అంతట నేనే చేశాను." అన్నాడు ఫోమా మళ్ళీనిశ్చలంగాను, నిర్భయంగాను.

"ఏం? మాటలు ముదిరిపోతున్నాయ్! అయితే నువ్వెందుకు చేశావు?" అన్నాడు ఇగ్నాట్.

"ఎందుకంటే......"

"ఏమిటి ఎందుకంటే......" వెక్కిరిస్తున్నట్టుగా అదే మాట సాగదీసి పలికాడు తండ్రి "నీ వా పని చేసినప్పుడు నీవే దానికి కారణం చెప్పగలిగి ఉండాలి." అన్నాడు మళ్ళీ

ఫోమా, కుర్చీమీద కూచున్న తండ్రిదగ్గరికివెళ్ళి ఆయన తొడలమీద కూచున్నాడు. తండ్రి, కొడుకుభుజాలపై చేతులు వేసి, నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూచాడు.

"ఏం? చేసినదానికి సిగ్గుపడుతున్నావా?"

"అవును." అంటూ నిట్టూర్చాడు ఫోమా.

"అదీ కథ, అలా చెప్పు నీ పరువూ నా పరువూ కూడా తీసేశావు. నాకూ తలవొంపులు తెచ్చావు నీవూ తలవొంపులు తెచ్చుకున్నావు." అంటూ ఇగ్నాట్ కొడుకు

తలను గుండెలకు హత్తుకుంటూ అతని జుట్టును నిమిరి మళ్ళీ మెల్లగా ఇలా అడిగాడు. "ఇలాటిపని ఎందుకుచేశావ్? పరుల తోటలో ప్రవేశించి వాళ్ళ ఆపిల్ పండ్లు దొంగిలించడమా?"

"ఎందుకో తెలియదు......ఆ విషయం నాకే తెలియదు. ఏదో ఒంటరిగా ఉండడంవల్లనో ఏమో రోజూ ఒకే రకమైన ఆట ఆడీఆడీ విసుగెత్తిపోయింది. ఇది అలా జరుగుతుందని అనుకోలేదు. ప్రమాదం వచ్చింది."

"ఇది నిన్ను ఉద్రేకపరిచింది కదూ?"

"అవును"

"కావచ్చు కాని ఫోమా! ఇలాచూడు! ఇక ఎప్పుడూ ఇలాటి పనులు చేయకు. చేశావ్రా అంటే నీ పని పట్టాల్సి వస్తుంది."

"ఇక ఎన్నడూ తోటగోడలెక్కను." అన్నాడు కుర్రవాడు, నమ్మకంగా చెపుతున్నట్టు.

"ఇకముందు ఇలా చేశావ్రాఅంటే ఆ నిందలన్నీ నీవే భరించాల్సిఉంటుంది. అందుకు నీవే బాధ్యుడవు అవుతావు. ముందుముందు నీవెలాసంచరిస్తావో, ఏమైపోతావో ఆ భగవంతుడికే ఎరుక. ఇప్పటికిలా చల్లగా బతుకు నాయనా, చాలు. ఒకమనిషి తానుచేసినతప్పు ఒప్పుకునిపశ్చాత్తాపపడడం ప్రాయశ్చిత్తం అనుభవించడం సామాన్యమైన పనికాదు. సులభమైనదీకాదు. నీవు కనుక ఇలా చేసినతప్పు ఒప్పుకున్నావు కాని, మరో కుర్రాడైతే తప్పంతా తనస్నేహితులమీద పెట్టి తాను తప్పించుకునేవాడు. నీవు "నేనే చేశాను" అని ఒప్పుకుంటున్నావు. ఇది చాలా మంచిపద్ధతి ఫోమా! తప్పుచేశావు.

చేసినతప్పు ఒప్పుకున్నావు. చుమ్‌కోవ్ నిన్నేం కొట్టలేదా?" అడిగాడు ఇగ్నాట్, మాట్లాడినంతసేపూ మధ్యమధ్య ఆగుతూ.

"ఆపని చేసిఉంటే, తిరిగి కొట్టిఉండేవాణ్ణి." అన్నాడు ఫోమా ప్రశాంతంగా.

"ఊ. అలాగా?" అన్నాడు ఇగ్నాట్ సాభిప్రాయంగా.

"నీవంటే అతనికి భయమని చెప్పానుకదూ? అందుకనే నన్నేమీ అనకుండా నీతో చెప్పాడు. లేకపోతే చెప్పిఉండే వాడు కాడు."

"ఓ! అలాగేం?"

"అవును. నిజంగా 'మీ నాన్నగారికి నా నమస్కారాలు చెప్పు' అనికూడా అన్నాడు."

"అన్నాడూ?"

"అవును."

"ఆరి వెధవా! చూడు! లోకంలో ఎలాటి మనుష్యు లుంటారో చూడు. వాడి తోటలో నీవు దొంగతనం చేశావు. అయినా నాకు నమస్కారాలు చెప్పాడు! ఇంతకూ దీనివల్ల వాడికి ఒక్క కోపెక్ అయినా నష్టంకలగకపోవచ్చు. అయినా వాడి బ్రతుక్కు అవి చాలు. వాడికి ఒక కోపెక్ అంటే ఒక రూబులుతో సమానం. మరి నాకు ఒకరూబులు, ఒకకోపెక్‌తో సమానం. నా కిలా, వాడి కలా. ఇంతకూ అసలువిషయంఅది కాదు. ఏదైనా నాఅంతట నేను నా చేతుల్లోంచి పారెయ్యానిదే దానిని తాకడానికి ఎవడికీ దమ్ములుండవు. సరే, ఇక ఈ పాడు గొడవంతా పోనీ. ఎక్కడెక్కడ తిరిగిగావో, ఏమేమిచూశావో నాకు చెప్పు." అని అడిగాడు ఇగ్నాట్. కుర్రవాడు తండ్రి

ప్రక్కన కూచుని ఆనాడు జరిగిన విషయాలన్నీ, ఒక్కటీ బీరు పోకుండా చెప్పాడు. తనఅభిప్రాయాలన్నీ చెప్పాడు. ఉత్సాహ పూరితమై విప్పారిన కొడుకుముఖంవంక తదేకదృష్టితో చూస్తూ ఇగ్నాట్ అంతా విన్నాడు. అతని కనుబొమలు, ఆలోచిస్తున్నట్లు ముడుచుకునిపోయాయి.

"ఇంకా నీవు పై పైనే తేలుతున్నావు బాబూ. ఇంకా నీవు లోతుకు పోలేదు. చిన్నతనం వీడలేదు." అన్నాడు ఇగ్నాట్ చివరకు.

"లోయలోకి వెళ్ళాం. అక్కడొక గుడ్లగూబను బెదరగొట్టాం. భలే గమ్మత్తుగా ఉందిలే. భయంతో ఎగిరెగిరి ఒక చెట్టుకు కొట్టుకునేది. ఎంతో దీనంగా అరిచేది. మళ్ళీమళ్ళీ భయంపెట్టాం. అది మళ్ళీమళ్ళీ ఎగిరెగిరి అటూ ఇటూ తిరుగుతూ దేనికో ఒకదానికి కొట్టుకునేది. పాపం, రెక్క లూడివస్తాయా అనిపించింది. అలా ఆ లోయంతా ఎగిరింది. చివరకు ఎంతో కష్టంమీద ఎక్కడో కనిపించకుండా దాక్కుంది. మళ్ళీ మేము దానికోసం వెదకలేదు. దాని దేహమంతా గాయాలుచేసినందుకు మాకు దిగులువేసింది. నాన్నా! పగటివేళ గుడ్లగూబలకు కళ్ళు కనపడవా? పూర్తిగా గుడ్డిదైపోతుందా?"

"గుడ్డి!" అంటూ చెప్పసాగాడు ఇగ్నాట్. "కొందరు మనుష్యులున్నారు చూచావ్? వాళ్ళు తమ జీవితంలో పగటి పూట కళ్ళులేని ఆ గుడ్లగూబలాగే కొట్టుకుంటారు. తన స్థానం ఎక్కడుందో ఎరగడు. తన స్థానంకోసం ఆ గుడ్లగూబ లాగే వెదుకుతాడు మనిషి. ఎంత వెదికినా చోటు కనిపించదు. రెక్కలన్నీ రాలిపోయేటట్టుగా ఎగిరినా ప్రయోజనం ఉండదు

బాధపడతాడు. గాయపడతాడు. మనస్సు వ్రణమైపోతుంది. అంతా నాశనమైపోతుంది. చివరకు మిగిలేదేమీ ఉండదు. ఇక చేసేదిలేక, దిక్కు తెలియక ఎక్కడైనా కాస్త మనశ్శాంతి దొరికితే చాలునని తలదాచుకుంటాడు. మనుష్యులు అలాటి బ్రతుకు బ్రతకడంకంటె చావడం ఉత్తమం! చావడం ఉత్తమం!"

"పాపం, ఎంతబాధ వాళ్ళకు?" అన్నాడు ఫోమా మెల్లగా.

"ఆ గుడ్డగూబలాగానే."

"ఎందుకని అలా?"

"ఎందుకనో! ఎవరుచెప్పగలరు? కొందరు అతిగర్విష్టులై కష్టాలపాలవుతారు. వారికి ఆశలు ఎక్కువఉంటాయి కాని, వాటిని సాధించే శక్తిమాత్రం ఉండదు. మరికొందరు బుద్ధిహీనులయినకారణంచేత, చపలచిత్తులైన కారణంచేత అవస్థలుపడతారు. ఇవికాక ఇంకా ఎన్నోలక్షలకొద్దీ కారణాలుంటాయి. ఎవరెందుకు అవస్థలుపడతారో ఎవరు చెప్పకలరురా బాబూ! అవి మనకు సరీగా తెలియని విషయాలు."

అంతలో లోపల్నుంచి అన్ఫీసా "ఇలా వచ్చి కొంచెం టీ తాగి పొండి" అని పిలిచింది. ఆమె చాలసేపటినుంచి తలుపుదగ్గర నిలుచుని తండ్రీ కొడుకుల సంభాషణ వింటోంది. ఏనుగంత మనిషి—తన అన్న ఇగ్నాట్ ఫోమామీదికి వయ్యారంగా వంగి ముచ్చటచెపుతూఉండడం, ఫోమా ముద్దుగా వింటూ కూచోవడం చూస్తే ఆ వృద్ధురాలికి కన్నులపండుగగా ఉంది.

ఇలా ఫోమా జీవితం క్రమక్రమంగా మెల్లమెల్లగా

వృద్ధిఅవుతూవచ్చింది. ఒడుదుడుకులులేని మెల్లని చల్లని జీవితం! అది తల్లక్రిందులు కావడానికి ఉద్యోగాలుకాని, ఉద్రేకాలు కానిలేవు. సాఫీగా సాగిపోతోంది. అప్పుడప్పుడుమాత్రం ఖోమా హృదయంలో తీవ్రమైన భావాలు మొలకెత్తి కలవర పరిచేవి. కాని అవి ఎంతోసేపుండేవికావు ఒకగంట మాత్రమే. లేకపోతే ఒకరోజు మాత్రమే. మందంగాఉన్న అతని జీవితానికీ—మనస్సులోపుట్టిన ఈ తీవ్రభావాలకూ పోల్చిచూచుకుంటే ఎంతోతేడా కవిపించేది. భావాలు శాశ్వతంగా ఉండక వెంటవెంటనే అదృశ్యమైపోయి ఎక్కడో అణగిపోయేవి. అతని హృదయం ఇంకా నిర్మలమైన నిశ్చలమైనసరోవరంలాగా నేఉంది. జీవితపుపెనుతుపానులకు చాలాదూరంగా నిశ్చల, నిర్మలప్రశాంత సరోవరంలాఉంది. ఆ సరోవరం పైభాగాన్ని తాకినదంతా ఒక్క క్షణంపాటు ఆ నిర్మల, నిశ్చల జలాన్ని కలచివేసినా, ఆ మరుక్షణంలోనే క్రిందికిదిగిపోయేది. లేకపోతే మెత్తని పై భాగంపై పెద్దపెద్ద సుళ్ళు తిరిగి అలా పైపైనే తేలిపోయేది.

బళ్ళో అయిదేండ్లపాటున్నాడు ఖోమా. నాలుగు తరగతులవరకూ చదివాడు. ఇప్పుడు మాంచి ధైర్యంకలకుర్రాడులా తయారయ్యాడు. నల్లనితలకట్టు, నల్లనిముఖం, తీర్చిదిద్దినట్టుండే దట్టమైన కనుబొమలు, పెద్దపెద్ద నల్లటికళ్ళు. ఆ కళ్ళలో అహర్నిశలూ ఏదో అంతులేని ఆలోచన. పసివాడి పెదవులకుమల్లే అరవిచ్చిన పెదవులు. ఏదైనా కోపమో, చిరాకో కలిగినప్పుడు అతని కనుపాపలు ఇంతింత పెద్దవిగా విప్పారేవి. అప్పుడుమాత్రం పెదవులు బిగపట్టుకునేవాడు. ముఖంలో నిశ్చలం ముద్రితమై ఉండేది.

థోమా ముఖం ఇలా ఉన్నప్పుడు మయకిన్ చూడడం తటస్థిస్తే "థోమా! నీవంటే ఆడవాళ్ళు వెర్రెత్తిపోతారు. నీలో ఉన్న తీయదనం తేనెలోకూడా వాళ్ళకు కనిపించదు. కాని నీ ముఖంలో తెలివిమాత్రం శూన్యం. అదే విచారకరమైన విషయంసుమా." అని అనేవాడు. ఇగ్నాట్ ఈ మాటలు విన్నప్పుడల్లా ఒక బరువైన నిట్టూర్పువిడిచి ఊరుకునేవాడు.

"ఇక త్వరలో అబ్బాయిని వ్యాపారంలో ప్రవేశపెట్టు." అనేవాడు మయకిన్.

"ఏమిటంతతొందర ? జరగనీ చూద్దాం." అనే సమాధానమిచ్చేవాడు ఇగ్నాట్.

"ఆలస్యమెందుకయ్యా? రెండు మూడేండ్లులో ల్లాఅంతా తిరిగివస్తాడు. ఆ తరువాత పెళ్ళిచేద్దాం. మాఅమ్మాయి లూబా ఉండనేఉందికదా."

లూబా మయకినా ఇప్పుడేదో బోర్డింగుబళ్ళో అయిదో తరగతి చదువుతోంది. థోమా వీధుల్లో తిరిగేటప్పుడు తరుచు కనిపిస్తూనేఉంటుంది. అతను అగుపడగానే గౌరవసూచకంగా తలవంచుకునేది. ఆమె కొంతమంది హైస్కూలు విద్యార్థులనుకూడా ఎరుగును. థోమా చిన్ననాటి స్నేహితుడు యెజోవ్ కూడా ఆ బృందంలో ఉండేవాడు. అయినా థోమాకు ఆ బృందంలోకలిసి తిరగడం ఇష్టంలేదు. వాళ్ళపొత్తు అతనికి పడేదికాదు. పైగా వికృతంగా, విడూరంగా కనిపించేది కూడా. వాళ్లు తమ విజ్ఞానాన్నిగురించీ, మేధాసంపత్తిని గురించీ తనముందు గొప్పలుచెప్పుకుంటూ గర్విస్తున్నట్లూ, తన అజ్ఞానానికీ, వెర్రిబాగులతనానికీ, తనను ఎగతాళిచేస్తున్నట్లూ

అతనికి అనిపించేది. లూబా ఇంట్లో బృందమంతా కూడేది. పుస్తకాలు చదవడం, తాము చదివిన చదువునుగురించి బిగ్గరగా వాదించుకుంటూ ఉండడం జరుగుతుండేది. ఆ సమయంలో ఫోమా అక్కడికివస్తే అతన్నిచూచి అందరూ తమచర్చలు చాలించి మౌనంవహించేవారు. ఈ కారణాలన్నీ తనమీద వారికిష్టంలేనట్టు ఫోమా అభిప్రాయాన్ని ధృఢపరిచాయి. ఇలా ఉండగా ఒకనాడు లూబా ఫోమాను తోటపికారుకురమ్మని పిలిచింది. అప్పుడు మయకిన్‌కూడా ఇంట్లోనే ఉన్నాడు. తోటలో విహరిస్తుండగా ఆమె అతనిపక్కకు వచ్చి అతని ముఖంలో ముఖంపెట్టి

"నీవు అందరికీ ఇంత దూరదూరంగా తిరుగుతుంటావేం? నీ తరహా ఏం నచ్చలేదు. ఏ విషయాన్నిగురించైనా మాట్లాడవేం?" అన్నది అదోలా ముఖమైఖరి మారుస్తూ.

"నేను దేన్నిగురించి మాట్లాడను? నాకే విషయాన్ని గురించి తెలుసునని?" అన్నాడు ఫోమా.

"తెలియకపోతే, తెలుసుకోవాలి. శాస్త్ర పుస్తకాలు చదవరాదూ?"

"ఏమో! నాకలా చేయాలని అనిపించదు."

"చూడు! ఆ విద్యార్థులకు అన్ని విషయాలూ తెలుసును. ఏ విషయాన్ని గురించైనా మాట్లాడుతారు. యెజోవ్ చూడు!"

"యెజోవ్‌ను నే నెరుగుదును. వట్టి డబ్బావాయింపుడు గాడు.!

"అతనంటే నీకు అసూయ—అందుకని అలా అంటు

న్నావు. అంతకన్నా మరేంలేదు. అతను అందరికంటే తెలివైన వాడు. త్వరలోనే పట్టభద్రుడుకానున్నాడు. పిమ్మట మాస్కో వెళ్ళి విశ్వవిద్యాలయంలో చేరతాడు."

"అయితే ఏం?" అన్నాడు ఫోమా, తనకేమీ సంబంధం లేనట్టు.

"నీ విలాగే ఉండిపోతావు. కాస్తయినా జ్ఞానంలేకుండా ఉండిపోతావు."

"ఉండిపోతే ఏం?"

"ఓ! నీమాటలు మహాబాగున్నాయి!" అన్నది లూబా

"ఈ విజ్ఞానం నన్నేం ఉద్ధరించక్కర్లేదు. విజ్ఞానం లేనంత మాత్రాన నేను చచ్చిపోను. చదువుకున్న మీవంటివాళ్ళందరినీ చూచి నవ్వుతూ కూచుంటాను. కడుపునిండనివాళ్ళను చదువుకోనీ. నాకు అవసరంలేదు."

"ఛీ! ఎంత బుద్ధిహీనుడవు! నిన్నుచూస్తే అసహ్యం వేస్తుంది.!" అంటూ లూబా ఫోమాను తోటలో ఒంటరిగావదిలేసి తాను చీదరించుకుంటూ వెళ్ళిపోయింది.

ఏకాంతంలోని మాధుర్యాన్ని, ధ్యానసమాధిలోని తీయని విషాన్ని అప్పుడప్పుడే గ్రోలడం మొదలెట్టాడు ఫోమా. ఎన్నోసార్లు వేసవినాటి సాయంత్రాల సంధ్యారాగాలు సమస్తాన్నీ తన బలీయవర్ణ కాంతులతో ప్రకాశింపచేయుచున్నప్పుడు, ఏదో అర్థంకానిదానికోసం అవ్యక్తమైన ఆవేదన జనించి అతని హృదయాన్ని చీల్చివేసేది. ఏ ఉద్యానవనతరువుల నీడల్లో, కూచున్నప్పుడో, లేక తన శయ్యామందిరంలో తూలికాతల్పంపై పరుండినప్పుడో తన అత్తయ్యచెప్పిన విచిత్రకథలలోని సుకు

మారి రాకుమార్తెల సుందర స్వరూపాలు ఊహించుకుని కళ్ళ ముందు చిత్రించుకునేవాడు. వాళ్ళంతా ఒక్కోమాటు లూలాబా ముఖంతో కళ్ళముందు బొమ్మకట్టేవారు. ఇంకోమాటు అపరిచితులైన స్త్రీలలా అగుపించేవారు. మెల్లమెల్లగా మేఘాల మాలలా తేలుతూవచ్చి తనకళ్ళముందు నిలబడి వింతవింతచూపులతో అతని కళ్ళల్లోకి సూటిగాచూచి నిర్వ్యారపాటుచెందేవారు. ఒక్కోమాటు ఇలాంటి స్వప్నాలు అతనిలో మహోన్నతశక్తిని మేలుకొలిపేవి. అతన్ని మత్తెక్కించి, మైమరపించేవి. అతను లేచి నిలబడేవాడు. తన రెండుచేతులూ చాచి రొమ్ము విరుచుకుని పరిమళాలు వెదజల్లే కమ్మని గాలిని కడుపునిండా పీల్చుకునేవాడు. ఇంకోసారి ఇవే స్వప్నాలు అతన్ని శోకసముద్రంలో ముంచేవి. అతనికి వెక్కివెక్కి ఏడ్వాలనిపించేది. కాని మళ్ళీ కన్నీరు కార్చడానికి సిగ్గుపడి ఏడుపు బిగపట్టుకునేవాడు. ఒంటరిగా ఎన్నడూ ఏడ్చేవాడుకాదు. ఒక్కొక్కమాటు పరమేశ్వరుని యెడల భక్తితో అతని హృదయం ప్రకంపించేది. ఆయనముందు సాష్టాంగపడాలనిపించేది. ప్రార్థనాగీతాల్లోని మాటల మంత్రాలు అతని మనోవీథుల్లో మెరుపుల్లా మెరిసేవి. ఆకాశంవంక నిశ్చలంగాచూస్తూ చాలాసేపు ఆ మాటల మంత్రాలు పఠించేవాడు. ఒక్కొక్క మంత్రం పఠిస్తూఉంటే అతని హృదయభారం తగ్గిపోయేది. అతనిలోని అధికశక్తి అంతా ఆ ప్రార్థనలో ద్రవించిపోయేది.

తండ్రి ఫోమాను నెమ్మదిగా వ్యాపారంలో ప్రవేశపెట్టాడు. తన వెంట తీసుకెళ్ళి తన ఒప్పందాలు,మారుబేరాలు, వ్యాపారపు లావాదేవీలు, ఇవన్నీ తెలియచేశాడు. సాటి

వ్యాపారస్థులాదరినీ పరిచయంచేశాడు. వాళ్ళంతా ఎవరెవరెలాటివాళ్ళయిందీ, ఎవరెవరెలా ఏ స్థితిలోంచి ఏ స్థితిలోకి వచ్చిందీ, ఎవరెవరిస్థితిగతులు ఆస్థిపాస్తులు ఎలాటివైనదీ, ఎవరెవరిస్వభావాలు ఎటువంటివైనవీ; ఇవన్నీ జాగ్రత్తగా ఫోమాకు నేర్పాడు. ఫోమా ప్రతివిషయాన్నీ సూక్ష్మంగా పరిశీలించి, అన్నిట్లో ఆరితేరుతున్నాడు.

"మూసుకున్న మొగ్గ పువ్వుపూస్తోంది; పువ్వుపూసి వికసిస్తోంది." ఫోమానుగూర్చి మయకిన్ నవ్వుతూ అనేవాడు.

ఫోమాకు పందొమ్మిదేండ్లు నిండాయి. కాని ఇన్ని నేర్చుకుంటున్నప్పటికీ ఇంకా అతనిలో పసితనంమాత్రం పోలేదు. అతని వయస్సు కుర్రాళ్ళకు అతనికీ ఎంతో భేదం కనిపించేది. వాళ్ళు అతన్నిచూచి నవ్వుతుంటారు. అతను వాళ్ళంటే అయిష్టంగా, దూరదూరంగా తొలగిఉంటాడు. తండ్రి ఇగ్నాట్, సంరక్షకుడు మయకిన్ – ఫోమాప్రవర్తనను ఎప్పటికప్పుడు జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు. అతని ప్రవర్తనలో ఒక నిశ్చయం, ఒక దృఢసంకల్పం లేకపోవడం చూచి వాళ్ళకు అనేకరకాల భయాలు కలిగేవి.

"వీడి వ్యవహారం నాకర్థంకావడంలేదు. పోనీ చెడుఅలవాట్లేమైనా ఉన్నాయా అంటే అవీ లేవు. చెడుజీవితాన్ని గడపడు. పోనీ ఆడవాళ్ళగాలి సోకిందా అంటే, అలాటిదీ కనపడదు. మన ఇద్దరినీ గౌరవంగానే చూస్తాడు. ప్రతివిషయం జాగ్రత్తగా వింటాడు. మరేమిటో వీడు నాకు అంతుపట్టడం లేదు. చూడగాచూడగా ఒక చక్కని చిన్నదానిలా కనిపిస్తున్నాడు. కాని మగపిల్లవాడిమాదిరిగా లేదు. అయినా మొద్దు

అనుకుంద్దామా అంటే అదీలేదు. అనేవాడు ఇగ్నాట్ మయకిన్‌తో—తన కొడుకుని గురించిభయంతో ఆలోచిస్తూ.

"అవును, మొద్దుతనం ఏమీ కనిపించదు." అనేవాడు మయకిన్.

"దేనికోసమో వెదుకుతున్నట్టు, దేనికోసమో వేచి ఉన్నట్టు, ఉంటాడు. అతని కళ్ళకు ఎప్పుడూ ఏదో తెర అడ్డం ఉన్నట్టుగా కనిపిస్తాడు. వాడితల్లి కూడా ఏడిలాగే ఏదో వెదుకు తున్నట్టుండేది! స్మోలిన్ మాఅబ్బాయికంటె రెండేళ్ళుమాత్రమే పెద్ద. అయినా ఎలా తయారయ్యాడో చూడు! తండ్రినిమించిన కొడుకయ్యాడు. ఒక్కోసారి వాడే తండ్రినిమించాడో—లేక తండ్రే వాణ్ణిమించాడో అన్నట్టు కనిపిస్తారు ఆ అబ్బాకొడుకులు. అలా ఉండాలిమరి! ఇప్పుడేదో ఫ్యాక్టరీలోచేరి పనినేర్చుకోవా లనుకుంటున్నాట్ట. వాళ్ళ నాన్నను తనకు భారమంతా అప్ప చెప్పమని అడుగుతాట్ట. మరి మనవాడో! ఉద్ధారకుడు! నోరు తెరిచి మాట్లాడనేమాట్లాడడు.! అయ్యో భగవంతుడా!" అంటూ ఇగ్నాట్, కొడుకును గురించి వాపోయేవాడు.

"చూడు ! నేనొకసలహా చెపుతాను. వాడిమీద వ్యాపారభారంపెట్టిచూడు. అప్పుడు తేలిపోతుంది.బంగారంకరిగిస్తే గాని నిగ్గుతేలదు. వాడంతట వాడికి స్వేచ్ఛఇచ్చి వదిలిపెట్టి నప్పుడు వాడిఉద్దేశాలు ఎలాఉంటాయో అప్పుడు తెలుస్తుంది. "లేమా" మీద వాణ్ణి ఒంటరిగాపంపించు, చూద్దాం ఏమవు తుందో!" అని సలహాఇచ్చాడు మయకిన్.

"ఒకసారి పరీక్షచేసి చూడమంటావా ?"

"ఊ. ఒకవేళ కాస్త కొంటెతనం చేసినా పర్వాలేదు. దానివల్ల మీకు కాస్త నష్టంవస్తే వస్తుంది. అయినా సాడిసత్తా ఏమిటో తెలుస్తుందిగా?"

"సరే, అలాగే పంపించిచూస్తాను," ఇగ్నాట్ నిశ్చయంతో అన్నాడు.

అనుకున్న ప్రకారం ఇగ్నాట్ తనకొడుకును ఆవసంతంలో స్టీమరుమీద పంపాడు. స్టీమరుతోపాటు మరి రెండు పడవలకు ధాన్యం ఎత్తారు. గార్డియెవ్ స్టీమరు "ఫిలెజ్నీ" నాయకత్వాన పడవలన్నీ బయలుదేరాయి. ఫోమాకు పూర్వపరిచితుడైన ఎఫిమ్ ఈ స్టీమరుకు నాయకుడు. అతను మంచి జాగ్రత్తగల కెప్టెన్.

అందరూ సంతోషంగా, సంతృప్తిగా ఉండడంవల్ల త్వరగా ప్రయాణం సాగింది. మొదట్లో ఫోమా తను నిర్వహించవలసిన బాధ్యతలు తలుచుకుని సగర్వంగా ఉన్నాడు. కొత్త యజమాని యువకుడని, ఎఫిమ్‌కూడా సంతోషించాడు. స్టీమరుమీదఉన్న ఇద్దరు ప్రధానవ్యక్తులకూ మనస్సు ఎంతో హాయిగాఉంది. 'మే' నెల మొదట్లో స్టీమరు చేరవలసిన స్థలానికి చేరింది.

ఫోమా బాధ్యతఅల్లా పడవల్లో ధాన్యం ఎవరెవరికి ఎలా సరఫరా చెయ్యాలో అలా సరఫరా చేయడం, అందుకు ఎంతెంత డబ్బు రావాలో దానిని వసూలుచేసుకోవడం— ఇదీ అతనిపని. తరువాత పెరమ్‌కు వెళ్ళి అక్కడకూడా ధాన్యం అందించాలి.

ఒక గ్రామానికి ఎదురుగా పడవలు ఆపుచేశారు. ప్రక్కనే పెద్ద అనాసఅడవి. పడవవచ్చి ఆగిన రెండో రోజునే స్త్రీలూ రైతులూ గుంపులుకట్టుకుని తీరానికి వచ్చారు. కేకలేస్తూ పదాలు పాడుతూ వెంటనే పనికి దిగారు. తీరంలో బండ్లు నిలిచిఉన్నాయి. ధాన్యం నింపుకుని గ్రామంలోకి కదలి వెడుతున్నాయి. స్త్రీలు పాడుతున్న పదాలు వినిపిస్తున్నాయి. రైతులు పరాచికాల్లో బూతులు విసిరేస్తున్నారు. నావికులు మధ్యమధ్య పనివాళ్ళను మందలిస్తున్నారు. సూర్యోదయమైంది. గాలి చల్లగా హాయిగా వీస్తోంది. అనాసచెట్ల పళ్ళని పరిమళం గాలిలో తేలివస్తూంది. ఆకాశం నదిలో ప్రతిబింబిస్తూంది. నీరు మర్మరధ్వనిచేస్తూ ప్రవహిస్తూఉంది. పనివాళ్ళ సందడీ, తొలి సుజకిరణాల తళతళలాడుతున్న ప్రకృతిదేవత సురుచిర సుందర సౌందర్యం, అణువణువునా చిందులాడుతున్న ఆర్ద్రితా- ఈవాతావరణమంతా ఫోమా అంతరంగాన్ని ప్రబుద్ధంకావించింది. ఏవేవో వ్యక్తావ్యక్తపు తలుపుల మధ్యన దాగుడుమూతలాడు తున్న వాంఛలు అతనిలో తారసిల్లి తారట్లాడుతున్నాయి. అతను టీ సేవిస్తూ టేబిల్‌ముందు కూచున్నాడు. పక్కన ఎఫిమ్, ధాన్యం పుచ్చుకోడానికివచ్చిన రిసీవరుకూడా ఉన్నారు. ఎర్రనిజుట్టు, మసక కళ్ళజోడు. మాటిమాటికీ రైతులు ఎలా తిండీతిప్పలూలేక మాడిపోతున్నదీ కర్కశంగాఉన్న కంఠస్వరంతో చెబుతున్నాడు. ఫోమాకు అతని మాటలు చెవుల కెక్కడంలేదు. మధ్యమధ్య క్రింద పనివాళ్ళను చూస్తున్నాడు. అనాసచెట్లు బారులుతీరిన నదిఆవలిదరి చూస్తున్నాడు. ఆ దరి ఎవరూ లేరు. అంతా నిశ్శబ్దంగాఉంది.

"అదీ వెళ్ళదగినచోటు", అనుకున్నాడు ఘోమా. దూరంనుంచి రిసీవర్ కర్కశకంఠం వినిపిస్తోంది.

"తమరు నమ్మండి, నమ్మకపొండి, కాని ఎంత ఘోరం అనుకున్నారు! ఓసాలో అలాటిసంఘటనజరిగింది", అంటున్నాడు.

అతను ఆ సంఘటన నిలా చెప్పాడు.

"ఒక పెద్దమనిషిదగ్గరికి ఒక రైతు వచ్చాడు. అతనితో ఒక పదహారేళ్ళ పిల్లకూడా వచ్చింది.

ఆ పెద్దమనిషి రైతుతో 'నీకేం కావాలి?' అన్నాడు.

"ఇదుగోండి, నా కుమార్తెను తమసన్నిధికి తెచ్చాను." అన్నాడు రైతు.

"ఎందుకు?"

"తమ అండన నిలుపుతారని. తమరు అవివాహితులు."

"అలాగా! అంటే?"

"దీన్ని ఊరుఊరూ తిప్పి తీసుకొస్తున్నాను. ఎక్కడైనా చాకిరీకి ఉంచుకుంటారేమో నని అందరినీ అడిగాను. ఒక్కరూ ఒప్పుకోలేదు. తమకు ఉంపుడుగత్తెగా నైనా ఉంచుకోండి."

"చూశారా ఎలాజరిగిందో! తన కుమార్తెను తనే అమ్మడానికి తీసుకుని వచ్చాడు. ఎంత ఘోరం! కాలవైపరీత్యం! ఆ పెద్దమనిషి ఉండబట్టలేక రైతును తిట్టడం మొదలెట్టాడు. కాని ఆ రైతుమాత్రం తగినవిధంగా జవాబుచెప్పాడు" అన్నాడు రిసీవరు.

ఆ రైతు ఇలా జవాబు చెప్పాడు.

"అయ్యా! నాదో చిన్న మనవి. ఈ అమ్మాయివల్ల నాకు బరువేకాని, మరేం ఉపయోగం? నాకు మగపిల్లలు

ముగ్గురు. వాళ్ళవుతే కాయకష్టం చేసుకుని కడుపునింపుకుంటారు. ఇదెందుకు ఈ పిల్ల? దీన్ని తమరు పుచ్చుకుని నాకో పది రూబుళ్ళివ్వండి. బ్రతికిపోతాం''—అన్నాడు ఆ రైతు.

రైతు ఇలా జవాబుచెప్పాడని చెప్పి "ఎంతఘోరం" అన్నాడు.

"ఆకలి అలాంటిది. కోటగోడలనైనా కూలుస్తుంది. కడుపుదోవ కడుపుదే" అన్నాడు ఎఫిమ్.

ఈకథ ఫోమా విన్నాడు. అతనికడుపు తరుక్కుపోయింది. ఆ పిల్ల విధురగాథ ఎలాపరిణమించిందో వినాలనేఆసక్తి కూడా కలిగింది.

"అయితే, ఇంతకూ ఆపిల్లని ఆ పెద్దమనిషి కొన్నాడంటావా?" అని అడిగాడు.

"లేదు," అన్నాడు రైతు.

"తరువాత ఏంజరిగింది?"—అనడిగాడు ఫోమా.

"కొందరు దయాపరులు ఆ అమ్మాయికి నిలవ నీడ నిచ్చారు."

ఫోమా బాధతో మూలిగాడు.

హఠాత్తుగా కోపావేశంతో 'నే నవుతే ఆ తండ్రిని నిలువునా చీల్చిఉండేవాణ్ణి' అన్నాడు.

"యెందుకు చీల్చడం? అతని అభిప్రాయం తమరు అర్థం చేసుకోలేదు" అన్నాడు రిసీవరు.

"నాకు తెలుసులే," అన్నాడు ఫోమా.

"ఆ సమయంలో అతనికి అంతకంటె మరి గత్యంతరం కనుపించలేదు."

"ఒక మానవజీవిని అమ్మడానికి అతని మనస్సెలా ఒప్పిందో!"

"అది అమానుషమే. నేనూ ఒప్పుకుంటాను."

"అందులోనూ ఆడది. నేనవుతే ఆ పది రూబుల్స్ ఇచ్చేసిఉండేవాణ్ని"

రిసీవరు నిరాశతో 'కావచ్చు,' అన్నట్టు చెయ్యి ఊపి మాట్లాడక ఊరుకున్నాడు. అతని నిర్లిప్తత ఫోమాకు కలవరం కలుగజేసింది.

ఫోమా రెయిలింగ్ దగ్గరకు వెళ్ళి పడవ క్రిందికి చూచాడు. పనివాళ్ళగుంపు కనిపించింది. ఆ రొద అతనికి కైపెక్కించింది. అతనిలో ఇన్నాళ్ళూ దాగిన వేదన ఇప్పుడొక బలవత్తరమైన వాంఛగా బాహిరిల్లింది. అది, తనొక పెద్దదయ్యంలా పని చెయ్యాలనే కోరిక. ఒకవంద బస్తాలధాన్యాన్నైనా హాలాహరిగా బుజాలపై ఎత్తెయ్యాలనే వాంఛ.

"పని కానీండి త్వరగా!"–బిగ్గరగా కేకేశాడు ఫోమా. క్రింద పనిచేస్తున్న పనివాళ్ళు తలలెత్తి పైకి చూచారు. కొన్ని ముఖాలు బారులుతీరి కనిపించాయి. ఆ ముఖాల్లో ఒక స్త్రీముఖం కనుపించింది. నల్లనికళ్ళు. అతన్ని చూచి ముచ్చటగా నవ్వింది, ఫోమా హృదయంలో ఒక నిప్పురవ్వలా అంటుకుంది ఆనవ్వు. ఒక అలలా ఊగిసలాడింది. ఆ నవ్వుకు నిలవలేక అతను మళ్ళీ టేబిల్ దగ్గరకు వచ్చాడు. అతని చెక్కిళ్ళు కాలుతున్నాయి.

"తమరి నాన్నగారికి వైర్ చేసి కొంతధాన్యం దానం చెయ్యండి" అంటున్నాడు రిసీవర్.

"ఏ మాత్రం? ఒకవంద 'పుడ్'లు కావాలా? రెండువంద

లివ్వనా? ' — అనడిగాడు ఫోమా.

రిసీవర్‌కు సంతోషం ఒకవైపూ, కలవరం ఒకవైపూ కలిగాయి. ఫోమా అడిగినప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో తెలీలేదు.

"తమకు అలా దానంచేసేహక్కుంటే..." అంటూ ఏదో నసిగాడు.

'యజమానిని నేనే"—అన్నాడు ఫోమా.

"క్షమించండి...తమరి నాన్నగారికికూడా..."

అంటూ మళ్ళీ ఏదో గొణిగాడు రిసీవరు.

పెదవులు నాలుకతో తడుపుకుంటూ జాగ్రత్తఅన్నట్టుగా ఎఫిమ్ తనయజమానివంక చూచాడు. ఫోమాముఖం గర్వంతో కప్పిఉంది. రిసీవర్ చెప్పేమాటలు వింటున్నాడు.

"రెండువందల 'పుడ్'లు! రష్యాదేశస్థునికి తగినరీతిగా దానం చేశావు అబ్బాయిగారూ! రైతులందరితోనూ మీ దానగుణాన్నిగురించి స్వయంగా చెప్పుతాను. వాళ్ళందరూ ఎంత సంతోషిస్తారో, మిమ్మల్ని ఎంతగా పొడుగుతారో, మీరు కళ్ళారా చూద్దురుగాని." అని అంటూ రిసీవరు మళ్ళీ అవతలవైపుచూస్తూ ఇలా అరిచాడు.

"ఒరేయ్, అబ్బాయిలూ! అయ్యగారు రెండువందల పుడ్లు ధాన్యం దానంచేస్తున్నారు."

"మూడువందల!" అన్నాడు ఫోమా.

"మూడొందలు పుడ్లు! ఓ, మూడొందలు! ఎంత దయామయుడవయ్యా! అబ్బాయిలూ! మూడొందల పుడ్లు."

కాని రైతులు అంతగా సంతోషించినట్టులేదు. తలలు

ఎత్తి ఒకమాటు చూచారు. మళ్ళీ తలలు వాల్చుకున్నారు. తమ పనిలో నిమగ్నులైనారు. ఆ దానం పుచ్చుకోవడం పని వాళ్ళకిష్టంలేదు. కొందరుమాత్రం వినపడీవినపడనట్లు "అందుకు మా అభినందనాలు! ఈశ్వరుడు మీకు అష్టయిశ్వర్యాలు ప్రసాదించుగాక! తలలువొంచి మిమ్ములను అభినందిస్తున్నాము" అని అన్నారు. ఈ అభినందనవాక్యాలుకూడా వారు అంత ఇష్టంలేనట్లుగానే పలికారు.

మరికొన్ని మానవ కంఠాలు నిర్లక్ష్యంగా, నిరసిస్తున్నట్లుగా, "ఈ దానంవల్ల మాకేమిటిలాభం? మాకు తలా ఒక గ్లాసు తాగుడు పోయించినా, సంతోషించేవాళ్ళం. ఈ ధాన్యం మాకు ఉపయోగపడదు! ఇదంతా గ్రామకౌన్సిల్‌వారు లాక్కునిపోతారు." పలికాయి.

"ఈ జనానికి ఎంత మొత్తుకున్నా బుర్ర కెక్కదు. క్రిందికి దిగివెళ్ళి చెపుతాను." అన్నాడు రిసీవరు. అలా అంటూ అతను క్రిందికి వెళ్ళిపోయాడు. కాని ఫోమాకు ఈ విషయమే పట్టలేదు. తను చేసిన దానానికి రైతులు కృతజ్ఞతలు తెల్పినా తెల్పకున్నా అతని కొకటిగానే ఉన్నట్లు కనిపించాడు. అతని దృష్టంతా ఆ స్త్రీ మీదనే ఉంది. గులాబీరేకుల్లాంటి ఆమె చెక్కిళ్ళు, ఆమె నల్లటి కళ్ళు అతన్ని ఆకర్షిస్తున్నాయి. ఆ కళ్ళు తన వంక చూస్తున్నట్లు, తనను అభినందిస్తున్నట్లు, చల్లగా సేదదీరునట్లుగా పిలుస్తున్నట్లు, అతనికి అనిపించింది. ఆమె నగరాల్లో ఉండే స్త్రీలపద్ధతిలోనే దుస్తులు ధరించిఉంది. తల చుట్టూ ఓ చక్కని చిత్రమైన రుమాలు చుట్టుకుంది. ఆమె సన్నగా, పొడుగ్గా వెదురుబెత్తంలా ఉంది. కాళ్ళకు బూట్లు

తొడుక్కుంది. నడుముకు కాలికో గుడ్డ కట్టుకుంది. ఒకవైపుగా కర్రలమండెమీద కూచుని గోతాలు కుడుతోంది. ఆమె చేతులు యంత్రంలా పనిచేస్తున్నాయి. గోతానికి ఎక్కడ చిల్లి కనిపించినా దాన్ని తొందర తొందరగా కుట్టేస్తోంది. ఆమె మోచేతులవరకూ నగ్నంగాఉన్నాయి. ఇంతసేపటిబట్టీ ఆమె ఫోమావంకచూస్తూ చిరునవ్వు నవ్వుతోంది.

అంతలో ఎఫిమ్ ఫోమాదగ్గరకొచ్చి "ఫోమా! మరీ హద్దుమీరి ప్రవర్తించావు." దానంచేస్తేమాత్రం అంతచేటా? యాభై "పుడ్లు" అయితే ఎక్కితక్కులు. ఇంటికివెళ్ళినతరువాత మీ నాన్నగారుఏమంటారో?" అన్నాడు కొంచెం మందలిస్తున్నట్టుగా.

"నాపనికి అడ్డురాకు" నాదోషను నన్ను పోనీయి." అన్నాడు ఫోమా.

"సరే, నాకేం? ఊరుకుంటాను. కాని మీనాన్నగారు చెప్పారు. నిన్నొకకంట కనిపెట్టిఉండేబాధ్యత నాకప్పగించారు. నాబాధ్యత సరిగా నిర్వర్తించకపోతే ఆయనచేతుల్లో నాకు దెబ్బలు తప్పవు. అందుకని ఇదంతా చెప్పాల్సివచ్చింది." అన్నాడుఎఫిమ్.

"నీకాభయం అక్కర్లేదు. ఆవిషయం నాన్నగారితో నే మాట్లాడతాలే." అన్నాడు ఫోమా.

"సరే. ఇకనేచెప్పేదేముంది? నీ ఇష్టం. నీవేకదా ఇక్కడ యజమానివి." అని ఊరుకున్నాడు ఎఫిమ్.

"ఊఁ. సరేలే."

"ఈమాట నీమంచికోసనే చెప్పాను ఫోమా! నీ వింకా

పసివాడివి, అమాయకుడివి కాబట్టి చెప్పాను."

"అబ్బ! ఇక ఊరుకో. నన్ను వేధించకు ఎఫిమ్!"

ఎఫిమ్ గట్టిగా నిట్టూర్చి ఊరుకున్నాడు. ఫోమా ఆ స్త్రీవైపే చూస్తున్నాడు"

"ఇలాటి ఆడదాన్ని నావద్దకు అమ్మకానికి తెస్తే ఎంత బాగుండేది!" అని అనుకున్నాడు తనలో.

అతనిహృదయం వేగంగా కొట్టుకోసాగింది. శారీరకంగా అతనింకా పవిత్రంగానే ఉన్నాడు కాని చెడిపోలేదు. అయినా స్త్రీ పురుషుల సంబంధాలనుగూర్చి ఎన్నెన్నో అద్భుతమైన రహస్యాలను, చెప్పుకుంటుండగా అతను వినేఉన్నాడు. మొరటుగానున్న, లజ్జాకరమైన పేర్లుకొన్ని అతను వినే ఉన్నాడు. ఆ పేర్లు జ్ఞాపకంవచ్చేసరికి అతని కొకవిధమైనసిగ్గు, కుతూహలము కలిగాయి. ఒక ఇచ్ఛను రగుల్కొలిపాయి. అతని ఊహాశక్తి అనిశ్చితంగా ఉంది.

అంచాత స్పష్టంగా ఆ రూపాలను తన కళ్ళముందు చిత్రించుకోలేకపోయాడు. కాని ఆ సంబంధాలు తాను విన్నంతగా అంత స్వల్పమైనవీ, మొరటైనవీ కావని అతని ఆత్మలో అనిపిస్తూనే ఉంది. అలాటి స్త్రీలు తనవైపు చూచి నవ్వుతూ నిజంగా అవి అటువంటివేనని నిశ్చయంగా చెప్పినప్పుడు మాత్రం తాను అందుకు ఏం సమాధానం ఇవ్వాలో తెలియక కలవరపడేవాడు. సమాధానానికి ప్రత్యామ్నాయంగా తానూ నవ్వేవాడు. ఏమైనప్పటికీ స్త్రీ పురుషుల సంబంధాలు అందరూ అనుకునేటంత మొరటుగాను, లజ్జాకరంగాను ఉండవలసిన పని లేదనీ, వారు అనుకున్నదానికంటె పవిత్రంగాను, పరిశుభ్రం

గాను, నాగరీకంగాను ఉండవచ్చునని కూడా అతను అనుకునే వాడు.

ఈ అభిప్రాయంతోనే అతను ఇప్పుడు ఆ స్త్రీ వంక చూస్తున్నాడు. ఆమె అతని హృదయాన్ని ఆకర్షించి కలవర పెడుతోంది. మళ్ళీ అంతలోనే అతన్ని ఏదో సిగ్గూ, భయమూ ఆవరించాయి.

థోమా చర్యలు గమనిస్తున్న ఎఫిమ్, అతనితో ఇలా అన్నాడు.

"థోమా! ఏమిటది? ఆ స్త్రీ వంక అదేపనిగా చూస్తున్నావేం? ఇక నేను ఊరుకోను చెపుతున్నా! అది ఎవర్తో నీకు తెలియదు. ఒకవేళ అది నిన్ను చూచి కన్నుగీటితే నీవేం చేస్తావో నీకే తెలియదు. నీవింకా పసివాడివి. పైగా నీ స్వభావంకూడా అందరిలాంటిది కాదు. చాలా విచిత్రమైన స్వభావం నీది నీ విలాటి పని ఏదిచేసినా మన పని ఖాళీ అవుతుంది. సర్వం సమర్పించుకుని చివరకు కట్టుబట్టలతో, కాలినడకతో ఇంటికు చేరాల్సివస్తుంది."

"ఇంతకూ నీకు కావల్సిందేమిటో చెప్పు?" అన్నాడు థోమా. అతని ముఖం కలవరపాటువల్ల ఎరుపెక్కింది.

"నాకేమీ అక్కర్లేదు. కాని నీవు కాస్త నామాట వినడం మంచిది. ఆడవాళ్ళకు సంబంధించిన విషయాల్లో నేను ఆరితేరిన ఘటాన్ని. దాదాపు గురువుననే చెప్పవచ్చు స్త్రీల విషయంలో నీవు ఎంత నిక్కచ్చిగాఉంటే అంతమంచిది. ఆమె కొక సీసావోడ్కా ఇప్పించు. తరువాత తినడానికేదైనా పెట్టించు.

ఆపైన రెండు బీరుసీసాలు; ఇవన్నీ అయినపిమ్మట ఓఇరవై కోపె క్కుల రొక్కం—ఇవి ఇస్తే చాలు. ఈ ఖరీదుకు ఆమె తన ప్రేమంతా మాంచి మజాఅయినతీరులో నీపైన కుమ్మరిస్తుంది."

"నీవబద్ధమాడుతున్నావు!" అన్నాడు ఫోమా మెల్లగా.

"నేనబద్ధాలాడుతున్నానా? ఇదే పద్ధతి నేనిప్పటికి వంద సార్లైనా అనుసరించిఉంటాను. అలాంటివాణ్ణి అబద్ధంచెప్పాల్సిన పనేమిటి? కావాలంటే ఒక్కమాటు ఆమె వ్యవహారం నాకప్ప చెప్పు—ఇకచూద్దువుగాని నాతడాఖా—క్షణంలో నిన్నామెకు అంటించి వదిలిపెడతాను"

"సరే, అలాగే." అన్నాడు ఫోమా; అతని కేదో గొం తుకు అడ్డంపడ్డట్టనిపించి, ఊపిరి బిగపట్టినట్లయింది.

"సరే, ఇంకేం? నేను ఆమెను సాయంత్రం నీ దగ్గరికి తీసుకొస్తాను." అన్నాడు ఎఫిమ్.

ఏదో వ్యవహారం చక్కపడినట్లు ఎఫిమ్ నవ్వుతూ వెళ్ళి పోయాడు. ఆ సాయంత్రంవరకూ ఫోమా పిచ్చెక్కినవాడికి మల్లే తిరుగుతున్నాడు. పొగమంచులో నడిచిపోతున్నట్లుగా ఉందతనికి. రిసీవరు చెప్పినదానినిబట్టి రైతులు అతన్ని చూచి నప్పుడల్లా గౌరవమర్యాదలు ప్రదర్శిస్తున్నారు. అయినా అతను వాటిని గమనించడంలేదు. ఏదోభయం అతనిమీద పిడుగులా పడ్డట్టయింది. ఎవరికో అపకారంచేస్తున్నట్టనిపించింది. ఏదో నేరంచేస్తున్నట్లుగాతోచింది. తనను ఎవరు పలకరిస్తున్నా వారికి వినయంగా, తప్పుచేసినవాడు ఒప్పుకుంటున్నట్లుగా అతను సమా ధానాలు చెప్పసాగాడు. సాయంత్ర మవగానే కొంతమంది పనివాళ్ళు ఇళ్ళకు వెళ్ళిపోయారు. మరికొందరు నదిఒడ్డున పెద్ద

మంటపెట్టి అక్కడ వంటలుచేసుకోసాగారు. వంటలుచేసుకుంటూ వాళ్ళు ఏవేవో మాట్లాడుకుంటున్నారు. ఆ మాటలు ఆ సాయంత్రపు నిశ్శబ్దంలో తేలుతూ పోతున్నట్టు వినిపిస్తున్నాయి. నదీజలంలో మంటలు ప్రతిఫలిస్తున్నాయి. అగ్నిజ్వాలల నీడలు ఎరుపు, పసుపు రంగులు గీరల్లాఉండి నిశ్చలంగా ఉన్న నదీజలంమీద, థోమా కూచున్న కాబిన్ కిటికీ అద్దాలపైన పడి ఆడుతున్నట్టున్నాయి. థోమా కాబిన్‌లో ఒకమూల కూచుని ఉన్నాడు. ఆ స్త్రీ ఎప్పుడొస్తుందాఅని కాచుకుని ఉన్నాడు. అతనిముందు ఒక టేబిల్ ఉంది. ఆ టేబిల్ మీద కొన్ని సోడా సీసాలు, మరికొన్ని బీరు సీసాలు, రొట్టెలు, వెన్న, పండ్లూ, కేకులు, బిస్కట్లు అమర్చిఉన్నాయి. కిటికీ తలుపులు మూసేసిఉన్నాయి. ఇంకా అప్పటికి దీపం వెలిగించలేదు. బయటినుంచివచ్చే మంటలవెలుగుమాత్రం మందంగా కిటికీ తెరల్లోంచి ప్రసరించి టేబిల్‌మీద టేబిల్‌పైనఉన్న వస్తువులమీద పడుతోంది. స్టీమరుమీద, పడవలమీద; ఎక్కడా అలికిడిలేదు. అంతా నిశ్శబ్దం. దూరంగా తీరంనుంచిమాత్రం ఎవరో ముచ్చట్లు చెప్పుకునే మాటలు కొన్ని అస్పష్టంగా వినవస్తున్నాయి. నదీతీరాలు ఒరుసుకుంటున్న ధ్వని నదీజలాలు స్టీమరుకొనలకు తాకిన ధ్వని మందంగా వినిపిస్తున్నాయి. కాబిన్ మూలలో ఎవరో దాగి తనపై నిఘా ఉంచారని థోమాకు అనిపించింది. మరెవరో బల్లకట్టుమీద బరువుగా నడిచివస్తున్నట్టు అడుగుల చప్పుడు వినిపించింది. బల్లకట్టు నీళ్ళకు కొట్టుకుని కోపంవచ్చినట్టు ధ్వనిచేస్తోంది. కెప్టెన్ గొంతు బిగపట్టి నవ్వుతున్నాడు. మెల్లగా మాట్లాడుటున్నాడు.

ఎఫిమ్ కాబిన్ తలుపుదాపున నిలబడి ఎవరితోనో మెల్లగా మాట్లాడుతున్నాడు. అయినా అత నెవరోన్నీ మందలిస్తున్నట్టు తెలుస్తోంది.

"నాకక్కరలేదు." అని అరుద్దామనిపించింది ఫోమాకు. అకస్మాత్తుగా పడకకుర్చీలోంచి లేచాడు. సరిగ్గా అదే క్షణంలో తలుపు తెరిచిన చప్పుడైంది. ఒక సన్నని పొడుగాటి స్త్రీ మూర్తి వాట్లో నిలబడింది. మళ్ళీ మెల్లగా చప్పుడుకాకుండా తలుపు మూసింది. "అయ్యో, దేవుడా! ఇక్కడెంత చీకటిగావుంది! ఇక్కడ బ్రతికివున్న పురుగుకూడా ఉండదేమో!" అన్నది స్త్రీ.

"ఊఁ" అని మెల్లగా మూలిగాడు ఫోమా.

"అమ్మయ్య! మనుషులున్నారు! నమస్కారం" అంటూ ఆమె మెల్లగా ముందుకు వచ్చింది.

"ఉండు, దీపం ముట్టిస్తాను." అన్నాడు ఫోమా. అతని కంఠస్వరం కంపిస్తోంది. మళ్ళీ పడకకుర్చీలో కూలబడి ఒక వైపుకు ఒదిగాడు.

"పర్వాలేదు. దోవకనిపిస్తూనేఉంది. కొంచెం అలవాటు పడదాకానే కష్టం. అలవాటైతే చీకట్లో అయినా కళ్ళకుఅన్నీ కనిపిస్తాయి."

"ఇలా కూచో." అన్నాడు ఫోమా.

"ఊఁ."

ఆ స్త్రీ అతనికి రెండుఅడుగుల దూరంలో కూచుంది. ఆమె కళ్ళు తళతళ మెరుస్తూ ఉండడం, నిండుగావున్న ఆమె పెదవులపై మందహాసం చిందుతూఉండడం ఫోమాచూచాడు. ఈ నవ్వు ఇదివరకు ఆమెనవ్విన నవ్వులాగాలేదు. ఈ నవ్వేదో

నీరసంగా దిగులుగా ఉంది. అయినా ఈ నవ్వే ఫోమాకు ఎక్కువ ఉత్సాహం కలిగించింది. ఆమె కళ్ళు చూచిన పిమ్మట అతనికి కాస్త ఊపిరిసలిపినట్టయింది తన కళ్ళు, ఆమె కళ్ళుకలిశాయి. కలియగానే హఠాత్తుగా తన కళ్లు తిప్పుకుని నేలమీదికి చూచాడు ఫోమా. రెండు నిముషాలపాటు ఇద్దరూ మాట్లాడలేదు. మౌనం వహించారు. అలా మౌనంగా ఉండడం ఇద్దరికీ బరువుగా, బాధగాతోచింది. పిమ్మట ముందుగా ఆమే మాట్లాడడం మొదలెట్టింది.

"ఇక్కడ మీరు ఒంటరిగా ఉండడంవల్ల బాధ కలిగిస్తున్నదనుకుంటాను."

"అవును." అన్నాడు ఫోమా.

"మా ఊరు మీ కెలా ఉంది? బాగుందా? "నింపాదిగా అడిగిం దామె.

"చాలా బాగుంది. ఇక్కడ అనేక అడవులున్నాయి." మళ్ళీ ఇద్దరూ మౌనం వహించారు.

"వోల్గానదికంటె ఈ నదే బాగుంది." అన్నాడు ఫోమా కొంచెంసేపయినతరువాత.

"నే నొకప్పుడు, వోల్గాతీరంలోనే ఉండేదాన్ని."

"ఎక్కడ?"

"సిమ్‌బ్రిస్క్ నగరంలో."

"సిమ్‌బ్రిస్క్? అదేమాట ప్రతిధ్వని పలికినట్టుగా పలికాడు ఫోమా. తరువాత మాట్లాడలేకపోయాడు. కాని ఆమెకు మాత్రం తెలుసు. ఎవరితో ఎలా సంచరించాల్సిందీ ఆమెకు తెలుసు.

"నాకేమైనా తింటానికి పెట్టరూ?"

"అరెరే! మరిచిపోయాను. నే నేం మనిషిని! ఇవిగో! టేబిల్ దగ్గరికి రా." అన్నాడు థోమా ఉలిక్కిపడి.

అతను ఆచీకట్లో తడుముకుంటూ మెల్లగా బల్లనుసమీపించాడు. బల్లమీదినుంచి ముందు ఒక సీసా తీసుకున్నాడు. తరువాత మళ్ళీ రెండో సీసా తీసుకున్నాడు. తిరిగీ వాటిని యథాస్థానాల్లో ఉంచాడు. ఏదో నేరం చేస్తున్నట్టు నవ్వుకుంటూ ఆ పని చేశాడు. ఆమె అతనిదగ్గరికి వచ్చి అతని ప్రక్కనే నిలబడింది. మందహాసంచేస్తూ అతని ముఖంవైపు, వణుకుతోన్న అతని చేతులవైపు చూచింది.

"మీరు సిగ్గుపడుతున్నారా?" హఠాత్తుగా, మెల్లగా అడిగిందామె.

ఆమె ఊపిరి తన చెక్కిలికి సోకినట్టు అతననుకున్నాడు. మళ్ళీ ఆమెలాగానే మెల్లగా "అవును," అని జవాబిచ్చాడు.

తరువాత ఆమె తన రెండుచేతులూ అతని భుజాలపై వేసింది. మెల్లగా అతన్ని దగ్గరికి లాక్కుంది. వక్షస్థలానికి ఒత్తుకుంది!

"ఫర్వాలేదు. సిగ్గుపడకుబాబూ! నా ప్రియమైన చిన్నవాడా! సిగ్గుపడకు, నీమీంద నాకెంత జాలిగా ఉంది!" అన్నదామె రహస్యంగా.

ఆమె అలా అనేసరికి అతనికళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏడవాలనిపిస్తున్నట్టుగా ఉంది. తీయని అలసటలో హృదయం కరిగిపోతున్నట్టుగా ఉంది. ఆమె వక్షస్థలానికి తన తలను గట్టిగా ఒత్తుకుంటూ, వినిపించీవినిపించనట్టు ఏవేవో మాటలంటూ,

ఆమె చుట్టూ తన చేతులు పెనవేశాడు. అతను మాటాడే మాటలు అతనికే అరంకావడంలేదు.

"ఇక వెళ్ళిపో!" అన్నాడు థోమా బరువైన కంఠ స్వరంతో. అలా అంటూ తన విప్పారిన కళ్ళతో గోడవంక తేరి పారచూచాడు.

ఆమె అతని చెక్కిలిని ముద్దాడి కాబిన్‌లోంచి బయటికి వెళ్ళిపోతూ "సరే, సెలవు" అన్నది.

ఆమె సమక్షంలో థోమా సహించలేనంతఅవమానంతో బాధపడ్డాడు. ఆమె వెళ్ళివెళ్ళకముందే ఎగిరిపడిలేచాడు. మళ్ళీ వెళ్ళి తన పడకకుర్చీలో కూలబడ్డాడు. తిరిగీ అక్కణ్ణుంచి లేచాడు. అతని కాళ్లు గజగజ వణుకుతున్నాయి. ఎంతో విలువైన వస్తువును పోగొట్టుకున్నట్టు బాధపడుతున్నాడు. తీరా దానిని పోగొట్టుకునే నిముషంవరకూ దాని విలువగాని, అది ఉన్నట్టుగాని, తెలుసుకోలేకపోయాడు. ఇప్పుడు తిరిగీ అతనిలో ఒక విధమైన శీవి ప్రవేశించింది. ఒక రకమైన అహంభావం కొత్తగా ప్రవేశించింది. ఆ అహంభావంవల్ల తానుపొందిన అవ మానం, సిగ్గు, అదృశ్యమైపోయాయి. వాటి స్థానంలో ఆ అమ్మాయియెడల జాలి హృదయకుహరంలోంచి జలలా ఉబికి వచ్చింది. సగం శరీరం కనిపించేలా చినిగిపోయిన బట్టలు కట్టుకుని, ఆ చలివేసే చీకటి రాత్రిలో ఒంటరిగా వెళ్ళి పోయిన ఆ అమ్మాయిపట్ల అతనికి ఎక్కడలేనిజాలి ముంచు కొచ్చింది. వెంటనే గబగబ కాబిన్‌లోంచి డెక్ మీాదికివచ్చి బయటికి చూచాడు. అది కృష్ణపక్షపురాత్రి. చంద్రుడులేని తారలుమాత్రం మినుమినుకుమంటున్నాయి. చల్లనిగాలి,

చిక్కనిచీకటి అతన్ని కౌగలించుకున్నాయి. తీరాన ఇంకా కణ కణమండుతున్న నిప్పుకణికలు కనిపిస్తూనేఉన్నాయి. ఫోమా చెవులొగ్గి డెక్ మీద నిల్చున్నాడు అంతటా నిశ్శబ్దం ఆవరించి ఉంది. బలమైన, బరువైన నిశ్శబ్దం. లంగరుగొలుసులకు తాకు తున్న నదీజలాల మర్మరధ్వనులుమాత్రం వినవస్తున్నాయి. ఎక్కడా నరసంచారంఉన్నట్టు లేదు. మళ్ళీ ఆ అమ్మాయిని పిలిస్తే బాగుండుననిపించింది ఫోమాకు. కాని ఆమె పేరేమిటో అతనికి తెలియదు. స్వచ్ఛమైన శీతలవాయువులు పీల్చుకుంటూ కొంతసేపు అలాగే నిలబడ్డాడు. ఉండిఉండి హఠాత్తుగా ఒక మూలుగు అతనికి వినిపించింది. ఆ మూలుగు మామూలుగా లేదు. ఏదో ఏడుస్తున్న మూలుగుడులా తోస్తున్నది. ఒకవేళ ఆ మూలుగుతూ ఏడుస్తున్నది ఆమేనేమో అని అనుకున్నాడు. గజగజవణికిపోతూ మెల్లగా మూలుగుడు వినవస్తున్న దెసకు వెళ్ళాడు.

ఆమె అక్కడుంది. గుట్టగా పడేసిఉన్న మోకులకు తల ఆనించుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది. అర్ధనగ్నంగాఉన్న ఆమె తెల్లనిచేతులు చలికి వణుకుతున్నాయి. ఆమె బాధపడు తున్నట్టు మూలుగుతోంది. ఆమెను చూచేసరికి ఫోమాకు విచారం కలిగింది. భయపడుతూ ఆమెమీదికి వంగాడు.

"ఏమిటది? ఎందుకు?" అన్నాడు మెల్లగా.

ఆమె తలఊపి ఊరుకుంది కాని జవాబు చెప్పలేదు.

"నీకు కష్టం కలిగించానా?" అనడిగాడు మళ్ళీ.

"వెళ్ళిపో." అన్నదామె.

"కాని, ఎలాగా?" అన్నాడు ఫోమా. ఏమనాలో

తెలియక అతను గాభరాపడ్డాడు. మెల్లగా ఆమె తలను తన చేతో్త స్పృశిస్తూ "కోప్పడకు. నీ అంతట నీవే ఇష్టమై వచ్చావు." అని అన్నాడు.

"నాకేం కోపం లేదు!" అన్నదామె కొంచెం బిగ్గరగా. "నీమీద నాకెందుకు ఉండాలి? నీవు నన్నేమీ చెరచలేదు. నీవు పవిత్రమైన వ్యక్తివి."

"పిచ్చిపిల్లవాడా! ఇలా వచ్చి నా పక్కన కూచో."

ఆమె ఫోమా చెయ్యి పట్టుకుని పసిపిల్లవాణ్ణి కూచోబెట్టుకున్నట్టుగా అతన్ని తన ఒడిలో కూచోబెట్టుకుంది. అతని తలను తన వక్షస్థలానికి హత్తుకుంది. అతనిమీదికి వాలిపోయి అతని పెదవులు పదే పదే ముద్దాడింది.

"మరి నీవు ఎందుకు ఏడుస్తున్నావు?" ఫోమా, ఒకచేత్తో ఆమె చెక్కిలి నిమురుతూ మరోచేత్తో ఆమె మెడ కౌగలించుకుని అడిగాడు.

"నాకోసమే నేను ఏడుస్తున్నాను. నీవు నన్నెందుకు పంపించివేశావు?" అని అడిగిందామె, దీనంగా.

"నామీద నాకే సిగ్గేసింది." అన్నాడు ఫోమా, తల వాల్చుకుని.

"పిచ్చిపిల్లవాడా! నాతో నిజంచెప్పు. నాతో ఉండడం సుఖంగాలేదా?" అన్నదామె చిరునవ్వునవ్వుతూ. ఇంకా ఆమె కళ్ళనుండి పెద్దపెద్ద వెచ్చని కన్నీటిబిందువులు రాలి ఫోమా గుండెలమీద పడుతూనేఉన్నాయి,

" నీవెందుకిలా మాట్లాడతావు?" అన్నాడు ఆ యువకుడు పూర్తిగా భయంలో మునిగిపోయి.

తరువాత ఏదో ఆవేశం ముంచుకొచ్చినట్టు గబగబ మాట్లాడసాగాడు. ఆమె అందచందాలను గురించీ, ఆమెమంచీ మర్యాదలనుగురించీ, ఆమె దయాదాక్షిణ్యాలను గురించీ ఏవేవో మాట్లాడాడు. ఆమెకోసం తానెంతగా విచారిస్తున్నదీ ఆమె సమక్షంలో తనెంతసిగ్గుపడుతున్నదీ చెప్పాడు. ఆమె అవన్నీవిన్నది. అతని శిరస్సునూ, మెడనూ, చెక్కిళ్ళనూ, వక్షస్థలాన్నీ పలుమారులు ముద్దుపెట్టుకుంది. అతను మాట్లాడడం అయిపోయినతరువాత పూర్తిగా ఊరుకున్నాడు. అప్పుడామె నింపాదిగా, విచారంగా, ఎవరోవచ్చినవాళ్ళను గురించి చెబుతున్నట్టుగా ఇలా చెప్పసాగింది.

"నేను మరోవిధంగా భావించాను. "ఇక వెళ్ళు." అని నీవు అనగానే నేను లేచి వెళ్ళిపోయానుకదూ. ఎందుకనుకున్నావు? నీ వా మాట అనగానే నాకెంతో దిగులువేసింది. చెప్పలేనంత దిగులువేసింది. పూర్వం ఒకప్పుడు—నా కిప్పటికీ జ్ఞాపకముంది. అందరూ నన్ను లాలనగాపాలనగా చూచేవారు. నాకోసం పడిచచ్చేవారు. ఒక్కక్షణంకూడా ఎవరూ నన్ను వదలి ఉండగలిగేవాళ్లు కారు. నన్నెంతగా తమ స్వంతం చేసుకున్నా వాళ్ళకు తనివితీరేదికాదు. నే నొక్కమాటు చిరునవ్వు చిందిస్తే చాలు, నే నేది కోరితే అది ఇచ్చేవారు. నే నేం చేయమంటే అది చేసేవారు. ఇదంతా నా యౌవనంలోని మాట. అది ఇప్పుడు జ్ఞాపకంవచ్చి ఏడ్చాను! గతించిన నా యౌవనం తలపుకు వచ్చేసరికి నా కెక్కడలేని విచారం ముంచుకొచ్చింది. ఇప్పుడు నాకు ముప్ఫైఏళ్లు. ఇవి ఆడదానికి ఆఖరిరోజులు విన్నావా ఫోమా!

ఆమె కొంచెం బిగ్గరగా చెప్పింది. పాటలలా విని పిస్తున్న ఆమెమాటలు, జలజలమని ప్రవహించే నదీజలాలతో శ్రుతికలుపుతున్నాయి. మళ్ళీ ఆమె చెప్పసాగింది.

"పిచ్చిపిల్లవాడా! నే చెప్పేది విను! నీ యౌవనం జాగ్రత్తగా కాపాడుకో. ప్రపంచంలో అంతకంటె కోరదగింది మరేమీలేదు. అందరకంటె విలువైనదీ, విశిష్టమైనదీకూడా లేదు. బంగారంతో ఏకోరికనైనా తీర్చుకోవచ్చు. అలాగే యౌవనంతో దేనినైనా సాధించుకోవచ్చు. బంగారంలాంటిది యౌవనం సుమా! నీ వృద్ధాప్యంలోకూడా నీ యౌవనం తాలూకు జ్ఞాపకాలు ఉండేవిధంగా జీవించు సుమా! ఇప్పుడు నాకు నా యౌవనం గుర్తుకొచ్చి దుఃఖించాను; అయినా గతించిన నా జీవితంలోని ఒక్కొక్క విషయం జ్ఞాపకంవచ్చి మళ్ళీ నాహృదయాన్ని జ్వలింపచేసిందిసుమా; ఆ మధుర స్మృతులలో నాకు మళ్ళీ యౌవనంవచ్చినట్టుగా ఉంది. దాహంతో తపిస్తున్నట్టు ఇప్పటి నాకు —— అనుభవించిన జీవితం తలపుకొచ్చేసరికి దప్పిక తీరినట్టుగా ఉంది. పిచ్చి పిల్లవాడా! నీతో సుఖపడ్డాను. నామీద నీకు మక్కువఉంటే మనవంట్లో శక్తి ఉన్నంతవరకూ సుఖపడతాము! విను! ఇప్పుడు నేను జ్వలించాను. అలా జ్వలించి జ్వలించి బూదినైపోతాను!"

అలా చెప్పి ఆమె ఆ యువకుణ్ణి తన దగ్గరికి తీసుకుంది. ఆకలిగొన్నదానిలా అతన్ని గట్టిగా కౌగలించుకుని అతని పెదవులు పదే పదే ముద్దాడసాగింది.

"ఓ...ఓ...ఓ..." అంతలో పడవల కాపలావాని కేక దీర్ఘంగా వినిపించింది.

కొన్ని రోజులతరువాత పడవలన్నీ సరుకులు దించుకుని మళ్ళీ పెరమ్‌కు ప్రయాణమైనాయి. ప్రయాణమయ్యేరోజున ఒక బండి నదీతీరానికి రావడం ఎఫిమ్ గమనించాడు. ఆబండిలో "పెలాగెయా" తన ట్రంకుపెట్టె మరికొన్ని మూటలు పెట్టుకుని కూచునిఉంది. ఆమెకూడా స్టీమరుతో ప్రయాణమైరావడం చూచేసరికి ఎఫిమ్‌కు ఎక్కడలేని విచారం కలిగింది.

"ఒక నావికుణ్ణి పంపి ఆమె సామానులు తెప్పించు." అని ఆజ్ఞాపించాడు ఫోమా, నదీతీరంవైపు చూపిస్తూ.

అతని ఆజ్ఞ నెరవేర్చడం ఎఫిమ్‌కు ఏమాత్రం ఇష్టంగా లేదు. పైగా కష్టంగాకూడాఉంది. అయినా యజమాని ఆజ్ఞ పాలించాడు ఎఫిమ్. ఆమె సామాన్లకోసం మనిషిని పంపి తరువాత యజమాన్ని ఇలా అడిగాడు.

"ఇంతకూ అదికూడా మనతో వస్తున్నదన్నమాట?"

"ఆమె నాతో వెడుతోంది." అన్నాడు ఫోమా, ముక్తసరిగా.

"అర్థమైంది. మనందరితోనూఅని నే ననడంలేదులే. అయ్యో, భగవంతుడా!"

"ఎందుకలా మూలుగుతావు?"

"అవును ఫోమా ఇగ్నాటిచ్! మనం వెడుతున్నది ఒక పెద్ద నగరానికి. ఈ రకం ఆడవాళ్ళు అక్కడ ఎంతమంది కావాల్సివస్తే అంతమంది దొరుకుతారు."

"సరే' ఇక నీవు మాట్లాడకు." అన్నాడు ఫోమా నిక్కచ్చిగా.

"నేను మాట్లాడను. కాని ఇది ఏమాత్రం మంచిపని కాదని చెపుతున్నా."

"ఏది?"

"అదే! ఇప్పుడు నీవు చేస్తున్న పని. మనస్టీమరుకు ఇంతవరకూ చెడుపేరు లేదు. ఉండిఉండి హఠాత్తుగా నీవొక ఆడదాన్ని తెచ్చి పెట్టావు. పోనీ, అదైనా మామూలు ఆడదికాదు. అన్నిటికీ తగిన ఆడది. ! గడితేరిన ఆడది!"

ఆ మాటలకు ఫోమా మండిపడ్డాడు. కెప్టెన్‌తో ఖచ్చితంగా చెప్పదలుచుకున్నాడు.

' ఎఫిమ్ ! నీవొక ముఖ్యవిషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. నీవొక్కడివే కాదు . ఈ ఓడమీదఉన్న ప్రతివాళ్ళూ. ఈ విషయం అందరికీ చెప్పు. ఎవడైనాసరే, ఆ పిల్లను పల్లెత్తు మాట అన్నట్టుగా చెవినిపడిందీ అంటే— వాడి తల వెయ్యి వక్కలు చేస్తాను." అన్నాడు ఫోమా, ప్రతిమాటా నొక్కి పలుకుతూ.

"ఎంత ఘోరం! ఎంత ఘోరం!" అని గొణుక్కున్నాడు ఎఫిమ్, యజమానివంక నివ్వెరపోయి చూస్తూ. అలా అని తనొక అడుగు వెనక్కు తగ్గాడు. ఫోమా తోడేలుపిల్లలా పళ్ళు చూపించాడు. అతడి కనుగుడ్లు బండిగానులంత పెద్దవైనాయి. మళ్ళీ గర్జించాడు ఫోమా.

"నవ్వుతున్నావా? నవ్వు! నవ్వడమెలాగో నీకు చూపిస్తాను!"

ఎఫిమ్ తన ధైర్యాన్ని కోల్పోయాడు. అయినా అభిమానంతో "ఫోమా ఇగ్నాటిచ్! నీవు నా యజమానివైన

మాట నిజమే. అయినప్పటికీ మీ నాన్నగారు నాతో వాణ్ణి శాస్త్ర కనిపెట్టిఉండు ఎఫిమ్" అని చెప్పాడు కనుక పైగా నేను ఓడపై క్లెప్టెన్ను కనుక, నీ కింతగా చెప్పాల్సివచ్చింది." అని అన్నాడు.

"ఏమిటీ? క్లెప్టెనా!" అంటూ ఫోమా భయంకరంగా అరిచాడు. అతని శరీరం గగుర్పొడిచింది. నరనరాలు వణికిపోయాయి. ముఖంలో నెత్తురుచుక్కలేదు.

"అయితే నే నెవరనుకున్నావు?" అని గర్జించాడు.

'సరేలే, ఇక అరవకు. ఎవతో ఆడదాన్నిగురించి ఎందుకిలా గొడవపడడం?" అన్నాడు ఎఫిమ్.

"ఇక ఊరుకో!" మళ్ళీ అరిచాడు ఫోమా.

ముఖాన నెత్తురుచుక్కలేని ఫోమా ముఖంలో, ఎర్రని నెత్తురుకదుములుకట్టాయి. ఒక అడుగు ముందుకు వేశాడు. చొక్కాజేబుల్లో రెండు చేతులూ పెట్టుకున్నాడు. ఒక నిశ్చయాన్ని, నిబ్బరాన్ని, సూచిస్తున్న గొంతుతో "ఏవోయ్, క్లెప్టెన్! విను ఇక, నోరు కదిపావా అంటే-ఏంచేస్తానో తెలుసా? నిన్నిక్కడే ఇప్పుడే స్టీమరులోంచి గెంటేస్తాను! నేను హాయిగా పైలట్‌తోకలిసి ప్రయాణంచేస్తాను. నీ ఉత్తర్వులేమీ నా ముందు పనికిరావు. తెలిసిందా, ఏం? చూపించమంటావా?" అని అరిచాడు.

ఎఫిమ్‌కు నోరు పడిపోయింది తన యజమానివంక విచిత్రంగా చూచాడు. అతనన్నదానికి ఏం జవాబు చెప్పాలో తోచక నిస్సందేహపడి కళ్ళార్పుకుంటూ నిలబడిపోయాడు.

ఏం, మాట్లాడవేం? నే చెప్పింది అర్థమైందా?"

"అవును అర్థమైంది! అయినా ఎందుకీ గొడవంతా? అందులోనూ ఒక—" అని గొణిగాడు ఎఫిమ్.

"మాట్లాడకు!"

ఘోమా కళ్లు క్రూరంగా జ్వలిస్తున్నాయి. ఆగ్రహావేశాలతో అతని ముఖం వికృతంగా మారిపోయింది. అతన్నిచూచి ఎఫిమ్ ఇక తా నక్కడ ఉండడం మంచిదికాదని గ్రహించుకున్నాడు. వెంటనే అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

"అయ్యో! ఎంతఘోరం! ఎంతభయంకరం! పండు చెట్టుకు దగ్గరలోనే రాలింది" అనిఅనుకున్నాడు ఎఫిమ్ తనలో. అతనికి ఘోమాపై కోపం వచ్చింది. అతని మనస్సు అనవసరంగా నొప్పించాననిపించింది. కాని మళ్ళీ వెంటనే తనపై ఒక యజమాని కర్కశహాస్యం — నిజమైనది ఉన్నట్టు గుర్తొచ్చింది. తాను అనేకసంవత్సరాలబట్టీ ఒకరికిందపడి ఉండడానికి అలవాడుపడ్డానని తెలుసుకున్నాడు. అంచాత ఘోమా తనపై చూపించిన ఆగ్రహం మామూలేనని అనుకున్నాడు. అతని మనస్సు ఏమీ నొచ్చుకోలేదు. పైగా అది తనకిష్టంగానేఉన్నట్టు కనిపించింది.

వృద్ధుడైన పెలట్ దగ్గరికి వెళ్ళి తనకూ యజమానికీజరిగిన ఘర్షణంతా విపులంగా చెప్పాడు ఎఫిమ్. అలా చెపుతున్నప్పుడు అతని కంఠస్వరంలో ఒకవిధమైన సంతృప్తి కనపడింది.

"చూడు! పులికడుపున మేక పుడుతుందా? బయటికి అలా మాంద్యంగా కనిపిస్తాడు కాని లోపల మనస్సుమాత్రం మహాగట్టిది. సరే, పోనీయి. ఏదోగమ్మత్తుగా కాస రుచిచూద్దామనుకున్నాడు. పోనీ, చూడనీ. ఈపాటిదానికే ముంచుకొ

పొయ్యేదేమీలేదు. అంత దిట్టమైన మనిషి ఈమా
త్రానికే చెడిపోడు. నన్నలా తిట్టాడనుకున్నావ్? కంచు
ఢక్కా మోగించినట్టు అరిచాడనుకో. తాను యజమాని అనే
మాట సార్థకంచేసుకున్నాడు." అంటూ ఎఫిమ్ తన కథను
ముగించాడు.

ఎఫిమ్ నిజమే చెప్పాడు. ఈ స్వల్పకాలంలోనే
ఫోమాలో తెలుసుకోలేనంత మార్పువచ్చింది. ఇప్పుడతని
హృదయంలో రగులుకొన్న అగ్నిజ్వాల, అతన్ని ఒక స్త్రీ
ఆత్మదేహాలకు రెంటికీ అధిపతిని కావించింది. ఈ నూతన
శక్తిలోని తీవ్రమైన, భయంకరమైన మాధుర్యాన్ని అతను
ఎంతో తపనతోను, దాహంతోను ఆసక్తితోను, ఆతృతతోను,
అనుభవించి జీర్ణించుకున్నాడు కూడా.

ఇది అతనిలోనున్న వెర్రితనాన్ని, మాంద్యాన్ని, మత్తును
దైన్యాన్ని, చింతను సమూలంగా దహించివేసింది. అతని హృద
యంలో నూతనశక్తి, యౌవనమదం నిండిపోయింది. తా
నేమిటో తనకు తెలిపింది. తెలుసుకున్నాడు! తన్ను తాను
తెలుసుకున్నాడు! అతనిలో ఒకనూతన చైతన్యం తొలకరించింది.

స్త్రీ ప్రణయం ఎప్పుడూ పురుషుడిలో మార్పు తెస్తుంది.
పురుషుణ్ణి ఫలవంతంచేస్తుంది. అది ఎలాటిప్రణయమైనాకావచ్చు.
ఆప్రణయం ఎన్నో బాధలకూ, కష్టాలకూ కారణం కావచ్చు.
అయినప్పటికీ అందులో నిండుతనం ఉండనేఉంటుంది. ఆ ఘన
తను, ఆ గొప్పతనాన్ని అదెన్నటికీ కోల్పోదు. ఎవరైతే ఆ
ప్రణయతాపాన్ని తాగలేకపోతారో, వారి ఆత్మల్లోమాత్రం
అది ఒక తీవ్రమైన విషంలాపనిచేస్తుంది, కాని ఆరోగ్యవంతుడికి

అలాకాదు. అది అతన్ని, నిప్పు ఇనుమును ఉక్కుగా మార్చి నట్టు మారుస్తుంది.

థోమాకు ముప్ఫయిఏండ్ల వయస్సుగల ఆ స్త్రీపై వ్యామోహం మళ్ళింది. తన కౌగిళ్ళలో గతించిపోయిన యౌవనాన్నిగురించి వాపోయే ఆ స్త్రీపై అనురక్తుడయ్యాడు. అయినా అంతమాత్రంచేత అతను తన కర్తవ్యాలను, తన వ్యవహారాలను విస్మరించలేదు. ఆమె మోహంలో పడి, ఆమె లాలింపులకు ముగ్ధుడై అతను తన పనులన్నీ విస్మరించలేదు. బాగా శ్రమించిన వాడి దాహంతీర్చిన చల్లని ద్రాక్షరసంలాగా అతనికి ఆమె ఉపయోగపడింది. నవయౌవనవంతుడైన అతని కౌగిళ్ళు, ముద్దులు, అనుభవించి ఆమెకూడా మళ్ళీ తన యౌవ నాన్ని పొందుకున్నది. ఆమె ఇప్పుడొక చక్కని యువతిగా తయారైంది.

థోమా ఫెరమ్ చేరేసరికి అతనికొక ఉత్తరం వచ్చిఉంది. ఆ ఉత్తరం అతని సంరక్షకుడైన మయకిన్ వ్రాశాడు. కొడుకు కోసం తండ్రి చాలా దిగులుపడ్డాడనీ, ఆ దిగులుపోవడం కోసం పిచ్చిగా తాగుతున్నాడనీ, కనుక త్వరలో పనులన్నీ పూర్తిచేసుకుని థోమాను ఇంటికి రావలసిందనీ, ఆ ఉత్తరంలో వ్రాశాడు. జాబు చదవగానే థోమాకు కంగారుపుట్టింది. ఇన్ని రోజులనుంచీ చీకూ, చింతా లేకుండా హాయిగా కాలంగడుపుతున్న అతని హృదయంలోకి మళ్ళీ కారుమబ్బు లొచ్చి కమ్ముకున్నాయి. కాని "పెలాగెయా" చూపుతున్న ప్రేమాదరణలలోను, తన కార్యకలాపాలలోనుపడి ఈమబ్బు లను మరిచిపోగలిగాడు. అతని జీవితం అతివేగంగా పరుగెత్తి

పోయే నదీతరంగంలా ప్రవహించసాగింది. రోజుకొక కొత్త అనుభవాన్ని చవిచూస్తున్నాడు. ప్రతిరోజూ ఒకకొత్త భావం అతని మనస్సులో మొలకెత్తుతోంది. ఇకపోతే "పెలాగెయా" విషయం మరి చెప్పనేపనిలేదు. ఒక ఉంపుడుకత్తెకు సహజంగా ఉండవలసిన తళుకు ప్రేమనంతా ఆమె ఫోమాపై కుండలతో తెచ్చి కుమ్మరిస్తోంది ఆ ఈడుగల స్త్రీలంతా జీవితాన్ని పిండి పిండి ఆ తుదకు ఆఖరునపడుతున్న బొట్లుబొట్లు రుచిచూచే ప్రేమ అది. ఎంతో వేడి, వేగము, శక్తి, తీవ్రత; ఆప్రేమలో మిళితమైఉంటాయి. కాని ఒక్కోమాటు ఆమెలో మరోరకమైనభావం జనించేది. అది ఫోమాను ఆమెకుఇంకా ఎక్కువగా కట్టుబడి ఉండేటట్టు చేసేభావం తప్పులుచేసే కొడుకును సరిదిద్దే తల్లిప్రేమలాంటిది అది. చెడు మార్గానపడి చెడిపోకుండా కొడుకుని సంరక్షించుకుంటూవచ్చే తల్లి ఆతృతలాంటిది అది. అనేక రాత్రులు అతని కౌగిళ్ళలో కూచుని ఆమె, ఎంతో మృదువుగా, పదునుగా ఉన్న తన కంఠస్వరంతో ఇలా చెప్పేది.

"నన్ను నీ అక్కయ్యగా భావించుకో, అంచాతనే ఇదంతా చెపుతున్నాను. శ్రద్ధగావిను. నేను జీవించినన్నాళ్ళు జీవించాను. జీవితమంటే ఏమిటో నాకు తెలుసు, మనుష్యులంటేఏమిటో నాకు తెలుసు. జీవితంలో ఎన్నెన్నో చూచాను. జీవితాన్ని ఎన్నిరకాలుగానో కాచాను! జీవితంలోని మంచిని చూచాను. చెడునూ చూచాను. అన్నీచూచాను. జాగ్రత్తగా తెలిసి స్నేహంచెయ్యి. స్నేహితులను ఎన్నుకునేటప్పుడు జాగ్రత్తగా పరిశీలించి ఎవరు నీకు స్నేహితులు కాతగినవారో

గ్రహించి ఆ ప్రకారం ఎన్నుకో. కొందరుంటారు అంటు రోగంకంటె హీనమైనవాళ్ళు. అంటురోగంలా అంటుకుంటే వదలరు. పైకి బాగానే ఉంటారు. చూడగానే వాళ్ళు అలాంటి వాళ్ళని తెలుసుకోలేవు. అలాంటి మనిషికూడా నీకు అందరి మనుషులకుమల్లే మామూలుగానే కనిపిస్తారు. కాని హఠాత్తుగా ఏం సంభవిస్తుందో తెలుసా? నీకు తెలియకుండానే నీవు జీవితంలో అతనిని అనుకరించడం ప్రారంభిస్తావు. తీరా కళ్ళు తెరిచి చూచేసరికి అతని అంటుకురుపులన్నీ నీకు అంటుకుని ఉంటాయి. అప్పుడది నీవు గమనించగలుగుతావు. నా విషయంలో ఏం జరిగిందో చూడు! ఒక స్నేహితుడివల్లనే నేను సమస్తాన్నీ పోగొట్టుకున్నాను. మొదట్లో నాకు భర్త ఉన్నాడు. ఇద్దరు బిడ్డలుకూడా. ముగ్గురం హాయిగా బ్రతుకుతూవచ్చాం. నా భర్త గుమాస్తాగిరీ చేస్తుండేవారు." అని చెప్పి ఆమె ఆపింది. నదిలో నీళ్ళవంక చూస్తూ చాలాసేపు కూచుంది. ఓడ నీళ్ళల్లో కదులుతోంది. కొంతసేపైన తరువాత ఆమె బరువుగా ఒక నిట్టూర్పు విడిచింది. మళ్ళీ చెప్పడంమొదలెట్టింది.

"నావంటి స్త్రీలబారినుండి నిన్ను 'పవిత్రకన్య' కాపాడు గాక! జాగ్రత్తగా ఉండు. నీవింకా పసివాడివి. ముక్కువచ్చలారని మెత్తని కుర్రవాడివి. నీగుండె ఇంకా గట్టిపడి గడుసు పారలేదు. నీవంటివాళ్ళంటే స్త్రీలు మోజుపడతారు. అందం, అదృష్టం, బలం, భాగ్యం, ఇవన్నీ ఉన్న నీలాంటి యువకులంటే! స్త్రీలు ముక్కువపడతారు. కనుక జాగ్రత్తగా ఉండు! ముఖ్యంగా మాట్లాడకుండా ముచ్చులా కూచుంటూ కే—అలాంటి స్త్రీలవిషయంలో ఎప్పుడూ జాగ్రత్తగా సంచరించు. అలాంటి

స్త్రీలు మగాణ్ణి జలగల్లా పట్టుకుంటారు. నెత్తురంతా పీల్చి పీల్చి పిప్పిచేస్తారు. కాని అలాటివాళ్ళే నీపై దయచూపిస్తారు కూడా. మెత్తగా ఉంటూనే కుతుకలు కోస్తారు. నీ సారాన్నంతా పీలుస్తూనే ఉంటారు. వాళ్ళ సారాన్ని నీకు ఇవ్వరు. పైగా నీదగ్గర పీల్చినదంతా నిల్వచేసుకుంటారు. వృథాగా, అన్యాయంగా నీ హృదయాన్ని బ్రద్దలుచేస్తారు వాళ్ళు. కనుక అటువంటి స్త్రీలకంటె నాలాగా ధైర్యసాహసాలుండే స్త్రీల సంబంధమే నీకు మంచిది. ఇలాటి స్త్రీలు నీ మూలంగా ఎంత లాభంవస్తుందా అని చూడరు.''

నిజంగా ఆమె అలాటిదే. స్వంతలాభం చూచుకునే మనిషి కాదు. ఇలాటివాటిపై ఆసక్తిలేని మనిషి. ఫెరమ్ చేరగానే థోమా ఆమెకోసం రకరకాల కొత్తవస్తువులెన్నో కొని ఇచ్చాడు. అవీ, ఇవీ అనకుండా అన్నిరకాలు కొనితెచ్చాడు. ఆమె ఎంతో సంతోషించింది. కాని వాటి నన్నింటినీ పరిశీలించినతరువాత విచారంగా ఇలాచెప్పింది.

''డబ్బును ఇలా ఇంత విచ్చలవిడిగా విరజిమ్మకు. మీ నాన్నగారికి కోపం తెప్పించకుండా చూడు. ఇలాటివేవీలేకపోయినా నిన్ను నేను ప్రేమిస్తాను.''

తాను కాజాన్‌వరకూ మాత్రమే అతనితో కలిసివస్తానని ఆమె ఇదివరకే దోవలో అతనికి చెప్పింది. కాజాన్‌లో పెళ్ళయిన తన చెల్లెలు ఒకామె ఉన్నదని ఆమె చెప్పింది. ఆమె తనను వదిలి వెళ్ళిపోతానంటే థోమా నమ్మలేకపోయాడు. కాజాన్ దగ్గరపడుతోంది. ఆమె మళ్ళీ ఆమాట జ్ఞాపకంచేసే

సరికి అతను బేజారై పోయాడు. దిగులుగా, దీనంగా ఆమెను వెళ్ళవద్దని బ్రతిమాలసాగాడు.

"ముందే ఎందుకింత దిగులు? ఇంకా ఒక రాత్రంతా మనం కలిసిఉంటాం. అంతగా నీవు దిగులుపడదలుచుకుంటే నేను సెలవు తీసుకుని వెళ్ళిపోయేటప్పుడు దిగులుపడుదువు గాని." అని చెప్పిందామె.

కాని అతను తనుపట్టినపట్టువదల్లేదు. తనను వదిలివెళ్ళ వద్దని బ్రతిమాలుకున్నాడు. ఎంత చెప్పినా ఆమె వినకపోయే సరికి చివరకు తానామెను పెళ్ళాడదలచానని మనస్సులో ఉన్న కోర్కె బయటపెట్టాడు.

"ఓ! అదా, అదా సంగతి! అరెరె!" అంటూ ఆమె పగలబడి నవ్వసాగింది. "నా భర్త బ్రతికుండగానే నిన్ను పెళ్ళాడమంటావా?' పిచ్చిపిల్లవాడా! నా ముద్దులనాయనా! ఎంత చిత్రమైన వాడివయ్యా నీవు! నన్ను పెళ్ళాడాలని ఉందటయ్యా నీకు? భలేవాడివయ్యా! పెళ్ళిచేసుకోవడానికి నాకన్నా మంచిపిల్ల దొరకదటయ్యా నీకు? నావంటి ఉంపుడు కత్తెలు నీకు చాలామంది—చాలా చాలామంది దొరుకుతారు. నీయౌవనం బాగాపొంగి పొర్లిపోయినతరువాత పెళ్ళిచేసుకో. అంతా నిండు గట్లు తెంపుకుని పోతుంది చూచావ్! అప్పుడయ్యా పెళ్ళి! తియ్యటి పంచభక్ష్య పరమాన్నాలు కడుపునిండా తిన్నతరువాత మనస్సు జొన్నరొట్టెమీదికి మళ్ళుతుంది చూచావ్? అప్పుడయ్యా పెళ్ళి! నా అనుభవంచెప్పనా! ఆరోగ్యవంతుడైనవాడు తన శాంతికోసమే త్వరగా పెళ్ళాడకుండదు. అతన్ని తృప్తిపరచడానికి ఒక స్త్రీ చాలదు. అంచాత ఒక స్త్రీమీదనుంచి మరో

స్త్రీమీదికి బుద్ధిపోతుంది. ఇలాఒకరు,ఇద్దరు, ముగ్గురు—మనసు పోతూనేఉంటుంది. ఇదంతా నీ సుఖంకోసమే చెప్తున్నా. ఒక స్త్రీ మాత్రమే నీకు చాలుఅని అనిపించినప్పుడు ఆమెను పెళ్ళాడు." అన్నదామె.

కాని ఆమె ఎంత నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తే, అంతగా థోమాకు ఆమెపై కోర్కె ఎక్కువైంది. ఆమెను పెళ్ళాడితీరాలనే మొండిపట్టు పడుతున్నాడు.

"నే చెప్పేది విను. బాగా మనసుకుపట్టించుకో. నీమేలు గోరి చెపుతున్నాను. నీ చేతిలో ఒక కాలుతోన్న కొరివి ఉన్నదనుకో. దాని వెలుతురులేకపోయినా నీవు బాగా చూడగలిగినప్పుడు ఆ కొరివి నీ కనవసరమేకదా. కనుక దానిని నీటిలో ముంచి ఆర్పివెయ్యడం మంచిది. అలా చేస్తే నీకు దాని పొగవాసన తగలదు, నీ చెయ్యీ కాలదు." అన్నదామె మళ్ళీ మెల్లగా.

" నీ మాటలు నాకర్థంకావడంలేదు." అన్నాడుథోమా.

"అర్థంచేసుకోవడానికి ప్రయత్నించు. నీవు నాకేమీ అపకారం చెయ్యలేదు కనుక నేనూ నీకెలాంటి అపకారం చెయ్యదలుచుకోలేదు. అంచాతనే నేను వెళ్ళిపోతున్నాను."

ఈ వాదన ఎలా సమాప్తమెఉండేదో తెలియదుకాని ఈ లోగానే ఒక సంఘటన జరిగింది. థోమా కాజాన్‌చేరుకునే సరికి మయకిన్ దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చిఉంది. టెలిగ్రాంలో వివరాలేమీలేవు. "పాసింజరు స్టీమరులో తక్షణంబయలు దేరిరా." అని మాత్రమేఉన్నది. థోమా హృదయం నీరసంగా ముడుచుపోయింది. కొన్నిగంటలసేపు అతనికేమీ

తోచిందిగాదు. ఆతరువాత విచారంగా డెక్ మీాదికివెళ్ళి నిలబడ్డాడు. అప్పుడే స్టీమరు హార్బరు విడిచిపెట్టి వెడుతోంది. రెయిలింగుదగ్గర నిలబడి చువ్వలుగట్టిగా పట్టుకుని తన ప్రియురాలిముఖంవంక తేరిపారచూడసాగాడు ఘోమా. ఆమె, ఆమెతోపాటు హార్బరూ, నదీతీరమూ, అన్నీ దూరమైపోవడం అతను గమనించాడు. "పిలాగెయూ" తనకేసిచూస్తూ చేతిరుమాలు ఊపుతోంది. ఆమె పెదవులపై చిరునవ్వులు చిందుతున్నాయి. కాని నిజంగా ఆమె నవ్వడంలేదనీ, ఏడుస్తూఎన్నో కన్నీటిబొట్లు రాలుస్తున్నదనీ ఘోమాకు తెలుసు. ఆ కన్నీటిబొట్టు ఒక్కొక్కటి ఒక్కొక్క గుండెపొరను చీల్చుకుని వస్తున్నదనీ అతనికి తెలుసు. ఆమె కన్నీటితో ఘోమా చొక్కాయావత్తూ తడిసి ముద్దయిపోయింది. ఆందోళన, కలవరం, అతని హృదయాన్ని కలచివేస్తున్నాయి. అతని గుండె మాచుగడలా గడ్డకట్టుకపోయింది. క్రమక్రమంగా ఆమెరూపంచిన్నదై పోతున్నది. శూన్యంలో శుష్కించిపోతున్నట్టుగా ఉంది. ఘోమా కళ్ళెత్తకుండా ఆమెవంక అలాగే నిశ్చలంగా చూస్తూ నిలబడ్డాడు. అతనికి తన తండ్రినిగురించినభయం, ఆ స్త్రీని గురించి విచారం; ఈ రెండూమాత్రమేకాక మరొకకొత్త బాధ తీవ్రమైన వ్రణంలాంటిబాధ అతని గుండెల్లో కోతపెడుతూ మేల్కొసాగింది. ఆ బాధ 'ఫలానా' అని అతను పేరుపెట్టి చెప్పలేకుండా ఉన్నాడు. అయినా అది ఎవరిమీాదనో పగలాంటిది

హార్బరులో జనం గుంపుకూడారు. గుంపంతా ఒక చీకటిమూాలకు వచ్చి చేరింది. ఆగుంపుకు ముఖ్యా, ముఖం

ఏమీలేదు. ఒక రూపంకాని, ఒక జీవంకాని; ఏమీలేదు. రెయిలింగ్ వద్దనుంచి డెక్ మీదికివెళ్ళి అక్కడ విచారంగా అటూఇటూ పచారుచేయడం మొదలెట్టాడు ఘోషా.

ప్రయాణీకులు బిగ్గరగా మాట్లాడుకుంటూ టీతాగడానికి కూచున్నారు. నౌకర్లు గ్యాలరీమీద బల్లలు సర్దుతున్నారు. క్రింద ఎక్కడో మూడో తరగతిలో ఒక చంటిబిడ్డ ఏడుపు విన వస్తోంది. ఒక హార్మోనీయం పాట సన్నగా; మూలుగుతున్నట్లు వినిపిస్తోంది. వంటవాడు దేనినో కత్తితో కోస్తున్నట్లు చప్పుడవుతోంది. గిన్నెలు, పళ్ళాలు, కదిలిస్తున్నట్లు చప్పుడు. స్టీమరు—నదీతరంగాలను అడ్డంగా కోసుకుంటూ నురుగులు కక్కుతూ బరువుగా నిట్టూరుస్తున్న ధ్వనిచేస్తూ, పెద్దకొండలాగా నదీ ప్రవాహానికి ఎదురువాలుగా అతివేగంగా వెళ్ళిపోతోంది. వెడల్పైన అలలు స్టీమరు కొసలకు కొట్టుకుని కోపంతో సంఘర్షిస్తున్నాయి. ఆ అలలబారును తిలకిస్తూ నిశ్చలంగా నిలబడి ఉన్నాడు ఘోషా. దేనినో బ్రద్దలుకొట్టాలనీ, ఛేదించివెయ్యాలనీ; ఏదో ఒకానొక బలమైన వాంఛ అతనికి కలిగింది. అంతే కాదు. బ్రహ్మాండమైన నదీప్రవాహానికి ఎదురీత ఈది దానిని తన ఎదురొమ్ముతో, బాహువులతో ఢీకొందామనే తీవ్రమైన వాంఛ అతనిలో చెలరేగింది.

"విధి!" అతని ప్రక్కవైపునుంచి ఏదో కర్కశమైన కంఠస్వరం అన్నట్లు వినిపించింది.

అదేమాట పలుమార్లు విన్నాడు ఘోషా. ఆ కంఠం అతనికి కొత్తదికాదు. అన్ఫీసా అత్తయ్య అతనడిగిన ప్రశ్నలకు ఎన్నోమార్లు ఇదే సమాధానం చెప్పింది. ఈ ఒక్క

మాటలో—ఒక చిన్న మాటలో, ఈశ్వరశక్తిలాంటి శక్తి నొకదానిని అతను ఊహించుకున్నాడు. అక్కడ మాట్లాడు తున్న మనుష్యులవైపు తిరిగిచూచాడు. వారిలో ఒక వృద్ధుడున్నాడు. మనిషి పొట్టి. ముఖం ప్రసన్నంగా ఉంది. మరొకడు అతనికంటె చిన్నవాడు. అలసినట్టున్న పెద్ద కళ్ళు, పెద్ద ముక్కు, లోనికి గుంజుకపోయిన చెక్కిళ్ళు, చిన్న గడ్డం. అతన్ని చూడగానే ఫోమాకు సరిగ్గా తన రక్షకపిత మయకిన్ గుర్తుకొచ్చాడు.

"విధి!" అంటూ ఆ వృద్ధుడు మళ్ళీ చిరునవ్వు నవ్వసాగాడు. "జీవితంలో విధి అనేది నదిలో బెస్తవాడిలాంటిది. బాధలతో, వేదనలతో బ్రతికే మనకు అది ఎరవేస్తుంది. మనం ఆశతో నోళ్ళు తెరుచుకుని దానివైపు వెడతాం. ఆ గాలంలో చేపల్లా చిక్కుకుంటాం. అప్పుడది మనల్ని పైకి లాక్కుంటుంది. తరువాత ఒడ్డున పడేస్తుంది. అప్పుడు మనిషి, ఆ నదిలోంచి ఒడ్డునపడ్డ చేపలా గిలగిల తన్నుకుంటాడు. అలా తన్నుకుని తన్నుకుని తుదకు అతనిగుండె తరుక్కుపోతుంది. అదిమనం కళ్ళారా చూస్తాం. అదిరా బాబూ అసలుసంగతి!"

ఏదో సూదిలాంటి సూర్యకిరణం వచ్చి కళ్ళల్లో గుచ్చినట్టుగా, ఫోమా గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. అతనుకూడా తల ఊపుతూ "అవును, నిజం! నీ వన్నది నిజం-నిజం!" అన్నాడు.

ఆ ఇద్దరు మిత్రులూ అతనివంక దృష్టినిలిపి చూచారు. వారిలో వృద్ధుడు ఒక తెలివైన చక్కని చిరునవ్వు నవ్వాడు. పెద్ద పెద్ద కళ్ళుగల ఆ రెండోవాడు ఏమిటో తెలియనట్టు ఊరు

కున్నాడు. అలా అతను ఊరుకోవడం ఫోమాను కలవరపర చింది. అతనికి సిగ్గుముంచుకొచ్చింది. అక్కణ్ణుంచి చరచర వెళ్ళి పోయాడు. విధినిగురించి తలపోస్తూ వెళ్ళిపోయాడు. ఆ విధి ముందతనికి ఒక స్త్రీని వరంలా ప్రసాదించింది. మళ్ళీ తాను ప్రసాదించింది తానే ఉపసంహరించుకుంది. ఇది ఎంతచిత్రం! ఫోమా ఈవిషయాన్నే తలపోస్తూ వెళ్ళాడు. ఇప్పుడు తనలో వ్రణంలా కోతపెడుతున్న బాధ, విధిపై పట్టిన పగ తప్ప మరేమీ కాదని అతనికి అర్థమైంది. ఆ విధే తన జీవితాన్ని ఆడించి పాడు చేసింది. అప్పుడప్పుడే మొట్టమొదటి విషబిందువు తన జీవిత మధుకలశంలో రాలింది. ఇంకేముంది? తన పగను తనే ప్రేమతో పెంచుకుంటూ ప్రయాణం చేసినంతకాలమూ కన్ను మూయకుండా గడిపాడు. అయితే ఈ పగ అతనిలో దుఃఖంకాని, అధైర్యంకాని కలిగించలేదు. ఆ పగ అతనిలో కోపాన్ని, కసినీ మాత్రమే ఉసికొలిపింది.

ఫోమా తన ఊరుచేరాడు. ఇంటికివెళ్ళగానే అతనికి ముందు కనిపించినవాడు మయకిన్. అతన్నిచూచి ఫోమా గాభరాపడుతూ చాలాచాలా ప్రశ్నలు వేశాడు. ఇద్దరూ బండ్లో కూచుని వెడుతున్నారు.

"మీనాన్న రోజురోజుకు చిన్నపిల్లవాడై పోతున్నాడు." అన్నాడు మయకిన్ చాలా ఉద్రేకంగా.

"ఏం? తాగుతున్నాడా?" అనడిగాడు ఫోమా.

"తాగడమేమిటి? విపరీతంగా తాగుతున్నాడు. మతి కూడా పూర్తిగాపోయింది."

"నిజంగానా? అయ్యో, దేవుడా! ఇంకా ఏంజరిగిందో చెప్పు."

"నీకు తెలియదా ఏం? అతని వెంట ఎప్పుడూ ఒక స్త్రీ ఉంటున్నది."

"ఎవరామె?" అన్నాడు ఫోమా. వెంటనే అతనికి తన ప్రియురాలు పెలాగెయా గుర్తుకొచ్చింది. ఆమె గుర్తుకు రాగానే ఎంచాతనో అతని మనస్సుకు సంతోషమైంది.

"అతన్నెప్పుడూ వదిలిపెట్టదు. అంటిపెట్టుకుని తిరుగుతోంది. జలగలాగా అతని నెత్తురు పీలుస్తోంది."

"నెమ్మదైన మనిషేనా?"

"ఓ! అదా! నిప్పుకెప్పుడైనా నెమ్మది ఉంటుందా? దానికీ అంతే! మీనాన్న దగ్గర్నుంచి కళ్ళుమూసి తెరిచేలోగా డెబ్భై అయిదువేల రూబుళ్ళు ఎగరకొట్టేసింది."

"అరెరె! ఎవరామె, చెప్పవూ?"

"సోంకా మెడిన్స్కాయా, ఒక శిల్పకారుడి భార్య."

"ఆరి దేవుడా! ఆమె అలాటి పనిచేయడం సాధ్యమా!—మరి మానాన్న—ఆమెను తన ప్రేయసిగా చేసుకోవడం సంభవమా?" అనడిగాడు ఫోమా ఆశ్చర్యపోతూ.

మయకిన్ కొంచెంతగ్గి, కళ్ళు తమాషాగా పెద్దవి చేశాడు.

"చూడబోతే నీకూ మతిపోయినట్టుందేమోయ్! ఆరి దేవుడా ! నీకూ మతిపోయింది. ఇప్పుడైనా కొంచెం తెలివి తెచ్చుకో. ఈ వయస్సులో ప్రేయసా? మీ నాన్న వయస్సెంతో నీకు తెలుసా? అరవైమూడు. పైగా ఇంతడబ్బుపోసి

కొనుక్కున్న ప్రేయసి! నీవు తెలిసే మాట్లాడుతున్నావా? సరేలే. ఈమాట ఇగ్నాట్‌కు చెప్పుతాను.” అంటూ మయకిన్ బిగ్గరగా నవ్వడం మొదలెట్టాడు. మేకగడ్డంలాఉన్న అతని గడ్డం విచిత్రంగా వణకసాగింది. అలాటిస్థితిలో ఉన్న మయకిన్ నోటినుంచి సరైనసమాధానం చెప్పించేసరికి ఫోమాకు తల ప్రాణం తోకకువచ్చింది. మయకిన్ చాలాసేపు ఏదేదో గొడవచెప్పాడు. మామూలుగా అతను నిమ్మళంగాఉండే మనిషి. కాని ఇప్పుడెందుచేతనో మాట్లాడుతూ మధ్య మధ్య ఉద్రేకం తెచ్చుకుంటున్నాడు. ఆఖరుకు ఎలాగో ఒకలాగు ఫోమాకు విషయమంతా అరమైంది. సోఫియా పావ్లోవ్నా మెడిన్స్కాయా ఒక శ్రీమంతుడైన శిల్పి భార్య. ఆమె ఆ ఊళ్ళో ఎన్నో ప్రజోపకరమైన పనులు చేసింది. ఆమె ప్రజాసేవాభిలాషిణి యని ఊళ్ళోఅందరికీ తెలుసు. ఊళ్ళో ఒక ధర్మసత్రం, ఒక గ్రంథాలయం కట్టించడంకోసం ఆమె ఇగ్నాట్ సహాయ మపేక్షించింది. అతన్ని డబ్బై అయిదువేల రూబుల్లు దానంగా ఇవ్వమని అర్థించింది. ఇగ్నాట్ అంత మొత్తం ఆమెకిచ్చేశాడు. ఆ సందర్భంలో ఇగ్నాట్ ధర్మ గుణాన్నిగురించి ప్రశంసిస్తూ పత్రికలు అతనిని పొగిడాయి. ఎప్పుడో ఒకటిరెండుసార్లు వీధిలో పోతూఉండగా ఫోమా ఆమెను చూడడం తటస్థించింది. మనిషి పొట్టిగా ఉంటుంది. ఆ ఊళ్ళో ఉన్న అందకత్తెలలో ఆమెకూడా ఒకతె అని అందరూ చెప్పుకొనడం ఫోమాకు తెలుసును. అమె నడతను గురించి కొన్ని చెడు పుకార్లు నగరంలో ప్రచారంలోఉండడం కూడా ఫోమాకు తెలియకపోలేదు.

మయకిన్ ఆ కథంతా చెప్పి ముగించినతరువాత "ఓస్, ఇంతేనా? ఏదో మునిగిపోయ్యే విషయం అనుకున్నాను." అన్నాడు ఫోమా ఏం పర్వాలేదనట్టు.

"నీవు? నీవనుకుంటున్నావా? నీవు ఏమీలేదని అనుకుంటున్నావా? గడ్డాలు, మీసాలురాని బిడ్డవు నీవు! నీకేం తెలుస్తుంది?" అన్నాడు మయకిన్ అకస్మాత్తుగా కోపం తెచ్చుకుని.

"నన్నెందుకలా తిడతావ్?" అన్నాడు ఫోమా.

"నాకోమాట చెప్పు, డెబ్బయి అయిదు వేలంటే పెద్ద మొత్తమా కాదా?"

"అవును పెద్దమొత్తమే." అన్నాడు ఫోమా ఒక క్షణం ఆలోచించి.

"ఆ, అదీ, అదీ! అలా చెప్పు."

"అయితేమాత్రం ఏం? మా నాన్నకు బోలెడు డబ్బుంది. ఈ స్వల్పవిషయాని కింత గొడవెందుకు?"

ఫోమా మాటలకు మయకిన్ ఆశ్చర్యపడ్డాడు. ఆ పిల్లవాడి మొహంలోకి ద్వేషంతో చూస్తూ ఇలా అన్నాడు.

"నీవు మాట్లాడవలసిన పద్ధతి యిదేనా?"

"నేనా? నేను మాట్లాడకపోతే ఇంకెవరు మాట్లాడతారు?"

"ప్రబద్ధం! నీవు కాదోయ్ మాట్లాడేది. నీకు పసితనంలో పట్టిన వెర్రి మాట్లాడుతున్నది. నేనూ ఇలాగే అనేకమార్లు వెర్రిలో పడబోయి తెలివిగా తప్పుకున్నాను. నీ వ్యవహారం

చూస్తే మనిషి వేలెడు, మాటలు బారెడులాగా కనిపిస్తున్నవి అప్పుడే మాటలు కోటలుదాటించకోయ్ కుర్రవాడా!"

మయకిన్ ఎప్పుడిలాంటి మాటలుమాటాడినా ఫోమాకు చిరాకుపుడుతుండేది. తన తండ్రే అనుకుంటే, తండ్రికంటె కూడా నిక్కచ్చిగా మాట్లాడేవాడు మయకిన్.

ఇప్పుడు మయకిన్ మాటలకు ఆ కుర్రాడికి మరింత కోపం వచ్చింది. ముక్తసరిగానే, కొంచెం కచ్చితంగా ఇలా అన్నాడు ఫోమా.

"పరిస్థితులు ఆలోచించకుండానన్ను నిందించడం భావ్యం కాదు. నే నింకా పాలు తాగే బిడ్డణ్ణి కాదు."

"అమ్మా, పిల్లగాడూ! చెప్పు చెప్పు. ఇంకా చెప్పు." అన్నాడు మయకిన్ కనుబొమలువిగరవేస్తూ వెక్కిరిస్తున్నట్టుగా.

ఇది ఫోమా కోపాన్ని ఇనుమడింపచేసింది. ఆ వృద్ధుడి కళ్ళల్లోకి సూటిగా చూచాడు. మళ్ళీ నిక్కచ్చిగా, నిర్భయంగా ఇలా అన్నాడు.

"నీకే చెప్పేది. ఇక నీ అభావ్యమైన నిందను నేను వినదలచుకోలేదు. ఇక చాలించు!"

"ఊఁ! సరే! క్షమించు."

యాకోవ్ తారాసోవిచ్ మయకిన్ కళ్ళు మూసుకున్నాడు. కొంచెంగా పెదవులునమిలాడు. బండి రోడ్డుమలుపు తిరిగింది. ఫోమా కూచున్న చోటునుంచి కొంచెం ముందుకుజరిగాడు! తరువాత మయకిన్ చిన్నచిరునవ్వునవ్వి ఇలా అన్నాడు.

"ఫోమా! నాకు చెప్పు. నీ వళ్ళను దేనిమీద పడును పెట్టుకున్నావు? ఏవోయ్?"

"ఏం? అంత పదునుగా కనిపిస్తున్నాయా?" అడిగాడు ఫోమా.

"సరే, మంచిదేలే! చాలా మంచిపనేలే! నీవ్వటి మంద గొడివై పోతావని నేనూ మీ నాన్నాకూడా భయపడుతుండే వాళ్ళం. సరే, మంచిదే: ఇంతకూ మరి నోడ్కా తాగడం కూడా మరిగావా?" అన్నాడు మయకిన్. చిన్నప్పటినుంచీ అంత మాద్యంగాఉండే కుర్రాడు ఇప్పుడు కాస్తచలాకీగా మాట్లాడు తున్నందుకు మయకిన్ సంతృప్తి పడ్డాడు.

"ఆ. మరిగాను." అని జవాబిచ్చాడు ఫోమా.

"అరె! ఇంత తొందరగానే! ఏమాత్రం తాగావు?

"అంతచేటెందుకు తాగాలి?"

"మంచిరుచిగా ఉన్నదా?"

"అంత రుచిగాలేదు."

"సరే, పర్వాలేదులే. ఇందులో అంతచెడుగేమీలేదు. కాని నీవు మనస్సులో ఉన్నది ఉన్నట్టు బయటికి అనేస్తావు. అదొక్కటే చిక్కు. దోవన కనిపించిన ధర్మాత్ముడికల్లా, వాడూ వీడూ అనకుండా, నీవు చేసిన పాపాలన్నీ ఏకరువుపెట్టడానికి తయారవుతావు. కాని ఎల్లప్పుడూ అలా చేయాల్సిన అవ సరంలేదని మాత్రం ఆలోచించవు. ఒక్కోమాటు బయట పడకుండా ఊరుకున్నందువల్ల నీకు క్షేమం కల్గడంకాకుండా అవ తలివాణ్ణికూడా సంతుష్టి పరిచినవాడవౌతావు. అవును. మనిషి నాలుకకు ఎప్పుడో కాని జ్ఞానండుండదు. అదిగో, రానేవచ్చాం, మనఇంటికి. నీవు వచ్చినట్టు ముందే మీనాన్నకు తెలియనివ్వ కుండాచూడు. ఇంట్లో ఉన్నాడా? ఏమో నబ్బా?"

తండ్రి ఇంట్లోనే ఉన్నాడు. అతను బిగ్గరగా, ఏదో కర్క శంగా నవ్వుతూఉండడం లోపల్నుంచి వినిపిస్తూనేఉంది. కిటికీ తలుపులు తీసే వున్నాయి. ఇంటిముందు బండి ఆగినచప్పుడు వినగానే ఇగ్నాట్ కిటికీలోంచి వీధిలోకి తొంగిచూచాడు. కొడుకు తనకంటపడగానే పట్టరానిసంతోషంతో "అరె, వచ్చా. వ్రటా నాయనా!" అని కేక వేశాడు.

కొంచెంసేపయిన తరువాత అతను ఒకచేతో ఫోమాను తనహృదయానికి హత్తుకుంటూ, రెండోచేత్తో అతని ఫాల భాగాన్ని తడిమాడు. ఇగ్నాట్ కళ్ళలో ఆనందం తొణుకు తోంది. కొడుకువంక ఆప్యాయతతో చూచాడు.

"ఎండపాటుతగిలి ఎంత నల్లబడ్డావురా నాయనా! వళ్ళు బాగా గట్టిపడ్డదికూడా. చక్కనైన చిన్నవాడు మానాయన! ఏం మేడం? నా కొడుకు ఎలా ఉన్నాడంటావు? అందంగా లేడూ?" అన్నాడు ఇగ్నాట్.

" బాగానే ఉన్నాడు !" అని ఒక మెల్లని గొంతు వెండిమ్రోగినట్టు వినిపించింది.

ఫోమా తన తండ్రి భుజంవెనుకనుంచి క్రీగంట చూచాడు. సున్నితంగా, నాజూగ్గా ఉన్న ఒక స్త్రీ గదిలో ఒకమూల కూచుని ఉండడం గమనించాడు. అద్భుతంగా అందంగా ఉన్నది ఆమె జుట్టు. నల్లటికళ్లు, సన్నగా తీర్చిన ట్లున్న కనుబొమలు, బొద్దుగా ఎర్రగా ఉన్న పెదవులు; ఆమె తెల్లటి ముఖానికి అన్నివిధాలా పొంకంగాకుదిరిఉన్నాయి. ఆమె కూర్చున్నపడకకుర్చీ వెనుకమళ్ళగా ఉన్న ఒకక్రోటన్ మొక్క పచ్చటిఆకులు ఆమె తలవెంట్రుకలమీద పడుతున్నాయి.

మయకిన్ మెల్లగా ఆమెను సమీపించి "ఏం సోఫియా పావ్లోవ్నా! కులాసాయేనా? మాలాటి పేదవాళ్ళదగ్గర ఇంకా చందాలు వసూలుచేస్తూనే ఉన్నావా?" అని అడిగాడు.

అందుకామె ఏమిజవాబుచెప్పిందీ ఫోమాకు వినిపించ లేదు. ఆమెను ఒకమాటు చూచి ఫోమా నింపాదిగా తల వాల్చుకున్నాడు ఆమెమాత్రం ఆ కుర్రాడివంక తేరిపార చూస్తూ ఎంతో ఆప్యాయతగా ఒక చిరునవ్వు నవ్వింది. ఆమె చూడడానికి చిన్న పిల్లలా ఉంది. నల్లటి సిల్కుదుస్తులు ధరించింది. ఆ దుస్తులు ఆమె కూచ్చున్న పడకకుర్చీ రంగులో కలిసి పోతున్నాయి. పచ్చని ఆకులక్రింద కూచున్న ఆమె ఒక చక్కని పువ్వులా ఉంది.

"చూచావా సోఫియాపాల్లోవ్నా! మావాడు నీవైపు ఎలా నివ్వెరపోయిచూస్తున్నాడో చూడు!" అన్నాడు ఇగ్నాట్.

ఆమె కళ్లు చిన్నవైనాయి. వల్చని సిగ్గుతెరవచ్చి ఆమె ముఖంమీద కప్పింది. పక్కున నవ్వింది. ఆ నవ్వు ఒక చిన్న వెండిగంట మ్రోతలా వినిపించింది.

"సరే, నేను వెడతాను. మీ పనులకు ఆటంకం కలిగించడం ఇష్టంలేదు. సెలవు." అన్నదామె వెంటనే లేచి.

ఆమె మెల్లగా, చల్లగా ఫోమా పక్కనుంచివెడుతుంటే అతనికి అత్తరువాసన గుప్పునకొట్టింది. ఆమె కళ్ళు నీలాల కళ్ళు అని ఫోమా గమనించాడు. కనుబొమలుమాత్రం నల్లగానే ఉన్నాయి. ఆమె వెళ్ళిపోగానే "మాయలమారి

మెల్లగా జారుకున్నది.'' అన్నాడు మయకిన్ నిమ్మళంగా. ఆమె వెళ్ళినదిక్కు కోపంగా చూచాడతను.

"సరే, అబ్బాయీ! నీ ప్రయాణంలో విశేషాలేమిటో చెప్పు. ఏమాత్రం డబ్బు తగలేశావు?'' అని అడిగాడు ఇగ్నాట్, అంతకుముందు మెడిన్‌స్కాయా కూచున్న కుర్చీలోనే ఇప్పుడు కొడుకును కూచోబెట్టడానికి యత్నిస్తూ. కాని ఫోమా తండ్రివంక అదోలాచూచి ఆ కుర్చీలో కూచోకుండా మరోకుర్చీలో కూచున్నాడు.

"ఆమె చక్కని యువతికదూ!'' అన్నాడు మయకిన్ ఫోమావంకచూచి చమత్కారంగా నవ్వుతూ. "ఆమెవంక అలాగే నోరుతెరిచి చూస్తున్నావూ అంటే, నీలోపలఉన్న సర్వస్వాన్నీ తినేస్తుంది, జాగ్రత్త!'' అన్నాడతను మళ్ళీ.

ఏకారణంవల్లనో ఫోమా భయంతో వణికిపోయాడు. ఆమాటకేమీ జవాబుచెప్పలేదు. తండ్రితో తన ప్రయాణ విశేషాలనుగురించి చెప్పడం మొదలెట్టాడు. ఉన్నవి ఉన్నట్టుగా చెప్పుతున్నట్టు కనిపిస్తున్నాడు. కాని మధ్యలో తండ్రి అతని మాటలకు అడ్డువచ్చి "ఉండు. కాక్‌నాక్ తెప్పిస్తాను, తాగుదువుగాని. అది మంచి పానీయం'' అని అన్నాడు.

"మరి నీవు ఇన్నాళ్ళబట్టీ బాగాతాగుతున్నావటగా?'' అని అడిగాడు ఫోమా, తన తండ్రిని.

ఇగ్నాట్, కొడుకువంక విచిత్రంగాను నివ్వెరపాటుతోను చూచాడు. మళ్ళీ ఇలా అడిగాడు: "నీవు నీ తండ్రితో మాట్లాడవలసిన పద్ధతి ఇదేనా?''

ఫోమా కలవరపడి తలవంచుకున్నాడు.

"అదిగో, రానేవచ్చింది." అంటూ ఇగ్నాట్ పానీయం తన దగ్గరికి తెమ్మని ఉత్తర్వు చేశాడు.

మయకిన్ చమత్కారంగా కళ్ళు తిప్పుతూ ఆ అబ్బా కొడుకులవంక చూచాడు. పిమ్మట వారివద్ద సెలవుతీసుకుని సాయంత్రం వారిద్దరినీ తన తోటలో 'టీపార్టీ' కి రమ్మని ఆహ్వానించి వెళ్ళిపోయాడు.

"అన్ఫీసా అత్తయ్య ఎక్కడుంది?" అడిగాడు ఫోమా.

"మఠానికి వెళ్ళిందిలే. సరే కాని, ఇక నీసంగతి చెప్పు. నేను కొంచెం కాక్‌నాక్ తాగుతాను."

ఫోమా కొద్దినిముషాలలో తనవిషయాలన్నిటినీ గురించి క్లుప్తంగా తండ్రితో చెప్పాడు. చివరకు ఇలా ఉన్నమాట ఒప్పు కుంటూ తన కథ ముగించాడు.

"నా స్వంతానికి చాలాడబ్బు వాడుకున్నాను.

"ఎంత?"

"దాదాపు ఆరువందల రూబుళ్ళు."

"ఆరు వారాల్లోనా! చాలా ఎక్కువ ఖర్చు చేశావు. ఒక గుమాస్తా ఖర్చుపెట్టిన విధంగా నీవూ ఖర్చుపెట్టావు.

"మూడువందల "పుడ్లు" ధాన్యం ధానం చేశాను"

"ఎవరికి? ఏ విధంగా?"

ఫోమా విషయమంతా చెప్పాడు.

"ఊ. సరే, బాగానే ఉంది!" అంటూ ఇగ్నాట్ సమ్మతించాడు. "మన అంతస్తుకు తగినట్టుచేశావు. తండ్రి ప్రతిష్ట, వ్యాపారసంస్థ గౌరవము నిలబెట్టావు. దీనివల్ల నష్టమేమీలేదు. ఎందుచేతనంటే ఇలాంటిపని మనకు గొప్పకీర్తి తెస్తుంది. పైగా

వ్యాపారం వృద్ధిపొందడానికి ఇంతకుమించిన ప్రచారము, ప్రకటన, లేదుగా అబ్బాయీ! సరే. ఇంకా ఏమిటి?"

"ఇంకా మరికొంత నేనేదో విధంగా ఖర్చుపెట్టాను."

"ఉన్నమాటచెప్పు. భయంలేదు. డబ్బును గురించికాదు నేను నిన్ను అడుగుతున్నది. నీ వక్కడ ఏవిధంగా జీవించావో చెప్పమని అడుగుతున్నాను."

"తింటుండేవాణ్ణి. తాగుతుండేవాణ్ణి." ఫోమా పూర్తిగా బయటపడలేదు. కాని ఆందోళనతో తల దించుకున్నాడు.

"వోడ్కా- తాగుతున్నావా?"

"వోడ్కా- కూడా."

"అరె! అలాగా. చాలాతొందర్లోనే ప్రారంభించావే?"

" ఎఫిమ్‌ను అడగండి. వళ్ళు తెలియనంతగా నేను ఎన్నడూ తాగలేదు."

"ఎఫిమ్‌ను ఎందుకుఅడగం? అన్ని విషయాలూ నీవే స్వయంగా చెప్పాలి. ఆ. అయితే తాగుతున్నావన్నమాట, ఏమో, నాకంతగా ఇష్టంలేదు."

"కాని, తాగకుండాకూడా నేనుఉండగలను."

"ఇదిగో; రా! కొంచెం కాగ్‌నాక్ పుచ్చుకుంటావా?"

ఫోమా, తండ్రివంకచూచి గొప్పగా నవ్వాడు. తండ్రి దయతో చిరునవ్వునవ్వి సమాధానం చెప్పాడు.

"ఒకేయ్, తాగరా! పిచ్చినాయనా! తాగు. కాని, భద్రంగా ఉండు —— నీపనిమాత్రం చెరుపుకోకు. తాగుడంటే ఏమిటనుకున్నావు? తాగుబోతుకు కమ్మని నిద్రపడుతుంది. బుద్ధిహీనుడికి అదీపట్టదు. మనసంతృప్తికోసం, ఈవిషయాన్ని

కనీసం ఇంతవరకైనా అర్థంచేసుకుందాం. మరినీవు అమ్మాయి లతోకూడా హాయిగా గడిపావా? నిజంచెప్పు! నిన్ను కోడ తానని భయపడుతున్నావా ఏమిట్రా? చెప్పు."

"అవును. స్టీమర్‌లో ఒక చిన్నది ఉన్నది. పెరమ్ నుంచి కాజాన్ వరకూ ఆమెతోనే ఉన్నాను."

"ఊఁ." అంటూ ఇగ్నాట్ బలంగా నిట్టూర్చాడు. కను బొమలుచిట్లిస్తూ మళ్ళీ ఇలా అన్నాడు. "చాలా తొందర్లోనే తప్పటడుగు వేశావు."

"నా కిప్పుడు వయస్సు ఇరవై. మీ కాలంలో పదిహే నేళ్ళకే పెళ్ళిచేసుకునేవాళ్ళని నీవే చెప్పావుగా!"

"అవును. ఆరోజుల్లో అలా పెళ్ళిచేసుకునేవాళ్ళు. సరే అది పోనీయి. ఇక ఆ విషయం వదిలేదాం. ఒక ఆడదానితో సాంగత్యం చేశావు. అంతేకదూ? స్త్రీతోసంబంధం టీకాలు వేయించుకోవడం వంటిది. జీవితంలో ఒక్కమారైనా టీకాలు వేయించుకోకుండా జరగదు. అలాగే స్త్రీతో ఒక్కసారైనా సంబంధం పెట్టుకోకుండా జీవితం జరగదు. నామటుకు నేను, అరవిడిచి చెపుతున్నాను – నీకంటె చిన్న వయస్సులోనే నేను ఆడవాళ్ళవెంట తిరగడం మొదలెట్టాను. కాని వాళ్ళ విష యంలో నీవుమాత్రం నీ జాగ్రత్తలో నీవుఉండాలి."

ఇగ్నాట్ మనస్సు ఆలోచనలో మునిగింది. చాలా సేపు తలదించుకుని ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు. తరువాత ఒక నిశ్చితమైన కంఠస్వరంతో మళ్ళీ మాట్లాడసాగాడు.

"విను ఫోమా! నేనింకా ఎన్నాళ్ళో బ్రతకను. వృద్ధుడనై పోయాను. గుండెల్లో ఏదో ఎగతట్టినట్టు బాధగా ఉంటోంది.

నేను చనిపోతాను. తరువాత నా బరువులన్నీ నీమీద పడ తాయి. అన్నివ్యవహారాలు నీవే చక్కదిద్దుకోవలసివస్తుంది. మొదట్లో నీ రక్షకపిత-మయకిన్ నీకు కొంత తోడ్పడతాడు. జాగ్రత్తగా అతనిమాట విను. నీ జీవితం బాగానే మొదలైంది. అన్ని వ్యవహారాలూ సక్రమంగానే నిర్వహించుకుని వచ్చావు. కళ్ళేలు గట్టిగానే పట్టుకున్నావు. డబ్బు ఎక్కువ ఖర్చు చేసినా, తెలివిగానే సంచరించావని స్పష్టమవుతోంది. కనుక పర్వాలేదు. భవిష్యత్తులోకూడా ఇలాగే జరగాలని భగవంతుణి ప్రార్థిస్తు న్నాను. కాని ఒకవిషయం గుర్తుంచుకో. వ్యాపారమనేది ఒక బలమైన గొడ్డులాంటిది. దాన్ని జాగ్రత్తగా పట్టుకరావాలి. దానిని గట్టిగా పగ్గాలతో కట్టివెయ్యాలి. లేకపోతే అది తెంపు కుని పరుగెడుతుంది. ఇక అప్పుడు నీచేతికి చిక్కదు కనుక ముందునుంచే జాగ్రత్తగా మచ్చికచేసుకుని దాన్ని నీవు వశం చేసుకోవాలి. కనుక నీ వ్యాపారంమీద నీవే నిలబడు. అదంతా నీ కాళ్ళక్రింద గట్టిగా పడిఉండేట్టు దానిమీద నిలబడు. అప్పుడు నీకు దానిలోని మెలుకువలన్నీ తెలుస్తాయి."

ఫోమా తనతండ్రి విశాలమైన వక్షస్థలంవంక చూచాడు. అతని బరువైన కంఠస్వరం విని తనలో "నీవు ఇంత త్వరలోనే చనిపోవు." అని అనుకున్నాడు. అలా అనుకునేసరికి అతని మనస్సు కాస్త కుదుటపడింది. తండ్రిపట్ల అనురాగం, అభి మానం పుట్టుకొచ్చాయి.

"మయకిన్ సలహాలు స్వీకరించు. అతనిబుర్ర అమోఘ మైనది. ఈ నగరానికంతా పంచిపెట్టగల ప్రపంచజ్ఞానం అతని బుర్రలోఉంది. ఇక అతనికి లేనిదల్లా ధైర్యం. అదొక్క టే-

అది ఒక్కటి ఉన్నట్టయితే ఈపాటి కతను ఉన్నతశిఖరాల్లో ఉండేవాడు. అవును. నిజం చెపుతున్నాను! భూమిమీద నాకు రోజులు దగ్గరపడ్డాయి. ఇప్పటికే చాలా కాలం ఉపేక్షించాను. ఇకనైనా చావుకు సిద్ధపడాలి. అన్నిపనులూ అవతలికి నెట్టి ఉపవాసాలు ప్రారంభిస్తాను. భగవద్భక్తితో ఉంటాను. అందరూ నన్నుగురించి మంచిగా చెప్పుకునేట్టు ప్రవర్తించాలి.'' అన్నాడు ఇగ్నాట్.

"మరేం పర్వాలేదు. అందరూ నిన్ను మంచివాడనే అనుకుంటారు.'' అన్నాడు ఫోమా.

"అనుకోవడానికి ఏదైనా ఒక కారణం అంటూ ఉండాలి కదా!''

"ధర్మసత్రం కట్టిస్తున్నావటగా?''

ఇగ్నాట్, కొడుకువంక చూచి నవ్వడం మొదలెట్టాడు.

"అయితే అప్పుడే మయకిన్ సందుచూచుకుని అంతా చెప్పాడన్నమాట? పిసినిగొట్టు ముసలాడు. నన్ను బాగా తిట్టి ఉండాలే?''

"కొద్దిగా.'' అన్నాడు ఫోమా చిరునవ్వు నవ్వుతూ.

"అవునులే. నాకతనిసంగతి తెలియదూ?''

"అదంతా తన సొంతసొమ్ము అయినట్టు మాట్లాడాడు.'' అన్నాడు ఫోమా.

అదివిని ఇగ్నాట్ పడకకుర్చీలో ఒరగబడిపోయి మరీ పెద్దగా నవ్వడం మొదలెట్టాడు.

"ఆరి ముసలి రాబందా? ఒరేయ్! అది నా డబ్బయినా తన డబ్బయినా అతనికి ఒకటే. కాని అతని మనస్సులో ఒక

ఉద్దేశం ఉన్నది. అదేమిటో చెప్పగలవా?" థోమా కొంచెం సేపు ఆలోచించి "నాకు తెలియదు" అని అన్నాడు.

"ఒరేయ్! నీది మందబుద్ధి. అతను మన అదృష్టాలు చెప్పాలనుకున్నాడు."

"అదేలాగా?"

"ఎలాగో, ఇప్పుడూహించు, చూద్దాం".

థోమా తన తండ్రిముఖం చూచి కనిపెట్టాడు. అతని ముఖం నల్లగామారిపోయింది. కుర్చీలోంచి కొద్దిగాలేచి నిశ్చయంతో ఇలా అన్నాడు.

"వద్దు. నాకక్కరల్లేదు. నే నామెను పెళ్ళిచేసుకోను!"

"అయ్యో, అదేమిటా? గట్టివరుసపిల్ల. తెలివి తక్కువది కాదు. అతని కది ఒక్కతే కూతురు."

"మరి తారాస్ సంగతేమిటి? అతను వెళ్ళిపోయాడు కదూ? ఏమైనా నే నాపిల్లను పెళ్ళాడను!"

"ఆవెళ్ళినవాడు మళ్ళీ రావడమంటూ లేదు. వాడిసంగతెందుకు? అసలు నేమాట్లాడేది అతన్ని గురించి కాదురా నాయనా. ఒక వీలునామా ఉంది. అందులో నాయావత్తు సిరచరాసులూ నాకుమారైకు చెందుతా'యని వ్రాసిఉంది. పైగా నా స్నేహితుడికూతురు. నీ విష్టపడితే అన్నీ సరిచేస్తాను."

"ఎలా అయినా ఒకటే. నే నామెను పెళ్ళాడేదిలేదు!" అన్నాడు థోమా, ఒక నిశ్చయంతో. "సరే, దీన్నిగురించి ఇప్పుడాలోచించవలసిన తొందరఏమీ లేదులే. అయినా, ఆపిల్ల మీద నీకెందుకంత అయిష్టం?" అడిగాడు తండ్రి.

"ఆమెలాఉండేపిల్ల లెవరైనా నాకిష్టముండదు."

"అలాగా! అయినా ఒకమాటు ఆలోచించుకో! ఇంతకూ నీకెలాటిపిల్లలంటే ఇష్టమో అడగవచ్చా?"

"ఆడంబరమేమీ లేనిపిల్లలు నాకు నచ్చుతారు. ఆమె కెప్పుడూ తనచదువు, తన పుస్తకాలు, కాలేజీ విద్యార్థులు; వీటిగొడవే. ఎలాగైనా నాకంటె చదువుకున్నపిల్ల, నన్ను అవమానిస్తుంది." అన్నాడు ఫోమా ఉద్రేకపడుతూ.

"అవును. అదినిజమే. చాలా తెగింపుగలపిల్ల. కాని ఇదేమంత పెద్దసంగతికాదు. కొంచెం ప్రయత్నంచేస్తే ఎలాటి తప్పునైనా వదలగొట్టవచ్చు. ఏమైనా ఇదినీభవిష్యత్తుకు సంబంధించిన విషయం. మయకిన్ గొప్ప తెలివైనవాడు. మంచివాడుకూడా. సాధుస్వభావం. అతనిజీవితమంతా చల్లగా గడిచింది. ఎక్కడికీ తిరగవలసినపని లేకుండా పదిలంగా కూర్చుని అన్నివిషయాలు చక్కగా ఆలోచించుకున్న మనిషి. అతని సలహావినడం నీకెప్పటికైనా మంచిదే. లోకవ్యవహారాలన్నీ కాచి వడపోసినవాడు. తారాస్ ఇంటినుంచి వెళ్ళిపోవడంతో అతనివేరు తెగిపోయినట్టయింది. అతని స్థానంలో నిన్ను ఉంచుదామనుకున్నాడు."

"నాకు నచ్చినచోటు నేనే ఎంచుకోగలను." అన్నాడు ఫోమా, మొండిగా.

"ఇంకా నీకు కుర్రతనం పోలేదు." అన్నాడు ఇగ్నాట్ కొడుకు చెప్పిన జవాబుకు నవ్వుకుంటూ.

అంతలో అన్‌ఫీసా అత్త వచ్చింది. ఆమె రావడంతో వారి సంభాషణ ఆగిపోయింది. ఆమె లోపలికివచ్చి రావడంతోనే "వచ్చావా, ఫోమా!" అని అడిగింది.

ఫోమా లేచి చిరునవ్వుతో ఆమెకు ఎదురువెళ్ళాడు.

తిరిగి 'ఫోమా జీవితం నింపాదిగా ప్రవహింప సాగింది. మళ్ళీ వ్యాపారం విషయాలు, తండ్రి నీతులు బోధిస్తూఉండడం అంతా మామూలుగానే సాగుతూఉంది. ఇగ్నాట్ కొడుకును ప్రోత్సహిస్తున్నట్టు మాట్లాడుతున్నాడు. కాని కచ్చితంగా ఉంటున్నాడు. చిన్నతనంనుంచీ స్వేచ్ఛగా పెంచుకొచ్చానని కొడుక్కు తరుచు జ్ఞాపకంచేస్తూ ఉండేవాడు.

"నీవంటి కొడుకును మరో తండ్రిఅయితే కొట్టేవాడు. నే నెన్నడూ నీపై చెయ్యి చేసుకోలేదు." అని అనేవాడు ఇగ్నాట్.

"అవును. నిజంగా నేను అలాంటి శిక్షలకు తగను." అన్నాడు, ఫోమా ఒకనాడు. అతనలా మాట్లాడినందుకు తండ్రికి కోపం వచ్చింది.

"హద్దుమీరి మాట్లాడకు." అని గర్జించాడు తండ్రి.

"చేనాతి మెతకదనంవల్లనే నీకింతధైర్యంవచ్చింది. నేను ఏమాటచెప్పినా దానికి ఎదురు జవాబు వెదుకుతుంటావు. జాగ్రత్త! నాచెయ్యి మెతకదే అయినా, అందులో ఇంకా వేడి రక్తం ఇంకిపోలేదు. నీవళ్ళు వాయగొట్టగలను. వచ్చిన చిక్కేమిటంటే చూస్తూచూస్తుండగనే చెట్టుపెరిగినట్టు పెరిగి నాఅంతవాడివయ్యావు. అప్పుడే చెడువాసనకూడా తగిలింది." అనేవాడు మళ్ళీ ఇగ్నాట్.

ఒకనాడు తండ్రి కులాసాగాఉన్న సమయం గుర్తించి ఫోమా మెల్లగా దగ్గరికివెళ్ళి అడిగాడు.

"నామీద నీకంతకోపమెందుకు నాన్నా?"

"కన్నతండ్రి కోపాన్ని ఆపాటి సహించలేవా?" అన్నాడు ఇగ్నాట్, మళ్ళీ వాదనకు సిద్ధపడుతున్నట్టు.

"అలాఅనడం అన్యాయం నాన్నా! నేను వెనుకటికంటె ఏమీ చెడిపోలేదే. నాతోటి కుర్రాళ్ళు ఎలాంటి జీవితాలు గడుపుతున్నారో నేను కళ్ళారా చూస్తున్నాను."

"నేనొక్కమాట అన్నంతమాత్రాన నీవళ్ళేమీ కందిపోదు. అసలు నిన్నెందుకు తిడతానో తెలుసా? నాలోలేనిది ఏదో నీలో ఉన్నది. అదేమిటో నాకు సరిగ్గా తెలియదుకాని, అదిమాత్రం నీలో స్పష్టంగా అగుపిస్తూనేఉంది. అదే నీకు ప్రమాదం తెచ్చిపెడుతుందని నాభయం. అందుకే నిన్ను తిడతాను."

ఇగ్నాట్ మాటలు ఫోమాలో తీవ్రమైన ఆలోచనను రేకెత్తించాయి. తండ్రి చెప్పినట్లు తనలో ఏదో వైపరీత్యం ఉన్నట్టుకూడా గుర్తించగలిగాడు. తన వయస్సు కుర్రాళ్ళనుండి తనను వేరుచేసే విచిత్రం ఏదో తనలో ఉన్నదని అతను గ్రహించాడు. కాని అదేమిటో అతనికీ అర్థంకాలేదు. తనపై తనకే అనుమానం కలిగింది.

బేరసారాల్లో కూచుని లావాదేవీలు జరపడమంటే ఫోమాకు ఇష్టంగాఉండేది. బేరాలు వేలరూబుళ్ళ సంఖ్యలో సాగుతూ ఉండేవి. పెద్దపెద్ద వర్తకులొంతా వచ్చి నిండుగా నింపాదిగా బేరాలుచేసుకుంటూ ఉండేవారు. చిన్నకారువర్తకులంతా తాను లక్షాధికారిబిడ్డ అని నమస్కారాలుచేస్తుండేవారు. ఈ గౌరవమర్యాదలన్నీ చూచి ఫోమా సంతోషంతో పొంగిపొయ్యేవాడు. తండ్రి వ్యాపారంలో తాను కూచుని

ఏదైనా ఒక పని సక్రమంగా నిర్వహించినప్పుడు అతనికి సంతో షంతోపాటు, గర్వంకూడా కలిగేది. అందుకు తండ్రికూడా మెచ్చుకుంటూ ఒక చక్కని చిరునవ్వుతో కొడుకును సత్క రించేవాడు.

ఫోమాకు ఒక గొప్ప ఆశ ఉండేది—తాను గొప్ప వ్యాపారస్థుడికిమల్లే కనిపించాలనే కోర్కె బలంగాఉండేది. కాని అతని జీవితం పూర్వంలాగానే—అంటే స్టీమరు ప్రయాణం చెయ్యక ముందులాగానే ఒంటరిగా గడుస్తూఉండేది. నిత్యం తన ఈడు వర్తకుల కుర్రాళ్ళతో సంబంధం ఏర్పడుతున్నా అతనికి వారితో స్నేహంచెయ్యాలనిలేదు. వాళ్ళు అప్పుడప్పుడు అతన్ని విందులకూ వినోదాలకూ తమతోపాటు రమ్మని ఆహ్వానించే వారు. అయినా అతను నిర్మొహమాటంగా రానని చెప్పేసే వాడు. పైగా వాళ్ళనుచూచి పరిహాసంగా నవ్వేవాడుకూడా.

"నాకు భయం. మీరు వెళ్ళి మీ తండ్రులతో చీవాట్లు తినండి. నాకు అందులో భాగంవద్దు." అని అనేవాడు.

ముఖ్యంగా వాళ్ళంటే అతనికి అయిష్టం ఎందుకంటే, వాళ్ళు తమ తండ్రులకు తెలియకుండా భ్రష్టజీవితాన్ని గడుపు తున్నారు. తండ్రులదగ్గరనుంచి దొంగిలించిన డబ్బుతోనో, దీర్ఘకాలపు ప్రాంశరీనోటుపై అప్పుతెచ్చిన సొమ్ముతోనో, వాళ్ళు విలాసాలు, వినోదాలు చేస్తున్నారు. ఇదే అతనికి అసహ్యంగా కనిపించేది. పోతే వాళ్ళకుకూడా ఫోమా అంటే అంత ఇష్టం ఉండేదికాదు. అతను ఎవరితోనూ కలిసిమెలిసి తిరగడనీ, అలా ప్రత్యేకంగా తిరగడంలో ఒక అహంభా వము, గర్వము, ఉన్నాయనీ వాళ్ళనుకునేవారు. ఫోమాకు

పెద్దవాళ్ళతో మాట్లాడడమంటే భయంగా ఉండేది. వాళ్లు తనకంటె గొప్ప తెలివికలవాళ్ళనీ, వాళ్ళముందు తానెందుకూ పనికిరానివాడుగా కనిపిస్తాననీ అతనికి బాధ, భయమూను.

అతనికి తరుచుగా "పెలాగెయా" గుర్తుకు వస్తుండేది. మొదటమొదట మనస్సులో ఆమె రూపం పొడకట్టినప్పుడల్లా విచారం వేసేది. కాని రోజులు గడిచినకొద్దీ, ఆమె తాలూకు వెలుగువెలుగు రంగులన్నీ చెరిగిపోతూ వచ్చాయి. ఆ సంగతి గ్రహించేసరికి అతని మనోవీధిలో నాజూగ్గా దేవకన్యలా కనిపించే మెడిన్స్కాయారూపం విహరించసాగింది. ప్రతి ఆదివారంనాడూ ఆమె ఇగ్నాట్ వద్దకు వస్తూఉండేది. అతనితో ఎన్నెన్నో విజ్ఞాపనలు చేసుకుంటూఉండేది. ముఖ్యంగా ధర్మసత్రం కట్టుబడి త్వరగా ముగించాలని ఆమె చెపుతూ ఉండేది. ఆమె ఇంటికివచ్చినప్పుడల్లా ఆమె సమక్షంలో ఫోమాకు ఎంచాతనో రోతపుట్టినట్లుండేది. అలా రోతపుడుతున్నందుకు అతను బాధపడేవాడు కూడా. సోఫియా పావ్లోవ్నా మెడిన్స్కాయా అతనివంక తనవిశాలమైన కళ్ళువిప్పి ప్రీతిగా చూస్తుండేది. అప్పుడతనికి ఎక్కడలేనిసిగ్గు, భయము, ఆవరించేవి. ఆమె తనవంకచూచినప్పుడల్లా ఆమెకళ్ళు నల్లగా మారిపోయేవి. పైపెదవి అదిరేది. రెండు పెదవులు విచ్చుకొని సన్నటి పలువరుస కనిపించేది. ఎందుకో అతనికి భయం. భయంతో అతను ఆమెవంక తదేకదృష్టితో చూస్తుండేవాడు. ఒకనాడు ఫోమా ఆమెవంక అదేపనిగాచూడడం తండ్రి గమనించి ఇలా హెచ్చరించాడు.

"ఆమె ముఖంవంక ఎందుకలా చూస్తావు? ఇక ఆమెవంక చూడకు. ఆమె ఎవరనుకున్నావు? నివురుకప్పిన నిప్పులాంటిది ఆమె. పైకి బూడిదలా నల్లగా మెత్తగా కనిపిస్తుంది. కాని ముట్టుకున్నావూఅంటే కాల్చివేస్తుంది! జాగ్రత్త!"

మెడిన్స్కాయా ఆ కుర్రాడిలో ఎలాంటి కామోద్రేకాన్నీ కలిగించలేకపోయింది. ఎంచేతనంటే "పెలాగెయా" లో ఉన్న సాధారణగుణాలేమీ అతనికి ఈమెలో కనిపించలేదు. పైగా ఈమె అందరి స్త్రీలకుమల్లే అగుపించడంలేదుకూడా. ఆమె నడతనుగురించి ఎన్నో అవమానకరమైన, లజ్జాకరమైన పుకార్లు పుట్టిఉండడంకూడా అత నెరుగును. కాని వాటిమీద అతనికి నమ్మకంలేదు. ఒకరోజు ఆమె ఒక లావుపాటి మగాడిప్రక్కన కూచుని బండ్లో వెడుతూ ఉండడం ఫోమా చూచాడు. అతని ముఖం ఎర్రగా గుండ్రటి తిత్తిలా ఉంది. అతని జుట్టు భుజాలమీద వడుతోంది. గడ్డమూ లేదు, మీసమూ లేదు. నెత్తిమీద బూడిదరంగు టోపీ ఒకటి పెట్టుకున్నాడు. ఆడమనిషి మగాడివేషం వేసుకుంటే ఎట్టా ఉంటుందో అట్లా ఉన్నాడతను. అతనే ఆమె భర్త అని ఫోమాకు చెప్పారు. అటుపిమ్మట ఏవేవో పరస్పరవిరుద్ధమైన భావాలు అతనిలో మొలకెత్తాయి. ఆ శిల్పిని అవమానంచేయాలని అనిపించింది. అతనిమీద అసూయ,మళ్ళీ వెంటనే గౌరవంకూడా కలిగాయి. ఇప్పు డతనికళ్ళకు మెడిన్స్కాయా తక్కువ అందగత్తెగాను, ఎక్కువ అందుబాటులో ఉన్నట్లుగాను కనిపించింది. ఆమెనుగురించి జాలిపడసాగాడు. అయినప్పటికీ ఇలా అనుకు

న్నాడు. "అతను ముద్దుపెట్టుకున్నప్పుడు ఆమెకు తప్పకుండా రోతపుట్టి తీరుతుంది."

ఇదిలాఉండగా అప్పుడప్పుడు అతని హృదయంలో ఏదో శూన్యత ఆవరించేది. అది ఒక పెద్ద అగాధంగా ఉన్నట్టనిపించేది. ఏదో బరువుగా బాధపెడుతున్నట్టు తోచేది. ఆ శూన్యమును దేనితోనూ నింపడానికి వీలులేదు. అప్పుడప్పుడే గడచిన ఆనాటి స్మృతులతోగాని లేక గతించిపోయిన స్మృతులతోగాని, ఆశూన్యతను నింపడానికివీలులేదు. ఒకవైపునతన వ్యాపారవ్యవహారాదులు, మరొకవైపున మెడిన్స్కాయాను గురించినభావాలు; వీటన్నిటినీ ఆశూన్యతమ్రింగివేసింది. అతనిహృదయంలోకల్లోలం బయలుదేరింది. ఆ అగాధమైనశూన్యతకు అట్టడుగున ఏదోఒక విభిన్నశక్తి, ఏదో ఒక విచిత్రశక్తి,దాక్కునిఉన్నట్టుగా అతనికితోచింది. కాని దానికింకా ఒక రూపమంటూ ఏర్పడలేదు. క్రమక్రమంగా, మెల్లగా, చాలాజాగ్రత్తగా అది ఒక రూపం ఏర్పరుచుకోవడం మొదలెట్టింది.

ఈలోపల ఇగ్నాట్‌లోకూడా మార్పువచ్చింది. అతనిలో బయటికి పెద్దమార్పేమీ కనిపించకపోయినా, క్రమక్రమంగా అతనిలో చిరాకు, చీదర, ఎక్కువవుతూవచ్చాయి. ఏదో అనారోగ్యంగా ఉంటున్నదనీ, అశాంతిగా ఉంటున్నదనీ పదేపదే చెపుతున్నాడు.

"నాకు నిద్రపోయింది. పూర్వం నామీద పిడుగులుపడ్డా మెలకువవచ్చేదికాదు. ఇప్పుడు ఎంత తన్నుకున్నా, ఎటునుంచి ఎటు పొర్లినా తెల్లవారుజాముదాకా కళ్ళు మూతలు పడడం లేదు. అప్పుడైనా గాఢంగా నిద్రపట్టదు. కలతనిద్ర. మధ్య

మధ్య అనేకమార్లు లేవాల్సివస్తుంది గుండెకూడా సహజంగా కొట్టుకోవడంలేదు. ఒక్కోమాటు ఆగిపోతుందేమో అనికూడా అనిపిస్తోంది. అలసిపోయినట్టు టక్-టక్-టక్ మంటోంది. అప్పుడప్పుడు హఠాత్తుగా క్రుంగిపోయినట్టనిపిస్తుంది. "అయ్యో, భగవంతుడా! నన్ను కృపచూడు. నీ కరుణామృతాన్ని నాపై వర్షింపచెయ్యి," అంటూ ఇగ్నాట్ ఆకాశంవంకచూస్తూ దేవుణ్ణి ప్రార్థిస్తున్నాడు. బరువుగా నిట్టూరుస్తున్నాడు. పూర్వం ప్రకాశవంతంగా తళతళమెరుస్తుండే అతని కళ్ళల్లో ఇప్పుడు ఏమాత్రం కాంతిలేదు.

"ఎక్కడో దగ్గర్లోనే చావు నాకోసం కాచుకుని కూచుంది." అన్నాడు ఇగ్నాట్ ఒకనాడు, విచారంగా. అతను అన్నట్టుగానే జరిగింది. త్వరలోనే అది ఏనుగంత అతని శరీరాన్ని పెద్ద వృక్షాన్ని కూల్చినట్టు నేలకూల్చింది.

ఇది ఆగస్టు నెలలో ఒకనాటి ఉదయాన జరిగింది. అప్పటికి ఫోమా ఇంకా నిద్రలేవలేదు. అతన్ని ఎవరో రెక్క పట్టుకుని కదుపుతూలేపుతున్న గొంతు వినిపించింది.

"లేరా."

ఫోమా కళ్ళు తెరిచిచూచాడు. తండ్రి తన దాపులోనే కుర్చీలో కూచునిఉన్నాడు.

"లేరా, లే, లే" అని అంటున్నాడతడు.

అప్పుడే సూర్యుడుదయించాడు. ఎర్రని సూర్యకాంతి ఇగ్నాట్ వంటిమీదపడి గులాబీవన్నెలు కురిపిస్తోంది.

"అప్పుడేనా? ఇంకా ప్రొద్దెక్కలేదు." అన్నాడు ఫోమా బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ.

"సరే, తరువాత కావలసినంత నిద్రపోవచ్చులే." ఫోమా మళ్ళీ బద్దకంగా దుప్పటి కప్పుకుంటూ "ఇప్పుడునాతో ఏంపని?" అని అడిగాడు

"లేరా నాయనా! నీ కడుపు చల్లగాను: ఏదో ఒక అవసరంలేనిదే నిన్ను లేపుతానట్రా?" అన్నాడు ఇగ్నాట్, కొంచెం కష్టంగా.

ఫోమా కళ్ళు తెరిచి తండ్రి ముఖంలోకి పరీక్షగా చూచాడు. ఆయన ముఖం తెల్లగా పాలిపోయి, బడలిఉండడం గమనించాడు.

"ఏం? సుస్తీగావుందా?"

"కొంచెంగా"

"డాక్టరును పిలిపించనా?"

"వాణ్ణి ఆ వోల్గాలోపడి చావమను! వాడుపాడుగాను డాక్టరు, డాక్టరెందుకురా? నేనేం వయసుకుర్రాణ్ణనుకున్నావా? అతను లేకుండానే నాకాసంగతి తెలుసు."

"ఏమిటి?"

"అయ్యో, నాకు తెలుసురా!" అంటూ ఆ వృద్ధుడు విచిత్రంగా గదినంతా కలయచూడసాగాడు. ఫోమా లేచి దుస్తులువేసుకుంటున్నాడు. తండ్రి తల వొంచుకుని మెల్లగా మాట్లాడుతున్నాడు.

"ఊపిరి పీల్చడమంటేనే భయంగాఉంది. ఎందుకో తెలియదు గాని, గట్టిగా ఊపిరి పీల్చానూఅంటే ప్రాణం పైనే పోయ్యేట్టుంది. ఇవాళ ఆదివారం. ఉదయం పూజ కాగానే మతగురువుకోసం మనిషిని పంపించు."

"ఏమిటినాన్నా, ఈ పిచ్చిమాటలు?" అంటూ థోమా మందహాసంచేశాడు.

"ఏమీలేదు, నీవు స్నానంచేసి మనతోటలోకి రా. అక్కడికి టీ తెమ్మని చెప్పిఉంచాను. అక్కడ చల్లని చెట్లక్రింద కూచుని ఇద్దరం టీ తాగుదాం. ఈ సమయంలో వేడివేడి టీ తాగాలనిపిస్తోంది. వెంటనే రా నాయనా." అని ఆ వృద్ధుడు ఎంతో కష్టంమీద కుర్చీలోంచి లేచాడు. తొట్రుపడుతూ మెల్లగా గదిలోంచి అవతలికి వెళ్ళాడు. థోమా తండ్రివంక చూచాడు. వెంటనే భయం బాకులా అతని గుండెల్లోంచి దూసుకునిపోయింది. త్వరత్వరగా స్నానాదులు ముగించుకుని తోటలోనికి వెళ్ళాడు.

అక్కడ ఇగ్నాట్ ఒకపెద్దఆపిల్ చెట్టుక్రింద పడకకుర్చీలో కూచుని ఉన్నాడు. చెట్టు ఆకులసందులలోనుంచి సన్నటి చారల్లా వెలుగువచ్చి ఆ వృద్ధుడిమీద పడుతోంది. అతనింకా రాత్రి దుస్తులే ధరించి ఉన్నాడు.

తోటంతా బ్రహ్మాండమైన నిశ్శబ్దం ఆవరించి ఉంది. థోమా-చొక్కాకు, చెట్టుకొమ్మ తగిలి చిన్న చప్పుడుచేసింది. అదే ఒక పెద్ద శబ్దంలా వినపడడంవల్ల థోమా భయంతో వణికిపోతున్నాడు. బల్లమీద టీ కెటిల్ పెట్టి ఉంది. బాగా బలిసిన పిల్లిలాగాఉంది. గాలిలోకి పొగలు వదులుతోంది. నిన్ననే బాగా వర్షం కురిసింది. తోటంతా పచ్చగా, ప్రశాంతంగా ఉంది. ఆ ప్రశాంతతలో, ఆ పచ్చని పచ్చదనంలో— తళతళ మెరుస్తున్న ఆ ఇత్తడి కెటిల్ థోమా కళ్ళకు ఒక అనవసరమైన వస్తువులా కనిపించింది. ఆసమయానికిగాని, ఆస్థలానికి

గాని, సరిపడేటట్టుగా లేదు. అది ఆవృద్ధుడుఏకాంతంగా,నిశ్చలంగా మునిలాగా ఆ చెట్టునీడన కూచునిఉండడంచూచేసరికి ఫోమాలో ఒకరకమైన భావన కలిగింది. ఆ టీ కెటిల్ తన భావనకు తగినట్టుగాలేదనికూడా ఫోమా అనుకున్నాడు.

"కూర్చో." అన్నాడు ఇగ్నాట్, కొడుకురాగానే.

"డాక్టరుకోసం కబురు పంపాలి." అన్నాడు ఫోమా, ఏదో అనిశ్చయంతో తండ్రి కెదురుగా కూచుంటూ.

"అవసరంలేదు. ఇప్పుడీ తోటలో గాలికి కూచుంటే ప్రాణం కొంచెం హాయిగాఉంది. కొంచెం టీ తాగుతాను. అదే కాసేపటికి తేలికిస్తుంది." అన్నాడు ఇగ్నాట్ టీ గ్లాసులలో పోస్తూ. ఆయన చేతులు గజగజవణుకుతూఉండడం ఫోమా గమనించాడు.

"తాగు." అన్నాడు తండ్రి.

ఒకగ్లాసు దగ్గరికి తీసుకుని పైనఉన్న నురుగు నోటితో ఊదాడు ఫోమా. తండ్రి బరువుగా ఊపిరిపీలుస్తూఉండడం అతనికి వినిపించేసరికి అతని హృదయం బాధతో వణికిపోయింది. అంతలో హఠాత్తుగా బల్లకు ఏదో కొట్టుకున్న చప్పుడైంది. బల్లమీదఉన్న టీ కప్పులు గలగలమన్నాయి.

ఫోమా భయంతో ఉలిక్కిపడి కళ్ళెత్తిచూచాడు. తన తండ్రి ఏదో భయభయంగా పిచ్చిపిచ్చిచూపులు చూస్తున్నాడు. ఆ పిచ్చిచూపులుచూచి ఫోమా నిర్విణ్ణుడైనాడు. ఇగ్నాట్, కొడుకువంక తేరిపారచూస్తూ వణుకుతోన్న కంఠంతో ఇలా అన్నాడు:

"ఒక ఆపిల్‌పండు క్రిందరాలింది. (దీనిపాడుగాను!) తుపాకికాల్పులా వినిపించింది."

"టీలో కొంచెం కాగ్నాక్ కలుపుకోవూ?"

అడిగాడు ఫోమా.

"అవసరంలేదు. ఇది రుచిగానేఉంది."

ఇద్దరూ కొంతసేపు మౌనంగా ఉన్నారు.

ఒక తేనెటీగలగుంపు "జుమ్మ్"ని మోతచేస్తూ తోటలో ఒకవైపునుంచి గాలిలో పరుగెత్తుకుంటూ వెళ్ళింది. మళ్ళీ తోటలో అగాధమైన నిశ్శబ్దంఆవరించింది. ఇగ్నాట్ కళ్ళల్లో ఇంకా భయంపోలేదు.

"ఓప్రభూ ! జీసస్ క్రైస్ట్!" అని మెల్లని గొంతుతో అని అతను క్రాస్ చేసుకుని ప్రభువును ప్రార్థించాడు. "అవును ఇదే...... నా జీవితంలో ఆఖరు ఘడియ" అని అన్నాడు.

"ఊరుకోనాన్నా ! అలా అనకు!" అన్నాడు ఫోమా. "ఎందుకు ఊరుకోవడం? మనం టీ తాగుదాం. తరువాత మతగురువుకోసం మనిషిని పంపు. మయకిన్‌నుకూడా పిలిపించు."

"ఇప్పుడే కబురుచేస్తాను."

"ఇక త్వరలోనే ప్రార్థన చేయడానికి చర్చిగంట కొడతారు. అంచేత ఇప్పుడు మతగురువు ఇంటివద్ద ఉండడు—పైగా అంత తొందరేమీలేదుకూడా. ముందు టీ తాగు." అంటూ అతను టీ సాసరులో పోసుకొని చప్పుడుచేస్తూ తాగడం మొదలెట్టాడు.

"ఇంకా ఒకటి రెండేండ్లు నేను బ్రతికి ఉండాల్సినమాట నీవు చిన్నవాడివి. నీవిషయం అనుకుంటే భయం

పుడుతోంది. జాగ్రత్తగా బ్రతుకు. నీతిగా నిక్కచ్చిగా బ్రతుకు. ఇతరులసొమ్ముకోసం ఎన్నడూ ఆశించకు. నీది నీవు జాగ్రత్త చేసుకో" అన్నాడు ఇగ్నాట్.

అతనికి మాట్లాడడం కష్టమనిపిస్తోంది. ఒక్క క్షణంఆగి ఎదురొమ్ముమీద చెయ్యిపెట్టి రుద్దుకున్నాడు.

"పనులమీద ఆధారపడి జీవించకు. వాళ్ళు నిన్ను ఉద్ధరిస్తారని ఎన్నడూ భావించకు. వాళ్ళనుంచి ఎక్కువఆశించకు. మనమందరం తీసుకోవడానికే బ్రతుకుతాం కాని, తిరిగి ఇవ్వడానికి కాదు. ఓ ప్రభూ! ఈ పాపాత్ముణ్ణి కనికరించు!" అన్నాడతను మళ్ళీ.

ఎక్కడో దూరంగా చర్చిగంట మోగుతున్నచప్పుడు బరువుగా ఆప్రభాతనిశ్శబ్దంలో వినపడింది. ఇగ్నాట్టూ, ఫోమా చెరి మూడుసార్లు క్రాస్‌గుర్తులు చేసుకుని ఈశ్వరుణ్ణి ధ్యానించారు.

మరోగంట-మళ్ళీ మూడోగంట, అలా వెంటవెంటనే వినిపించాయి. క్షణంలో ఆ ధ్వనులు నలువైపులా నిండిపోయాయి.

"అదిగో, ప్రార్థనకు రమ్మని పిలుస్తూ చర్చిగంటలు కొడుతున్నారు. శబ్దాన్ని బట్టి ఏ గంట ఎక్కడిదో, ఏ గంట దేనితో చేసిందో నీవు చెప్పగలవా?" అని అడిగాడు ఇగ్నాట్, గంటలమోతలు జాగ్రత్తగా వింటూ.

"చెప్పలేను." అని జవాబిచ్చాడు ఫోమా.

"అయితే విను. ఇదిగో, ఇప్పుడు కొట్టేగంటచప్పుడు విన్నావా? అది కంచుగంట. నికోలా చర్చిలోనిది. దానిని

పీటర్ మిట్రిచ్ వ్యాసిన్ బహూకరించాడు. దానిది మంచి ధ్వని. ఇదిగో, ఈ గంట విను. ఇది ప్రాస్కొవా పెట్నిట్జా చర్చిలోది."

గంటలమోతలు గాలిలో తరంగాలుగా వ్యాపించి చివరకు స్వచ్ఛమైన నీలాకాశంలో కలిసిపోయాయి. ఫోమా తండ్రిముఖంలోకి చూచాడు. ఇప్పుడిప్పుడే అతని కళ్ళల్లో భయం అదృశ్యమైపోతున్నట్టు కనిపిస్తోంది. ఇప్పు డతని కళ్లు శాస్త కాంతిగా వున్నాయి.

కాని మళ్ళీ హఠాత్తుగా వృద్ధుడిముఖం బాగా ఎర్రగా మారిపోయింఎి. అతనిగుడ్లు గిరగిర తిరుగుతున్నాయి.భయంతో నోరు తెరుచుకునిఉంది. ఆ నోట్లోంచి ఒకవిచిత్రమైన, బుసకొట్టినట్టు శబ్దంవెలువడింది.

"ఫా...ఫా...చ్."

తత్షణమే ఇగ్నాట్‌తల భుజంమీాద వాలిపోయింది. అతని శరీరం కుర్చీమీాదినుంచి మెల్లగా నేలమీాదికి జారిపోయింది. భూమి ఆ దేహాన్ని అధికారపూర్వకంగా తనవైపు లాక్కున్నట్టుగా ఉంది. ఫోమా కొంతసేపు స్తంభించిపోయాడు. పిమ్మట తండ్రివద్దకు పరుగెత్తుకుని వెళ్ళాడు. నేలమీాద వాలిన తండ్రి తలను పైకెత్తి ముఖంలోకిచూచాడు. ముఖంపై నల్లని కప్పువేసింది. నిశ్చలంగా ఉంది కళ్ళు పెద్దవైనాయి. ఆ ముఖంలో, భయము, బాధ, ఆనందము; ఏమీాలేవు. ఫోమా తన చుట్టూ కలయచూచాడు. తోటలో ఎవరూ, కనిపించలేదు. ఇం కాచర్చిగంటలు మోగుతూనే ఉన్నాయి. ఆశబ్దతరంగాలు నింగిపైకెగసి ప్రతిధ్వనిస్తున్నాయి. ఫోమా చేతులు వణకడం మొదలెట్టాయి. తండ్రి శిరస్సు వదలిపెట్టాడు. అది నేలకు

గట్టిగా కొట్టుకుంది. తెరచుకున్న నోటినుంచి నల్లగా గడ్డ గట్టిన నెత్తురు స్రవిస్తూఉంది. నోటినుంచి చెక్కిలిమీదికి జారి సన్నని కాలువకట్టింది.

ఖోమా తన రెండుచేతులతో గుండెలు బాదుకున్నాడు. తండ్రి మృతకళేబరముందు మోకరిల్లి పెద్దపెట్టున ఏడ్చాడు. భయం! భయంతో గజగజ వణికిపోతున్నాడు. అతని కళ్ళు పిచ్చివాడి కళ్ళలాఉన్నాయి. ఆపచ్చని ప్రశాంతమైన తోటలో ఎవరికోసమో వెర్రిగా వెదుకుతున్నట్టు చూడసాగాడు.

## నాలుగో అధ్యాయం

తండ్రిచావు ఖోమాను పూర్తిగా సొమ్మసిల్ల జేసింది. అతని హృదయంలో ఒక విచిత్రమైన నిశ్శబ్దం నిండింది. ఒక బాధాకరమైన, చలనంలేని నిశ్శబ్దం అది. వైరాగ్యంతో కూడిన నిశ్శబ్దం అది. బ్రతుకులోని రణగొణ ధ్వనులన్నీ ఆ నిశ్శబ్దంలో కరిగిపోయినాయి.

అతనిచుట్టూఉన్న జీవితం వివిధరకాల రణగొణ ధ్వనులతో మోగుతూనేఉంది. అతని సంబంధీకులు, పరిచయస్థులు, బంధువులు; అందరూ అతనిచుట్టూ చేరి రొదపెడుతూనే ఉన్నారు. వారంతా ఏవేవో చెపుతున్నారు. అతనువింటున్నాడు. సమాధానాలు చెపుతున్నాడు. కాని సకాలంలో చెప్పడంలేదు. అతని మాటలు శూన్యంగాఉన్నాయి. వాటికొక అర్థంలేదు. ఒక రూపంలేదు. అవన్నీ అతని హృదయంలో నిండిన మృత్యుతుల్యమైన అగాధ నిశ్శబ్దపు లోతుల్లోపడి అంతలో అదృశ్యమై

పోతున్నాయి. ఈ నిత్యజీవితపు రొదలప్రత్యక్షాలు, అంతర్ధానాలు ఆ నిశ్శబ్దాన్ని కదల్చలేకపోతున్నాయి. అతనికి దుఃఖంగా ఉన్నదాలంటే అదీ కనిపించదు. అతనికి దుఃఖమూలేదు. విచారమూలేదు. ఎలాటి ఆలోచనాలేదు. మనిషి పాలిపోయాడు. దిగులుపడ్డట్టు కనిపిస్తున్నాడు. స్తబ్ధుడుగా కనిపిస్తున్నాడు. తన హృదయంలో శూన్యం నింపి తన హృదయాన్ని స్తబ్ధంచేసిన అగాధ నిశ్చల నిశ్శబ్దాన్ని జాగ్రత్తగా వింటున్నాడు. దేహంలో ఏదో భారంగా ఉన్నట్టుమాత్రం అనిపిస్తోంది. ముఖ్యంగా గుండెల్లో భారం. ఎప్పుడూ ఏదో సంధ్యాసమయంలా కనిపిస్తుంది. నడిశిరసున మధ్యందినభానుడు మండుతున్న సమయానకూడా లోకమంతా చీకటిగా ఉన్నట్టు కనిపిస్తుంది.

ఇగ్నాట్ అంత్యక్రియలు జరిపించడానికి మయకిన్ అన్ని ఏర్పాట్లూ చేశాడు. పెద్దభారం నెత్తిన వేసుకున్నవాడిలా అంగలు పంగలు వేస్తూ గదులలో అటు ఇటు తిరుగుతున్నాడు. అందరికీ పనులు పురమాయిస్తున్నాడు. అదనీ ఇదనీ కేకలేస్తున్నాడు. ఫోమా దగ్గరికొచ్చి అతని భుజం తడుతూ

"అలా శాయిలా కూచుంటావేం? ఎందుకా దిగులు? అందరిమీదా అరువు. కేకలుపెట్టు. అప్పుడాదిగులంతాపోతుంది. మీ నాన్న వృద్ధుడైపోయాడు. దేహం శుష్కించింది. మరణం ఎవరికీ తప్పదు. మనమూ ఎప్పుడోఒకప్పుడు పొయ్యేవాళ్ళమే. ఎప్పుడో అదివస్తుందని ఇప్పటినుంచే దిగులుపడి కూచుంటే ఏంలాభం? నీవిలా విచారపడికూచుంటేమాత్రం మరణించిన నీతండ్రిని మళ్ళీ బ్రతికించగలవా? పిచ్చి! చచ్చినవాళ్ళతోపాటుచస్తా

మటోయ్. పైగా నీ విచారంతో ఇప్పుడతనికి పనిలేదుకూడా. అసలు పురాణాల్లో, శాస్త్రాల్లో ఏంచెప్పారో విన్నావా? 'మృత్యుదూతలు దేహంనుండి ఆత్మను వేరుచేసి తీసుకపోగానే ఆత్మ తనబంధువర్గాన్నీ, మిత్రకోటినీ తదితర పరిచయస్థుల్నీ, అందరినీ మరిచిపోతుంది.' దీని అర్థమేమిటి? ఇప్పుడు నీ తండ్రికి నీతో పనిలేదన్నమాట. నీ కష్టసుఖాలతో అతనికి అవసరంలేదన్నమాట. నీవు బాగున్నా ఓగున్నా, నీవు నవ్వినా ఏడ్చినా అతనికి ఒకటే. చెప్పానుకదా! చచ్చినవాళ్ళతోపాటు చావం. బ్రతికిఉన్నవాళ్ళం బ్రతికి ఉన్నవాళ్ళసంగతి ఆలోచించాలి. అయినా విలపించడంమానవసహజంకాబట్టి విలపించు. మంచిదే. దానివల్ల హృదయభారం తగ్గుతుంది. కాని తక్కిన విషయాలు ఆలోచించు" అని హితబోధ చేశాడు మయకిన్.

ఈ మాటలు ఫోమా తలకెక్కలేదు. అతని హృదయాన్ని కదిలించనూలేదు. తండ్రి అంత్యక్రియలు జరిగేనాడు మాత్రం ఎలాగో కాస్త తెలివిలోకివచ్చాడు.

అంత్యక్రియలు జరిగేనాడు బాగా మబ్బుపట్టిఉంది. ఇగ్నాట్ గార్డియెవ్ శవపేటికను చర్చికి తీసుకపోతున్నారు. బ్రహ్మాండమైన జనసమూహం బారులుతీరి శవపేటిక వెంట నడుస్తున్నారు. దోవపొడుగునా దుమ్ము రేగుతోంది. బారులు తీరి వెడుతోన్న జనసమూహం నల్లనిజడలావుంది. మతగురువులు బంగారు తళుకులతోఉన్న దుస్తులు ధరించారు. మేళగాళ్ళు విషాదగీతాలు ఆలాపిస్తున్నారు. జనసమూహపు మందగమనం ఆ సంగీతంతో శృతికలుపుతోంది. ఫోమాకూడా అందులోఉన్నాడు. అతనికి ఇరువైపులా జనం. ముందు వెను

కలా జనం. ఆ జనసమూహం మధ్య నలిగిపోతూ అలసటతో నడుస్తున్నాడు ఫోమా. నడుస్తున్నప్పుడతనికి తండ్రి నెరిసినతల తప్ప మరేమీ కనిపించడంలేదు. మేళగాళ్ళ విషాద సంగీతం అతని హృదయంలో దుఃఖపూరితంగా ప్రతిధ్వనిస్తోంది. మయకిన్ అతని ప్రక్కనే ఉన్నాడు. మధ్యమధ్య అతని చెవిలో "చూడు. ఎంతజనసమూహం—ఎన్ని వేలమంది! గవర్నరుకూడా వచ్చాడు. మేయరు, పట్టణ కౌన్సిల్ సభ్యులు; అందరూ మీ నాన్న శవంవెంట చర్చికివచ్చారు. నీవెనుక—ఒక్కమాటు తిరిగి చూడు! అదిగో. సోఫియాపావ్‌లోవ్‌నా వస్తోంది. నగరమంతా ఇగ్నాట్‌కు జోహారు లర్పిస్తోంది." అని చెప్పుకపోతున్నాడు.

మొదట్లో ఫోమా ఈ మాటలు వినిపించుకోలేదు. కాని మెడిన్‌స్కాయా పేరు చెవినిపడగానే అప్రయత్నంగా వెనుదిరిగి చూచాడు. చూడగానే గవర్నరు కనిపించాడు. అంత ప్రముఖవ్యక్తి కంటపడగానే ఫోమా హృదయంలో ఏదో ఒక చిన్న ఆనందబిందువురాలినట్టనిపించింది. గవర్నరు తన అధికారసూచకమైన దుస్తులు ధరించిఉన్నాడు. భుజంమీద మెరుస్తున్న సన్నటిదట్టీ, ఎదుర్రొమ్ముమీద ప్రభుత్వ పతకాలు, ఉన్నాయి. చాలా కఠినంగాఉండే అతనిముఖంలో ఇప్పుడు విచారం కనిపిస్తోంది.

"ఈనాడు ఈ జీవుడు వెడుతున్నబాట ఎంతో ధన్యమైనది." అని అన్నాడు మయకిన్, మెల్లగా. మళ్ళీ ఫోమా చెవిలో రహస్యంగా ఇలా చెప్పసాగాడు. "డెబ్భైఅయిదు వేల రూబుళ్ళంటే సామాన్యమైన మొత్తంకాదు. ఆ డబ్బుతో నీ వెంతమంది దాస దాసీజనాన్నైనా కొనవచ్చు. మెడిన్

స్కాయా అప్పుడే. ధర్మసత్రానికి శంకుస్థాపనకోసం ప్రయత్నాలు సాగిస్తోంది, నీకు తెలుసా? మీనాన్న చనిపోయి నలభైఅయిదు రోజులైనవెంటనే ఆపని చేస్తుందట."

థోమా మళ్ళీ వెనక్కి తిరిగిచూచాడు. సరిగ్గా అతని కళ్ళూ, మెడిన్‌స్కాయా కళ్ళూ కలుసుకున్నాయి. లాలింపుగా ఉన్న ఆమె చూపులకు అతను బరువుగా నిట్టూర్చాడు. అలా నిట్టూర్చడంవల్ల తక్షణమే అతని గుండెభారం తగ్గినట్లనిపించింది. వెచ్చని వెలుగుకిరణ మేదో గుండెల్లో చొచ్చుకుని అక్కడ గడ్డకట్టిన దేనినో కరిగించివేసినట్లనిపించింది. అటూఇటూ దిక్కులుచూడడం తనకు భావ్యంకాదని ఊరుకున్నాడు.

చర్చిలోఉండగా థోమాకు తననొప్పి ప్రారంభమైంది. తన క్రిందా, తనచుట్టూ ఉన్న సమస్తమూ ప్రకంపించిపోతున్నట్లు తోచింది. గాలి బిగిసింది. ఊపిరాడడంలేదు. అంతటా దుమ్ము. జనసమూహంనుండి వెలువడే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, సాంబ్రాణి పొగలు, వెలిగించిన కొవ్వొత్తులవాసన, అంతా భయంగాఉంది. దీపాలు వణుకుతున్నాయి. పెద్దపీఠంమీద నున్న జీసస్ విగ్రహం దీనంగా అతనివంక చూస్తోంది. కొవ్వొత్తి దీపాల జ్వాలామాలలు "రక్షకుని" ఫాలభాగానఅలంకరించిన మాసిపోయిన బంగారు కిరీటంలో ప్రతిఫలించి రక్తపుచుక్కలను జ్ఞప్తికి తెస్తున్నాయి.

దైవారాధన జరుగుతోంది. థోమా ఆత్మ మేల్కొన్నది. ఆ గంభీర ప్రార్థనాక్రమంలోని విషాద కవితను ఆతృతతో అందిపుచ్చుకుని జీవచైతన్యాన్ని అనుభవిస్తోంది. "రండి! అతనికి మనకడసారిముద్దు లందిద్దాం." అని పెద్దగా పిలుపు వినిపించింది.

వెంటనే ఫోమా గుండెల్లోంచి శోకం దూసుకునివచ్చింది. అలా గుండెలు పగులగొట్టుకుని వచ్చిన అతని శోకాన్నిచూచి ఛర్చిలో జనసమూహమంతా ఆందోళనతో ఊగిపోయింది.

అలా గుండెపగిలినట్టు ఏడ్చి ఫోమా తూలిపడబోయాడు. అతని రతుకపిత మయకిన్ వెంటనే అతని రెక్క పట్టుకుని శవపేటికవద్దకు నడిపించుకుని వెడుతూ "ఇప్పటివాకా మనతో ఉండివెళ్ళిన అతన్ని ముద్దాడు. ముద్దాడు ఫోమా! అతన్ని సమాధిచేయబోతున్నారు. పైన రాయి కప్పేస్తారు. చీకట్లో స్థిరపడబోతున్నాడు. మృతులమధ్యకు వెడుతున్నాడు. ఫోమా." అని చెప్పాడు. ఫోమా తన పెదవులతో తండ్రి ఫాలభాగాన్ని స్పృశించాడు. వెంటనే భయంతో ఉలిక్కిపడి శవపేటికవద్దనుంచి వెనుకంజవేశాడు.

"చలించకు! శాంతిగా ఉండు! కాసేపట్లో నన్ను క్రింద పడేసేవాడివే." అన్నాడు మయకిన్ మెల్లగా. నెమ్మదిగా శాంతంగా చెప్పిన ఈ మాటలు, అతను పడకుండా పట్టుకున్న చేతులకంటెకూడా ఫోమాకు ఎక్కువ ఆధారం కలిగించాయి.

"మిత్రులారా! సహోదరులారా! నన్ను మృతజీవిగా, అచేతనుణ్ణిగా చూస్తున్న మీరు నాకోసం విలపించండి." అని మృతుడైన ఇగ్నాట్ ఆ చర్చి గర్భాలయంనుంచి అరిస్తున్నట్టుగా ఉంది. కాని అతని కుమారుడు ఫోమామాత్రం ఇప్పుడు ఏడవడంలేదు. నల్లగాఉబ్బిన తండ్రిముఖం చూచేసరికి అతనిలో మళ్ళీ భయం నిండింది. ప్రార్థనాక్రమంలోని విషాదసంగీతంతో మత్తెక్కిన అతని హృదయాన్ని ఈ భయం నేలుకొలిపింది. అతనిచుట్టూ, బంధువులు, పరిచయస్తులు గుమికూడి అతన్ని

ఓదారుస్తున్నారు. వాళ్ళ ఓదార్పులను అతను వింటూ కూచు న్నాడు. తనపై అందరికీ ప్రేమ అనీ, అందుకే తనకోసం అందరూ విచారిస్తున్నారనీ అతను గ్రహించాడు. మయకిన్ అతని చెవిలో "చూడు! అందరూ నీచుట్టూ ఎలా ఈగల్లా ముసిరారో! అప్పుడే ఈగలన్నీ బెల్లం ఉన్నట్టు పసికట్టాయి." అని చెప్పాడు.

ఈమాటలు ఫోమా చెవులకు ఇంపుగా లేవు కాని అవి అతనికి ఉపయోగపడేమాటలు.

సమాధివద్ద ఇగ్నాట్ శాశ్వత స్మృతికోసంపాడినగీతాలు విని ఫోమా మళ్ళీ భోరున ఏడ్చాడు. మయకిన్ అతన్నిపట్టుకుని సమాధిదగ్గరనుంచి తీసుకొనివస్తూ "ఎంత బేలగుండె నీది! నాకుమాత్రం కడుపులో దిగుల్లేదనుకున్నావా? నీవు అతనికి కేవలం కొడుకువు మాత్రమే. కాని నిజంగా అతనెంతటి విలు వైనవాడో నాకు తెలుసు. అయినా నేను ఏడ్వడంలేదే. మే మిద్దరం దాదాపు ముప్పయి ఏండ్లబట్టీ స్నేహితులుగా ఉన్నాం. కలిసిమెలిసి తిరిగాం. ఎలాంటి పొరపూ లేకుండా జీవించాం. ఎన్నెన్ని విషయాలు ముచ్చటించామో! ఎన్నెన్ని ఆలోచించామో!' ఎన్ని కష్టాలుపడ్డామో! ఎన్ని దుఃఖాలు దిగమ్రింగి ఊరుకున్నామో! నీ వేమెరుగుదువు? నీవు చిన్న వాడివి. ఇలా ఏడుస్తూ కూచోవడం తగినపనికాదు. నీ జీవితం నీముందున్నది. నీవింకా ఎన్నో అనుభవించాలి. ఎంతమంది తోనో స్నేహం చెయ్యాలి. ఎన్ని బాంధవ్యాలో నెరపాలి. నేనా? పెద్దవాడినైపోయాను. నాకున్న ఈ ఒక్క స్నేహితుణ్ణి కూడా పూడ్చిపెట్టుకున్నాను. ఇక ఇప్పుడు నేను ఏమీలేని

బికారిని. నేను హృదయమిచ్చి స్నేహంచేయగల ఇలాటి స్నేహితుడెవడూ ఇక నా జీవితంలో దొరకడు!" అని చెప్పాడు.

ఆ వృద్ధుడి కంఠస్వరం రుద్ధమై కంపించసాగింది. అతని ముఖం చెదిరి వక్రగతి చెందింది. పెదవులు ముందుకు సాగి దుఃఖోద్వేగంతో వణకడం మొదలెట్టాయి. చిన్నవైపోయిన అతని కళ్ళనుండి కన్నీరు కారి ముడుచుకుని అతని ముఖంలో ఏర్పడిన ముడతలపై పరుగిడుతోంది. ఎంతో దీనంగా జాలి గొలిపేట్టు ఉన్నాడు.

స్వభావసిద్ధంగా అత నలా ఉండేమనిషికూడా కాదు. ఫోమా అతన్ని దగ్గరకు తీసుకుని గట్టిగా ఒత్తుకుంటూ "ఏడవకు తండ్రీ!—నా తండ్రీ! ఏడవకు!" అని అన్నాడు.

"అదీ, అలా ఉండాలి." అన్నాడు మయకిన్ నీరసంగా. బరువుగా ఒక నిట్టూర్పు విడిచాడు.

మళ్ళీ వెంటనే యథాప్రకారంగా ధృష్టత్వము, తెలివి గల వృద్ధుడుగా మారిపోయాడు.

బండిలో ఫోమాప్రక్కన కూచుంటూ "నీవు ఏడ్వ కూడదు. నీ విప్పుడు యుద్ధంలో సేనాధిపతివి. నీ సైనికులను నీవు ధైర్యంగా నడపాలి. రూబుళ్ళే నీ సైనికులు. వీటితో నీకు గొప్పసైన్యంఉంది. ఈ సైన్యాన్ని నడిపి ఎడతెగని పోరాటం సాగించు!" అని చెప్పాడు.

అతను ఇంతఅకస్మాత్తుగా మారిపోవడంచూచి ఫోమా ఆశ్చర్యపోయాడు. అతనిమాటలువింటూ కూచున్నాడు. ఎం చాతనోకాని ఆమాటలువింటున్నప్పుడు ఫోమాకు, ఇగ్నాట్‌ను

సమాధిచేస్తుండగా శవ పేటికపై జనులు చల్లిన మట్టిబెడ్డలు గుర్తుకొచ్చాయి.

"నే నెవరిమీద పోరాటం సాగించాలి?" అని అడిగాడు ఫోమా నిట్టూరుస్తూ.

"అది నీకు నేర్పుతాను! నేను మెదడుకల ముసలాణ్ణనీ, నీవు నామాట వినడం మంచిదనీ మీనాన్న నీతో చెప్పాడా?"

"చెప్పాడు."

"అయితే నామాట శ్రద్ధగావిను! నీ యువశక్తికి నా బుద్ధిబలాన్ని జతచేస్తే చక్కటి విజయాన్ని సాధించవచ్చు. నీ తండ్రి చాలాగొప్పవాడు; కాని అతనికి దూరదృష్టి తక్కువ. అంచాత నా సలహాతిసుకోలేకపోయాడు! అతను జీవితంలో తన బుద్ధిబలంవల్ల విజయం సాధించలేదు. తన గుండెబలంవల్ల సాధించాడు. అయ్యో, నీ విషయంలో ఏమవుతుందోమరి? నీవు మా ఇంటికివచ్చి మాతోపాటే ఉండడం మంచిది. మీ ఇంట్లో నీవు ఒంటరివాడవవుతావు గనుక తోచదు."

"అత్తయ్య ఉందిగా,"

"అత్తయ్యా? ఆమె రోగిష్టిమారి మనిషి. ఎంతో కాలం బ్రతకదు."

"అలామాటాడకండి" మెల్లగా అరిసున్నట్టు అడిగాడు ఫోమా.

"నేను అలాగే మాట్లాడతాను. చావుకు భయపడాల్సిన అవసరంలేదు. నీవేం మూలపడుకున్న ముసలమ్మవుకావు. నిర్భయంగా జీవించి నీ విధులు నెరవేర్చుకో. ఈ భూమిమీద జీవితాన్ని నిర్మించడంకోసమే మానవుడు నియమింపబడ్డాడు...

కనుక జీవించడమే అతని విధి. రూబుల్‌లాగానే మానవుడు మూలధనం. మానవుడు మట్టిబొమ్మని పెద్దలు చెప్పారు. అలాగే అతను వ్యర్థమైన రాగిడబ్బులతోను, కోపెక్కులతోను చేయబడ్డాడు. అలా జన్మించిన మానవుడు లోకంతో సంబంధం పెట్టుకుంటున్నాడు. అనేక అనుభవాలు పొందుతున్నాడు. లోకంలోని మంచీ, చెడూ, పాపం, పుణ్యం, కష్టం, సుఖం, స్వేదం, కన్నీళ్ళు, నైర్మల్యం, మాలిన్యం—వీటినన్నిటినీ తాగి తనలో జీర్ణించుకుంటున్నాడు. అతనిలో ఆత్మ, మనస్సు స్వస్వయంగా రూపధారణచేస్తాయి. ఇలా మానవుడు, ఊర్ధ్వ ముఖుడై, అధోముఖుడై వృద్ధిపొందుతాడు. ఒక్కొక్క మాటు అతని విలువ అత్యల్పం. మరొక్కమాటు అత్యధికం. ఒకసారి అతని ఖరీదు రాగిడబ్బు, మరోసారి అయిదుకోపెక్‌లు. ఇంకొకమాటు యాభైకోపెక్‌లు, మరొకసారి ఒక వెండిరూబుల్, ఇంకా వంద, వెయ్యి, లక్షరూబుళ్ళు. ఒక్కొక్కమాటు అతని ఖరీదుకు అంతుఉండదు. వడ్డీకి ఇచ్చిన డబ్బు అలా తిరుగుతూ ఉన్నట్టే అతనూ తిరుగుతుంటాడు. అలా తిరిగితిరిగి జీవితానికి వడ్డీ సంపాదించిపెట్టాలి. మనలో ప్రతి ఒక్కడి ఖరీదూ జీవితానికి తెలుసు. అంచాత అకాలంలో మనకు ఏదీ సంప్రాప్తించదు. అకాలంలో మన దోవకు అడ్డుతగలదు. విన్నావా అబ్బాయీ! తెలివైనవాడెవడూ తననాశనాన్ని తను కొనితెచ్చుకోడు. జీవితం మనకెంతో విజ్ఞానసంపదను కూడబెట్టి ఉంచింది, వింటున్నావా నాయనా?"

"ఆ. వింటున్నాను."

"మరి నీకర్థమైందేమిటి?"

"అన్నీనూ!"

"బహుశా అబద్ధమాడుతున్నావేమో?" మయకిన్ సందేహిస్తూ అడిగాడు.

"ఇదంతా సరేకాని, మనం ఎందుకోసం చనిపోవాలి?" అంటూ ఫోమా నింపాదిగా అడిగాడు. మయకిన్ దీనవదనుడై అతనిముఖంలోకి చూచాడు. పెదవులుతడుపుకుంటూ బుద్ధిశాలి అయినవాడెప్పుడూ ఇలా ప్రశ్నించడు. నది అనేది ఒక చోట పుట్టి ప్రవహించడం మొదలుపెట్టిన తరువాత దానికి గమ్యస్థానమంటూ ఒకటి ఉంటుందని అతనికి తెలిసితీరుతుంది! ఆవిషయం అతనికి మరొకరు చెప్పాల్సిన పనిలేదు. ఒకవేళ అది ప్రవహించకుండా ఒకచోట నిలబడిపోయిందీ అంటే—అదిగుంట అవుతుందీ కాని నది కాదన్నమాట" అని చెప్పాడు.

"నీవు మధ్యమధ్య ఉబుసుపోక నన్ను ఊరికినే పరిహాసం చేస్తుంటావు. నీకది ఒక అలవాటైపోయింది. మరి సముద్రం మాటేమిటి? అది ఎటూ ప్రవహించడం లేదు. ఉన్నచోటే ఉన్నది కదా!" అని ప్రశ్నించాడు ఫోమా, ఒక దృఢనిశ్చయంతో.

"నదులన్నీ కలిసేచోటు సముద్రం. అది నదులన్నిటినీ తనలోకి తీసుకుంటుంది. అప్పుడప్పుడు దానిలో పెనుతుపానులు వీస్తుంటాయి. అలాగే జీవితసముద్రంకూడా మధ్య మధ్య అల్ల కల్లోలమవుతూ ఉంటుంది. దానిని మనుష్యులు కదిపి తుపానులు రేపుతుంటారు. మృత్యువనేది జీవితసముద్రంలోని నీరు తోడివేస్తూ మళ్ళీ కొత్తనీరు తెచ్చిపోస్తూ ఉంటుంది. లేకపోతే ఆ నీరు అలాగే నిల్వఉండి పనికిరాకుండా

పోతుందని, ఆపని చేస్తూ ఉంటుంది. ఒకవైపు కోటానకోట్లు మానవులు మరణిస్తుంటే-మరోవైపు అసంఖ్యాకంగా జన్మిస్తున్నారు."

"అయితే కావచ్చు. కాని మా నాన్నమాత్రం చనిపోయాడు."

"ఒక్కప్పుడు నీవూ చనిపోతావు."

"మరి అయితే జనం వృద్ధికావడంవల్ల నాకు ఒరిగేదేమిటి?" అంటూ ఫోమా, విచారపూరితంగా నవ్వాడు.

"ఏవోయ్, అదీ, అదీ!" అంటూ మయకిన్ నిట్టూర్చాడు. "అదీ నిజమే కాని దానితో మనకు సంబంధంలేదు అలాగైతే నీవు తొడుక్కున్న పంట్లాంకూడా 'లోకంలో ఇన్ని రకాలవాళ్ళుంటే వాళ్ళతో నాకు సంబంధమేమి'టని వాదిస్తుందనుకుంటా. కాని నీవు దానిని లెక్క చేస్తావా చెప్పు. తొడిగినంత కాలం తొడుగుతావు, తరువాత అవతల పారేస్తావు."

అది విని ఫోమా మయకిన్ వంక చూచి అతను మందహాసంచేస్తూ ఉండడం గమనించాడు. ఫోమాకు ఆశ్చర్యాం కలిగింది. అతనిపట్ల గౌరవం కనపరుస్తూ "నిజంగా నీకు మృత్యువంటే భయంలేదా?" అని అడిగాడు.

"అబ్బాయీ! అన్నిటికంటె నాకు బుద్ధిహీనత అంటే ఎక్కువ భయం." అని వినయంగా సమాధానమిచ్చాడు మయకిన్. "నా అభిప్రాయం చెపుతాను విను. ఒక బుద్ధిహీనుడు నీకు తేనె తాగమని ఇచ్చినాసరే, దానిముఖాన ఉమ్మేయ్. ఒక బుద్ధిమంతుడు నీకు విషమిచ్చినాసరే దాన్ని తాగెయ్యి! మరొక్కమాట. చెట్టు కొమ్మపై పక్షి, పాదాలు

పూర్తిగా మోపి కూచోనంతవరకూ దాని ఆత్మ దుర్బలం గానే ఉంటుంది." అన్నాడు మళ్ళీ.

వృద్ధుడు చెపుతున్న మాటలకు థోమా కోపం తెచ్చు కున్నాడు. ముఖం మరోవైపుకు తిప్పి "నీవెప్పుడూ ఏదో ఒక నెపం వేస్తూనే ఉంటావు." అన్నాడు.

"మరోరకంగా మాట్లాడడం నాకు చాతకాదు. ప్రతి మనిషీ తనకు దేవు డిచ్చిన నాలుక పెట్టుకుని మాట్లాడతాడు. అంతేకాని, నాలుక మరొకరిదగ్గర అరువు తెచ్చుకోడు. నా మాటలు నీకు కటువుగా ఉన్నాయా? ఏం?"

అందుకు థోమా జవాబు చెప్పకుండా మౌనం వహించాడు.

"ఇదిగోనోయ్! నీకే చెప్పేది. ఇది విను. ఎవరైనా మనకు మంచి చెపుతున్నారూ అంటే—మనమీద ప్రేమవల్లనే. ప్రేమ లేకపోతే ఏదీ చెప్పడు. ఈ మాట బాగా గుర్తుంచుకో. ఇక మృత్యువు సంగతంటావ్! దాని విషయం ఆలోచించకు. బ్రతికిఉన్న మనిషి చావునుగురించి ఆలోచించడం తెలివితక్కువ తనం నాయనా. మరణాన్నిగురించి అందరికంటె ఎక్కువగా మథనపడ్డ మహాత్ములు ఏం చెప్పారో విన్నావా? చచ్చిన సింహంకంటె బ్రతికున్నకుక్క మేలన్నారు."అన్నాడు మయకిన్.

ఇద్దరూ ఇల్లు చేరారు. ఆ వీధినిండా బళ్ళు క్రిక్కిరిసి ఉన్నాయి. తెరచిఉన్న గదికిటికీల్లోంచి ఇంట్లో పెద్దగా మాట్లాడుతున్న శబ్దం వినిపిస్తోంది. థోమా హాలులో అడుగు పెట్టగానే అతని చుట్టూ చాలామందిజనం మూగారు. అతన్ని పట్టుకుని బల్లదగ్గరికితీసుకెళ్ళారు. బల్లముందు కూచోబెట్టి ఫల

హారాలు తినమనీ, పానీయాలు తాగమనీ బలవంతం చేశారు. హాలంతా ఒక పెద్ద అంగడిమాదిరిగాఉంది. జనంసందడి. ఊపిరి ఆడడంలేదు. ఫోమా మాట్లాడకుండా ఒక గ్లాసెడు వోడ్కా తాగాడు. తరువాత మరొకగ్లాసు. ఇంకొకటి. ఇలా మూడు గ్లాసులు ఖాళీచేశాడు. అతనిచుట్టూ జనం తింటున్నారు. తాగుతున్నారు. వాళ్ళు నములుతున్న చప్పుడు, చప్పరిస్తున్న చప్పుడు. లొట్టలువేస్తున్న చప్పుడు. పెద్దపెద్ద సీసాల్లోంచి గ్లాసుల్లో వోడ్కా పోస్తున్నారు. గాజుగ్లాసుల గలగలచప్పుళ్ళు. గ్లాసులు కొట్టుకుంటున్న చప్పుళ్ళు, అన్నీ వినిపిస్తున్నాయి. వారంతా అనేకవిషయాలను గురించి చర్చించుకుంటున్నారు. ఎండబెట్టిన మాంసాన్ని గురించి కొంతసేపు చర్చిలో ఫిడేలు సంగీతాన్నిగూర్చి కాసేపు మాట్లాడుకుంటున్నారు. మళ్ళీ వివిధ విషయాలపై చర్చలు సాగుతున్నాయి. చెప్పినవి చెప్పు కుంటున్నారు. తరువాత మేయరుకూడా ఉపన్యసించా లనుకుంటున్నాడనీ, కాని మతగురువు ఉపన్యాసమిచ్చినతరు వాత తను ఉపన్యసిస్తే పేలవంగాఉంటుందని మానుకున్నాడనీ, అనుకుంటున్నారు. వారిలోంచి ఒకడు, "ఇగ్నాట్ బ్రతికుండగా ఏంచేసేవాడనుకున్నారు? ఒక సాల్మొన్‌చేపనుకోసి దానికి దట్టంగా మిరియపుపొడి పట్టించేవాడు. తాగినవెంటనే దాన్ని మరోముక్కతో చేర్చి చటుక్కున మింగేసేవాడు" అని చెప్పుక పోతున్నాడు.

"మనమూ అతని పద్ధతినే అనుసరిద్దాం."

అని వంతపాడాయి మరికొన్ని గొంతులు.

ఫోమాకు అసహ్యమనిపించింది. కోపంగా అటువైపు చూచాడు. మంచిరుచికరమైన పదార్థాలు నములుతున్న మనుష్యుల దవడలవైపూ, లావుగా మొద్దుగా ఉన్న పెదవులవంకా చూచాడు. అతనికి ఏడుపొచ్చింది. వాళ్ళందరినీ అక్కణ్ణుంచి తరిమివెయ్యాలనిపించింది. అంతలో మయకిన్ అతన్ని సమీపించి "నీవు కాస్త మెత్తగా ఉండాలి. అందరితోనూ చనువుగా కలిసిమెలిసి తిరగాలి." అన్నాడు.

కోపంతో ఫోమా కళ్ళు ఎర్రగా రగిలాయి. "ఏమిటీ అల్లరంతా? ఇదేం కల్లుపాక అనుకున్నారా? సారాకొట్టనుకున్నారా?" అని అరిచాడు.

"ఇష్!" అంటూ మయకిన్ భయంతో వెనక్కుతిరిగి చూచాడు. మళ్ళీ నవ్వుముఖం పెట్టి చుట్టూ కలయచూచాడు. కాని అతనలానవ్వినా లాభంలేకపోయింది. ఫోమా అరవడం అందరికీ వినిపించింది. వెంటనే ముచ్చట్లు ఆగిపోయినాయి. ఎక్కడిదక్కడ సద్దుమణిగింది. కొందరు అతిథులుమాత్రం లేచి గబగబ అటూఇటూ తిరగడం మొదలెట్టారు. మరికొందరు కోపంతో తింటున్న పదార్థాలు వదిలిపెట్టి బల్లముందునుంచి లేచారు. అందరూ ఫోమావంకచూచారు. ఫోమా మౌనంగా నిశ్చలంగా, కోపంతో కళ్ళుమించచకుండా, ఈ చూపులన్నిటినీ భరించాడు

"నీ పీ బల్లదగ్గరికిరా, నామాట విను. కూచో. తీపి పదార్థలు తెస్తున్నారు, తిందువుగాని." అన్నాడు మయకిన్ జనసమూహంలోంచి, బూడిదకుప్పలో నిప్పురవ్వలా.

"నా కక్కర్లేదు. నేను తినను." అంటూ థోమా మొండిగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే వెనుకనుంచి రొద బయలుదేరింది.

మయకిన్ వాళ్ళందరికీ మాటలు చెప్పి చల్లారుస్తున్నాడు. "మరోలా అనుకోకండి. దిగులువల్ల వాడిలా అయిపోయాడు. అంతా దిగులువల్లనే. వాడికి తల్లి అయినా, తండ్రిఅయినా ఇగ్నాట్ ఒక్కడేకదా." అని ఎవరితోనో అంటున్నాడు. ఆ మాటలు థోమాకు వినిపించాయి.

థోమా తోటలోకి వచ్చాడు. తన తండ్రి మరణించిన చోటనే కూచున్నాడు. ఒంటరితనమూ, విచారమూ అతని గుండెను బ్రద్దలుచేస్తున్నాయి.

కొంచెం హాయిగా గాలి పీల్చుకుందామని చొక్కా గుండీలు ఊడతీసుకున్నాడు. మోచేతులు బల్లమీద ఆనించి గడ్డంక్రింద చేతులు పెట్టుకుని నిశ్చలంగా కూచున్నాడు. సన్నగా వర్షపు జల్లు పడుతోంది. ఆ వానజల్లుకు ఆపిల్ చెట్టు ఆకులు కదిలి ఏదో విచారంగా ధ్వనిచేస్తున్నాయి. అలాగే ఒంటరిగా చెట్ల ఆకులమీదనుంచి రాలుతున్న వాన బిందువులుచూస్తూ చాలాసేపు కూచున్నాడు థోమా. బాగా వోడ్కా తాగడంవల్ల అతని తల దిమ్మెక్కిఉంది. మనుష్యులపట్ల ఒక రకమైన కసి అతని గుండెల్లో గాలంలా గుచ్చుకుంటోంది. క్రమక్రమంగా అది పుండయి సెలవెయ్యడం మొదలెట్టింది. అవ్యక్తమైన అస్పష్టమైన భావాలేవో-తనకుసంబంధించనివి మొలకెత్తి మళ్ళీ అంతలో అంతర్ధానమైపోతున్నాయి

అతని కళ్ళముందు తన రత్నకపిలయైన మయకిన్ బట్టతల మెరిసింది. ఆ తలపై అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలున్నాయి. ముఖం పురాతన విగ్రహాల ముఖంలాగా నల్లగాఉంది. బోసినోరు, కలుషితమైన చిరునవ్వు. ఆ ముఖాన్ని కళ్ళముందు చూచేసరికి ఫోమాకు అసహ్యమూ, భయము ఆవరించాయి. తను మరింత ఒంటరివాడైనట్లు తోచింది. పిమ్మట అతనికి మేడిన్ స్కాయా రూపం గుర్తొచ్చింది. ఆమె పల్చని శరీరం, మెత్తని చూపులు కళ్ళముందు ఆడాయి. అదే సమయంలో పొడుగ్గా, పుష్టిగా ఉండి, గులాబీల్లాంటి చెక్కిళ్ళుగల లూబా జ్ఞాపకంవచ్చింది. ఆమె తలకు బంగారు జలతారు చుట్టుకుంది. కళ్ళలో వెన్నెలాంటి నవ్వు కురుస్తోంది.

“మనుష్యులపై ఆధారపడకు. వాళ్ళు నిన్నెన్నటికీ ఉద్ధరిస్తారనుకోకు.” అని తండ్రి చెప్పినమాటలు తలపుకువచ్చాయి. ఆ తలపులు తలుపుల్లా పదేపదే కొట్టుకోసాగాయి. విచారంగా నిట్టూర్చి ఒకమాటు చుట్టూ కలయచూచాడు. వానజల్లు పడి చెట్లఆకులు వణుకుతున్నాయి. సర్వత్రా విషాదధ్వనులు నిండిఉన్నట్టనిపించింది. పైన నభోమండలం భోరున ఏడుస్తున్నట్టుంది. ఏడ్చిఏడ్చి రాల్చిన ఆకాశపు కన్నీళ్ళే చల్లనివాన బిందువులై చెట్ల ఆకులపైపడి గజగజ వణుకుతున్నాయి. ఫోమాఆత్మ ఎండినమోడులా ఉంది. ఆత్మలో అంతాచీకటి. పెనవేసిన చీకటి. ఆ దిక్కులేని బాలుడిహృదయంలో బాధ పక్కపరుచుకుని పడుకుంది. ఒకానొకప్రశ్న ఆ గాధల అగాధం నుంచి బయలుదేరింది.

"నే నిలా ఒంటరిగా ఎలా బ్రతకగలను?" వర్షానికి అతనిబట్టలు తడిసిముద్దయినాయి. చలివల్ల వణుకువస్తున్నట్టు తెలియగానే లేచి ఇంట్లోకి వెళ్ళాడు. జీవితం అతన్ని అన్ని వైపులనుంచి గుంజుతోంది. అతనికి ఊపిరి సలపనివ్వడంలేదు. మనస్సును ఒకదానిమీద నిలిపి ఆలోచించడానికి కాని, తండ్రిని గురించి దుఃఖించడానికి కాని అతనికి అవకాశం ఇవ్వకుండా ఉంది. ఇగ్నాట్ చనిపోయిన నలభయ్యోరోజు ఫోమా చక్కగా ముస్తాబుచేసుకుని 'ధర్మసత్రం' శంకుస్థాపన మహోత్సవానికి బయలుదేరాడు. ఇప్పు డతని హృదయంకూడా కాస్త తేలిక పడింది. వెడుతూ వెడుతూ దోవలో, అక్కడెలా ఉంటుందో అని, అందరిముందూ తనెలా ప్రవర్తించాలో అని మధనపడు తున్నాడు.

"ఏవోయ్, ఏవోయ్! ఆగు!" అని వెనకనుంచి ఎవరో పిలుస్తున్నట్టు వినిపించింది. ఫోమా వెనుదిరిగి చూచాడు. మయకిన్ గబగబ నడిచివస్తున్నాడు. అతని పొడుగాటి కోటు కాళ్ళవరకూ వ్రేలాడుతోంది. చేతిలో ఒక పెద్ద గొడుగు పట్టుకున్నాడు.

"కాస్త నన్నుకూడా నీతోపాటు అక్కడికి చేర్చ వోయ్" అని అంటూ కోతిలా బండ్లోకి గెంతి కూచున్నా డా వృద్ధుడు "నీవు బయలుదేరేవేళ అయిందని నిజంగా ఇప్పటి దాకా నీకోసమే కాచుకు కూచున్నాను." అన్నాడతను మళ్ళీ.

"నీవుకూడా అక్కడికి కొస్తున్నావా?" అని అడిగాడు ఫోమా.

"అవును నా స్నేహితుడి డబ్బు వాళ్ళెలా భూస్థాపితం చేస్తారో చూడాలని ఉంది." అని జవాబు చెప్పాడు మయకిన్.

ఫోమా అతనివంక కోపంగాచూచి ఊరుకున్నాడు. "ఎందుకాకోపం? మరేం భయంలేదులే. నీవుకూడా ధర్మదాతవని కీర్తి సంపాదించుకుందువుగాని." అన్నాడు మయకిన్.

"అంటే మీ ఉద్దేశం?" అడిగాడు ఫోమా, ముక్తసరిగా.

"ఏముంది! నీవు భవన నిర్మాణపు కమిటీలో మెంబరుగాను, సోఫియా ఏర్పాటుచేసినసంఘంలో గౌరవసభ్యుడుగాను ఎన్నికైనట్లు ఇవాళఉదయమే వార్తాపత్రికలో చదివాను."

"అవునూ."

"ఈ సభ్యత్వం కత్తిరించినట్టు నీ జేబులు కరకరనమిలేస్తుంది." అంటూ మయకిన్ నిట్టూర్చాడు.

"అది నన్నేమీ నాశనంచేయదు."

"ఆ సంగతి నాకు తెలియదు. కాని ఈ విషయాన్ని గురించి ఎందుకింతగా మాట్లాడుతున్నానూ అంటే—నిజంగా ఈ దానధర్మాలకు ఒక అర్థమంటూ ఉండదు. పైగా ఇదొక వ్యాపారమూ కాదు కేవలం ప్రమాదకరమైనపిచ్చి" అని అన్నాడు మయకిన్ కుచ్చితంగా.

"ప్రజలకు తోడ్పడడం ప్రమాదకరమా?"అని అడిగాడు ఫోమా, తీవ్రంగా.

"వట్టి మట్టి బుర్ర! ఒకమాటు మా ఇంటికి రా. ఈ విషయంలో నీ కళ్ళు తెరిపిళ్ళుపడేట్టుచేస్తాను. నీకు బోధిం చాలి. వస్తావా మరి?" అని అడిగాడు మయకిన్, ఒక చిరునవ్వు నవ్వి.

"సరే, వస్తాను." అని జవాబిచ్చాడు ఫోమా.

"మంచిది. కాని ఈ లోపల శంఖుస్థాపన సందర్భంలో సగర్వంగా ఉండు! ఉత్సవసమయంలో అందరికంటా పడేట్టు ప్రవర్తించు. ఈ మాట నీకు చెప్పకపోయినట్లయితే, నీ వెవరికీ కనిపించకుండాపోయి ఎవరి వెనకాలో దాక్కుంటావు. అందు కనే చెప్పాను."

"దాక్కోవాల్సిన అవసరం నాకేమిటి?"

"నే చెప్పేదీ అదే. దాగి ఉండాల్సిన అవసరం నీకేమీ లేదు. డబ్బు దానంచేసినవాడు మీనాన్న. అంచాత అతని వారసుడివిగా ఆ గౌరవ మర్యాదలన్నీ స్వీకరించే హక్కు నీ కున్నది. డబ్బు ఎలాంటిదో గౌరవంకూడా సరిగ్గా అలాంటిదే. ఆ గౌరవంతోటే ఒక వ్యాపారసుడు ఎక్కడైనా అప్పుపుట్టించ గలడు. ప్రతిచోటా అతనికి దోవ తెరిచే ఉంటుంది. అంచాత ముందుకొచ్చి నిలబడు. అందరిదృష్టిలోనూ ప్రధానవ్యక్తిగా కనిపించు. ఎప్పుడైనా ఒక పావలాఎత్తు పనిచేశావూ అంటే, దానికి తిరుగు ఒక రూపాయిలాభం పొందేటట్టుగా ఉండాలి. నీవు దాగిఉన్నావంటే—అది కేవలం అవివేకి లక్షణంగా కనిపిస్తుంది. ఫలితం ఏమీ ఉండదు."

వారు ధర్మశాలకు చేరుకున్నారు. అప్పటికే పట్టణంలోని ప్రముఖులంతా అక్కడికి విచ్చేసిఉన్నారు. కలపసామాను పడే

సినచోట, ఇటుకలు చేర్చినచోటా జనం గుమికూడి ఉన్నారు. బిషప్, గవర్నర్, ఇంకా నగరంలో శ్రీమంతుల కుటుంబాలకు చెందిన వ్యక్తులు, చక్కగా అలంకరించుకుని వచ్చిన స్త్రీలు —వీరంతా గుమికూడి ఇద్దరు తాపీపనివారు సున్నం, ఇటుకలతో పనిచేస్తుంటే పరిశీలిస్తున్నారు.మయకిన్, ఫోమా జనసమూహంలోంచి చిన్నగా దోవచేసుకుంటూ వెళ్ళారు. మయకిన్ ఫోమా చెవిలో "మరేం భయంలేదు. ధైర్యంగా ఉండు. వీళ్ళపైమెరుగులు చూచి మోసపోకు. వీళ్ళంతా కడుపులో కాలుతున్నా సిల్కుబట్టలు కట్టుకుని కులికేరకం"అని చెప్పాడు.

పిమ్మట మయకిన్ బిషప్ చూస్తుండగా ముందు గవర్నర్‌ను గౌరవపురస్సరంగా అభినందించాడు.

"క్షేమంగా ఉన్నారా యువర్ఎక్సెలెన్సీ? తమ ఆశీస్సులు అందచేయండి పూజ్యశ్రీ!" అని అభినందించాడు. గవర్నర్ స్నేహపూర్వకంగా చిరునవ్వు నవ్వి మయకిన్‌తో కరస్పర్శ కావించాడు. తరువాత మయకిన్ బిషప్‌వైపు తిరిగి "చిరంజీవులు ఎలా ఉన్నారు?" అని అంటూ అతని చేతిని ముద్దాడి మళ్ళీ గవర్నర్‌తో "యువర్ ఎక్సెలెన్సీ! తమకూ, సోఫియాపావ్లోవ్నాకు నాహృదయపూర్వక అభివందనాలు!" అని పలికి బొంగరంలా గిర్రున తిరిగి ఆ జనసమూహంలోంచి చొచ్చుకునిపోయాడు. ఒక్కక్షణంలో అక్కడున్న పెద్దలందరితోనూ పరిచయంచేసుకున్నాడు. కరస్పర్శగావించి అభినందించాడు. తన చిరునవ్వులతోనూ, చమత్కృతులతోను అందరినీ ఇట్టే ఆకర్షించాడు. అందరికళ్ళూ అతనిమీదనే ఉన్నాయి. పిట్టంతమనిషైనా ఒక్కక్షణంలో సులువుగా అందరినీ ఆకట్టుకున్నాడు.

ఫోమాకు ఏంచేయాల్సిందీ తోచలేదు. మయకిన్ వెనకాలే తల వొంచుకుని నిలబడ్డాడు. ఆవృద్ధుడి సాహసగుణం, బుద్ధిబలం అతన్ని పిచ్చివాణ్ణిగాచేశాయి. అతనిమీద అసూయపుట్టింది. తన ధైర్యంకోల్పోయాడు. ధైర్యంపోతున్నదని తెలియగానే అతని భయంఇనుమడించింది. మయకిన్ ఫోమాచెయ్యిపట్టుకొని దగ్గరికిలాగుతూ "యువర్ ఎక్సలెన్సీ! ఇతనే నామిత్రుడు ఇగ్నాట్‌కు ఏకైకపుత్రుడైన ఫోమా." అని గవర్నర్‌కు పరిచయంచేశాడు. గవర్నర్ ఫోమాతో అనునయంగా "తండ్రిని కోల్పోవడమంటే ఇంతాఅంతా కష్టంకాదు నాయనా" అని అన్నాడు. ఫోమా ఏదో జవాబుచెపుతాడని ఒకటి రెండు క్షణాలు వేచిఉన్నాడు. కాని ఫోమా నోరు కదపకపోవడం చూచి గవర్నర్ మళ్ళీ మయకిన్‌తో "నిన్న నీవు పురమందిరంలో ఇచ్చిన ఉపన్యాసం గొప్పగాఉంది. క్లబ్‌కోసం డబ్బు ఖర్చుచేస్తున్నారుకాని, నిజంగా ప్రజల అవసరాలేమిటో వీళ్ళకు తెలీదు'అని నీవు చెప్పినమాట నాకెంతో నచ్చింది. అంటూ అభినందించాడు. గవర్నర్ అభినందనకు మయకిన్ చాలా సంతోషించాడు.

"నిగ్రహంఉండడం అవసరమే. అందరూ నిగ్రహపరులైతేమాత్రం ఎవరొద్దంటారు? నామటుకునేనుతాగుడుముట్టను అయినా ప్రజలకుఅతిరజ్ఞానమైనాలేనప్పుడు ఈగ్రంథాలయాలు ధర్మశాలలు-వీటివల్ల ప్రయోజనమేమిటి? ఇవన్నీ పైమెరుగులు" అన్నాడు మయకిన్ గవర్నర్‌కూడా ఆందు కంగీకరించాడు. ఈ సొమ్మంతా సాంకేతిక శిక్షణాలయాలకు వినియోగించడం మంచిదనే అభిప్రాయం వెలిబుచ్చాడు.

సోఫియా పావ్లోవ్నా ఫోమాదగ్గరికి వచ్చింది. "మొన్న మీ నాన్నగారి అంత్యక్రియలప్పుడు నీ ముఖంవంక చూచాను. నాగుండె తరుక్కుపోయిందంటే నమ్ము. 'ఈశ్వరా! ఈ పసివాడి కెంత కష్టం తెచ్చిపెట్టావు! ఎంత తపిస్తున్నాడో!' అని నాలో అనుకున్నాను. నీ ఏడుపుకు నాగుండెలు పగిలిపోయినాయి బాబూ. నేను వృద్ధురాలను కాబట్టి నీతో ఇలా మాట్లాడడం తప్పు లేదనుకుంటున్నాను" అని మెల్లగా అన్నది.

ఆమె చల్లని మాటలు వింటోంటే ఫోమాకు అమృతపానం చేసినట్టనిపించింది. "నీవు వృద్ధురాలవా?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"ఏం? కానా?" అతనివంక అమాయకంగాచూస్తూ ఆమె అడిగింది. ఫోమా మౌనంగా తలవాల్చుకున్నాడు. "నేను వృద్ధురాలనంటే నమ్మవా ఏం?" అని మళ్ళీ అడిగింది.

"నమ్ముతాను. అంటే నీ వేమాటచెప్పినా నమ్ముతానన్నమాట. కాని ఇదిమాత్రం నమ్మను. ఎందుకంటే ఇది నిజంకాదు." అన్నాడు ఫోమా.

"ఏది నిజంకాదు? ఏమాట నమ్ముతావు?"

"కాదు. ఇదిమాత్రం నిజంకాదు. కాని అది...క్షమించు. నాకు మాట్లాడడం చాతకాదు. నాకు సంస్కారం లేదు." అన్నాడు ఫోమా. అలా అంటోంటే అతన్ని దిగులు, కలవరము పెనవేశాయి.

"ఆవిషయమై నీవు బెంగపెట్టుకోవలసినపనిలేదు. నీ వింకా చిన్నవాడివి. చదువు అందరికీ అందుబాటులో ఉండేదే కాని చదువనేది కొందరికి అపకారం కలిగిస్తుందికూడా. నిర్మల

హృదయులు, అమాయకులు, పసివారు — ఇలాటివారికి ముఖ్యంగా, నీవూ ఇలాటివాడివే. అవునా?"

థోమా ఆ ప్రశ్నకు జవాబుచెప్పలేక వినమ్రుడై ఊరుకున్నాడు. "నిన్ను వినయపూర్వకంగా అభినందిస్తున్నాను" అనిమాత్రం అనగలిగాడు. తనమాటల కామెకళ్ళు ఆనందంతో మెరుస్తుండడం గమనించగానే థోమా, తన కళ్ళకు తానే మందమతిగాను, హాస్యాస్పదంగాను కనిపించాడు. తత్క్షణమే తనమీాద తనకు కోపంవచ్చింది. రుద్ధకంఠంతో "అవును. నేను అలాటివాణ్ణే. ఎప్పుడూ ఉన్నది ఉన్నట్టు చెప్పేస్తాను. మోసంచెయ్యలేను. ఏదైనా ఎగతాళిగాకనిపిస్తే పైకే నవ్వేస్తాను. నేను మందమతిని." అన్నాడు.

"ఎందుకలాటిమాటలు?" అన్నదామె అతన్ని మందలిస్తున్నట్టు. ఆమె తన దుస్తులు సవరించుకుంటూ యాదృచ్ఛికంగా థోమాచెయ్యి నిమిరింది. ఆ స్పర్శతో అతను తన మణికట్టువైపు చూచుకుని కలవరపడి చిరునవ్వు నవ్వాడు.

"విందుకు తప్పక వస్తావుకదూ?" అని అడిగింది మెడిన్స్కాయా.

"వస్తాను."

"మరి రేపు మా ఇంట్లో సమావేశానికి?"

"దానికీ వస్తాను."

"ఎప్పుడైనా చుట్టపుచూపుగా కూడా వస్తావుకదూ?"

"వస్తాను!"

తరువాత ఇద్దరూ మౌనం వహించారు. ప్రార్థన పఠిస్తూ ఉన్న మతగురువు కంఠస్వరం గాలిలో తేలిపోతున్నది. శంఖు

స్థాపనచేస్తూ పునాదివేసిన రాతివైపు చెయ్యి చాచి పంచ భూతాలవల్ల ఆ భవనానికి ఎలాంటి ప్రమాదం రాకుండా ఉండాలనీ, భవననిర్మాణం త్వరలో పూర్తి కావాలనీ ఆశీర్వ దిస్తూ శ్లోకాలు పఠిస్తున్నాడు.

"ప్రార్థనలు ఎంతో నిండుగా, కన్నులపండుగగా ఉం టాయి కదూ!" అని అడిగింది మెడిన్‌స్కాయా.

"అవును." అన్నాడు ఫోమా. ఆమె మాటలు అర్థం కాక మళ్ళీ అతనికి సిగ్గువేసింది. మయకిన్ ఒకవైపు నిల్చొని స్వీడన్‌కూ స్విజర్లాండుకూ భేదం తెలియకుండా ధారాళంగా మాట్లాడేస్తున్నాడు.

"వాళ్ళకు కావల్సినదేముంది? పత్రికలవాళ్ళు అంగీక రిస్తే చాలు. అంతేకాని అసలువిషయం వాళ్ళకు తెలియదు. పైపై నటనతప్ప అసలుజీవితాన్ని నిర్మించడం వాళ్ళఉద్దేశమే కాదు. వార్తాపత్రికలూ, స్వీడనూ - ఈరెండే వాళ్ళకు ముఖ్య ప్రమాణాలు నిన్న డాక్టరుగారు ఈ స్వీడన్‌గొడవ లేవనెత్తి నాపురంపెట్టాడు. విద్యలో, వసతిలో స్వీడన్‌ది విశిష్టస్థానమట. అవిఅక్కడున్నట్లు మరెక్కడా లేవట. అయినా నామటుకు నాకు స్వీడన్‌లో ఏమున్నదనిపిస్తుంది. అక్కడ ఏమీలేదు. పైగా మనం బ్రతికేది స్వీడన్‌కోసమా ఏమిటి, దాన్ని మనం ప్రమా ణంగా తీసుకోవడానికి? మనపెద్దవాళ్ళు పెట్టిన దోవలోనే మనమూ నడుస్తాం." అని ధోరణిసాగిస్తున్నాడు.

మతగురువు తలపైకెత్తి "ఈ భవనస్థాపకుని స్మృతి స్థిరస్థాయిగా నిల్చుగాక!" అని ఆశీర్వదిస్తున్నాడు. ఫోమా

భయంతో కంపిస్తున్నాడు. మయకిన్ అతనిపక్కకు వచ్చి "నీవూ విందుకు వస్తున్నావా?" అని అడిగాడు.

విందులో కూర్చున్నంతసేపూ ఫోమాకు ముళ్ళపై కూచున్నట్టుంది. అలాంటివ్యక్తులమధ్య తిరగడం అతనికదే మొదటిసారి. ఎవరినిచూచినా, అంతా తనకంటె మెరుగ్గాఉన్నట్టే కనిపిస్తున్నారు. వేషభాషల్లోనూ, తిండీ తిప్పల్లోనూ, అంతా ఒకరకమైన కట్టుదిట్టంగా తనకంటె బాగా ఉన్నట్టుగా కనిపిస్తున్నారు. మెడిన్స్కాయా అతని కెదురుగానే కూచుంది. తనకూ ఆమెకూ మధ్య ఒక బల్లమాత్రం అడ్డంఉంది. అయినా అదే ఒక పెద్దకొండలా కనిపించింది ఫోమా కళ్ళకు. తను గౌరవ సభ్యుడుగా చేరిన సంఘ కార్యదర్శి, తనపక్కనే కూచున్నాడు. అతను యువకుడు. కోర్టులో ఒక ఉద్యోగి. అతని పేరు చిత్రంగాఉంటుంది. "ఒట్లెమ్ బెల్" అట అతనిపేరు. పేరు తగినట్టే కుదిరింది. అతను మాట్లాడుతుంటే గంట కొడుతున్నట్టుంటుంది. బంతిలాంటి ముఖం. లావుగా పొట్టిగా ఉంటాడు. అప్పుడే పోత పోసి తీసుకొచ్చిన గంటలా కనిపిస్తుంటాడు. ఏదో ఒకేయిదిగా వదురుతున్నాడు. అదంతా సోఫియానుగురించి పొగడడంతప్ప మరేమీకాదు.

ఫోమా అతని వాగుడంతావిన్నాడు. మధ్యమధ్య ఆమె వంకచూస్తున్నాడు. ఆమె ఒకపోలీసుఆఫీసర్‌తో సంభాషిస్తోంది. ఫోమా ఒకవైపున వింటూనే మరొకవైపు అతని మాటలకు గదిమినట్టుసమాధానాలిస్తున్నాడు. ఇదంతాఎంతతొందర్లో ముగుస్తుందాఅనిఆదుర్దాపడుతున్నాడు. తనుఅసహ్యంగాను,మాంద్యం గాను, పరిహాసాస్పదంగాను ఉన్నట్టుతోస్తోంది. అందరికళ్ళూ తన

మీదే ఉన్నట్టుగా, తనను పసిగట్టి తనకు అడ్డు తగులుతు న్నట్టుగా భావించుకోసాగాడు. ఈ బాధ అతన్ని అదృశ్యంగా ఉన్న శృంఖలాలతో బాధించింది తనమాటలను, భావాలను కూడా అరికడుతున్నట్టనిపించింది. చివరి కతనిమనోవేదన చాలా దూరంపోయింది. విందులో ముందువరుసలో కూచున్న ముఖా లన్నీ తనను చూచి విరగబడి నవ్వుతున్నట్టు భావించు కున్నాడు. ఆ చూపులన్నీ సూదుల్లా పొడుస్తున్నట్టున్నాయి.

మయకిన్ మేయర్ దాపులో కూచున్నాడు. తింటు న్నంతసేపూ మాట్లాడుతూనే ఉన్నాడు. మేయర్ అతనివంక బెదరిన ఆంబోతులా చూస్తున్నాడు. అంతానవ్వుకుంటున్నారు. ఆ నవ్వుల గోలలో మయకిన్ ఉపన్యాసం వినబడడంలేదు. అందులో ఒక్క ముక్కకూడా ఫోమాకు వినిపించడంలేదు. ప్రక్కన కూచున్న కార్యదర్శిమాటలు గంటకొట్టినట్టు అతని చెవులో గింగురుమంటున్నాయి. అతనికి విసుగెత్తిపోతున్నది.

“అడుగో! మతగురువు లేచినిలబడ్డారు. ఇక మళ్ళీ ఇగ్నాట్ పేరు స్థిరస్థాయికావాలని ఆశీర్వదిస్తాడు” అని అంటు న్నాడు కార్యదర్శి.

“నేను వెళ్ళవచ్చా?” అని అడిగాడు ఫోమా, మెల్లగా.

“ఎందుకు వెళ్ళకూడదూ. కాని అంతా దీన్ని అర్థం చేసుకుంటారు.”

మతగురువు మళ్ళీ గొంతెత్తి చెపుతున్నాడు. ఆ ధ్వని హాలులో ధ్వనులన్నిటినీ క్రమింగేసింది. వర్తకప్రముఖులు అతని నోటివైపు గుడ్లప్పచెప్పి చూస్తున్నారు.

ఈ సందు చూచుకుని ఫోమా అక్కణ్ణుంచి లేచి వెళ్ళి పోయాడు. వెంటనే తన బండెక్కి కూచుని అప్పుడు శాస్త్ర హాయిగా ఊపిరిపీల్చుకున్నాడు. ఇలాంటి గుంపులో తనకు స్థానంలేదని తలపోయసాగాడు. అతని అభిప్రాయంప్రకారం వాళ్ళంతా నాగరికులు, నాజూకైనవాళ్ళు. వాళ్ళ మెరుగులు, ఉల్లాసం, ఆ ముఖాలు, ఆ నవ్వులు, ఆ తీరు, ఆ తరహా; అన్నీ అతనికి అయిష్టంగాఉన్నాయి. వాళ్ళపై అతని శాకరికమైన అసూయకలిగింది. గౌరవంకూడాకలిగింది. వాళ్ళలా తను లేనందుకు, వాళ్ళంగా తనుమాట్లాడలేకపోయినందుకు దిగులుపడ్డాడు. ఆ దిగు లతన్ని క్రుంగదీసింది. ఈ విషయంలో తనను లూబా హెచ్చరించడం, నిందించడం ఇప్పు డతనికి గుర్తొచ్చాయి.

ఫోమాకు లూబాఅంటే ఇష్టంలేదు. ఆమెనుతనకిచ్చి వివాహంచెయ్యాలని మయకిన్ ఉద్దేశమైనట్టు తండ్రివల్ల తెలుసుకున్ననాటినుంచీ, ఆమెకుమరింతదూరంగా ఉండడం మొదలెట్టాడు. కాని తండ్రి పోయినతరువాత దాదాపు రోజూ మయకిన్ ఇంటికి వెడుతుండేవాడు. ఒకనాడు లూబా అతనితో "రోజూ నిన్ను చూస్తూనేఉన్నాను. కాని ఒక్కనాడైనా నీవు వర్తకుడికి మల్లే కనిపించవు." అన్నది.

"నీవూ వర్తకుడికూతురికిమల్లే కనిపించవు." అని బదులు అన్నాడు ఫోమా. ఆమెవంక అనుమానంగాచూచాడు. ఆమె మాట లతనికి బోధపళ్ళేదు. తనను నొప్పించడానికే అలా అన్నదో లేక తమాషాకు అన్నదో అతనికి తెలియలేదు.

"నీజవాబు బాగున్నది." అని ఆమె స్నేహంగా నవ్వి ఊరుకున్నది.

"ఏమిటంత సంతోషం?" అన్నాడు థోమా.

"మన తండ్రులకూ మనకూ పోలిక లేనందుకు. దాచకుండా చెప్పు. నీకు నాతండ్రి అంటే అంత ఇష్టం లేదుకదూ?" అని అడిగింది. థోమా ఆమె వంక నివ్వెరపోయి చూచాడు.

"అంతగా ఇష్టంలేదు." అని మెల్లగా జవాబిచ్చాడు.

"మరి నాకు అసలే ఇష్టంలేదు"

"ఎందుకని?"

"అన్నివిధాలాను. నీకు శాస్త్ర తెలివివచ్చినతరువాత నీవే తెలుసుకుంటావు. మా నాన్నకంటే మీ నాన్నే నయం."

"అవును. ముమ్మాటికీ" అన్నాడు థోమా, సగర్వంగా.

ఈ మాటలు జరిగిన తరువాత ఇద్దరి మధ్యా ఒక కొత్త అనుబంధం ఏర్పడింది. అది నానాటికి వృద్ధికాజొచ్చింది. అతి త్వరలోనే స్నేహంగా పరిణమించింది. కాని ఆ స్నేహం ఏదో చిత్రంగా ఉండేది. లూబా అతనికంటె వయస్సులో పెద్దదేం కాదు. అయినా పెద్దవాళ్ళు పిల్లవాళ్ళను చూచినట్టు అతన్ని చూచేది. పెద్దవాళ్ళుసలహాలిచ్చే పద్ధతిలో అతనితో మాట్లాడేది. అతనికి కష్టంకలిగినా ఖాతరుచెయ్యకుండా పరిహాసాలాడేది. ఆమె ఎప్పుడుమాట్లాడినా ఆ మాటలలోని భావం అతనికి బోధపడేదికాదు. ఆమె తను మాట్లాడే ప్రతిమాటా తూచినట్టు మాట్లాడేది. ప్రతిమాటా ఒత్తిపలికేది. ఆమె ఎక్కువగా తన అన్న తారాస్‌నుగురించి మాట్లాడేది. అతన్ని ఆమె ఎన్నడూ చూళ్ళేదు. అయినా ఆమె అతన్నిగురించి కథలల్లి చెపుతుంటే, థోమాకు అన్‌ఫీసా అత్త చెప్పినకథల్లోని ఉదాత్తతగల దోపిడిదొంగలు గుర్తుకొచ్చేవారు. తనతండ్రిని గురించి

తరుచు మాట్లాడుతూ "నీవూ అచ్చంగా అతనిలాగే తయా రవుతావు" అని ఎత్తిపొడుస్తూ ఉండేది. ఇదంతా అతనికి కష్టం కలిగించేది. అతని గర్వాన్ని, గాంభీర్యాన్నీ పోటుపొడిచినట్టుం డేది. కాని ఒక్కోమాటు ఆమె ముక్కుకు సూటిగా, నిష్కప టంగా ఉన్నట్టు కనిపించేది. అతనిపట్ల దయగా, స్నేహంగా ఉండేది. అలాటి సమయాల్లో తన బాధలన్నీ ఆమెకు చెప్పు కుని గుండెబరువు దించుకునేవాడు. ఎంతో సేపు ఇరువురూ మనసిచ్చి మాట్లాడుకున్నారు. కష్టసుఖాలు చెప్పుకునే వారు. కాని ఒకరిమాటలు ఒకరికి అర్థమయ్యేవికావు. లూబా మాటలు అతనికి విచిత్రంగా విడ్డూరంగా కనిపించేవి. అతని మాటలుకూడా ఆమెకు అర్థరహితంగా కనిపించేవి. ఎంతసేపు మాట్లాడుకున్నా ఇద్దరికీ ఏదో అసంతృప్తిగానేఉండేది. ఇద్దరిమధ్య తెలియకుండా ఒక గోడ హఠాత్తుగా నిలిచినట్టనిపించేది. ఆ అడ్డుగోడను తాకడానికి ఇద్దరూ సాహసించలేకపోయేవారు. తమ మధ్య అది అడ్డుఉన్నదనికూడా ఒకరికొకరు చెప్పుకోవడానికి భయపడేవారు. తమ మాటల్లో ఇద్దరినీ బంధించేది ఏమీలేక పోయినా మాటలుమాత్రం మానుకునేవారు కారు.

ఒకనాడు ఫోమా, మామూలుగా మయకిన్ ఇంటికి వచ్చాడు. అప్పుడు లూబా ఒంటరిగాఉంది. అతన్ని చూడగానే బయటికివచ్చి ఆహ్వానించింది. ఎంచాతనో అదోలా కనిపిస్తోంది. కళ్ళు ఎర్రగా మండుతున్నట్టున్నాయి. చలిగాలి తగలకుండా వెచ్చని శాలువ కప్పుకుంది. అతన్ని చూడగానే చిరునవ్వు నవ్వుతూ "నీవురావడం మంచిదైంది. ఒంటరిగా కూచున్నాను.

తోచడంలేదు. ఎక్కడికైనా వెడదామన్నా మనస్కరించలేదు. కొంచెం టీ తాగుతావా? అని అన్నది.

"సరేకాని, ఏమిటలాఉన్నావు? వంట్లో బాగాలేదా?"

గదిలోకివెళ్ళికూచో. అక్కడికి టీ తెమ్మనిచెపుతాను." అన్నది అతను అడిగినదానికి జవాబు చెప్పకుండా. అతను ఒక చిన్న గదిలోకి వెళ్ళాడు. గదికి రెండు కిటికీ లున్నాయి. కిటికీల్లోంచి చూస్తే తోట కనిపిస్తోంది. గదిమధ్య బాదంకాయ ఆకారంలోఉన్న బల్ల. బల్లచుట్టూ తోలు దిండ్లతోఉన్న పాతకాలపుకుర్చీలు, వాకిలికి ఎదురుగా గోడ గడియారం, ఒక మూల గిన్నెలు, పళ్ళాలు, వస్తువులుపెట్టుకునే ఆల్మరా ఉన్నాయి.

"నీవు విందుదగ్గర్నుంచి వస్తున్నావా?" అని అడిగింది లూబా గదిలోకి వస్తూనే. ఫోమా ఔనన్నట్టు తలఊపాడు.

"ఎలా ఉంది? గొప్పగా జరిగిందా?"

"ఘోరం!"అంటూ ఫోమా నవ్వాడు. "అక్కడున్నంత సేపూ నాకు ముళ్ళమీద కూచున్నట్టుంది. నిప్పులకుంపట్లో వేగినట్టు వేగిపోయాను. వారంతా నెమళ్ళమాదిరిగా ఉంటే నే నొక్కణ్ణి గుడ్లగూబలా ఉన్నాను." అన్నాడు ఫోమా. లూబా ఆల్మరాలోంచి గిన్నెలు తీస్తోంది. ఫోమా మాటలకు జవాబుచెప్పలేదు. ఎందుకలా విచారంగా ఉన్నావు?" అని అడిగాడతను మళ్ళీ. విచారంతో నిండిఉన్న ఆమె ముఖంవంక చూచాడు. "రాత్రంతా నిద్రపోలేదు. చదువుకుంటూ కూచు న్నాను. ఏదైనా చదువుదామా? మన కళ్ళముందు మరో. లోకం తలుపు తెరచుకున్నట్టనిపిస్తుంది. ఆ లోకమే వేరు.

అక్కడి మనుష్యులు, వారి భాషా, ఆతీరూ తెన్నూ; అన్నీ వేరు. ఆ లోకంలో బ్రతుకే వేరుగా కనిపిస్తుంది." అన్నదామె.

"నా కిలాంటివి నచ్చవు. అదంతా వట్టి కనుకట్టు గారడీ! నాటకశాలకూడా అలాంటిదే. అక్కడ వర్తకులను వెక్కిరిస్తూ చిత్రించిన నాటకాలు ఆడతారు. నిజంగా వాళ్ళంత అవివేకులా? ఉదాహరణకు మీనాన్ననే తీసుకో" "నాటకశాలా, బడీ, ఒకేమాదిరివి థోమా. పూర్వకాలంలో వర్తకులు అలా ఉండేవారు." అయినా పుస్తకాల్లో ఏం మోస్తం ఉంటుంది? "కట్టుకథల్లోలాగా పుస్తకాల్లో ఏదీ నిజం ఉండదు." "పొరపాటు! నీవు పుస్తకాలేవీ చదవలేదు. చదవకుండా ఎలా చెప్పగలవు? పుస్తకాలు నిజాన్ని తూచినట్టు చెపుతాయి. ఎలాజీవించాలో నేర్పుతాయి."

"ఏమిటీ, చెప్పవూ? ఇక చాల్లే. పుస్తకాలవల్ల ప్రయోజనమేమీ లేదు. మీ నాన్ననే తీసుకో. ఏంపుస్తకాలు చదివాడు? అయినా ఎంత తెలివైనవాడో చూడు! ఇవాళ ఆయన్ను చూస్తే నిజంగా నాకే అసూయపుట్టుకొచ్చింది. అందరితోనూ అంత చనువుగా, అంత తెలివిగా వ్యవహరించాడు. అందరితోనూ తగినట్టు మాట్లాడాడు. అలాంటివాడు ఏదనుకున్నా తప్పక సాధించగలడని వెంటనే చెప్పవచ్చు." అన్నాడు థోమా.

"ఇంతకూ ఆయనపడే తాపత్రయమంతా దేనికోసమంటావ్? డబ్బు! డబ్బుకోసం. కాని లోకంలో కొందరుంటారు. అందరిసుఖాన్నీ అపేక్షిస్తారు. ఆ ఆశయసిద్ధికోసం నిరంతరం

కృషిచేస్తారు. ఎలాటి స్వార్థమూ లేకుండా చేస్తారు. ఆ సాధన లోనే తపించి తపించి తుదకు రాలిపోతారు. ఇలాంటివారితో మా నాన్నను పోల్చగలవంటావా?" అన్నది లూబా.

"నీవు పోల్చవలసిన పనిలేదు. నీవు చెప్పేవాళ్ళకు ఒక విషయమంటే ఇష్టం. మీనాన్నకు మరోవిషయంపట్ల ఇష్టం. ఇది స్పష్టంగానే కనిపిస్తూనేఉంది." అన్నాడు ఫోమా.

"వాళ్ళకు దేనిమీదా ఇష్టముండదు."

"అదేమిటి?"

"వాళ్ళు ప్రతిదీ మార్చాలనుకుంటారు!"

"అంటే వాళ్ళుకూడా ఏదో ఒకదానికోసం తాపత్రయ పడుతున్నారంటావా? ఏదోఒకదాన్ని కోరుతున్నారంటావా?" సాలోచనగా అడిగాడు ఫోమా.

"వాళ్ళు అందరికీ సుఖంకావాలని వాంఛిస్తారు." అన్నది లూబా, కొంచెం తీవ్రంగా.

నేనిది అర్థంచేసుకోలేకపోతున్నాను. నా విషయమే చూడు. నా సుఖం ఎవరు పట్టించుకుంటున్నారు? అదీకాక నన్ను సుఖపెట్టేదేమిటో వాళ్ళకేం తెలుసు; నాకే తెలియ నప్పుడు? కాని, ఇవాళ విందుకొచ్చిన జనాన్ని నీవు చూచి ఉంటే బాగుండేది." అన్నాడు ఫోమా, తల పంకిస్తూ.

"వాళ్ళు మనుష్యులుకారు?" అనేసింది లూబా నిశ్చితంగా.

"నీ దృష్టిలో వాళ్ళెలాంటివాళ్ళో నాకు తెలీదు. కాని జీవితంలో తమ స్థానమేమిటో వాళ్ళకు నిర్దుష్టంగా తెలుసు. అదిమాత్రం స్పష్టం. ఆ తెలివి, ఆ చలాకీతనం ఓ! భలేగుంపు"

"అయ్యో, ఘోమా! నీ కొక్కటీ అర్థంకాదు. ఒక్కటీ నిన్ను కదిలించదు! నీవు కేవలం మందమతివి. వట్టి జడుడవు." అన్నది లూబా విసుగెత్తిపోయి.

"అదిగో! విషయాన్ని మళ్ళీ తిరగేస్తున్నావు! నే నెక్కడున్నదీ నాకే తెలీకుండాఉంది. అదీ నా పరిస్థితి."

"నీలో ఏమీలేదు. వట్టి శూన్యం." అన్నది లూబా రూఢిగాను, నిక్కచ్చిగాను.

"నా ఆత్మలో ఏముందో నీకేం తెలుసు? నీవేం చూచి రాలేదుగా? నా ఆలోచనలు నీవు తెలుసుకోలేవు." అని నింపాదిగా జవాబుచెప్పాడు ఘోమా.

"ఏముంది కనుక ఆలోచించడానికి?" అన్నది లూబా, భుజాలు ఎగరవేస్తూ.

"అలాగేం? ఎన్ని ఆలోచనలున్నాయో చెప్తా విను. మొదటిది, నేను ఒంటరివాడనయ్యాను. రెండోది నేను బ్రతకాలి. ఇప్పటి నాపరిస్థితినిబట్టిచూస్తే, ముందుముందు బ్రతకడం అసాధ్యం. ఆవిషయం నాకు సంపూర్ణంగా తెలుస్తున్నది. పరిహాసాస్పదంగాను, అవమానకరంగాను బ్రతకడం నాకిష్టంలేదు. మరి నేనేం చెయ్యాలి? నా కింతవరకు మనుష్యులతో మాట్లాడడంకుండా తెలీదు. కనీసం ఆలోచించడంకూడా చాతకాదు" గాభరాగా చిరునవ్వు నవ్వి తన మాటలు ముగించాడుఘోమా.

"దానికి చదవడం, చక్కగా విచారించుకోవడం అవసరం." అతన్ని ఒప్పిస్తున్నట్టుగా అంటూ లూబా, గదిలో అటూ ఇటూ పచారుచేయడం మొదలెట్టింది.

"నా అంతరంగంలోపల ఏదో అలజడి రేగుతోంది." మళ్ళీ చెప్పసాగాడు థోమా. అతను ఆమెవంక చూడకుండా తనలో తానే మాట్లాడుకుంటున్నట్లు చెప్పసాగాడు. "కాని అదేమిటో చెప్పలేకుండా ఉన్నాను. పోనీ మీ నాన్నగారు చెప్పిందే తెలివిగాను, సహేతుకంగాను ఉన్నదనుకుందామా అంటే— అది నన్నాకర్షించకుండా ఉంది. తక్కినవాళ్ళే నాకు ముచ్చటగా కనిపిస్తున్నారు."

"అంటే నీవనేది మదించిన గర్విష్ఠులా?"

"అవును."

"అదే! అదే నీకు తగినచోటు!" అలక్ష్యంగా చిరునవ్వునవ్వి లూబా అన్నది. "అబ్బెబ్బె, సిగ్గుచేటు! వాళ్ళూ మనుష్యులేనా? వాళ్ళకు హృదయమంటూ ఉన్నదా?" "వాళ్ళను గురించి నీ కెలా తెలుసు? వాళ్ళను నీవెరగవు. వాళ్ళతో నీకు పరిచయంలేదు."

"మరిపుస్తకాలూ? నేనువాళ్ళనుగురించి పుస్తకాల్లో చదవలేదనుకున్నావా?"

అంతలో పరిచారిక టీ తీసుకుని రావడంవల్ల వారి సంభాషణకు అంతరాయం కలిగింది. లూబా మాట్లాడకుండా టీ కలుపుతూ ఉంటే, థోమా ఆమెవంక చూస్తూ మెడిన్స్కాయాను జ్ఞప్తికితెచ్చుకున్నాడు. ఆమెతో ఒకమాటు మాట్లాడాలని అనుకుంటున్నాడు.

"అవును." అన్నది ఆ అమ్మాయి, సాలోచనగా. "బ్రతకడం కష్టమేనని నాకూ తెలుసు. ఆ మాటపై రోజురోజుకు నాకూ నమ్మకం కల్గుతూనే ఉంది. కాని నేనేంచెయ్యను? వివా

చూమా? ఎవరిని? ఎందుకూ పనికిరాని ఒక వర్తకుణ్ణి — బ్రతికి నన్నాళ్ళూ ప్రజలను దోచుకోవడం, తాగడం జూదమాడడం; వీటికితప్ప మరెందుకూ పనికిరానివాణ్ణి వివాహమాడనా? అనాగరికుడైన అడివిమనిషినా? అది నేను కోరడంలేదు! నేను నావ్యక్తిత్వాన్ని కాపాడుకోదలచాను, కాపాడుకుంటున్నాను. అవును, నాకు వ్యక్తిత్వమున్నది. ఎంచాతనంటే జీవితనిర్మాణం ఎంత తప్పుగా జరిగిందో నాకు తెలుసును. పోనీ చదువుకుంటే? మా నాన్నగారు దానికి అంగీకరించడు. ఓ భగవంతుడా! పారిపోతే? అంత సాహసంలేదు. కనుక నేనేంచెయ్యాలి?" ఆమె తన చేతులు కట్టుకొని బల్లమీదికి తలవొంచుకుంది. "ప్రతిదీ ఎంత అసహ్యంగాను, అప్రియంగాను ఉందో నీకు తెలుస్తే బాగుండును. ఈ చుట్టుప్రక్కల పుట్టపురుగుకూడా జీవించలేదు. మా అమ్మ చనిపోయినప్పటినుంచీ మా నాన్న అందర్నీ తరిమేసి నప్పటినుంచీ లీపాకూడా మమ్మల్ని విడిచివెళ్ళింది. ఆమె నాకు రాస్తుంది. 'చదువుకో' అని. అయ్యో, చదువు! నేను చదువుకుంటున్నాను! నేను చదువుకుంటున్నాను!" అంటూ ఆమె నిరాశతో ప్రలాపించింది. ఒక నిముషం ఊరుకుని మళ్ళీ విచారంగా చెప్పసాగింది. "హృదయం ఎక్కువగా, ఏది కావాలని కోరుతుందో అది పుస్తకాల్లో ఉండదు. పైగా వాటిలో నాకర్థంకానిది చాలావుంది. ఆతరువాత ఎల్లప్పుడూ ఒంటరిగా చదవడం అలుపొచ్చినట్టనిపిస్తోంది. కాసేపైనా మనిషితో మాట్లాడాలని ఉంది. కాని మాట్లాడడానికి ఎవరున్నారుకనుక? బ్రతుకుమీద చీదర—అసహ్యం పుట్టింది. ఒక మనిషి ఒక మాటే బ్రతుకుతాడు. కాని బ్రతుకు ప్రారంభం కావడానికి

నాకిప్పటికే కాలాతీతమైపోయింది. అయినా ఇంతవరకూ ఒక్క ప్రాణి కనిపించదు! నేనెక్కడ బ్రతకను? లీసా నాకు చెపుతుంది. "చదువు అంతా అర్థంచేసుకుంటావు" అని. నేను రొట్టెకావాలంటే అది రాయి తెచ్చి ఇస్తుంది. ఒక మనిషి ఏంచెయ్యాలో నేను గ్రహించాను. తాను నమ్మినదానికోసం, ప్రేమించినదాని కోసం నిలబడాలి. దానికోసం పోరాడాలి. కాని నేను ఒంటరి దానను! ఎవరితో పోరాడను? ఇక్కడెవరూ శత్రువులులేరు. ఇక్కడ మనుష్యులే లేరు! ఇక్కడ నా బతుకొక బంధిఖానా!" అని వాపోయింది లూబా.

థోమా తన చేతివ్రేళ్ళను పరీక్షగా చూచుకుంటూ ఆమె చెప్పిన మాటలన్నీ విన్నాడు. ఆమె మాటల్లో ఏదో అంతులేని బాధ, దుఃఖము ఉన్నాయని భావించాడు కాని, ఆమెను మాత్రం అర్థంచేసుకోలేకపోయాడు. దుఃఖంతో ఆమె క్రుంగిపోయి మౌనం వహించినప్పుడు, ఆమెను అనునయించడానికి కొద్దిమాటలుమాత్రం అతనికి తోచాయి. కాని ఆమాటలు చెప్పబోయేసరికి, అవి అనునయానికి మారుగా, కోపంగా కసురుకున్నట్టు ధ్వనించాయి.

"పుస్తకాలవల్ల ఏమాత్రం ప్రయోజనంలేదనీ, అవి నీ కేవిధంగాను ఉపయోగపడడంలేదనీ, నీమటుకునీవే ఒప్పుకుంటున్నావుకదా! అయినప్పుడు మరి నన్నుకూడా చదువుకోమని పురమాయిస్తావు దేనికి?" అన్నాడు.

ఆమె అతని ముఖంలోకి చూచింది. ఆమె కళ్ళల్లో కోపం జ్వలించింది. "నేను పొందే ఆవేదనలో నీవు అణుమాత్రమైనా గ్రహించగలిగిఉంటే ఎంత బాగుండేది. నా యాత

నలు, నా ఆలోచనలు, నా ఆవేదనలు నీ కున్నట్టయితే—నీవు కన్ను మూసేవాడివి కాదు. నీకూ్కడా నా మాదిరిగానే ప్రతిదానిమీదా రోత పుట్టేది. బ్రతుకుమీద అసహ్యంవేసేది. నీమీద నీకే రోత కలిగేది. మీలో ప్రతిఒక్కరినీ నేను అసహ్యించుకుంటున్నాను. నీవంటే నా కసహ్యం!"

ఆమె ముఖం జ్వలిస్తోంది. అతనివంక తీవ్రమైనకోపంతో చూచింది. ఎక్కడలేని అసహ్యం రోత పుడుతున్నట్టు చూచింది. అతనికి నివ్వెరపాటు కలిగింది. తనను నిందించి తనపై కోపం కురిపిస్తున్నదని, అత నా నివ్వెరపాటులో భావించుకో లేకపోయాడు. ఆ విధంగా ఆమె ఎన్నడూ అతనితో మాట్లాడి ఉండలేదు.

"ఏమిటిలా అయిపోయావు? ఏం జరిగింది?" అని మళ్ళీ అతనడిగాడు.

"నీవంటేకూడా నా కసహ్యం! నీవు, నీవేమిటి? నీవెవరివి? నీవు శవం, వట్టి డొల్ల నీవెలా బ్రతుకుతావు? మానవ జాతికి నీవేమివ్వగలవు? నీవల్ల ప్రయోజనమేమిటి?" అన్నదామె మెల్లని కంఠస్వరంతో, అతనిమీద అసహ్యాన్ని ద్వేషాన్ని వెళ్ళగక్కుతూ.

"నేనేమీ ఇవ్వలేను. వాళ్ళనుగురించి వాళ్ళే తాపత్రయపడనీ." అని జవాబిచ్చాడు ఫోమా; తనమాట లామెకు మండుతున్న అగ్నిలో ఆజ్యంపోసినట్టుంటాయని తెలిసే.

" వట్టి దౌర్భాగ్యుడు! " అన్నదా అమ్మాయి, అసహ్యంతో.

ఆమె నిందాపూర్వకంగా మాట్లాడుతున్నప్పటికీ, ఆమె మాటలలోని శక్తీ, తీవ్రతా, అప్రయత్నంగానే అతన్ని వినే టట్టుచేశాయి. ఆమె మాటలన్నీ శ్రద్ధగా విన్నాడు. వాటిల్లో ఏదో సాధారణమైన అర్థమే ఉన్నదనుకున్నాడు. ఆమెకు దగ్గరగా తన కుర్చీని జరుపుకున్నాడు. కాని ఆమె కోపంతో ముఖం తిప్పుకుంది. మౌనంగా ఊరుకుంది.

బయట ఇంకా వెలుతురుగానే ఉంది. అస్తమిస్తున్న సూర్యకిరణాలు కిటికీలకానుకుని ఉన్న నిమ్మచెట్ల కొమ్మలపై ప్రతిఫలిస్తున్నాయి. కాని అప్పటికే గదిలో సందెవెలుగు వ్యాపించింది. ఆ సందెవెలుగు నీడల్లో గదిలోఉన్న గోడ గడియారం,అల్మారా; ప్రతివస్తువూ పెద్దవైనట్టుకనిపిస్తున్నాయి. గడియారంలోని పెద్ద ఇత్తడి పెండ్యూలం మందంగా, బద్ధకంగా అటూ ఇటూ ఆడుతోంది. దాన్ని చూచేసరికి ఫోమాకు ఏదో ఏకాంతంగా ఉన్నట్టనిపించి విసుగుజనించింది. లూబా లేచి లాంతరు వెలిగించింది. లాంతరు, బల్లపైన వ్రేలాడుతోంది. ఆ అమ్మాయి ముఖం వివర్ణంగాను, నిశ్చితంగాను ఉంది.

"నీప్రవర్తన నాకేమీ అర్థంకావడంలేదు? ఏమిటి? ఎందుకిలా? అన్నాడు ఫోమా ముక్తసరిగా.

"నేను నీతో మాట్లాడదలచుకోలేదు!" అని లూబా సమాధానం చెప్పింది కోపంగా.

"అది నీఇష్టం. కాని నేను చేసిన తప్పేమిటి? నీకేం అపకారంచేశాను?

"నీవా?"

"నేనే."

"నేను ఊపిరాడకచస్తున్నాను. అర్థంచేసుకున్నావా? ఇదొక చీకటిజైలు. ఇది బ్రతుకేనా? ఇలాగేనా బ్రతకాల్సింది? నేనేమిటి? నాతండ్రిమీద ఆధారపడి బ్రతుకుతున్నదాన్ని. ఆయన ఇంటిమీదపడి తింటూ ఆయనకు భారంగా బ్రతుకుతున్నదాన్ని. ఇంటిపనులన్నీ చూడ్డానికి ఆయన నన్ను అట్టిపెట్టుకున్నాడు. తరువాత నాకు పెళ్ళిచేస్తారు! అప్పుడూ మళ్ళీ ఇంటిపనులు. మొద్దుజీవితం. నా బ్రతుకింతే! ఈకూపంలో ఊపిరాడక మునిగిపోతున్నాను."

"వీటన్నిటితో నాకేమిటి సంబంధం? నేనేం చెయ్యగలను?"

"అందరికంటె నీవేం తక్కువ తినలేదు. వాళ్ళలాగా నీవల్లా ప్రయోజనంలేదు"

"అందుకని నేను నేరం చేశానంటావా?"

"అవును. నేరం! బాగా బ్రతకాలని కోరుకోవాలి."

"అయితే నేను కోరుకోవడం లేదూ?" అనడిగాడు ఫోమా.

ఆ అమ్మాయి అతనితో ఏదో చెబుదామనుకున్నది. కాని అంతలో ఎక్కడో గంటమోగడం మొదలెట్టింది. ఆమె కుర్చీకి చేరగిలబడి మెల్లగా చెప్పసాగింది.

"నాన్నగారు"

"ఇంకా కొంచెం ఆలస్యంగావచ్చినా బాగుండేది. నీవు చెప్పేది నాకు ఇంకా వినాలనిపిస్తోంది, నీ మాటలు చాలా విచిత్రంగా ఉంటున్నాయి." అన్నాడు ఫోమా.

"ఓ! నా ముద్దుబిడ్డల్లారా! నా కంటిపాపల్లారా!" అంటూ

తలుపుదగ్గర ప్రత్యక్షమైనాడు మయకిన్. "టీ తాగుతున్నారా? లూబా! నాక్కూడా కాస్త టీ కలిపి తీసుకురామ్మా!" అన్నాడు. తీయని చిరునవ్వులు చిందిస్తూ, చేతులు రుద్దుకుంటూ వచ్చి అతను ఫోమాదగ్గిర కూచున్నాడు. సరదాగా చమత్కారంగా అతనితో మాట్లాడసాగాడు. "ఏమిటో ఇద్దరూ కిచకిచలాడుతూ గుసగుసముచ్చట్లాడుకుంటున్నారే?" అని అడిగాడు. ఫోమా చిరుపక్కలో చెయ్యివేసి చక్కిలిగింత పెడుతూ.

"అంత చెప్పుకోవలసిందేమీ లేదు. ఏదో లోకాభిరామాయణం." అని జవాబుచెప్పింది లూబా.

"నేను నిన్ను అడగలేదుగా? అడిగానా? నీవు ఊరికే అక్కడ కూచో. నోరు కదపకు. మీ ఆడంగుల వ్యవహారమేదో నీవు చూచుకో. అంతే." అన్నాడు కూతురుతో.

"ఇవాళ జరిగిన విందునుగురించి ఆమెతో చెపుతున్నాను." అన్నాడు ఫోమా, మధ్యలో అందుకుని.

"ఓహో! అలాగా! సరే; అయితే ఇక నన్నుకూడా విందునుగురించి కాస్త చెప్పనీ. నేను నిన్ను ఒకకంట కనిపెడుతూనే ఉన్నాను ఫోమా! నీవు తెలివిగా ప్రవర్తించలేదు. ఎలా ప్రవర్తించాలో నీకు తెలీదు!"

"అంటే ఏమిటి నీ ఉద్దేశం?" అని అడిగాడు ఫోమా, కనుబొమలు చిట్లిస్తూ.

"అంటే నీ ప్రవర్తన చాలా అవివేకంగాను, అసహజంగాను ఉన్నదంటున్నాను. అంతే. మాటవరసకు చెపుతాను చూడు. గవర్నర్ నీతో మాట్లాడినప్పుడు నీవు మారుపలకకుండా మౌనంవహించావు."

"నే నాయనతో ఏం మాట్లాడాలి? 'తండ్రిని కోల్పోవడం చాలా దురదృష్టం' అన్నాడాయన. సరే. అది నాకు తెలుసు. దానికి నేనేం చెప్పాలి."

"ఏం చెప్పాలా?" 'ఈశ్వరేచ్ఛ అలా ఉంది యువర్ ఎక్సెలెన్సీ. దాన్ని తప్పించడం, ఎవరివశం? అందుకు చింతించి ఏం ప్రయోజనం?' అని చెప్పాలి. లేదా అలాంటి మాటే ఏదో, ఆ ధోరణిలో చెప్పాలి. గవర్నరు నాయనా. ఏమనుకున్నావు? ఎంత వినయవిధేయతలు చూపితే అంత మక్కువ పడతారు."

"అంటే నన్ను గొర్రెపిల్లలా అతని కాళ్ళకుచుట్టుకోమంటావా?" అని అడిగాడు థోమా, చిరునవ్వు నవ్వుతూ.

"నీవు చూపులకు గొర్రెపిల్లలాగే కనిపిస్తావు. అది అనవసరమంటాను. నీవు గొర్రెపిల్లలా కనపడాల్సినపనీలేదు. లేక తోడేలు లా ఉండాల్సిన అవసరమూలేదు. నీవు మాకు తండ్రివంటివాడివి, మేము మీకు బిడ్డలవంటివాళ్ళం' అని అలా అర్థంవచ్చేటట్టు ప్రవర్తిస్తే చాలు. వెంటనే ఆయన వెన్నముద్ద అయిపోతాడు."

"దేనికి ఈపని చేయడం?"

"దేనికైనా అవసరమే. గవర్నర్ నాయనా గవర్నర్. ఎప్పుడూ ఏదోవిధంగా మన కుపయోగపడేవాడు, ఎక్కడో ఒకచోట మనకు అవసరమయ్యేవాడు.

"ఏమిటి నాన్నా అతనికి బోధిస్తున్నది?" అని అడిగింది లూబా మెల్లగా, నొచ్చుకుంటూ.

"ఏమి టనుకుంటున్నావు?"

"ఏముంది! నటన. నటనతో పొట్టపోసుకోవడం!"

"అబద్ధం! చదువుకున్న మొద్దూ! నే నతనికి బోధిస్తున్నది రాజకీయాలుగాని నటించడంకాదు. బ్రతకడానికవసరమైన రాజకీయాలు బోధిస్తున్నాను. చూడు. మా విషయానికి మమ్మల్ని వదిలేసి నీపనికి నీవుపోవడం మంచిది. మాగోల నీకెందుకు? కాస్త తినడాని కేదైనా తీసుకరా, వెళ్ళు. వెళ్ళు!"

వెంటనే లూబాలేచి తనవంటిమీద కప్పుకున్న శాలువ కుర్చీమీద అడ్డంగా పడేసి చరచర లోపలికి వెళ్ళిపోయింది. ఆమె వెడుతోంటే మయకిన్ కళ్ళు తిప్పుకుంటూ చూచాడు. వేళ్ళతో బల్లమీద దరువువేస్తూ ఇలా అన్నాడు. "ఫోమా! నీకు పాఠం చెపుతాను విను. బ్రతకడానికి అవసరమైన అసలైన సిసలైన విజ్ఞానం, నిజమైన జీవితసారం నీకు బోధిస్తాను. విను. వాటిని నీవు గ్రహించావంటే, నీ జీవితం ఎలాటి మచ్చ, మరక లేకుండా సాఫీగా సాగిపోతుంది"

ఫోమా ఆ వృద్ధుడి ముఖంలోకి చూచాడు. అతని నుదుటిమీద వంకరటింకరగా ముడతలుపడ్డాయి. ఆ ముడతలు లిపిలాగా, అక్షరపు పంక్తుల్లాగా అగుపిస్తున్నాయి.

"ఫోమా! మొట్టమొదట నీవొకవిషయం గ్రహించాలి. నీవు భూమిమీద బ్రతికినన్నాళ్ళూ, నీకు సంబంధించిన ప్రతి విషయాన్నీ ఆలోచించడం నీ విధి. ఎందుకంటావా? నీఅజ్ఞానం వల్ల నీవే బాధపడకుండా ఉండడానికిన్నీ. నీఅవివేకంవల్ల ఇతర్లకు అపకారం జరగకుండా ఉండడానికిన్నీ, ఆ పని చెయ్యాలి. ఇక పోతే, మనిషిచేసే ప్రతిచర్యకూ రెండు ముఖాలుంటాయి ఫోమా. ఒక ముఖం అందరికీ అగుపించేది—ఇది నకిలీ ముఖం;

ఇక రెండో ముఖం ఎవరికీ కనిపించకుండా లోపలదాగిఉంచది—ఇది అసలు ముఖం. ఏ విషయాన్నైనా నీవు అర్థంచేసుకోవాలన్నా, దాని సారాన్ని గ్రహించాలన్నా ఈ ముఖంతోనే. ఉదాహరణకు తీసుకో — విశ్రాంతిగృహాలు, రక్షణశాలలు, శరణాలయాలు, పేదల వసతిగృహాలు; ఇంకా ఇలాంటి ధర్మ సంస్థలనే తీసుకో—ఒక్కమాటు ఆలోచించు. ఇవి ఎందుకోసం?" అన్నాడు మయకిన్.

"ఇందులో ఆలోచించాల్సిందేముంది? అవి ఎందుకోసమో అందరికీ తెలిసిందే—పేదలకోసం, అశక్తులకోసం." అన్నాడు ఫోమా బద్ధకంగా.

"ఓయ్, అబ్బాయీ! విను. ఎవడో ఒకడు—పుండాకోరు పచ్చిదుర్మార్గుడు, క్షుద్రుడు అయినవాడుంటాడనుకో. వాడలాంటివాడని అందరికీ తెలుసు. అయినప్పటికీ అతన్ని మహాత్మా అనో మహారాజా అనో పిలుస్తారు. నిందించడానికి మారుగా అతని పేరుకు అతని తండ్రిపేరుకూడా ప్రక్కన చేర్చి గౌరవిస్తారు."

"ఇప్పుడు దానికీ దీనికీ సంబంధమేమిటి?"

ఇదంతా అసలువిషయానికి సంబంధించినదే. ఇంతకూ నీవన్నట్లు ఈ ధర్మసంస్థలన్నీ ఈశ్వరునిపేరుమీద పేదవాళ్ళకు, బిచ్చగాళ్ళకు సహాయం చేసేనిమిత్తం ఏర్పడ్డాయి కదా. సరే, బాగానేఉంది! కాని ఎవడు బిచ్చగాడు? మనం నిత్యజీవితంలో ఈశ్వరుణ్ణి జ్ఞాపకం చేసుకుని, ఆయన్ను స్మరించడంకోసం, విధిబలంచేత సృష్టించబడినవాడే బిచ్చగాడు. అతను ఈశ్వరుని సోదరుడు. మన ఆత్మలను మేల్కొల్పడానికి ప్రభువు

ప్రమోగించే గంట అతను. అతను మన గడపలో నిలబడి భగవం తుని పేరుమీద నాకు ధర్మం చెయ్యండి; ఈశ్వరార్పణం' అని పలుకుతాడు. దానివల్ల మనకు ఈశ్వరుణ్ణి జ్ఞాపకంచేసినవాడవు తున్నా డతను. 'తోటి మానవుడికి తోడ్పడండి'. అనే ఈశ్వర వాక్కును స్మృతికి తెచ్చినవాడవుతున్నాడు. కాని మానవులు తమ జీవితాలను వేరే విధంగా నిర్మించుకున్నారు. అంచేత ఈ జీవితంలో ఈశ్వరాజ్ఞలను అనుసరించడం అసాధ్యమైంది. కనుక మనకు జీవితంలో ఈశ్వరుడే అనవసరమైనాడు. ఒకసారి కాదు. వందమార్లు, వేయిమార్లుకూడా మనం భగవన్నామస్మరణ చెయ్యాని పాపపు సమయాలున్నాయి. అయినా, ఈ అనాథులు భిక్షుకులు. అనవరతం వీధులవెంట తిరుగుతూ భగవన్నామస్మరణ చేసి, మనకు ఆయనజ్ఞాపకం వచ్చేటట్టు చేస్తున్నారు. అంచేత మనం జీవితంలో పూర్తిగా ఈశ్వరుణ్ణి మరువకుండా ఉండడం సంభవిస్తోంది. కాని మనం ఇప్పుడు ఈ బిచ్చగాళ్ళ అందరికి శరణాలయాలేర్పరచి అందులో వాళ్ళను బంధిస్తున్నాము. ఇక వాళ్ళు వీధులుతిరగడం పోయింది. అంచేత ఒక్కమాటలో చెప్పాలంటే మనం ధర్మసంస్థలనేవి నెలకొల్పి బిచ్చగాళ్ళను అందులో బంధించి మనఆత్మలను నిద్రపుచ్చుతున్నాం. ఈ ధర్మ సంస్థలనిర్మాణం ఒకతంతు, ఒక పన్నాగం!" అన్నాడు మయకిన్.

"చాలా తెలివిగా చెప్పావు." అంటూ ఫోమా మయకిన్ వంక ఆశ్చర్యపోతూ చూచాడు.

"ఇప్పుడు గ్రహించావా అసలువిషయం?" అన్నాడు మయకిన్. ఏదో విజయంసాధించినట్టు అతని కళ్ళు మిలమిల మెరిశాయి.

"మరి మా నాన్నగారు ఈ విషయం ఎందుకు ఆలోచించలేదు?" అన్నాడు ఫోమా, కష్టంగా.

"ఉండుండు! నన్ను సాంతం చెప్పనీ. ఇంకా ఘోరమైన సంగతులున్నాయి. కనుక ఇప్పుడు మనకు తేలినసారాంశం ఏమిటీ అంటే—అనాథులను, భిక్షుకులను మనం స్వేచ్ఛగా వీధులలో తిరిగి అడుక్కోనీయకుండా ధర్మశాలలనే బందిఖానాల్లో పెడుతున్నాం. అక్కడ వాళ్ళచేత పనిచేయించి తిండి, బట్ట ఇస్తున్నాం. వాళ్ళు వృద్ధులు, దుర్బలులు అయినా బలవంతాన పనిచేయిస్తున్నాం. ఇక వాళ్ళ దీనవదనాలు మనకు వీధుల్లో కనిపించవు. వాళ్ళ దౌర్భాగ్యాన్ని, దుఃఖాన్ని మనం చూడవలసిన పనిలేదు. కాబట్టి ప్రపంచంలోని మానవులంతా తిండికీ బట్టకూ కొదువలేకుండా సుఖజీవనం గడుపుతున్నారని భావిస్తాం. అంచాత ఈ ధర్మశాలలనేపేరుతో మనం సత్యాన్ని ఈశ్వరుణ్ణి జీవితంలోంచి తరిమివేసి వ్యర్థంగా బ్రతుకుతున్నవాళ్ళం అవుతున్నాం. ఇప్పుడు నీ కర్థమైందా?"

"అవును." అన్నాడు ఫోమా ఆ వృద్ధుడి తెలివైన మాటలకు కలవరపడుతూ.

"ఇంతటితో అయిపోలేదు. ఇంకా గుంటను అడుగు వరకూ తిరగతోడలేదు." అన్నాడు మయకిన్, ఉత్సాహంతో గాలిలో చెయ్యిఆడిస్తూ. అతని నుదుటిమీద ముడుతలు కదులుతున్నాయి. కాకిముక్కులాంటి అతని పొడుగాటి ముక్కు వణుకుతోంది. కంఠస్వరం ఉద్రేకంతో ప్రకంపిస్తోంది. మళ్ళీ చెప్పసాగాడు. "ఇక ఈ విషయాన్ని రెండో వైపునుంచి చూద్దాం. పేదవాళ్ళకోసం కడుతున్న ఈ ధర్మశాలలకు చందా

లిచ్చే దెవరు? భాగ్యవంతులు, వర్తకులు—మనకోవకు చెందిన వర్తకులంతా. బాగానేఉంది! మరి మన బ్రతుకును నియమబద్ధం చేసి శాసించేదెవరు? గొప్పగొప్పవారు, ప్రభువులు, అధికార్లు మనతరగతికి చెందని ఇంకా తక్కినవాళ్ళు. వీరివద్దనుంచి మనకు చట్టాలు, న్యాయసూత్రాలు, వార్తాపత్రికలు, విజ్ఞానం, శాస్త్రం ఇవన్నీ వస్తాయి. పూర్వం వీళ్ళంతా భూవసతికలవారే. కాని, ఇప్పుడు ఆ భూములు వాళ్ళవద్దనుంచి ఎగిరిపోయాయి. అంచాత ఉద్యోగాల్లోకి దిగారు. బాగానే ఉంది! కాని ఈనాడు అందరి కంటె శక్తికల ప్రజ లెవరు? వర్తకుడు! సామ్రాజ్యంలోకల్లా సర్వశక్తిసంపన్నుడు వర్తకుడే! ఎందుకంటే అతని చేతుల్లో కోట్లకొలదీ ధనం ఉన్నది! నిజమేనా?" "నిజం!" ఒప్పుకున్నాడు ఫోమా.

"ఇది గుర్తు పెట్టుకో" మళ్ళీ ఆ వృద్ధుడు స్పష్టంగాను, ఆకర్షణీయంగాను చెప్పసాగాడు. "కనుక జీవిత నిర్మాణం వర్తకులమైన మన చేతుల్లో లేదు. అందులో మనకు పాలులేదు. అక్కడ మనమాట చెల్లదు. బ్రతుకును ఏర్పాటుచేసింది పరాయివాళ్ళు. వాళ్ళే బ్రతుకులో నానారకాల అంటువ్యాధులనూ వృద్ధిచేస్తున్నారు—ఈ వికలాంగులను, అనాథులను, బిచ్చగాళ్ళను పెంచి పెద్దచేస్తున్నారు. అలా వృద్ధిచేసి బ్రతుకుకు ప్రతిబంధకం కలిగిస్తున్నారు. బ్రతుకును పాడుచేస్తున్నారు. న్యాయంగా చెప్పాల్సివస్తే మళ్ళీ ఈ బ్రతుకును సరిదిద్దాల్సిందీ, బాగుచెయ్యాల్సిందీ వాళ్ళే. అది వాళ్ళవిధి. కాని మనమే బ్రతుకును బాగుచేస్తున్నాం. పవిత్రవంతంగా చేస్తున్నాం. పేదవాళ్ళకు దానధర్మాలు చేసేదీ, వాళ్ళ శ్రేయస్సుకోరేది

మనమే. ఇందేంన్యాయమో నీవే ఆలోచించు. పరాయివాడు తన కోటు చింపుకుంటాడు. దానిని మనం కుట్టిపెట్టాలి. పరాయివాడిఇల్లు—అందులో ఉండేవాడూ పరాయివాడే. అయినా దానిని మనం బాగుచెయ్యాలి. ఎందుకిలా చెయ్యాలి? ఇదేనా న్యాయం? అంచాత బ్రతుకులో వృద్ధిపొందుతున్న ఈ కల్మషాన్నంతా కనిపెడుతూ, దాన్ని వారెలా నిర్మూలించేస్తారో చూస్తూ కొంతకాలంపాటు మనం దూరంగా ఉండాలి. ఈ కల్మషాన్ని వారు తుడిచెయ్యలేరు. ఆ పని చేయడానికి వారు పనికిరారుకూడా. అప్పుడు వాళ్ళు మన దిక్కు చూస్తారు, మనకోసం వస్తారు.

"అయ్యా! మాకు సహాయపడండి!" అంటూ మన సహాయాన్ని అర్థిస్తారు. అప్పుడు మనం "పనిచేయడానికి మాకు అవకాశం ఇవ్వండి! జీవిత నిర్మాతల్లో మేమూ ఒకరంగా గుర్తించండి!" అని సమాధానం చెపుతాం. అలావాళ్ళు అవకాశమిచ్చినవెంటనే మనమూ అదే కుంచె పట్టుకుని వాళ్ళతోపాటు బ్రతుకులోని కల్మషాన్ని కడిగివెయ్యడానికి పూనుకుంటాం. అప్పుడు చక్రవర్తి తన కళ్ళతో తాను చూస్తాడు. ఎవరు నిజంగా తనకు విశ్వాసపాత్రులైన సేవకులో గ్రహిస్తాడు. మన చేతుల్ని కట్టేసి ఉంచినప్పుడుకూడా ఎంతటి విజ్ఞానం మనం కూడబెట్టుకోగలిగామో చూస్తాడు. అర్థమైందా?"

"అవుతోంది!" అన్నాడు ఫోమా.

మయకిన్, అధికారవర్గాన్నిగురించి మాట్లాడేటప్పుడు ఫోమా విందులో తాను చూచినజనాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. విందులో తన సరసన కూచున్న విచిత్రమైన కార్య

దర్శిని గుర్తుకు తెచ్చుకున్నాడు. వెంటనే అతనికి ఆలోచన తట్టింది. ఆ కార్యదర్శి ఏపాటివాడు. అతని ఆదాయం మహా ఉంటే ఏడాదికి వెయ్యి రూబుళ్ళు. కాని తనకు? తాను కోటీశ్వరుడు. అయినా అతనే ఎంతో హాయిగా, స్వేచ్ఛగా బ్రతుకుతున్నట్టూ,ఇన్ని కోట్లున్నా తాను బ్రతకలేకపోతున్నట్టూ భావించుకున్నాడు. ఈ విషయము, మయకిన్ ఇచ్చిన ఉపన్యాసము; ఇవి రెండూ అతనిలో ఆలోచనా పరంపరలను ప్రకోత్తించాయి. కాని ఒక్కటిమాత్రమే అతను బయటికి విప్పి చెప్పగలిగాడు.

"కనుక. మనం కేవలం డబ్బుకోసమే పనిచేస్తున్నామంటావా? అధికారం ఇవ్వలేనప్పుడు డబ్బువల్ల ప్రయోజనమేమిటి?" అని అడిగాడు ఫోమా.

"అయ్యో!" అన్నాడు మయకిన్ కళ్ళార్పుతూ. ఫోమా కొంచెం కోపంగా "మరి మానాన్నగారిమాటేమిటి? నీవు ఆయనతో చెప్పావా?" అనిఅడిగాడు.

"ఇరవై సంవత్సరాలు చెప్పాను."

"సరే, ఏమన్నారు?"

"నామాటలు అతని తలకెక్కలేదు. అతని బుర్ర మట్టిబుర్ర.అతని హృదయంమాత్రం అందరికీ అందుబాటులో ఉండేది. అతని మనస్సుమాత్రం మరుగులో ఉండేది. అవును. అతను తప్పుచేశాడు. డబ్బునుగురించి నాకు చాలా విచారంగా ఉంది."

"డబ్బునుగురించి నేను విచారించడంలేదు."

"అందులో పదోవంతైనా నీవు సంపాదించి, ఆపైన మాట్లాడు."

"నేనురావచ్చా?" అంటూ తలుపు అవతల్నుంచి లూబా కంఠస్వరం వినిపించింది.

"నిరభ్యంతరంగా రావచ్చు." అన్నాడు ఆమె తండ్రి.

"ఇక ఫలహారాలకు లేస్తారా?" అని ఆడిగింది ఆమె గదిలోనికి వస్తూ.

"చేస్తాం."

వెంటనే ఆమె అల్మారావద్దకు వెళ్ళి కప్పులు, పళ్ళాలు ఇవతలికితీయడం మొదలెట్టింది. మయకిన్ ఆమెవంక చూచి పెదవులు కదిల్చాడు. హఠాత్తుగా ఫోమా మోకాలిమీద తడుతూ "అదీ నాయనా విషయం! ఆలోచించు." అన్నాడు

ఫోమా చిరునవ్వు నవ్వి తనలో "కానిఈయన తెలివైన వాడు–నా తండ్రికంటె చాలా తెలివైనవాడు." అని అనుకున్నాడు. కాని తక్షణమే అతనిలోంచి మరోవాక్కు– "తెలివైన వాడే కాని చెడ్డవాడు." అని సమాధానం చెప్పింది.

## ఆయిదో అధ్యాయం

కాలం గడిచిపోతూవుంది. మయికిన్‌పట్ల ఫోమా ద్వంద్వాత్మక బాంధవ్యం నానాటికి దృఢతరమవుతూఉంది. ఒక వైపునఅతని మాటలు వినాలనే ఆసక్తి, మరోవైపు అతనంటే అసహ్యం—ఈ రెంటి మధ్యా ఫోమా ఊగిసలాడుతున్నాడు. ఫోమాకు ఒక్కొక్కసారి తన రక్షక పితను చూస్తే భయంవేసేది, మరోసారి శారీరకంగాకూడా అతనికి దూరంగా ఉండాలనిపించేది. ఆ స్పర్శకూడా గిట్టేదికాదు. ఎప్పుడైనా కులాసాగా

ఉన్న సమయాల్లో మయికిన్ ఫోమా దగ్గరికి వస్తూవుండేవాడు. నవ్వుతూ కబుర్లు చెప్పేవాడు. నవ్వుతూంటే ముసలివాడి ముఖంలో ముడతలు కంపిస్తూఉండేవి. అతనిముఖంతీరు మాటి మాటికీ మారుతూవుండేది మాట్లాడుతున్నా, నవ్వుతున్నా సన్నని పెదవులు ముందుకు సాగేవి. నల్లని పగిలిన పండ్లు బైటపడేవి. ఎర్రని చిన్నగడ్డం జ్వాలలాగా కనుపించేది. తుప్పుపట్టిన ఇనప లంకెల మోతలాగా వినిపించేది నవ్వు. అటూ ఇటూ పరుగులిడుతున్న బల్లిపిల్లలా కనుపించేవాడు. ఫోమా, ఆవృద్ధునిపట్ల తన అసహ్యాన్నికాని, క్రోపతాపాలను కాని దాచిపెట్టుకోగలిగేవాడు కాదు. మాటలద్వారానూ చేతలద్వారానూ ప్రదర్శిస్తూనే ఉండేవాడు. కాని, ముసలాడు. గమనించనట్టుగా నటించేవాడు. ఫోమామీద ఒక కన్ను వేసి ఉంచేవాడు. ఎప్పుడూ అతని అడుగడుగూ కనిపెట్టిఉండేవాడు. ఎప్పుడూ అతని పడవల వ్యాపారమంతా తనే చూస్తూ, తన దుకాణానికి వెళ్ళడంకూడా మానేశాడు. అంచాత ఫోమాకు కావాలసినంత తీరికకూడా చిక్కింది. మయకిన్‌కు ఊళ్ళో కావలసినంతపేరు ప్రతిష్టలూ పదవీ అన్నీ వున్నాయి. వోల్గా తీరంలో కావలసినన్ని పరిచయాలున్నాయి. అంచాత వ్యాపారం ముమ్మరంగా సాగుతూఉంది. కాని, తన వ్యవహారాల్లో ఇంత శ్రద్ధతీసుకోవటం వల్ల, అతని కూతురిని తన కిచ్చి కట్టిపెట్టడానికేనన్న అనుమానం ఫోమాలో మరింత గట్టి పడింది. అంచాత ఆ ముసలాడంటే అసహ్యం మరీఎక్కువైంది.

లూబా అంటే ఫోమాకు ఇష్టమే. కాని ఆమె పట్ల ఏదో అనుమానం, భయంకూడాఉండేది. ఒక్కోసారి అను

మానాస్పదంగానూ ప్రమాదకరంగానూ కనుపించేది. ఆమెకు ఇంతవరకు పెళ్ళికాలేదు. మయకిన్ ఒక్కమాటుకూడా ఆ విషయం ప్రస్తావించడు. సాయంకాలపు పార్టీ లివ్వడంకాని, యువకులను తన ఇంటికి ఆహ్వానించడంకాని, అలాటి పనులేమీ చెయ్యడు. లూబాను ఇల్లు వదలి వెళ్ళనివ్వడుకూడా. ఆ అమ్మాయితోటి స్నేహితురాండ్రందరికీ అప్పుడే పెళ్ళిళ్ళయిపోయినాయి. ఫోమా ఆమె మాటలు ఎంతో మెచ్చుకునేవాడు. ఆమె తండ్రి మాటలు విన్నట్టే ఆమె మాటలుకూడా శ్రద్ధగా ఆలకించేవాడు. కాని ఆమె తన అన్న 'తారాస్'ను గురించి ప్రేమతోనూ, వేదనతోనూ మాట్లాడడం మొదలెట్టగానే ఆ పేరట మరో వ్యక్తిని దాచి అతన్నిగురించి మాట్లాడుతున్నదేమో అనిపించేది. ఆమె ఎంతో నిష్కపటంగానూ దయార్ద్రంగానూ కనుపించేది. ఈ లక్షణాలు ఫోమాను ఎంతో ఆకర్షించాయి. చాలాసార్లు ఆమె మాటలు వింటుంటే ఆమెపట్ల ఒకవిధమైన జాలి కలిగేదికూడా. ఆమె ఈ లోకంలో బ్రతికి తిరుగుతున్న ఒక వ్యక్తిలా కనుపించేది. మేలుకునిఉన్నా, ఎప్పుడూ ఏదో కలలో ఉన్నట్టుగా ఉండేది.

తన తండ్రి అంత్యక్రియల సందర్భంలో ఫోమా ప్రవర్తన వరకులందరికి తెలిసిపోయింది. అంచాత వాళ్ళదృష్టిలో అతనికి అపకీర్తికూడా వచ్చింది. బేరానికి వెళ్ళినప్పుడు అందరూ తన వంక అదోలా తనను పరిహాసం చేస్తున్నట్టు చూడడం గమనించాడు ఫోమా. అతనితో మాట్లాడే తీరులోకూడా ఏదో మార్పు కనుపించింది. ఒకరోజు అతనికి వెనకాలే ఎవరో అతన్ని

గురించి, గార్డ్ లేంక్ 'ఎందుకూ పనికిమాలినవాడు,' అని అనడం ఫోమా విన్నాడు.

ఇది తననిగురించే అనుకున్నారనుకున్నాడు ఫోమా. కాని ఆమాటలు ఎవరన్నారో అని వెనక్కుతిరిగి చూడలేదు. ఒకప్పుడు శ్రీమంతులను చూస్తే అతనికి భయంగా ఉండేది. ఒక ఆకర్షణకూడా ఉండేది. ఇప్పుడు రానురాను ఆ భయమూ ఆకర్షణా సన్నగిల్లిపోతున్నాయి. వాళ్ళు ఒకటి రెండు సార్లు అతన్ని మోసంచెయ్యడానికి యత్నించడం అతను గమనించాడు. ఇలా మోసంచెయ్యడానికి వెనుకాడరని గ్రహించాడు. అందరూ ఇదేవిధంగా ఒకరినిఒకరు మోసంచేసుకుంటూ బ్రతుకుతారనీ డబ్బుకోసం ఎలాటిపనయినా చేస్తారనీ గ్రహించాడు. ఒకమాటు ఈ విషయాన్ని మయకిన్‌తో ప్రస్తావించాడు. అప్పుడు ఆ వృద్ధుడు 'వ్యాపారమంటే మరేమిటనుకున్నావ్? వ్యాపారం ఒక యుద్ధంలాంటిది. డబ్బుకోసం హోరాహోరి పోట్లాడుతారు. డబ్బులోనే దేవుడున్నాడోయ్!'' అన్నాడు.

"నా కిలాటివంటే ఇష్టంలేదు,'' అన్నాడు ఫోమా.

"నాకూ ఇష్టంలేదు. ఈ విషయాల్లో చాలా మోసం ఉంది. అయినా వ్యాపారంలో మడికట్టుకుని ఉండడం సాధ్యమయ్యే పనికాదు. కాస్త తెలివితేటలతో వ్యవహరించుకోవాలి. అబ్బాయ్! ఒక మనిషి వ్యాపారం పనిమీద నీదగ్గరికి వచ్చాడంటే ఒక చేతిలో తేనె చూపుతూ మరోచేతిలో చురకత్తి దాచి ఉంచాలి. అయిదు కోపెక్‌లుచేసేవస్తువును అరకోపెక్‌కే కొనాలని చూస్తారు.''

"ఇదీ మంచిపనికాదు," అన్నాడు ఫోమా సాలోచనగా.

"ముందు మంచిగా కనుపించకపోయినా తరువాత మంచిగా పరిణమిస్తుంది. జీవితం చూచావబ్బాయ్ - ఒక్క మాటలో చెప్పాలంటే - నీకు చేతనవుతే అందరినీ కరిచి బ్రతుకు. లేదా ఒకమూల ముసలమ్మలా పడుండు." అని ముసలాడు నవ్వాడు. అతని పండ్లు బైటపడ్డాయి. ఆ పండ్లు చూడగానే ఫోమాకు ఒకభావం తట్టింది.

"నీవు చాలామందిని కరిచినట్లున్నావు"—అన్నాడు.

"పోరాటం!—అదొకటీ అసలైనమాట"—అన్నాడు ముసలాడు.

"అదొక్కటేనా నిజం?"—అని ప్రశ్నించాడు ఫోమా మయకిన్‌వంక అన్వేషిస్తున్నట్లు చూస్తూ.

"నిజంఅంటే నీ ఉద్దేశం?"

"ఇంతకంటె ఉత్తమమైంది ఏమీలేదా? బ్రతుకంతా ఇందులోనేఉందా?"

"ఇంతకంటె మంచి ఎక్కడుంటుంది? ప్రతిమనిషీ తన కోసం జీవిస్తాడు. తన బాగు కోరుకుంటాడు. జీవితంలో కోర దగింది ఏమిటి? అందరికంటె మిన్నగా ఉండడమే. ప్రపంచంలో ప్రతిమనిషీ జీవితంలో తొలిస్థానం తనే ఆక్రమించుకోవాలని చూస్తుంటాడు. ఇందుకోసం ఒకడు ఒకమార్గం అనుసరిస్తే మరొకడు మరోమార్గం అనుసరిస్తాడు. కాని ప్రతివాడూ శిఖరంలా పైకి పెరగాలనే చూస్తాడు. నిప్పు రవ్వల్లాగ పైకి వెళ్ళడానికే మనిషి పుట్టాడని జాబ్ గ్రంథం చెబుతూఉంది. ఉదాహరణకుచూడు; ఆడుకునే పసిపిల్లలుకూడా ఆ పాటల్లో

ఒకరినొకరు మించాలని చూస్తుంటారు. ప్రతిఆటకూ ఒక పట్టనేది ఉంటుంది. ఆ పట్టే ఆటకు ఆకర్షణ. అర్థమైందా?"

"అర్థమైంది!"—అన్నాడు థోమా నిశ్చితంగా.

"అర్థం కావడమేకాదు. నీవు ఈ విషయాన్ని బాగా మనసుకు పట్టించుకోవాలి"కూడా. ఒక్క-అర్థం చేసుకున్నంత మాత్రంతోనే నీవు సాధించినట్టుకాదు. నీవు ఒక విషయాన్ని సాధించితీరాలని తీవ్రంగా ఆశించాలికూడా. ఒక పెద్ద కొండ నీకంటికి ఒక చిన్న రాతిగుట్టలా కనుపించాలి. సముద్రం ఒక చిన్న నీటిమడుగులా కనుపించాలి. నీ ఈడులో నేనెంతో హుషారుగా కులాసాగా ఉండేవాణ్ణి నీవేవో అవీ ఇవీ అనవసరపు ఆలోచనలుపెట్టుకుని కూచున్నావు. అయినా, మంచి పండు పండాలంటే కాలం పడుతుంది. త్వరలో పండుదులే."

వృద్ధుడు ఇలా దీర్ఘోపన్యాసాలిస్తూ ఉండేవాడు. అవి త్వరలోనే థోమా మనస్సులో ముద్రితాలైనాయి. థోమా వాటిని శ్రద్ధగా ఆలకించి తన జీవితాదర్శాన్ని సుస్పష్టం చేసుకున్నాడు. ఇతరులకంటె తను అధికంగా ఉండాలని నిశ్చయించుకున్నాడు. ముసలాడి మాటలవల్ల ప్రేరేపింపబడిన ఈకోరిక అతనిలో గాఢంగా వ్రేళ్ళూనింది. అతని హృదయంలో మొలకెత్తింది. కాని ఇంకా అతని హృదయాన్నిమాత్రం పూర్తిగా ఆవరించలేదు. మెడిన్‌స్కాయాతో థోమా సంబంధాలు ఎలా పరిణమించాలో అలా పరిణమించాయి. ఆమెకోసం అతని ఆతురత హెచ్చయింది. ఎప్పుడూ ఆమెను చూడాలనిపించేది. కాని తీరా ఆమె దగ్గరికి వెళ్ళేసరికి ఒకవిధమైన పిరికితనం పట్టుకునేది. మందమతిలా ప్రవర్తించేవాడు. ఈ విషయం అతనికి తెలిసి, ఎంతో బాధపడే

వాడుకూడా. తరుచుగా ఆమెఇంటికి వెడుతూ ఉండేవాడు. కాని ఎప్పుడూ ఆమె ఇంట్లో ఒంటిగా ఉండేదికాదు. ఎప్పుడూ ఎవరో ఆమెచుట్టూ ఈగల్లా ముసిరి ఉండేవారు. ఆ తరులు గుబాళించే విలాసపురుషులు, బెల్లంచుట్టూ ఈగల్లాగా ఆమెచుట్టూ ముసిరిఉండేవారు. ఫ్రెంచిభాషలో ఆమెతో ఏవేవో తమతీయని కబుర్లుచెబుతూఉండేవారు. పాడుతూ నవ్వుతూ ఉండేవారు. అతనుమాత్రం కోపంతోనూ అసూయతోనూ వేగిపోతూ నిశ్శబ్దంగా వాళ్ళవంకచూస్తూ ఉండేవాడు. చక్కగా అలంకరింపబడిన ఆమె డ్రాయింగ్ రూమ్‌లో ఒకమూల పద్మాసనం వేసుకుని కూచుని నిశ్చలంగా వాళ్ళ సరససల్లాపాలూ, ఆటపాటలూ విలాస వినోదాలూ చూస్తూ ఉండేవాడు.

మెత్తని తివాసీలపై అడుగులచప్పుడు కాకుండా ఆమె అటూ ఇటూ తిరుగుతూ ఉండేది. మధ్యమధ్యలో అతనివంక చిరునవ్వులు విసురుతూ ఉండేది. చల్లనిచూపులు ప్రసరిస్తూ ఉండేది. ఆమె భక్తులంతా ఆమెచుట్టూ పెంపుడుకుక్కల్లాతిరుగుతూ ఉండేవారు. సర్పాల్లాగా తెలివిగాకుర్చీలమధ్యనుంచి టేబల్ల మధ్యనుంచీ తెరలమధ్యనుంచీ పూలకుండ్ల మధ్యనుంచీ ప్రాకుతూ తిరుగుతూ ఉండేవారు. ఆ గదిలో ఉన్న ముచ్చటయిన వస్తువులు ఇన్నీ అన్నీ అని చెప్పడానికి వీల్లేదు. గదినిండా చెల్లాచెదురుగా పడేసి ఉన్నాయి. ఇవి ఘోమాకు ఎంతో అంతరాయం కలిగించేవి. అతను తివాశీలపై నడుస్తూఉంటే ఆ మెత్తని తివాశీల్లో అతని అడుగులచప్పుడు అణిగిపోయేది కాదు. వస్తువులు పూలకుండ్లు అతని కోటుతగిలి వణికి క్రిందపడిపోయేవి. పియానో ప్రక్కనే ఒక సెయిలర్ కంచుబొమ్మ ఉంది. ఆబొమ్మ రింగును

విసిరేస్తున్నట్టు చెయ్యెత్తి ఉంటుంది. ఈ రింగుమీద కొన్ని తీగచుట్టలున్నాయి. ఫోమాజుట్టు ఎప్పుడూ వీటిలో తగు ల్కొనేది. ఈ విడ్డూరాలన్నీ సోఫియా పావ్‌లోవ్‌నాకు ఆమె అభిమానులకూ నవ్వుతెప్పించేవి. ఫోమా ఎంతో బాధ పడేవాడు.

ఆమెతో ఒంటిగా ఉన్నప్పుడుకూడా అతనికి హాయిగా ఉండేదికాదు. ఒక చల్లని నవ్వుతో అతన్ని ఆహ్వానిస్తూ డ్రాయింగ్‌రూమ్‌లో ఒకమూల అతనిప్రక్కన వచ్చికూచునేది. తన ఇంటికి వస్తున్న అందరిని గురించి నిందిస్తూ సంభాషణ ప్రారంభించేది.

"నిన్ను చూడడం నాకెంత సంతోషంగా ఉంటుందో నిజంగా చెప్పలేను!"—అనేది. ఒక పిల్లిలా వంగి అతని కళ్ళ లోకి చూచేది. ఆమె కళ్ళలో ఏదో తీవ్రతృష్ణ తళుక్కొత్తేది.

"నీతో మాట్లాడడమంటే నాకెంతో ఇష్టం" అనేది రాగం, తీస్తున్నట్లు. "వాళ్ళందరితో, వాళ్ళందరితో చాలా విసు గెత్తిపోయాను. వాళ్ళందరూ రోతగా కనుపిస్తారు. నీ వొక్క డివే స్వచ్ఛంగా నిర్మలంగా కనుపిస్తావు. నీకూ వాళ్ళంటే ఇష్టంలేదుకదూ?" అనేది.

"నేను వాళ్ళను భరించలేను." అన్నాడు ఫోమా.

"మరి నన్నో?" అనిఅడిగింది మెల్లగా. ఫోమా మరో వైపుచూచి నిశ్వసించి "ఈమాట నన్ను ఎన్నిసార్లుఅడిగావు?" అన్నాడు.

"నాకు చెప్పాలంటే కష్టంగాఉందా?"

"కష్టంకాదు. కాని, చెప్పి ప్రయోజనం?"

"నేను తెలుసుకోవాలి."

"నాతో ఆటలాడుతున్నావు" అన్నాడు ఫోమా. ఆమె కళ్ళు నిడివిగా విప్పార్చి ఆశ్చర్యంతో "నేను నీతో ఆటలాడుతున్నానా? అంటే నీ ఉద్దేశం ఏమిటి?" అన్నది. అప్పుడు ఆమె ముఖం ఒక దేవతముఖంలా ఎంతో అమాయకంగా కనుపించింది. ఆ ముఖంచూచి ఆమెను నమ్మకుండా ఉండలేక పోయాడు.

"నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను! నిన్ను ప్రేమించకుండా ఉండలేను!"—అన్నాడు తీవ్రంగా వెంటనే కంఠస్వరం తగ్గించి, కాని, నా ప్రేమతో నీకు అవసరంలేదు!"

మెడిన్స్కాయా నిశ్వసించి కాస ప్రక్కకు జరిగి "ఇదన్నమాట నీ ఉద్దేశం! నీవు ఇంత తీవ్రంగా ఈ మాట ఎప్పుడు చెప్పినా నాకు ఎంతో సంతోషంగా ఉంటుంది. నా చెయ్యి ముద్దాడుతావా?" అని అడిగింది.

అతను మారుమాటాడకుండా ఆమె సన్నని తెల్లని చిన్నారి చెయ్యి దగ్గరికి తీసుకుని జాగ్రత్తగా వంగి ఎంతోసేపు గాఢంగా ముద్దాడాడు. ఆమె అంతసేపూ చిరునవ్వునవ్వుతూ ముచ్చటగా కూచుంది. అతను ముద్దాడడం ముగియగానే మెల్లగా తన చెయ్యి విడిపించుకుంది. సాలోచనగా అతని వంక చూచింది. ఆమె కళ్ళలో ఎప్పుడూ కనుపించే విచిత్రమైనతళుకు మిలమిలలాడుతూఉంది. ఆ తళుకు ఎప్పుడూ ఫోమా మనస్సును అయోమయం చేసేది అతన్ని ఒక విచిత్రవస్తువునుచూచినట్టు చూస్తూ.

"నీలో ఎంత బలం ఎంతశక్తి ఎంత స్వచ్ఛతా ఉన్నాయి! నీకు తెలుసా? మీావర్తకులజాతిలో గొప్పశక్తి ఉంది. నీవు వజ్రం లాంటివాడివి. కాని నిన్ను సానపట్టాలి" అన్నది.

అతన్ని 'మీారు' అని పిలిచినప్పుడుకాని, అతని వర్తక తరహాను జ్ఞాపకంచేసినప్పుడుకాని ఆమె తనను దూరం చేస్తున్న దనిపించేది ఫోమాకు. ఆమె ఈ ప్రవర్తన అతనికి దిగులూ వైమనస్యం కలిగించేవి. చిన్నబాలికలా కనుపిస్తున్న ఆమెవంక చూస్తూ ఆలాగే నిశ్శబ్దంగా కూచునేవాడు ఆమె ఎప్పుడూ ముచ్చటగా ముస్తాబై ఉండేది. నలగని పూవల్లే కనుపించేది. ఒక్కోసారి ఫోమాకు ఆమెను గట్టిగా కౌగిలించుకొని ముద్దాడాలనిపించేది. కాని అలా గట్టిగా కౌగిలించుకొని ముద్దాడితే సన్నని తీగలాటి ఆమె శరీరం ఎక్కడ కందిపోతుందో అనుకునేవాడు. ఆమె నలిగి విరూపమైపోతుందేమోనని భయపడేవాడు. ఆమె చల్లని మెల్లని కంఠస్వరం మాసిపోతుందేమోననుకునేవాడు. ఒక్కోసారి ఆమె చూపులో జాగర్త కనుపించేది. అలాటి సమయాల్లో ఫోమా చల్లబడిపోయేవాడు. ఆమె అతని హృదయంలోకి చొచ్చుకొని చూస్తూ తన భావాలు తెలుసుకుంటున్నట్టు అనిపించేది. కాని, ఇలాటి ఉద్వేగఘట్టాలు ఎప్పుడోకాని తరచుగా వచ్చేవికాదు. సాధారణంగా ఆమెను ఒక విధమైన పూజాభావంతో మాత్రమే చూస్తూఉండేవాడు. అమె అందం, ఆమె మాటలు, దుస్తులు అన్నీ అతనికి గొప్పగా కనుపించేవి. ఈ పూజాభావం అలా ఉంచి అతన్ని ఒకప్రక్క మరోవిషయం బాధిస్తూఉండేది. తను ఆమెకు దూరంగా

ఉన్నాడనీ, ఆమె తనమీద అధికారం చలాయిస్తున్నదనీ భావించేవాడు.

కొద్దికాలంలో వారిద్దరిమధ్య ఈ సంబంధ బాంధవ్యాలు స్థిరపడిపోయాయి. రెండుమూడు సార్లు కలుసుకున్నతరువాత మెడిన్స్కాయా థోమాను పూర్తిగా తన అధీనంలోకి తీసుకుంది. తరువాత అతనిని చిత్రహింసపెట్టసాగింది. ఒక మంచి కుర్రాడు తన దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి ఉండడం ఆమె కెంతో ముచ్చట. ఒక మాటతో ఒక చూపుతో – అతన్ని మచ్చిక చెయ్యడమంటే ఆమెకెంతో ఇష్టం. ఇలా అతనితో చెరలాటలాడడమంటే ఆమెకెంతో ఆనందంగా ఉంది. ఆమెతో కొంతకాలం గడిపి వెళ్ళినతరువాత థోమాకు మనస్సు అల్లకల్లోలంగా ఉండేది. ఆమెపట్ల కోపంకూడా కలిగేది. ఒకరోజున ఆమెను థోమా ఇలా అడిగాడు.

"సోఫియాపావ్లోవ్నా! నీకెప్పుడైనాపిల్లలుకలిగారా"

"లేదు"

"నేనూ అలాగే అనుకున్నాను" అన్నాడు థోమా ఒకవిధమైన ఆనందంతో.

ఆమె అతనివంక ఒక అమాయకురాలైన కన్నెపిల్లలా చూచి "నీవలా అనుకోడానికి కారణమేమిటి? అయినా నాకు పిల్లలు కలిగారో లేదో తెలుసుకోవలసిన అవసరం నీ కేమొచ్చింది?" అన్నది.

థోమా సిగ్గుపడి తల వంచుకున్నాడు. ఒక కొండరాతిని మోస్తున్నట్టుగా ఒక్కొక్కమాటే బరువుగా చెప్పడం మొదలెట్టాడు.

"పిల్లలు కలిగిన స్త్రీ కళ్ళు ఇలా ఉండవు" అన్నాడు.

"అయితే నా కళ్ళు ఎలా ఉన్నాయంటావు?"

"సిగ్గూ శరం లేనట్టుగా ఉంటాయి."

మెడిన్‌స్కాయా వెండిమువ్వలు గలగలలాడినట్టు నవ్వింది. ఫోమా ఆమెవంకచూచి తనూ నవ్వడం మొదలెట్టాడు. తరువాత కాసేపటికి, "నేనేమైనా తప్పు మాట్లాడానేమో క్షమించు" అన్నాడు.

"లేదు, లేదు. నీవు తప్పేమీ మాట్లాడవు. మంచి కుర్రాడివి అయితే నా కళ్ళు సిగ్గులేనట్టుగా లేవంటావు"?— అన్నది మెడిన్‌స్కాయా.

"నీ కళ్ళు దేవత కళ్ళలా ఉంటాయి" అన్నాడు ఫోమా ఆమెవంక వికృతనేత్రాలతో చూస్తూ. ఆమెకూడా అతనివంక ఎన్నడూ చూడనివిధంగా చూచింది. ఒక తల్లిలా చూచింది. విషాదమూ భయమూ కలిసిన చూపది. ప్రియుడు ఏమైపోతాడో అనే భయంతో ప్రియురాలుచూచేచూపు.

"ఇక వెళ్ళు. నాకు అలసటగా ఉంది. నేను విశ్రాంతి తీసుకోవాలి" అన్నది మెడిన్‌స్కాయా. ఈ విషయాలు మయకిన్‌కు కూడా తెలుస్తున్నాయి. మయకిన్ ఫోమాను మందలిస్తున్నాడు. సోఫియా విషయంలో వారిద్దరికీ భేదాభిప్రాయాలు ఏర్పడి చిన్న తగాదా కూడా జరిగింది.

"ఫోమా! తల జాగ్రత్తగా కాపాడుకో ఏదైనా గాలి విసురుకుకొట్టుకునిపోయేను." అని మందలించాడు మయకిన్

"మీ మాటలు నాకు బోధపడడంలేదు." అన్నాడు ఫోమా.

"నేను సోంకావిషయం మాట్లాడుతున్నది. నీవు తరుచుగా దానిఇంటికి వెడుతున్నట్టున్నావు."

"ఆమెను సోంకా అని పిలవకండి." అన్నాడు ఫోమా.

"ఆమె నీకు బాగా చదువునేర్పుతుందిలే! బాగా నేర్చుకో!" అన్నాడు మయకిన్.

ఇద్దరూ నదీతీరానికి వెళ్ళి స్టీమర్లు పరీక్షించి ఇంటికి తిరిగివస్తున్నారు.

"మళ్ళీ ఆమె ఇంటికి వెడతావా?" అని అడిగాడు మయకిన్.

"తప్పకుండా వెడతాను" అన్నాడు ఫోమా.

"ఊఁ. నీ వేమైనా బహుమతులిచ్చుకుంటున్నావా? లేక ఊరికినే కేవలం నీ ప్రేమకోసమే నీతో కాలక్షేపం చేస్తుందా?" అని అడిగాడు మయకిన్. ఫోమా మండిపడ్డాడు.

"నేనిలాంటి మాటలు వినిలేను" అన్నాడు.

"ఆవేశ్య నిన్ను ధ్వంసంచేస్తుంది." అన్నాడు మయకిన్.

"ఇహమీరు మాట్లాడకండి, చాలు." అన్నాడు ఫోమా మెల్లగాను దీనంగాను.

"ఏంవోయ్, నీకు తొందర్లో ఒక పిల్లనుచూచి మెడకు కట్టడం మంచిది. కోడెదూడకు ముక్కుకు తాడు బిగిస్తేకాని లొంగదు." అన్నాడు మయకిన్.

"అబ్బ! ఇహ ఆపండి! మీకుపుణ్యముంటుంది" అన్నాడు. ఫోమా.

"వయస్సులో మగాడికి మతిపోతుందిసుమా!" అన్నాడు మయకిన్ మళ్ళీ మెల్లగా. ఫోమా అతనివంకచూళ్ళేదు.

"మొద్దును చూచి ఎద్దనుకుంటాడు!" అన్నాడు మయకిన్, ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"తెలిసేటట్టు మాట్లాడండి!" అన్నాడు ఫోమా తీవ్రంగా.

"ఏమిటి మాట్లాడేది? కనపడంలేదూ? వయసులో ఉన్న పిల్ల మీగడలాంటిది. వయసుమళ్ళిన స్త్రీ పాలవంటిది. వయసు మళ్ళిన స్త్రీ అందుబాటులో ఉంటుంది. వయసులో ఉన్న పిల్ల అందకుండాపోతుంది. నామాట విని పోంకాతో నిర్మొహమాటంగా చెప్పు. నీ ఇంటికి రానని చెప్పు."

"మీ కర్థంకాదు." అన్నాడు ఫోమా, మెల్లని కంఠస్వరంతో.

"ఏమిటి అర్థంకానిది ? నా కన్నీ తెలుసు" అన్నాడు మయకిన్.

"హృదయం! మానవునికి హృదయమంటూ ఒకటి ఉంది." అన్నాడు ఫోమా. మయకిన్ కళ్ళార్పుతూ," అయితే అతనికి మతిలేదన్నమాట." అన్నాడు.

## ఆరో అధ్యాయం

నగరంలోకి వచ్చేసరికి ఫోమాకు దిగులూ, పగతో నిండిన కోపమూ ఆవహించాయి. మెడిన్స్కాయాను నిందించి పరాభవించాలనుకున్నాడు. ఇదొక తీవ్రమైన వాంఛగా పరిణమించి అతనిలో జ్వలించసాగింది. పళ్ళు గట్టిగా బిగించుకున్నాడు. చేతులు చొక్కా జేబుల్లో లోతుగా దూర్చుకున్నాడు. కొన్ని గంటలసేపు తన ఇంట్లో నిర్మానుష్యంగా ఉన్న గదులలో

ఒంటరిగా తిరగసాగాడు. కనుబొమలు మెలివేసినట్టు ముడీవ డ్డాయి. మధ్యమధ్య తలపైకెత్తి ఎదురొమ్ము ముందుకు ఉబికిస్తు న్నాడు. గుండె కోపంతో నిండి పెద్దదైంది. రొమ్ములో ఇమడక పగులగొట్టుకుని బయటికివస్తుందా అనిపిస్తోంది. పాదాలతో భూమిని తన్నుతున్నాడు. అతను అడుగులు వేస్తుంటే భూమి అదురుతోంది. కోపాన్ని సుత్తెలతో సాగకొడుతున్నట్టుగా ఉన్నాయి ఆ అడుగులు. "వట్టి నీచురాలు – దిగివచ్చిన దేవ కన్యలా వేషంవేసుకుంది, వంచకి!" అని తలపోస్తూ ఉండగా అతని స్మృతిపథంలో పెలాగెయా నిలిచింది. "పతితురాలైనా ఆమె నయం. కపటంలేని మనిషి! ఇలా నాటకం ఆడేదికాదు. తక్షణమే మనస్సు విప్పి మాట్లాడింది. హృదయాన్నీ దేహాన్నీ కూడా అర్పించింది. ఆమె వక్షస్థలంలాగానే హృదయంకూడా నిర్మలమైనదీ, నిండైనదీ." అని అనుకున్నాడు. అప్పుడప్పుడు ఆశ భయపడుతూ అతని చెవిలో గుసగుసలాడేది. "ఒకవేళ సోఫియాను గురించి చెప్పుకున్నదంతా అబద్ధమేమో." అని. కాని మళ్ళీ తన రక్షకపిత మయకిన్ చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. ఆ బరువైన, రూఢియైన మాటలముందు ఇప్పు డొచ్చిన ఆలోచన అంతర్ధానమైంది. అతని పళ్ళు ఇంకా గట్టిగా ఇనకరుచుకపోయాయి. ఎదురొమ్ము ఇంకా విరుచుకున్నాడు. దురాలోచనలు కొయ్యముక్కల్లా వచ్చి అతని గుండెలో గుచ్చుకున్నాయి. అవి పెడుతున్న కఠినమైన బాధకు అతని గుండె బ్రద్దలైపోతోంది.

మెడిన్స్కాయాను గురించి తృణీకారంగాను అవమాన కరంగాను మాట్లాడాడు మయకిన్. కాని దానివల్ల ఆమెను

ఫోమాకు మరింత చేరువుగా చేరనిచ్చినవాడైనాడు. ఈ విషయం త్వరలోనే ఫోమా గ్రహించుకున్నాడు. అందుకు సంతోషించాడుకూడా. కొన్నిరోజులపాటు అతను తన వ్యాపారపు గొడవల్లో మునిగిఉన్నాడు. వసంతరుతువు వస్తూఉండడంచేత స్టీమరు పరీక్షించాల్సివచ్చింది. ఈ పనుల్లోపడి తిరుగుతూ ఉండడంచేత అతనిలో చెలరేగిన ఆందోళనలు క్రమక్రమంగా శాంతిస్తూవచ్చాయి. ఆమెకూడా ఒక మానవమాత్రురాలేనని విచారం కలిగింది. ఆవిచారం ఆమెపైగలద్వేషాన్ని తగిస్తూ వచ్చింది. ఆమె తనకు అందుబాటులో ఉన్నదనే ఆలోచన అతనికి ఆమెపైగల వ్యామోహాన్ని మరింత రెచ్చగొట్టింది. చివరకేదో ఒక విధంగా అతను సోఫియాపావ్లోవ్నా వద్దకు వెళ్ళి స్పష్టంగాను దాపరికం లేకుండాను తన కోర్కె తెలియచెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. అలా ఎందుకు నిశ్చయించుకున్నదీ అతనికే గ్రాహ్యంకాదు. అయినానిశ్చయించుకున్నాడు. అంతే! ఆ నిశ్చయంవల్ల అతనికి ఆనందంకూడా కలిగింది, ధైర్యంగా ఆమె ఇంటికి బయలుదేరాడు. తను ఆమెకు ముఖ్యంగా చెప్పవలసిన విషయాన్ని గురించీ, అదెలాం తగురీతిలో చెప్పాల్సిందీ దోవలో ఆలోచించుకుంటూ వెళ్ళాడు.

మెడిన్స్కాయా ఇంట్లో పనివాళ్ళు అతనిరాకపోకలకు అలవాటుపడ్డవారే. 'అమ్మగారు ఇంట్లో ఉన్నారా?' అని అతను పరిచారికను ప్రశ్నించగానే ఆమె "కచేరీ చావిట్లోకి దయచేయండి. అమ్మగారక్కడ ఒంటిగానే ఉన్నారు" అని సమాధానమిచ్చింది.

అతనికి కొంచెం భయమేసింది. కాని అద్దంలో తన ప్రతిబింబం కంటపడేసరికి (తన చక్కని ఆకారం, బాగా అమరిన కోటు , తీవ్రమైన ముఖము, అప్పుడప్పుడే ఏర్పడుతున్న వంపు లొంపుల నల్లటిగడ్డం, విశాలమైన నల్లటికళ్ళు) అతను భుజాలు పైకెత్తి నమ్మకంతోను, ధైర్యంతోను ముందడుగువేశాడు. లోపల్నుంచి వాద్యపు తంత్రుల విచిత్రధ్వనులు ప్రశాంతంగా తేలుతూ వచ్చి అతన్ని చేరుతున్నాయి. ఆ ధ్వనులు—ఏదో నిశ్శబ్దంలోకిచొచ్చుకుపోతూ, నిరుత్సాహంగానవ్వుతూ, ఏదో మొరపెట్టుకుంటూ, మృదువుగా హృదయాన్ని ఊపుతూ — ఆసక్తి కలుగుతుందనే ఆశలేకపోయినా, ఏదో ప్రార్థిస్తున్నట్టూ వినిపించసాగాయి. సంగీతం వినడం ఘోమాకుఇష్టంలేదు. ఎప్పుడు సంగీతం విన్నా అతనికి విచారమూ, దిగులూ పుట్టుకొస్తాయి. ఆఖరుకు హోటళ్ళల్లో 'మ్యూజిక్ బాక్సు' విచార సూచకంగా రాగం పాడుతున్నప్పుడు కూడా అతని హృదయం దిగులుతోను, విచారంతోను నిండిపోయేది. అప్పుడతను దానిని ఆపివెయ్యమని హోటలువాళ్ళతో చెప్పేవాడు. లేదా తానే అక్కణ్ణుంచి లేచి రాగంవినపడకుండా దూరంగావెళ్ళి కూచునేవాడు. పాపం, మాటలులేని ఈ స్వరాలు—శోకంతోనుకన్నీళ్ళతోను నిండిఉన్న ఈ స్వరాలు అతను ప్రశాంతగా వినలేకపోయేవాడు. అలాగే ఇప్పుడుకూడా అతను లోపలికి పోక అప్రయత్నంగా తలుపుదగ్గర ఆగిపోయాడు.

రంగురంగుల ముత్యాలు పేర్లతో తయారుచేసిన పొడుగాటి తెర ఒకటి వాకిలికి వ్రేలాడుతోంది. ముత్యాలపేర్లన్నీ చోద్యమైన ఒకరకపు మొక్క ఆకారంలో కూర్చబడిఉన్నాయి.

ముత్యాల పేర్లు నిశ్శబ్దంగా కదులాడుతూ—వివర్ణమైన పూల నీడలు గాలిలో తేలుతున్నాయా అన్నట్టు కనిపిస్తున్నాయి. ముత్యాలతెర తొలగించి గదిలోకి చూచాడు ఫోమా. చిన్న ఇరుకు గది అది. మెడిన్స్కాయా ఒకమూల సోఫాలోకూచుని 'మేన్డోలిన్' వాయిస్తూఉంది. ఒక పెద్ద జపాను గొడుగు గోడకు బిగించివుంది. రంగురంగుల కలయికతో ఏర్పడ్డ దాని నల్లటినీడ వచ్చి ఆమెను కప్పుతోంది. ఎత్తైన ఎర్రటి మూత క్రిందనున్న కంచులాంతరువెలుగు వచ్చి ఆమెమీదపడుతూ సంధ్యాకాంతిని స్ఫురింపచేస్తోంది. ఆ ఇరుకు గదిలో మృదువైన వాద్యతంత్రుల మందధ్వనులు దిగులుగా, దీనంగా ప్రకంపిస్తున్నాయి. గదిఅంతటా పరిమళిస్తున్న మెత్తటి సందె వెలుగు విరజిమ్ముతోంది. ఇప్పుడామె వాద్యాన్ని మోకాళ్ళపై ఉంచుకుని తంత్రులపై చులాగ్గా వ్రేళ్ళు పరుగెత్తిస్తూ వాయిస్తోంది. ఆమె ముందుకు సూటిగాచూస్తోంది. ఫోమా బరువుగానిశ్వసించాడు.

మెడిన్స్కాయా వాయిస్తున్న వాద్యసంగీతం హాయి గొలుపుతోంది. ఆమెముఖంమీద వివిధరకాల వెలుగునీడలు పడి ఆమె నేత్రకాంతిలో కలిసిపోతున్నా, ముఖం శాశ్వతంగా మార్పుచెందుతోంది.

ఫోమా ఆమెను పరిశీలించాడు. మనుష్యుల సమక్షంలో కనిపించేటంత అందంగా ఆమె ఇప్పుడు ఒంటిగా ఉన్నప్పుడు కనిపించడంలేదు. ఇప్పుడామెముఖంలో వృద్ధాప్యం కనిపిస్తోంది. తీవ్రంగాఉంది. కళ్ళల్లో కారుణ్యం, సాధుత్వం కనిపించదు. చూపులు డస్సిపోయి నీరసించినట్టున్నాయి. కూచున్న తీరు కూడా వేరుగాఉంది. కదలాలనుకున్నా కదల్లేక అలసి కూచున్న

స్త్రీలా ఉంది. ఇలా కూచున్న ఆమెను చూచేసరికి థోమా హృదయం మెత్తపడింది. అతను కాళ్లు నేలకు రాస్తూ తాను వచ్చినట్టు తెలియచెయ్యడానికి మెల్లగా దగ్గాడు.

"ఎవ"రన్నది ఆమె కలవరంతో తల ఎత్తిచూస్తూ. ఆమె చేతిలో మేన్‌డొలిన్ తీగెలు కదిలి కంపించాయి.

"నేనే" అన్నాడు థోమా, ముత్యాలతెర తొలగిస్తూ.

"చప్పుడుకాకుండా వచ్చావే. నిన్ను చూడడంవల్ల చాలా సంతోషమైంది. ఇలా కూచో. మా ఇంటిమీద శీత కన్నేశావే!" అంటూ ఆమె తన ప్రక్కనున్న ఒక పడక కుర్చీ చూపింది. ఆమె కళ్ళు నవ్వుతున్నాయి.

"స్టీమర్లు పరీక్షిస్తున్నాను." అన్నాడు థోమా.

"ఇంకా పొలాల్లో మంచు అలాగేఉందా?" అని అడిగింది మెడిన్‌స్కాయా.

"కావల్సినంత మంచు కరుగుతూ ఉంది. రోడ్లవెంట ఎక్కడచూసినా నీళ్ళే." అన్నాడు థోమా. ఆమెవంకచూచి చిరునవ్వు నవ్వాడు. అతని నవ్వులోనూ, అతని తరహాలోనూ ఏదో కొత్తదనం, చనువూ కనిపించాయి. ఆమె తన దుస్తులు సవరించుకుని కొంచెందూరంగా జరిగి కూచుంది. వారి కళ్ళు కలిశాయి. మెడిన్‌స్కాయా తల వాల్చుకుంది.

"మంచు కరుగుతూ ఉందా?" అని అడిగిందామె, సాలోచనగా తన చిటికెనవ్రేలి ఉంగరాన్ని పరిశీలిస్తూ.

"అవును. ప్రతిచోటా మంచు వాగులుకడుతోంది." అన్నాడు థోమా.

"మంచిదే. వసంతం వస్తూఉన్నదన్నమాట."

"ఇక ఎంతో కాలం పట్టదు."

"వసంతం వస్తున్నది." అని పునశ్చరించుకున్నది మెడిన్ స్కాయా మెల్లగా— తన పలుకులు తనే వింటున్నట్టుగా.

"ఇక ప్రణయాలు ప్రారంభిస్తాయన్నమాట." అన్నాడు ఫోమా.

"నీవూ తయారవుతున్నావా?" అని అడిగింది మెడిన్ స్కాయా, అనాసక్తంగా.

"నేను తయారుకావల్సిన అవసరంలేదు. చాలా కాలం క్రితమే తయారైఉన్నాను. ఇదివరకు ఎప్పుడో ఆజన్మప్రణయంలో పడ్డాను." అన్నాడు ఫోమా. ఆమె ఒకమాటు అతని వంక చూచింది, మళ్ళీ మేన్డోలిన్ వాయించడం మొదలెట్టింది. తంత్రులవంక చూస్తూ సాలోచనగా "వసంతం! ఎంతచక్కటిదో! జీవనప్రారంభక్షణం. ఎంతమధురమైందో! హృదయంనిండాఏదో కొత్తశక్తి. హృదయంలో అంతా వెలుగేకాని చీకటి లేదు." అన్నది.

"సోఫియాపావ్లోవ్నా!" అని పిలిచాడు ఫోమా, మెల్లగా. ఇంతలో ఆమె లాలనగా అతనికి అడ్డువచ్చింది.

"ఆగునాయనా! ఈరోజు నీకొక మంచిమాటచెవుతాను. నీకోవిషయం తెలుసా? చాలాకాలం బ్రతికిన ఒక వ్యక్తి కొన్ని క్షణాలలో తన హృదయంలోకి చూచుకున్నప్పుడు అకస్మాత్తుగా, ఎన్నడో మరచిపోయిన ఏదో విషయం కనిపిస్తుంది. సంవత్సరాల తరబడి అది అక్కడెక్కడో హృదయపులోతుల్లో దాగి పడిఉంటుంది. కాని, దాని తరుణపరిమళం అలాగే ఉంటుంది. స్మృతి దాన్ని స్పర్శించినప్పుడు ఆ వ్యక్తిలో నూతన

వసంతం తొలకరిస్తుంది. జీవనప్రభాతపు విమలనైర్మల్యంతో అతన్ని ముంచెత్తుతుంది. ఇది విచారకరమైన విషయమైనప్పటికీ ఎంతో మంచిది." అన్నదామె. ఆమె కొనవ్రేళ్ళు సోకి, తంత్రులు కంపించి ఏడ్చాయి. ఆ స్వరాలు, ఆ స్త్రీ మృదుల కంఠస్వరం తన హృదయాన్ని లాలిస్తున్నట్టుగా అనిపించింది ఫోమాకు. కాని అతని నిశ్చయంమాత్రం ఇంకా సడలలేదు. ఆమెమాటలుమాత్రం వింటూనే ఉన్నాడు. కాని అవి అతనికి బోధపడడంలేదు.

"నీవేమైనా మాట్లాడు. కాని ఒక్కమాటలోకూడా నాకు నమ్మకంలేదు." అని ఫోమా తనలో అనుకున్నాడు. ఈ భావం అతన్ని ఉద్రిక్తుణ్ణిచేసింది. పూర్వంలాగా ఆమె మాటలు విశ్వాసంతోను, శ్రద్ధగానూ వినలేననుకున్నాడు.

"బ్రతకడానికి ఏవి అవసరమో వాటిని గూర్చి ఆలోచిస్తున్నావా?" అని అడిగిందామె.

"ఒక్కొక్కమాటు ఆలోచిస్తాను, కాని మళ్ళీ మరచిపోతాను. ఆలోచించడానికి నాకు వ్యవధిలేదు! పైగా ఆలోచించడానికేముంది? ఇతరు బ్రతకడం చూస్తుంటాంకదా. మనమూ అలాగే బ్రతికితే సరి" అన్నాడు ఫోమా.

"అలా మాత్రం చెయ్యకు. అందరిలాగా నీవు అవకు. అలాంటిబ్రతుకు నీకు సంతృప్తినివ్వదు. నీవు జీవితంలో మరి దేనికోసమో వాంఛిస్తున్నావు. కాదా?" అన్నది మెడిన్స్కాయా. ఇలా మాట్లాడుతూఉంటే ఆమె కళ్ళల్లో కలవరపాటు, భయము కనిపించాయి. ఆమెవంకచూచి "ఈమె ఎక్కడికి లాక్కుపోతోంది?" అనుకున్నాడు ఫోమా. మెల్లగా

ఇలా సమాధానం చెప్పాడు. "నేను మరేదో విషయాన్ని ఆశించి ఉండవచ్చు కాని ఇదివరకే ఆవిషయాన్ని ఆశించానేమో !" ఆమె అతని దగ్గరకి జరిగి అతనిముఖంలో చూస్తూ "నామాట విను. ఇతర్లలాగా నీవూ జీవించకు. నీ జీవితాన్ని మరోవిధంగా తీర్చి దిద్దుకో. నీవింకా కుర్రాడివి. బలావున్నది. మంచివాడివి." అన్నది.

"నేను మంచివాణ్ణి అయితే నాకు మంచి జరగాలి." అన్నాడు ఫోమా. అతని హృదయం ఆతృతతో కొట్టుకో సాగింది.

"కాని అది అసాధ్యం. ప్రపంచంలో చెడ్డవాళ్ళకే మంచి జరుగుతుంది కాని, మంచివాళ్ళకు మంచి ఎన్నడూ జరుగదు." అన్నదామె దిగులుగా. మళ్ళీ ఆమె వేళ్ళు సోకి కంపింత స్వరాలు నాట్యంచేయడం మొదలెట్టాయి. వెంటనే తను అనుకున్నది చెప్పకపోతే, ఇక ఎన్నటికీ ఆ విషయం చెప్పలేనను కున్నాడు. ఫోమా హృదయం దిటవు చేసుకుంటూ ఇలా ప్రారంభించాడు.

"సోఫియాపావ్లోవ్నా! ఇక చాలు! ఈ విషయం చెప్పడానికే నేనువచ్చాను. మనం హృదయాలు విప్పి మాట్లాడుకోవడంమంచిది. మొదట్లో నీవు నన్ను ఆకర్షించావు. ఇప్పుడు నీచుట్టూ నీవు కంచె కట్టుకుంటున్నావు. నీవు చెప్పేదేమిటో నా కర్థంకాదు. నా మనస్సు మందమైంది. కాని నీవు నానుంచి దాగిపోవాలని యత్నిస్తున్నట్లు స్పష్టంగా గ్రహించగలను. ఇప్పుడిక్కడికి ఎందుకొచ్చానో ఇప్పటికైనా అర్థమైందా?" అతని కళ్ళు నిప్పు కణికల్లా మెరయసాగాయి. ప్రతిమాటకూ అతని

కంఠస్వరం మరింత తీవ్రమైంది. ఆమె "ఇక మాట్లాడేకు." అన్నది.

"కాదు, మాట్లాడుతాను." అన్నాడు ఫోమా.

"నాకేం చెప్పదలచుకున్నావో నాకు తెలుసు."

"నీకేం తెలీదు. నిన్ను గురించి నా కంతా తెలుసు. నా కంతా తెలుసు!" అన్నాడు ఫోమా బెదిరిస్తూ.

"అలాగా! అయితే మరీమంచిది." అన్నది మెడిన్ స్కాయా, ప్రశాంతంగా. ఆమెకూడా సోఫాలోంచి లేచింది. ఎక్కడికో వెళ్ళేదానిలా లేచి నిల్చుంది. కాని కొద్దిక్షణాల తరువాత మళ్ళీ కూచుంది. ఆమె ముఖం గంభీరంగాఉంది. కళ్ళు దించుకున్నాయి. ఫోమా ఆ కళ్ళవంక చూడలేకపోయాడు.

"నిన్ను గురించి నాకంతా తెలుసు.' అని తను అన్నప్పుడు ఆమె భయపడుతుందనీ, సిగ్గుపడుతుందనీ, కలవరపడుతుందనీ, తనతో అలా చెరలాటం ఆడినందుకు తనను క్షమాపణ కోరు తుందనీ, ఫోమా భావించాడు. అలా క్షమాపణ కోరినవెంటనే ఆమెను కౌగిలించుకుని లాలించి క్షమిద్దామనుకున్నాడు. కాని అలా జరగలేదు. ఆమెనైశ్చల్యం అతనినే కలవరపెట్టింది. మళ్ళీ సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలీక, ఆమెవంక నివ్వెర పోయిచూస్తూ నిల్చున్నాడు.

"మంచిదే. అయితే నన్నుగురించి అంతా తెలుసుకున్నా వన్నమాట. తగినవిధంగానే నన్ను శిక్షించావు. నా కర్థమవుతూ ఉంది. నీ ముందు తప్పుచేసినదాన్ని అయ్యాను. కాని నన్ను నేను సమర్థించుకోదలచలేదు." ఇలా అని ఆమె మెల్లగా ఊరుకుని, హఠాత్తుగా చేతులెత్తి తల పట్టుకుని జుట్టు సవరిం

చుకోసాగింది. ఫోమా బరువుగా నిశ్వసించాడు. ఆమెమాటలు అతని ఆశను పూర్తిగా చంపాయి. ఆ ఆశ చనిపోయింది అని ఇప్పుడే తెలుసుకున్నాడు. ఆమెవంక చూచి జుగుప్సతో "ఒకప్పుడు నిన్ను చూచి 'ఎంత అందమైనది.' అనుకునేవాణ్ణి. కాని ఇప్పుడు 'నేను తప్పుచేసినదాన్ని' అంటున్నావు" అని ఫోమా ఆతరువాత మాట్లాడలేకపోయాడు. ఆమె మెల్లగా నవ్వసాగింది.

"నీవు ఎంత సుకుమారివి! ఎంత పిచ్చివాడివి! ఒక్క విషయంకూడా అర్థంచేసుకోవే?" అన్నదామె. అతను ఆమెవంక చూచాడు. ఆమె లాలింపుమాటలు, విషాదపూరిత మందహాసం అతన్ని అశక్తుణ్ణి గావించాయి. ఆమెకంటివెలుగు ముందు అతనికి ఆమెపట్లగల వైమనస్యం ఇప్పుడు కరిగిపోసాగింది. ఆమె ఇప్పుడొక అనాథశిశులా కనిపించింది. అతన్ని ప్రాధేయపడుతున్నట్లు మృదువైన కంఠస్వరంతో ఏదో చెప్పుతున్నది. కాని అతనుమాత్రం ఆమాటలు ఆలకించడంలేదు.

"నేను కఠినహృదయంతో నీదగ్గరకువచ్చాను. నీకు అంతా చెపుదామనుకున్నాను. కాని ఏమీ చెప్పలేకపోయాను. నా హృదయం క్రుంగిపోయింది. నిన్ను చూచేసరికి అదోలా అయిపోయాను. ఇక నేను వెళ్ళడం మంచిది." అన్నాడు ఫోమా.

"ఆగునాయనా! వెళ్ళకు, నామీద ఇంతకోపమెందుకు? నాజీవితం శూన్యం! నేను వృద్ధురాలనయ్యాను. అలసిపోయాను తల్లిలాగా నీకు సలహా ఇస్తున్నాను విను. నిన్ను గడ్డంపట్టుక బ్రతిమాలుతున్నాను. నీ హృదయం ఎలాచెపితే అలా నడుచుకో! మరెవరిమాట వినకు. మనుష్యులకేమీ తెలీదు

వాళ్ళెన్నడూ నీకు నిజం చెప్పరు. వాళ్ళను ఎన్నడూ లెక్క చెయ్యకు," అన్నది. ఆమె ఇలామాట్లాడుతున్నంతసేపూ జాలిగా చిరునవ్వు నవ్వుతోంది. ఆమెముఖం అదివరకటి లాగా అందంగా లేదు. "జీవితం చాలా నిష్కర్ష అయినది తన ఆజ్ఞలకు ప్రతివాళ్ళూ తల ఒగ్గి ఉండాలంటుంది. ప్రతిమనిషిలోనూ ఇద్దరు మనుష్యులుంటారు. ప్రతిమనిషీ ఒంటిగా ఉండలేక తనకు ఇష్టంకానివాళ్ళతోనే రాత్రింబగళ్ళు గడుపుతూఉంటాడు," అన్నది. ఫోమా తలెత్తిచూచాడు.

"నా కిదేమీ అర్థం కావడంలేదు. లూబాకూడా ఇదే మాట చెపుతున్నది." అన్నాడు.

"ఏ లూబా? ఆమె ఏం చెపుతున్నది." అని అడిగింది మెడిన్స్కాయా.

"నా పెంపుడుచెల్లెలు. ఆమెకూడా జీవితం నిరర్థక మంటుంది." అన్నాడు ఫోమా.

"ఇంత చిన్నతనంలోనే ఇలా మాట్లాడడం ఎంతో ఆనందకరం" అన్నదామె.

"ఆనందం ! మనుష్యుల హృదయాలను వేగించేది ఏమి ఆనందం !" అన్నాడు ఫోమా. ఆమెవంక చూచి నిశ్వసించాడు. "నేను నీతో తల్లిలా, చెల్లెలిలా మాట్లాడదలచుకున్నాను. నన్ను నమ్మవూ?" అని అడిగింది, మెడిన్స్కాయా.

"ఒకప్పుడు నమ్మేవాణ్ణి " అన్నాడు ఫోమా.

"మరి ఇప్పుడో?" అని అడిగింది ఆమె.

"ఇప్పుడు నే నిక వెళ్ళిపోవడం మంచిది. నాకంతా అయోమయంగా ఉంది. నన్ను చివరవరకూ లాక్కొచ్చావు.

తీరా అంచుదగ్గరికి వచ్చేసరికి 'నేను నీకు తల్లిని' అని తప్పించు కుంటున్నావు." అన్నాడు థోమా.

"నన్ను అర్థంచేసుకో. నీ కోసం ఎంతో విచారపడు తున్నాను." అన్నదామె, మెల్లగా. థోమాకోపం ఎక్కువౌతోంది.

"విచార మెందుకు? నేను మాట్లాడలేను. నీవు నన్ను సరిగా చూడలేదు. ఇలా నన్ను నీ సాలెగూటిలో ఎందుకు చిక్కించుకున్నావు? నే నేం నీ చేతిలో ఆటవస్తువునా?" అన్నాడు థోమా.

"నిన్ను ఊరికినే నా ప్రక్కన ఉంచుకొని చూచుకుందా మనుకున్నాను." అన్నదామె. అత నీ మాటలు వినడంలేదు.

"చివరకు సమయంవచ్చినప్పుడు భయపడ్డావు. నాకు దూరంగా తొలగి తలుపులు మూసుకుని కూచున్నావు. పశ్చాత్తపించడం మొదలెట్టావు. జీవితం మంచిది.కాదని జీవితాన్ని నిందింపసాగావు. ఎప్పుడూ ఎందుకు జీవితాన్ని నిందిస్తావు? జీవితం వేరె నట్టు! మనిషే జీవితం! మనిషికిమించిన జీవితంలేదు. జీవిత మని మరేదో పెద్ద దయ్యాన్ని కనిపెట్టారు మీరు!" అన్నాడు థోమా. ఆమెముందు నిల్చున్న అతని నరనరం వణికి పోతున్నాయి "అందమైన వ్యక్తి మంచి జీవితం గడపాలి; కాని నిన్ను గురించి అందరూ అనేక విషయాలు చెప్పుకుంటారు." ఇక థోమా చెప్పలేక ఆగిపోయాడు. "సెలవు" అనిమాత్రం అనగలిగాడు.

"సెలవు" అని మళ్ళీ ఆమెకూడా అన్నది, మెల్లగా.

అతను ఆమెతో కరస్పర్శగావించలేదు. హఠాత్తుగా తిరిగి వెళ్ళసాగాడు. కాని తీరా వాకిలిదగ్గరికి చేరేసరికి ఆమెను గూర్చి విచారంకలిగింది. అలాగే నిల్చుని వెనక్కు తిరిగి ఆమెవంక చూచాడు. ఆమె ఒకమూల ఒంటిగా తలవొంచుకుని, చేతులు వ్రేలాడవేసుకుని నిశ్చలంగా నిలబడిఉంది. ఆమె నలా వదలి పెట్టివెళ్ళడం ఇష్టంలేక అయోమయంగా "నేనేమైనా తప్పు మాట్లాడానేమో! క్షమించు! కాని ఇంతజరిగినా నిన్ను ప్రేమించడం మానలేదు." అన్నాడు ఫోమా. ఆమె మెల్లగా నవ్వసాగింది. "నాకు నీవు కోపంతెప్పించలేదు. త్వరగా వెళ్ళు!" అన్నది.

"సెలవు!" అన్నాడు ఫోమా.

"సరే" అన్నదామె.

ఫోమా ముత్యాలతెర తొలగించుకుని ఇవతలికి వచ్చాడు. చల్లని ముత్యాలపూసలు అతని చెక్కిళ్ళకు తగిలాయి. అతను బయటికి వచ్చేసరికి రాత్రి అయింది. వెన్నెల పిండిఆరబోసినట్టుగా ఉంది. వెండిరజను చల్లినట్టుగా ఉంది. మంచునెగుళ్ళు చేతికర్రతో పగలగొడుతూ ఫోమా నడుస్తున్నాడు. ఇళ్ళనీడలు, చెట్లనీడలు చిత్రవిచిత్రరూపాల్లో రోడ్డుమీద పడుతున్నాయి. "ఇప్పుడామె ఏంచేస్తూ ఉంటుందో?" అని అనుకోసాగాడు ఫోమా, ఆగదిలో ఒకమూల మసకవెలుతురులో నిల్చున్న ఆమెను ఊహించుకుంటూ. "ఇక ఆమెను మర్చిపోవడం మంచిది," అనుకున్నాడు కాని మర్చిపోలేకపోయాడు. జాలినీ, కోపాన్నీ తెప్పిస్తూ ఆమెరూపం తన కళ్ళముందు స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. ఒక బండి పోతూఉంది.

వెధిలో వెలుగునీడలు చల్లినట్టుగా ఉన్నాయి. దూరంగా చీకటి చిక్కగా, భూమికీ ఆకాశానికీ గోడకట్టినట్టుగా ఉంది. ఈ రోడ్డున పోతున్న బాటసారులు ఎవరో, ఎక్కడికిపోతున్నారో అనుకున్నాడు. అందరూ ఎక్కడికి పోతున్నారో అతనికి తెలియడంలేదు. తనుకూడా ఎక్కడికి పోతున్నాడో అతనికి తెలియడంలేదు. అతని కళ్ళముందు అతని ఇల్లు కనిపించింది. ఆరు పెద్దగదులు. అతను ఒంటరిగా ఉంటున్నాడు. అన్ఫీసా అత్త మఠంలో చేరింది. మళ్ళీ తిరిగిరాదు. బహుశా అక్కడే చనిపోతుంది. ఇంట్లో కాపలాదారు వృద్ధుడు, చెవిటివాడు అయిన ఇవాన్, వృద్ధదాసీ సెక్లెటయా, ఒక మురికికుక్క—తప్ప ఎవరేమీ లేవు. ఆ కుక్కకూడా ముసలిదే. "నేను పెళ్ళిచేసు కోవడమే మంచిదనుకుంటాను." అనుకున్నాడు ఫోమా. తాను తలుచుకుంటే ఇట్టే పెళ్ళాడేసెయ్యొచ్చు. అంచాతనే అతనికి వివాహం అర్థరహితంగాను, హాస్యాస్పదంగాను కనిపించింది. తనరతీకపితతో ఒక్కముక్క చెప్పితేచాలు. రేపీపాటికి ఒక ఇల్లాలు వచ్చి తనఇంట్లో ఉంటుంది. రాత్రింబగళ్ళు తనను కాచుకుని ఉంటుంది. తను ఆమెతో "ఇక షికారు వెడదాం" అంటాడు. ఆమె వస్తుంది. తను ఆమెతో "ఇహ నిద్రపోదాం" అంటాడు. ఆమె నిద్రపోతుంది. ముద్దాడాలని కోరిక కలిగితే అతనికి ఇష్టంలేకపోయినా ముద్దాడుతుంది. "అక్కర్లేదు వెళ్ళు." అని అతనంటే ఆమెకు కోపంవస్తుంది. ఆమెతో అతను ఏం మాట్లాడుతాడు? అతనితో ఆమె ఏం చెపుతుంది? అతను తనకు పరిచితులైన కన్యలందరినీ ఒకమాటు జ్ఞాపకంచేసుకున్నాడు. కొందరు అందంగా ఉంటారు. వారిలో ఎవరైనా అతన్ని

కోరి చేసుకుంటారు. వారిలో ఎవరూ తనకు భార్యకావడం అతనికిష్టంలేదు. ఒక కన్య భార్యకావడం ఎంత అసహ్యకరమైన విషయం! కొత్తదంపతులు శోభనపుగదిలో ఏం మాట్లాడు కుంటారో, అలాటి సమయంలో తను ఏం చెప్పాలో ఆలో చించి తగినమాటలు తోచక ఫోమా అయోమయంగా నవ్వు కున్నాడు. తరువాత అతనికి లూబా మయకిన్ జ్ఞాపకంవచ్చింది ఆమె అయితే తనకే అర్థంకాని ఏవో అవకతవకపు మాటలు చెపుతుంది. ఆ అమ్మాయి తన ఈడుకు తగినట్టు మాట్లాడదు.

ఇప్పుడు అతను లూబా జీవితాన్నిగురించి తనతో మొర పెట్టుకున్నమాటలు జ్ఞాపకంవచ్చాయి. అతనినడక మందగించింది. ప్రపంచంలో అందరూ అతనితో జీవితాన్నిగురించే మాట్లాడారు. అతనితండ్రి, అత్త, రక్షకపిత, లూబా, సోఫియాపావ్లోవ్నా; అందరూ అతనికి జీవితాన్ని అర్థంచేసుకోమనో లేక జీవితం మంచిదికాదనో చెప్పారు. వృద్ధుడు స్టీమరుమీద విధినిగురించి చెప్పినమాటలు జ్ఞాపకంవచ్చాయి. మరెందరో మనుష్యులు జీవితాన్నిగురించి చెప్పిన రకరకాల విషయాలు జ్ఞాపకం వచ్చాయి. జీవితమంటే మనిషికాక మరేమిటి? జీవితం వేరైనట్టు మనిషి మాట్లాడుతూఉంటాడు. తనుకానిది ఏదో తనకు అడ్డుతగులుతున్నట్టు మాట్లాడుతాడు. అదేమైనా దయ్యమేమో!'' అని తలపోయిసాగాడు ఫోమా.

ఒక భయభ్రాంతి పెద్ద పిడుగులా అతనిమీద పడింది. అతను కంపించి నలువైపులా కలయచూచాడు. వీధి నిర్జనంగా నిశ్శబ్దంగాఉంది. చీకటిగాఉన్న ఇళ్ళ కిటికీలు, తెరిచినకళ్ళలాగా

ఉన్నాయి. థోమా నీడ గోడలమీదపడి అతన్ని వెన్నాడుతూ ఉంది.

"డ్రైవర్!" అని బిగ్గరగా పిలిచాడు థోమా. త్వర త్వరగా నడుస్తూ అతని నీడ లేచి, భయచలితంగా నల్లగా నిశ్శబ్దంగా అతని వెనకాలే ప్రాకి పెద్దదైంది. అతని వెనకాలే భీకరమైనదేదో అతన్ని తరుముతున్నట్టనిపించింది. థోమా భయంతో పరుగెత్తుతూ బండిదగ్గిరికి వెళ్ళాడు. చీకట్లోంచి బండి శబ్దంచేస్తూవచ్చింది. బండ్లో కూచున్నాడు. చూడాలనుకున్నా వెనక్కు తిరిగి చూడలేకపోయాడు.

# ఏడో అధ్యాయం

థోమా మెడిన్స్కాయాను కలుసుకుని వారం రోజులు కావస్తోంది. ఆమెరూపం మాత్రం రాత్రింబగళ్ళు అతన్ని వెన్నాడుతూనేఉంది. అతని హృదయాన్ని ఏదో అవ్యక్తమైన ఆవేదన కలవరపెట్టసాగింది! ఎప్పుడూ ఆమెదగ్గిరికి వెళ్ళి చూడాలనిపించేది. కాని అతను ఎంతో నిబ్బరంతో ఈ మనోవేదనను భరిస్తూవచ్చాడు. ఈ వాంఛకు లొంగకూడదని నిశ్చయించుకున్నాడు. ఏదోఒకవిధంగా ఈ వేదనను మరచిపోవడానికి తన వ్యాపార వ్యవహారాలలో అహరహలూ నిమగ్నుడయ్యేవాడు.

ఒకవైపు తనపనులూ—మరోవైపు ఆమెకోసం ఆవేదనా— ఈ రెండువిధాలా అతనిమనస్సు అల్లకల్లోల

మవుతూఉన్నా, ఫోమా జీవితాన్నిగురించి ఆలోచించడం మాత్రం మానెయ్యలేదు. జీవితం అప్పుడే అతని హృదయంలో ఒక విచిత్రమైన కలవరాన్ని మేలుకొల్పింది. అతనికి వాదోప వాదాలుచేసేశక్తి లేకపోయినా జీవితాన్నిగురించి అందరూ చెప్పేమాటలు శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. ఆమాటలు మననం చేసుకోడానికి కూడా యత్నిస్తున్నాడు. కాని ఆ మాటలవల్ల అతనికేవిషయము స్పష్టంగా తేలడంలేదు. పైగా ఆ మాటలు అతని అయోమయాన్ని మరింత ఎక్కువచేస్తున్నాయి. అందరూ ఎంతో తెలివిగా జాగ్రత్తగా మసులుకోడం అతను కనిపెట్టాడు. ముఖ్యమైన వ్యవహారాలు మాట్లాడే సందర్భాలలో ఎవరూ మనస్సులోమాట వెలిబుచ్చకపోవడం గమనించాడు. అంచాత వాళ్ళపట్ల ఒకవిధమైన అవిశ్వాసమూ అనుమానమూ అతనికి కలుగసాగాయి.

ఒకరోజున అతను వ్యాపారకూడలిలో ఉండగా రతుకపిత మయకిన్ అతనిదగ్గరకువచ్చి "అనానీవచ్చాడు నిన్నుచూడాలనుకుంటున్నాడు. ఇవాళసాయంత్రం వెళ్ళి అతన్ని కలుసుకో. కాని చాలా జాగ్రత్తగా తూచి మాట్లాడు. ముసలాడు సామాన్యుడు కాడు. గుంటనక్క" అని హెచ్చరించాడు.

"మనం అతనికి ఏమన్నా బాకీ ఉన్నామా?" అని అడిగాడు ఫోమా.

"అవును. కొంతబాకీ ఉన్నాం. ఒకపడవకొన్నాం. ఇంకా దానికి పైకం చెల్లించలేదు. అతను ఒక్కమాటే పైకమంతా చెల్లించాలంటే ఇస్తానను. ఒక రూబుల్ చూచావ్—అది జిగురులాంటిది. నీచేతిలో ఎంత ఎక్కువకాలం అది తిరుగుతే

అన్ని కోపెక్‌లు దానికిఅంటుకుంటాయి. రూబుల్ పావురాయి లాంటిది. ఆకాశంలోకి ఎగురుతుంది. నీవు ఇట్టే చూచేలోగా ఒకపావురాయిగుంపును వెనకేసుకుని వస్తుంది.” అన్నాడు మయకిన్.

“కాని అతను ఇస్తావా చస్తావా అని కూచుంటే ఇవ్వకుండా ఉండడం ఎలా?” అని అడిగాడు ఫోమా.

“అతను అరచి గీపెట్టినా ఇవ్వకు” అన్నాడు మయకిన్.

“సరే. అతన్ని వెళ్ళి చూస్తాను.”

అనానీసావిచ్‌షురోవ్ పెద్ద కలపవర్తకుడు. అతనికి ఒక పెద్ద రంపపుమిల్లుంది. బల్లకట్లూ, పడవలూ తయారు చేస్తారు. అతనికి పూర్వం ఇగ్నాట్‌తో లావాదేవీ లుండేవి. ఒకటిరెండు సార్లు చిన్నతనంలో ఫోమా దీర్ఘకాయుడైన ఈ వృద్ధుణ్ణి చూచాడుకూడా. నెరిసినజుట్టూ, విశాలవదనం, నిర్మలమైన కళ్ళూ కలిగి పర్వతాకారం గల ఆ వృద్ధుణ్ణి చూచినప్పుడల్లా ఫోమాకు ఒకవిధమైన భయగౌరవాలు కలిగేవి. కాని అతన్ని గురించి కొన్ని కథలూ పుకార్లూ కూడా విన్నాడు ఫోమా. ఆ వృద్ధుని ధనమంతా న్యాయార్జితం కాదనీ, ఎక్కడో అడవుల్లో ఉన్న మారుమూల గ్రామంలో అతను దుష్టజీవితం గడుపుతూండేవాడనీ విన్నాడు. ఇగ్నాట్ కూడా ఫోమాకు ఒకమాటు ఈ విషయమే చెప్పాడు. షురోవ్‌కు అసలు మొదట్లో ఆస్తి ఏమీ లేదు. ఒకపేదరైతట. జైలునుంచి పారిపోయివచ్చిన ఒక ఖైదీని తనతోటలో స్నానాలగదిలో దాచాడట. అతని కోసం ఆ ఖైదీ దొంగనోట్లుచేసేవాడట. అప్పటినుంచి అనానీకి సిరిమెత్తుకున్నదట. ఒకరోజున ఆ స్నానాలగది తగలబడిపోయి

ఆ బూదిలో ఒకమనిషిశవం దొరికిందట. ఆల్మోష్కురోవే ఆ మనిషిని చంపి తరువాత గదితగలపెట్టాడని చెప్పుకునేవారు. ఎన్నో దారిదోపిళ్ళూ హత్యలూ కూడా చేయించాడట. ఫోమా చిన్నతనంలో ఇలాంటి కథలు చాలా విన్నాడు. కాని అవి నిజమో అబద్ధమో ఎప్పుడూ ఆలోచించలేదు.

షురోవ్ ఇద్దరు పెళ్ళాలను హతంచేశాడనికూడా అతనికి తెలుసు. మొదటిభార్య శోభనంరోజురాత్రే అతని కౌగిళ్ళలో కళ్ళుమూసింది. తరువాత తన సొంత కోడలినే చేరదీశాడు. తరువాత ఆ బాధతో కొడుకు తాగుబోతై చెడిపోయేవాడట. కాని దైవానుగ్రహంవల్ల ఇర్గిజ్‌లో సన్యాసులమఠంలో కలిశాడట. కోడలుకూడా చనిపోయినతరువాత షురోవ్ ఒక మూగి బిచ్చగత్తెను చేరదీశాడు. ఇప్పటికీ ఆపిల్ల అతనితోనే ఉంటోంది. ఇటీవలే ఒక మృతశిశువునుకూడా కన్నది. అనానీని కలుసుకోడానికి హోటల్‌కు వెళ్ళే దోవలో ఫోమాకు ఈ విషయాలన్నీ జ్ఞాపకంవచ్చాయి.

తలుపు తెరుచుకుని ఫోమా లోపల అడుగుపెట్టాడు. అది చిన్నగది. ఒకటే కిటికీ. కిటికీగోనుంచి అవతలఉన్న ఇంటి చూరు కనుపిస్తూఉంది. షురోవ్ అప్పుడే నిద్రలేచాడు. పక్క మీద కూచునిఉన్నాడు వంగికూచుని నేలవంక చూస్తున్నాడు. అతని పెద్దగడ్డం మోకాళ్ళు తాకుతూఉంది. వంగికూచున్నా ఎత్తుగా కనుపిస్తున్నాడు.

'ఎవరావచ్చింది?'—అన్నాడు గద్దిస్తూ, తల ఎత్తకుండా.

"నేనే. ఎలా ఉన్నారు అనానీసావిచ్!"అన్నాడుఫోమా

వృద్ధుడు తలెత్తి కళ్ళార్పుతూ ఫోమావంక చూచాడు.

"ఇగ్నాట్ అబ్బాయివికదూ? అవునా?" అన్నాడు.

"అవును. అతన్నే" అన్నాడు ఫోమా.

"సరే, ఇలావచ్చి కూచో. ఏదీ ఒకమాటునిన్ను చూడనీ ఎంత పెరిగావు! నాతో కలిసి ఒక గ్లాసు టీ తాగుతావా?"

"సరే!"

"వెయిటర్!" పిలిచాడు ముసలాడు. గడ్డం చేతిలోకి తీసుకుని తడువుకుంటూ నిశ్శబ్దంగా ఫోమాను పరిశీలించడం మొదలెట్టాడు.

ముడతలుపడిన విశాలఫాలం, చామన చాయ శరీరం, నెరసిన జడలు, ప్రశాంతంగాఉన్న పండ్లు—వృద్ధుడు ఎంతో గంభీరంగా ఉన్నాడు.

"చిన్నతనంలో మీ నాన్నలాగా ఉండేవాడివి. మీ నాన్న జ్ఞాపకమేనా? ఎప్పుడైనా అతనికోసం ప్రార్థిస్తూఉంటావా? ఇగ్నాట్ నాకు తెలుసు. వాడు మహాపాపి. పశ్చాత్తాపం పొందే అవకాశం లేకుండానే అకస్మాత్తుగా చనిపోయాడు!" అన్నాడు వృద్ధుడు. తన తండ్రినిగురించి ఇలా మాట్లాడినందుకు ఫోమాకు కోపంవచ్చింది.

"ఇతరులకంటె ఎక్కువ పాపి కాదు." అన్నాడు."

"అంటే నీ ఉద్దేశం?"

"లోకంలో లక్షలమంది పాపులున్నారు."

"ఇగ్నాట్‌వంటిపాపి ఒక్కడే ఉన్నాడు, అతను నీ రక్షక పిత మయకిన్."—అన్నాడు వృద్ధుడు.

"నిజంగానంటావా?" అన్నాడు ఫోమా నవ్వుతూ.

"ఏమాత్రం సందేహంలేదు." అన్నాడు షురోవ్. వెయిటర్ టీ తీసుకొచ్చాడు. వృద్ధుడు టీ కలిపి తనొక గ్లాసు తీసుకుని ఫోమాకు ఒక గ్లాసు అందించాడు.

"ఎక్కువ పాపాలుచేసినవాడికి ఎక్కువ తెలివిఉంటుంది. పావం గుమవులాంటిది." అన్నాడు వృద్ధుడు.

టీ కలిపి ఫోమాకు అందించినతరువాత ఫోమాకు ఎదురుగా కూచుని ఇలా చెప్పసాగాడు.

"మీనాన్న నీ ఈడుకు మా ఊరిదగ్గరే పడవల్లో కూలీగా ఉండేవాడు. అప్పుడు అతన్ని చూడగానే అద్దంవెనకాల ఏముందో చెప్పినట్టు ఇతను ఫలానారకం మనిషి అని చెప్పగలిగేవాణ్ణి. కాని ఇప్పుడు కాలం మారిపోయింది. నిన్ను చూస్తే నీవు ఎలాటివాడివో అలా చెప్పలేను. అసలు నీవిషయం నీకే తెలీదు. ఇహ నే నెలా చెప్పగలను? బ్రతుకంతా గాలికికూలిన చెట్ల చిక్కటడవి అయిపోయింది. అసలు దోవ ఎక్కడుందో కనుక్కోడం అసాధ్యంగా ఉంది. ఇంతకూ – నీకు పెళ్ళయిందా?"

"ఇంకా కాలేదు." అన్నాడు ఫోమా.

"పెళ్ళి కాలేదు! అయినా మైలపడే ఉంటావనుకుంటాను. వ్యాపారం బాగా చూచుకుంటున్నావా?"

"ఒక్కోసారి నేనే చూచుకుంటాను. లేకపోతే నా రక్షకపిత చూచుకుంటాడు."

"అయినా, ఈ రోజుల్లో అంతపెద్దపనులేమున్నాయిలే! ఇప్పుడు ఒళ్ళొంచి పనిచెయ్యడమంటూ లేదు. పూర్వపురోజుల్లో వర్తకుడు రాత్రనక పగలనక గాలనక ఎండనక వర్తకంపనుల

మీద గుర్రాలపై వందలకొద్దీ మైళ్లు ప్రయాణంచేసేవాడు. ఇప్పుడు రైళ్ళూ టెలిగ్రాములూ వచ్చాయి. కడుపులో చల్ల కదలకుండా ఉన్నచోటే కూచుని ఎంతదూరంలో ఉన్నవాళ్ళ తోనైనా వ్యవహారాలు మాట్లాడేస్తున్నారు. ఏమీ పనులు తోచక, గోళ్లుగిల్లుకుంటూ కూచోలేక పాపాలు చేస్తున్నాడు మనిషి. శ్రమఉంటే ఈ తీరికా ఈ స్వేచ్ఛా ఉండవు. అప్పుడు ఈ పాపాలూ ఉండవు. స్వేచ్ఛ మనిషిని హతమారుస్తుంది.''

ఆ వృద్ధునివంకచూస్తూ ఈ మాటలు వింటోంటే ఫోమా భయకంపితుడైనాడు.

''శరీరానికి స్వాతంత్ర్యం ఇచ్చినవాడు ఆత్మను చంపుకున్నవాడవుతాడు'' అన్నాడు వృద్ధుడు.

''ఇప్పుడేకాదు. పూర్వపు రోజుల్లో కూడా మనుషులు తాగి, భోగించి నశించేవారే కదా?'' అని అడిగాడు ఫోమా.

''నీవు మహాతెలిసినట్టు మాట్లాడుతున్నావే? ఇహ చాలించు. పూర్వపు రోజుల్లో మనుషులు పెద్ద మర్రి మానుల్లా ఉండేవారు. బలాన్ని, శక్తినిబట్టి భగవంతుడు మంచీ చెడ్డా నిర్ణయిస్తాడు. గొర్రెను మింగినందుకు తోడేలును శిక్షించడు కాని ఒక ఎలుక దాని చావుకు కారణమవుతే ఆ ఎలుకను శిక్షిస్తాడు.''

బైటంతా నిశ్శబ్దంగాఉంది. కిటికీఅవతల ఏదో మెల్లగా చప్పుడవుతూ ఉంది.షురోవ్ గడ్డం తవుడుకుంటూ టీగ్లాసులోకి నిశ్చలంగా చూస్తూ కూచున్నాడు.

''నీ తండ్రి లేకపోవడంవల్ల నీకు చాలా కష్టంగా ఉన్నదనుకుంటాను.'' అన్నాడు.

"దానికి మెల్లగా అలవాటుపడుతున్నాను." అన్నాడు ఫోమా.

"మయకిన్ తరువాత అతని ఆస్తి కూడా నీకే కలుస్తుంది కదా?"

"ఆ ఆస్తితో నాకు అవసరంలేదు."

"నీకు కాకపోతే మరెవరికిస్తాడు? అతనికి ఉన్నది ఒక్కతే కూతురు. నీవు దాన్ని పెళ్ళాడకతప్పదు. ఇలా బ్రహ్మచారిగా బ్రతకడంమాత్రం ఏంబావుంది? ఎప్పుడూ పిల్లలకోసం వేటాడుతున్నా వనుకుంటాను?"

"లేదు"

"నాకు చెప్పకోయ్! నాకు తెలుసు! ఈ రోజుల్లో సిసలైన వర్తకుడు నశించిపోతున్నాడు. ఒకడెవడో నాకు చెప్పాడు – నిజమో అబద్ధమో తెలీదుకాని–అసలు మొదట్లో కుక్కలు తోడేళ్ళేనట.తరువాత కుక్కలుగాదిగజారిపోయాయట. మనం, మనుష్యులంకూడా ఇలాగే అయిపోతున్నాం. పెద్దా చిన్నా, ఎక్కువా తక్కువా లేకుండా పోతుంది. చదువులు కూడా ఇలాగే తగలడుతున్నాయి. బళ్ళల్లో పిల్లలందరినీ ఒకే మూసలో పోసి తయారుచేస్తున్నారు. ఇహ యాభై సంవత్సరాలు పోతే నేనంటూ ఒకణ్ణి బ్రతికున్నానని నమ్మను కూడా నమ్మరేమో అనుకుంటాను. నాకు చిన్నతనంలో పైసా లేదు. ఇప్పుడు లక్షలు ఆస్తి సంపాదించాను. భూములూ అడవులూ కొన్నాను."

"అందరూ డబ్బునుగురించే మాట్లాడుతారు. ఈ డబ్బు వల్ల మనిషికివచ్చే ఆనందమేమిటో!" అన్నాడు ఫోమా.

"డబ్బువిలువ తెలుసుకోకపోతే నీవు మంచివర్తకుడివి కాలేవు." అన్నాడు షురోవ్.

తరువాత తన బాకీవిషయం ప్రస్తావించాడు.

"నా పైకం పట్టుకొచ్చావా?" అని అడిగాడు. "లేదు." అన్నాడు ఫోమా. వృద్ధునిమాటలువిని ఫోమాతల బరువెక్కి ఉంది. వ్యాపార ప్రస్తావన తీసుకొచ్చేసరికి, "అమ్మయ్య! అసలు విషయంలో పడ్డాడురా." అనుకున్నాడు.

"అది మంచి పనికాదు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. నీవు పైకం చెల్లించి తీరాలి," అన్నాడు వృద్ధుడు.

"రేపు సగం ఇస్తాను"

"సగం ఏమిటి? అంతా ఎందుకివ్వవు?"

"ఇప్పుడు డబ్బుకు కొంచెం కటకటగావుంది."

"అయితే నన్ను సహాయంచెయ్యమంటావన్నమాట!"

"దయచేసి తమరు కొంచెం సహాయంచెయ్యాలి. వాయిదా ఇవ్వండి"

"మీనాన్నస్నేహాన్ని పురస్కరించుకుని అలాగే చేస్తాను."

"ఎన్నిరోజులు వాయిదా ఇస్తారు?"

"ఆరు నెలలు."

"ధన్యవాదాలు!"

"నీవు నాకు పదకొండువేల ఆరువందల రూబుళ్ళు ఇవ్వాలి. పదిహేనువేలకు నోట్లు తిరగవ్రాయి. దానిపై వడ్డీ మాత్రం ముందుగా చెల్లించు. నీ రెండు పడవలూ తాకట్టు పెట్టుకుంటాను."

రేపు నోట్లు పంపండి అలాగే చేస్తాను."

"సరే. మంచిది"

ఫోమా బైటపడ్డాడు. వృద్ధునిపట్ల అతనికి ప్రీతి, అసహ్యమూ రెండూకలిగాయి. పాపాన్ని గురించి అతను చెప్పిన మాటలు జ్ఞాపకంవచ్చాయి.

"ఇతనూ జీవితాన్ని గురించి మాట్లాడుతాడు. తన పాపాలు తనకు తెలుసు. కాని వాటిని గురించి వాపోతూ కూచోడు. పాపాలు చేశాడు. వాటి ఫలితాల ననుభవించడానికి సిద్ధంగా ఉన్నాడు. కాని ఆమె?" అని తలపోయసాగాడు ఫోమా. అతనికి మెడిన్స్కాయా జ్ఞాపకంవచ్చింది. అతనిహృదయం బాధతో కుంచించుకుపోయింది.

"ఆమె కూడా పశ్చాత్తపిస్తున్నది.' కాని అది నిజమో అబద్ధమోఎవరికి తెలుస్తుంది? మంచిచెడ్డలు ఒక్క భగవంతుడికే తెలియాలి." అనుకున్నాడు ఫోమా.

ఇలా తలపోస్తూ మయకిన్ ఇల్లు చేరుకున్నాడు. మయకిన్‌తో జరిగిన వృత్తాంతమంతా చెప్పాడు. అతను వెళ్ళేసరికి మయకిన్ కుర్చీలో కూచొని లెక్కలు చూచుకుంటున్నాడు. ఫోమాను చూడగానే లూబానుపిలిచి "అమ్మాయ్ లూబా! ఫోమాకు టీ పట్టుకురా." అన్నాడు. లూబా టీ తీసుకొచ్చింది. ఫోమా షుకోవ్ నోట్లు తిరిగి వ్రాయమని అడిగిన విషయం మయకిన్‌తో చెప్పాడు.

"ఇంకా ఏమన్నాడు ముసలాడు?" అని అడిగాడు మయకిన్.

"తనొక మర్రిమానట."

"మఱ్ఱిమానా? అయితే, నేను రచిస్తాన్నని కో. మఱ్ఱి గొప్పవృక్షమే. కాని దాని కాయలు ఎందుకూ పనికిరావు?"

"అతను చాలా బరువుగా మాట్లాడుతాడు."

"నన్ను తిట్టేడుంటాడే!"

"కొంతవరకు"

"అప్పుడు నీవేం చేస్తున్నావు?"

"వింటూ కూచున్నాను."

"అలాగా? ఏం వింటున్నావు?"

"భగవంతుడు బలవంతులను శిక్షించడట. బలహీనులను మాత్రమే శిక్షిస్తాడట."

"ఆహా! ఏం విజ్ఞానం!"

"అతను యంత్రాలను నిందించాడు. అవి మనిషిని పాడుచేస్తున్నా యన్నాడు."

"అతని కేం తెలుసో వాటి గొప్పతనం?"

తరువాత మయకిన్ లేచి నగర కౌన్సిల్‌కు వెళ్ళవలసి వెళ్ళాడు. ఆయన వెళ్ళినతరువాత ఫోమా, "దేవా తెన్నూ ఎవరికీ తెలిసినట్టు కనుపించదు. ఒక్కొక్కరు ఒక్కొకమాట చెబుతారు. ఏమాటనమ్మాలో ఏమాటనమ్మకూడదో తెలీదు" అన్నాడు.

"పుస్తకాలూ ఇంతే." అన్నది లూబా మెల్లని కంఠ స్వరంతో.

ఫోమా ఆమెవంక చూచాడు. చిరునవ్వు నవ్వాడు. ఆమెకూడా అప్యాకంగా చిరునవ్వు నవ్వింది.

ఆమె కళ్ళలో అలుపూ దిగులూ కనుపించాయి.

"నీవింకా పుస్తకాలు చదువుతూనే ఉన్నావా?" అని అడిగాడు ఫోమా.

"ఊఁ" అన్నది ఆ అమ్మాయి దిగులుగా.

"నీ ఒంటరితనం ఇంకా పోలేదా?"

"నేను ఒంటిగానే ఉన్నాను. నాకు రోతవేస్తూంది. ఒక్కమాట మాట్లాడాలన్నా ఎవరూలేరు."

"ఊఁ"

ఆమె తువాలా కొసలు కొనవ్రేళ్ళతో మెలిపెడుతోంది.

"నీవు పెళ్ళిచేసుకోవాలి." అన్నాడు ఫోమా.

"ఇక ఆ సంగతి చెప్పకు." అన్నది లూబా.

"అదేమిటి? నీవు తప్పకుండా పెళ్ళిచేసుకుని తీరుతావు. నాకు తెలుసు."

"నాకూ ఇతరులకూ మధ్య మంచుతెర — దట్టమైన మంచుతెర ఉన్నట్టు అనిపిస్తుంది."

"ఇవన్నీ పుస్తకాల్లో మాటలు."

"అలా అనకు. నాకు లోకంలో ఏదీ తృప్తికరంగా కనుపించదు. అన్నీ తప్పుగానే కనుపిస్తాయి. కాని ఆ విషయం చెప్పలేను."

"ఇదంతా నీవు చదివిన పుస్తకాలవల్ల ఏర్పడిన అయోమయం."

"మొదట్లో నాకు పుస్తకాల్లో విషయాలన్నీ స్పష్టంగా అర్థమైనట్టు కనుపించేవి. కాని రాను రాను..."

"ఇహ నీ పుస్తకాలగొడవ చెప్పకు."

"అలా అనకు. కొన్ని పుస్తకాలు చదివితే మనస్సు వెర్రెత్తిపోతుంది. కొన్ని పుస్తకాల్లో విషయాలు అన్నీనిజమే ననిపిస్తాయి."

"ఒక పుస్తకానికీ ఇంకోపుస్తకానికీ సంబంధం ఉండదు."

"అంతా గొడవ"

ఈ లోగా మయకిన్ వచ్చాడు.

"ఏమిటి కబుర్లాడుతున్నారు?" అన్నాడు.

"ఏవో పుస్తకాలవిషయం మాట్లాడుకుంటున్నాం." అన్నది లూబా.

తరువాత మయకిన్ మళ్ళీ పనిమీద వెళ్ళాడు. ఫోమా, లూబా మిగిలిపోయారు.

"మీనాన్న చాలా చిత్రమైన వ్యక్తి." అన్నాడు ఫోమా.

లూబా తలఊపింది. ఒకరికి ఎదురుగా ఒకరు కూచున్నారు. ఇరువురూ మాట్లాడడంలేదు. బైట చీకటిపడుతోంది. గదిలో అప్పటికే చీకటిగాఉంది. గాలికి నిమ్మచెట్టుఆకులు గలగలాడుతున్నాయి. కొమ్మలు చలికి ఇంటిగోడలను కౌగిలించుకుని శరణ్యమివ్వమని అర్థిస్తున్నట్లుగా ఉన్నాయి.

"లూబా!" పిలిచాడు ఫోమా మెల్లగా. లూబా తలెత్తి చూచింది.

"నేనూ మెడిన్స్కాయా తగాదాపడ్డాం తెలుసా?"

"ఏం?" అనడిగింది లూబా ఔత్సుక్యంతో.

"నన్ను అవమానించింది."

"ఆమెతో తగాదా రావడం మంచిదే. వట్టి చెడ్డమనిషి. విలాసిని."

"ఆమె చెడ్డదికాదు. మీరు ఆమెనుగురించి చెప్పుకునే మాటలు నిజంకాదు."

"అయితే క్షమించు."

"అదికాదు లూబా, ఆమెనుగురించి నాముందు అలా మాట్లాడకు. ఆమె తన విషయమంతా తనే స్వయంగా నాకు చెప్పింది." అన్నాడు ఫోమా ప్రాధేయపడుతున్నట్టుగా.

"ఆమే చెప్పిందా? ఏం చెప్పింది?" అని అడిగింది లూబా ఆశ్చర్యంతో.

"తను పాపాత్మురాలినని చెప్పింది."

"ఇంతేనా?" అన్నది లూబా నిరుత్సాహంతో.

"అది చాలదా?"

"ఇప్పుడు నీవేం చెయ్యదలుచుకున్నావు?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను."

"నీవు ఆమెను అంత ఎక్కువగా ప్రేమిస్తున్నావా?"

ఫోమా ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేదు. కిటికీవంకచూస్తూ అయోమయంగా

"ఏమీ చెప్పలేను. కాని ఇప్పుడు పూర్వంకంటె ఎక్కువగా ఆమెను ప్రేమిస్తున్నా ననుకుంటున్నాను." అన్నాడు.

"తగాదాకు ముందరికంటె ఎక్కువగానా?"

"అవును."

"అలాంటి స్త్రీని ప్రేమించడం ఎలాసాధ్యమో?" అన్నది ఆ అమ్మాయి.

"ఏం? ఎందుకు ప్రేమించకూడదు?"

"నీకు అంతకంటె మంచిస్త్రీ తటస్థించలేదు కాబట్టి ఆమెను ప్రేమిస్తున్నావు."

"అంతకంటె మంచిస్త్రీ లేదేమో."

"మనలో లేకపోవచ్చు." అన్నది లూబా.

"ఆమెను ప్రేమిస్తున్నాను. కాని ఆమెను చూస్తే ఏదో భయం."

"అంటే ప్రేమిస్తున్నావన్నమాట. నేనూ ప్రేమిస్తే అలాగే అనుకుంటాను. నేనొక పనిచేస్తే నా ప్రియుడు ఏమను కుంటాడో అనుకుంటాను." అన్నది లూబా.

"ఆమెదంతా అదో తరహా! అయినా ఎంతఅందంగా ఉంటుంది? ఒక్కొక్కసారి పసిపిల్లలా కనుపిస్తుంది."

"ఇంతకూ మీ ఇద్దరిమధ్యా ఏంజరిగింది?"అని అడిగింది లూబా.

ఫోమా కుర్చీ దగ్గరికి జరుపుకున్నాడు. తనకూ మెడిన్స్కాయాకు మధ్య జరిగిన విషయమంతా చెప్పాడు. అంతా విని "మంచిపని చేశావు." అన్నది లూబా.

ఇద్దరూ మాట్లాడకుండా ఊరుకున్నారు. లూబా తన జడతో ఆడుకుంటోంది. ఆమెకూడా మౌనంగా ఉంది. టీ పొయ్యి చల్లారిపోయింది. గదిలో చీకటి ఎక్కువవుతూ ఉంది. బైట చీకటి దట్టంగా వ్యాపించింది. నిమ్మకొమ్మలు సాలోచనగా వణుకుతున్నాయి.

"ఇక దీపం వెలిగించు" అన్నాడు ఫోమా.

"మనిద్దరం ఎంత దురదృష్టవంతులం" అన్నది లూబా.

ఫోమాకు ఈమాట నచ్చలేదు.

"నాకు సుఖం లేకపోలేదు. నేను జీవితానికి ఇంకా అల వాటుపడలేదు. అంతే" అన్నాడు.

రేపు తనేం చెయ్యనున్నాడో తెలీనివాడు దురదృష్ట వంతుడే. నాకూ నీకూ ఈ విషయం తెలీదు. ఎక్కడికి వెడు తున్నామో తెలీదు. కాని వెడుతున్నాం. వెళ్ళకతప్పదు. నాలో ఎప్పుడూ ఏదో వేదన" అన్నది లూబా.

"నాకూ అంతే. ఇక వెడతాను. క్లబ్బుకు వెళ్ళాలి"

"వెళ్ళకు" ప్రాధేయపడింది లూబా.

"కాదు వెళ్ళాలి."

"సరే" అన్నది లూబా.

"ఇక పడుకుని నిద్రపోతావా?"

"కాదు. కాసేపు చదువుకుంటాను"

"తాగుబోతుకు తాగుడు ఎలాగో నీకు పుస్తకాలు అలా."

"అంతకన్న చేసేదిమటుకేముంది?" అన్నది లూబా.

ఫోమా వీధిలో నడుస్తున్నాడు. అతనికి కిటికీలోనుంచి లూబా ముఖం కనుపించింది. ఆమె మాటల్లాగానే ఆమె కోరిక ల్లాగానే ఆమె ముఖం కూడా అవ్యక్తంగా కనుపిస్తూంది.

"ఈమెకూడా మెడిన్ స్కాయాలాగానే దోవతప్పింది." అనుకున్నాడు ఫోమా లూబాను గురించి.

రాత్రి పడుతున్నది. గాలిచల్లగా ఉంది. ఫోమా క్లబ్‌కు చేరగానే ఊక్టిషెవ్ ఎదురయ్యాడు. 'ఎలా ఉన్నావోయ్?

కులాసా? అంటూ ఫోమాను పలకరించాడు. మన 'అసమాన హితకారిణి' విదేశాలకు వెడుతూందట తెలుసా?", అన్నాడు.

"సోఫియా పావ్లోవ్‌నా? అని అడిగాడు ఫోమా.

"అవును. మన జీవితకాంతి అస్తమిస్తూంది." అన్నాడు ఊక్టిషెవ్ గమ్మత్తుగా.

"మెడిన్‌స్కాయా విదేశాలకు వెడుతోందా?" మరో కంఠస్వరం వినిపించింది. ఫోమా అటువంక చూచాడు. ఆ వ్యక్తి మీసాలు తడువుకుంటూ "అయితే మన ఊళ్ళో ఒక సాని తరుగుబడుతుందన్నమాట." అన్నాడు.

"అది సానిదని నీకు తెలుసా? మనుషులను పరోక్షంలో తిట్టకు; ధైర్యముంటే సూటిగా తిట్టు." అన్నాడు ఫోమా. ఫోమా కోపం ఆపుకోలేకపోయాడు. సివంగిలా అతని మీద దుమికి అతన్ని కొట్టి నేలమీద ఈడ్చాడు. ఇలాటి సందర్భాలలో అతనికి ఒక పెద్ద బరువు తీరినట్టుండేది. ఎన్నాళ్ళనుంచో అతనిలో పేరుకున్న ఒక బరువుతీరి తేలిగ్గా ఉన్నట్టనిపించేది. ఆ వ్యక్తి చిందరవందరైపోయి నేలమీద ప్రాకులాడుతున్నాడు.

"నే నెవరో తెలుసా?" అన్నాడు ఆ వ్యక్తి.

"ఊక్టిషెవ్ ఎంతో బలవంతంమీద ఫోమాను విడదీసి "అతను వైస్ గవర్నర్ అల్లుడు." అన్నాడు.

"అలాగా." అన్నాడు ఫోమా.

"ఏం కొంప ముంచుతాడో!" అన్నాడు ఊక్టిషెవ్. స్నేహితులిద్దరూ క్లబ్‌నుంచి బైటపడి మాట్లాడుకుంటూ వెడుతున్నారు. ఫోమా మెడిన్‌స్కాయాను గురించి తన ఆవేద

నంతా వెళ్ళబోస్తున్నాడు "అందరికీ సుఖంఉంది. నాకు లేదు" అన్నాడు.

"ఒక అమ్మాయిదగ్గరికి వెడదామా? ఇలాంటి మెడిన్స్యాయాలు లక్షమందికూడా దానిముందుచాలవు." అన్నాడు ఊక్టిషెవ్.

"నాఅంతరాత్మ ఒప్పుకోదు" ఆమె బ్రతికిఉన్నంతకాలం మరో స్త్రీ ముఖం చూడలేను,"

"ఈ వయసులో ఈ మాటలేమిటి? అంతరాత్మ విషయం నాకు చెప్పకు. నీవు దాన్ని సరిగా నిర్వహించలేకుండా ఉన్నావు. నీకు అడ్డం వస్తున్నది నీ అంతరాత్మ కాదు, నీభయం అనుకుంటాను. దాన్నే నీవు అంతరాత్మ అను కుంటున్నావు. నీవు నలుగురితో కలిసిమెలిసి ఉండవు. నలుగురికీ దూరంగా ఉంటావు. మనిషి సుఖించడం సహజం. ఇందులో అంతరాత్మజోక్య మేమిటి? సుఖం మనిషికి జన్మహక్కు. అవసరం"

ఊక్టిషెవ్ మాట్లాడుతూనే ఉన్నాడు. ఫోమా ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

"నీమనస్సు సరిగా ఉన్నట్టులేదు. ఒక విలాసమందిరానికి వెడదామా ? ఇద్దరు అక్కచెల్లెళ్ళున్నారు. ఎంత హాయిగా ఉంటారనుకున్నావు? వస్తావా?"

"ఆలస్యమైందేమో?" అన్నాడు ఫోమా.

"ఇలాటివాటికి ఆలస్యాలంటూ లేవు." అన్నాడు ఊక్టిషెవ్, ఉల్లాసంగా.

# ఎనిమిదో అధ్యాయం

క్లబ్ గొడవ జరిగి మూడురోజు లైంది. థోమా కొందరు స్నేహితులతో కలిసి నగరానికి రెండుమైళ్ళదూరంలో వున్న ఓడల రేవుకు వెళ్ళాడు. అక్కడ కలపబద్దలతో కట్టిన ఒక పడవపై స్నేహితులతో కలిసి కులాసాగా జల్సా చేస్తున్నాడు. వారిలో ఊక్టిషెవ్, వర్తకుని కుమారుడైన జ్వాంటిజెవ్, నిండుగాఉన్న ఒక బట్టతలవ్యక్తి మరి నలుగురు స్త్రీలుఉన్నారు. స్నేహితులందరూ తలా ఒక స్త్రీని తమతో తెచ్చుకున్నారు. ఆ బట్టతల వ్యక్తి, వర్తకుని కుమారుణ్ణి జీన్ అని పిలుస్తాడు. జీన్ వెంటతెచ్చుకున్న స్త్రీ పొడుగ్గా, బొద్దుగా ఉంటుంది. ఉబికిన వక్షస్థలం, పొడుగాటిముక్కు. రామచిలుకలాకనిపిస్తోంది. ఊక్టిషెవ్ వెంటతెచ్చుకున్న స్త్రీ పేరు 'వేరా.' పొడుగ్గా, పాలిపోయి ఉంటుంది. ఎర్రనిజుట్టు, బట్టతలగలవ్యక్తి వెకిలిగా నవ్వుతున్న ఒకపిల్ల ప్రక్కన కూచునిఉన్నాడు. థోమావెంట వచ్చిన స్త్రీ గంభీరంగాఉంది. నల్లటిదుస్తులువేసుకుంది. ఆమెలో ఒకవిధమైన అహంభావం కనిపిస్తోంది. అక్కడఉన్నవారందరిలోకీ తనే గొప్పదాన్ని అనుకుంటుందేమో అనిపిస్తోన్నది.

మెల్లగా ప్రవహిస్తున్న నదిపై కలపబద్దీల పడవచివర స్నేహితులంతా కూచున్నారు. మధ్యలో ఒక బల్ల. దానిమీద ఖాళీ సీసాలు, నారింజతొక్కలు, ఆహార పదార్థాలుగలబుట్టలు చిందరవందరగాఉన్నాయి. స్నేహితులంతా అప్పుడే భోజనం ముగించి ద్రాక్షరసాలు, పండ్లు పుచ్చుకుంటున్నారు. రెండు రోజులనుంచీ జల్సాగా కాలక్షేపంచేయడంవల్ల అందరూ అలసి

పోయిఉన్నారు. నదివంకచూస్తూ ఏదోసంభాషించుకుంటున్నారు. మధ్య మధ్య అలుపువల్ల వారి సంభాషణ ఆగిపోతోంది.

ఆరోజు నిర్మలంగా హాయిగా ఉంది. నిండైన నది నిర్మలమైన ఆకాశంలాగా ప్రశాంతంగా కనిపిస్తోంది. దూరంగా బారులుతీరి ఉన్న కొండలు, నీలాలమంచులో జలకమాడుతున్నాయి. చర్చిలపై శిలువగుర్తులు నక్షత్రాల్లాగా మిలమిల మెరుస్తున్నాయి. నదీతీరంలో అలజడిగా ఉంది. స్టీమర్లు వచ్చి పోతున్నాయి. పెద్దపెద్ద పడవలు నదీవాహినికి ఎదురువాలుగా పరుచుకుని పెద్దపెద్ద పందులు పడుకున్నట్టుగా కనిపిస్తున్నాయి. స్టీమరుగొట్టాల్లోంచి నల్లటి పొగ లేచి ఆకాశంలో కలిసిపోతోంది. స్టీమరుకూత అతిశ్రమవల్ల అలిసిపోయి బిగ్గరగా కేక వేసిన పెద్ద జంతువుయొక్క కేకలాగా ఉంది. కలపబద్దీలపడవ దగ్గర వచ్చికబయళ్ళలో అంతా నిశ్శబ్దంగా ప్రశాంతంగా ఉంది. ఒంటిగాఉన్న చెట్లు నదిలో మునిగిపోయాయి. నాచు కూడా కప్పింది. ఎర్రని జుట్టుగల స్త్రీ దూరంలోకిచూస్తూ విషాదంగా

"వోల్గానదీ వాహినిలో
ఒక చిట్టిపడవ తేలుతూ పోతున్నది!"

అని పాడుతున్నది.

"ఉన్న విచారానికి తోడు ఈ పాట ఎందుకు?" అన్నది ఒకస్త్రీ.

"ఆమెను పాడనీ!" అన్నాడు ఫోమా.

"శాషా! పాడనా?" అని అడిగింది ఆ స్త్రీ.

"నేనే పాడుతాను" అన్నది ఘోమా సఖురాలు. వాసా వంక తిరిగి "వాసా! నాతో కలిసి పాడవే" అంది. వాసా వెంటనే మాట్లాడుతున్నదల్లా మాట్లాడడం ఆపివేసి గొంతు సవరించుకున్నది. శాషా సగర్వంగా తలెత్తి ఇలా పాడడం మొదలెట్టింది.

"బాధలు, బరువులు లేని జీవితం
హాయి కాదా ఈ లోకంలో!
ఆశల అగ్నిజ్వాలల ప్రగ్గని
బ్రతుకే హాయి కాదా ఈ లోకంలో"

తరువాత ఆమె చెల్లెలు అందుకున్నది.—

"కన్నె బ్రతుకంతా కాలిపోయెనే!
వెన్నలాంటి నా కన్నెబ్రతుకు వేగిపోయెనే!"

తరువాత శాషా తగ్గుస్థాయిలో

"గడ్డిపూవులా నా హృదయం వాడిపోయెనే!

అని పూర్తి చేసింది. రెండు కంఠస్వరాలూ కలిసి ఆ నదీ తలంపై ప్రవహింపసాగాయి. ఒక కంఠస్వరం హృదయంలో తీరని వేదనతో ఏదో ప్రశ్నిస్తున్నట్టుగా ఉంది. విషాదవిషంతో మత్తెక్కి వెక్కి వెక్కి ఎడతెరిపిలేకుండా ఏడుస్తున్నట్టుగా ఉంది. మరో కంఠస్వరం తగ్గుస్థాయిలో పురుషకంఠస్వరంలాగా బలీయంగా పగతో, వగతో ప్రకంపిస్తోంది. ఒక అగాధమైన వాహిని లాగా ఆమె హృదయాన్ని చీల్చుకుని వస్తోంది. ప్రతిమాటలో నెత్తురు సలసల కాగుతోంది.

"ప్రియునిపై పగతీర్చుకుంటాను నేను!" అని పాడుతోంది వాసా. ఆఘూతాల్లాగా ధ్వనిస్తున్న స్వరాలతో శాషా ఇలా అందుకుంది.

"ప్రియుణ్ణి ప్రజ్వలింపచేస్తాను నేను!
పీల్చి పిప్పిచేస్తాను మేను!

"తరువాత వాసా గానధోరణి మారుస్తూ. ఉచ్చ స్వరంతో ఇలా పాడసాగింది.

"వడగాలిదెబ్బలా వడలింపచేస్తాను!
ఎండిన గడ్డిలా ఎండవేస్తాను!"

బల్లమీద చేతులానించి నిల్చుని, తలవొంచుకుని ఫోమా ఆ స్త్రీ ముఖంలోకి, అర్ధనిమీలితాలైన ఆమె కళ్ళలోకి తదేకంగా చూస్తున్నాడు. దూరంలోనికి నిశ్చలంగా చూపు నిలిపిన ఆమె కళ్ళు చిన్నచిన్న జ్వాలల్లా జ్వలిస్తున్నాయి. ఆ వెలుగువల్ల ఆమె కంఠస్వరం కూడా కళ్ళలాగానే జ్వలిస్తున్నట్టుగాఉంది. ఆమె లాలింపులు, బుజ్జగింపులు అతనికిజ్ఞాపకంవచ్చి "ఇది ఇలాంటిస్థితికి ఎలా దిగజారిందో? దీని ప్రక్కన ఉండడానికి కూడా భయం వేస్తోంది." అనుకున్నాడు.

ఉఖ్తి షెవ్ తనవెంటతెచ్చుకున్న స్త్రీ ప్రక్కన కులాసాగా కూచుని ఉన్నాడు.

శాషా పాటముగించిన తరువాత తనచుట్టూ సగర్వంగా పరికించి, ఫోమా ప్రక్కన వచ్చికూచుని అతని మెడచుట్టూ గట్టిగా చేతులు పెనవేసింది. "ఏం? పాట ఎలాఉంది?" అంది.

"అద్భుతం!" అన్నాడు ఫోమా.

అందరూ ఆమెపాటను మెచ్చుకుంటూ చప్పట్లు చరుస్తున్నారు. కాని ఆమె మాత్రం వాళ్ళను లెక్క చెయ్యడం లేదు. ఫోమాను కౌగలించుకుని సాధికారంగా "నా పాటకు ఏదైనా బహుమతి ఇవ్వవూ?" అని అడిగింది.

"ఇస్తాలే." అన్నాడు ఫోమా.

"ఏమిటీ?"

"నీవే చెప్పు."

"ఊళ్ళోకి వెళ్ళగానే చెపుతాను. నేనడిగింది కనుక ఇచ్చావూ అంటే – అబ్బ! నిన్నెలా ప్రేమిస్తానో తెలుసా?"

"మరిఇప్పుడో? ఏమైనా నీవు నన్ను ప్రేమించక తప్పదు."

ఆమె అతనివంక ప్రశాంతంగా చూచింది. ఒకక్షణం ఆగి నిశ్చితంగా ఇలా చెప్పింది.

"నిజం చెప్పనా? ఉన్నమాట ఉన్నట్టు చెపుతున్నాను. నిన్ను నీ డబ్బుకోసం, నీ బహుమతులకోసం ప్రేమిస్తాను. డబ్బు తప్ప పురుషులకు మరొక విలువేమీ లేదు. వాళ్ళు డబ్బు తప్ప మరేమీ ఇవ్వలేరు. ఈవిషయం నాకు బాగా తెలుసు. ప్రేమంటే ఇంతే! కొంతకాలంపోతే నిన్నింతకంటె బాగా అర్థం చేసుకుని, అప్పుడు డబ్బు లేకుండానే ప్రేమించగలుగుతానేమో! ఈలోగా మాత్రం నన్ను అపార్థం చేసుకోకు. నాలాంటి జీవితం గడిపేవాళ్ళకు డబ్బు చాలా అవసరం."

ఫోమా ఈ మాటలు విన్నాడు. నవ్వుకున్నాడు. సూర్యుడస్తమిస్తున్నాడు. అడవిలో పచ్చికబయళ్ళకావల దూరంగా ఎక్కడో కనిపిస్తున్న సూర్యాస్తమయం అడవినంతా రాగరంజితం చేస్తోంది. నీటిపై చెదురుచెదురుగా బంగారు రంగులు వెదజల్లుతోంది. ఫోమా ఆ సూర్యకిరణాల విచిత్ర ఖేలన పరిశీలిస్తున్నాడు. శాషా అతనిభుజంమీద తలఉంచి అతని చెవిలో ఏవో రహస్యాలు ఊదుతోంది. ఒక రైతు దూరంగా కూచుని పాట వింటున్నాడు.

"ఏమిటలా చూస్తున్నావ్?" అన్నాడు ఊకిట్టేవ్ అతనివంక చూస్తూ.

"నేను అమ్మగారిపాట వింటానికివచ్చాను." అన్నాడు రైతు.

"బాగా పాడుతుందంటావా?"

"అదేం ప్రశ్నండీ? బాగా పాడకేం!"

"మంచిమాటన్నావు."

"అమ్మగారి రొమ్ముల్లో మహా దొడ్డశక్తి ఉంది" అన్నాడు రైతు.

ఆ మాటలలోని ద్వంద్వార్థానికి అంతా పగలబడి నవ్వుకున్నారు. ఇదంతా ప్రశాంతంగావింటూ కూచున్న శాషా రైతు నిలా అడిగింది.

"నీకు పాటలొచ్చా?"

"కొంచెం"

"ఏమేమి పాటలొచ్చా?"

"అన్నీ. నాకు పాటలంటే మహాఇష్టం"

"మనిద్దరంకలిసి పాడదాం వస్తావా?"

"అదెలాగండీ? నేను మీకు జోడు కలుస్తానా?"

"సరే, మొదలెట్టు."

"నేను కూచోవచ్చా."

"ఇలా రా. ఈ బల్లదగ్గర కూచో."

"మహా మజాగాఉంది సంభాషణ!" అన్నాడు వర్తకుని కుమారుడు.

నీకు విసుగ్గా ఉంటే వెళ్ళి ఆనదిలో మునుగు" అన్నది శాషా.

"నీళ్ళు చల్లగా ఉన్నాయి. మునిగితే చలిపుడుతుంది." అన్నాడు వర్తకుని కుమారుడు.

"నీఇష్టం" అన్నది శాషా.

"ఏమిసరసం? రష్యాలో వేశ్యల్లోకూడా నాజూకులేదు." అన్నాడు వర్తకుని కుమారుడు, ప్రక్కనున్న వ్యక్తితో. అతను కైపుతో చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు. శాషా అతన్ని అవమానించడం గమనిస్తూ నవ్వుతూ నిల్చున్నాడు ఫోమా. "భలేపనిచేశావు!" అన్నట్టుగా శాషావంక చూస్తున్నాడు.

రైతు వచ్చి ఆమె కాళ్ళదగ్గర కూచున్నాడు. శాషా అతనితో ఇలా చెప్పతోంది.

"నేను గొంతు తగ్గించినప్పుడు నీవు గొంతు హెచ్చించాలి. తెలిసిందా?"

"చిత్తం; కాని అమ్మగారూ! మనకు ధైర్యం కావాలంటే తమరు కొంచెం ఏదైనా ఇప్పించాలి."

"ఫోమా! అతనికొక గ్లాసు బ్రాందీ ఇవ్వు."

రైతు బ్రాందీగ్లాసు ఖాళీచేసి గొంతు సవరించుకుని "ఇహ పాడతాను." అన్నాడు.

"మొదలెట్టు."

రైతు కళ్ళెత్తి ఆమెవంకచూస్తూ ఉచ్చకంఠస్వరంతో ఇలా మొదలెట్టాడు.

" తిండి తిందామన్న గొంతులో దిగదాయె!
తాగుదామంటేను మనసైన పోదాయె!"

నరనరంలో కంపించిపోతూ, విషాదస్వరంతో ఆ స్త్రీ ఇలా అందుకుంది.

" మధురాతి మధురమగు మధువు సేవించినా
హృదయాన రవంత శాంతిలేదే నాకు !

ఆ రైతు ముందుకూ వెనక్కూ ఊగిసలాడుతూ

"నే వెళ్ళిపోయే రోజు దగ్గరికి వచ్చింది?"

అని పాడాడు. తరువాత ఆ స్త్రీ సుళ్ళు తిరిగిపోతూ

బంధుమిత్రులగూడ బాయవలసొచ్చింది!

అని పాడింది. మళ్ళీ రైతు వేదనతో

"దూరదేశాలకు వెళ్ళవలసొచ్చింది!"

అని పాడాడు.

రెండు కంఠస్వరాలు ఆ నిర్మలసంధ్యానిశ్శబ్దంలో తేలిపోయాయి. వాతావరణమంతా మరింత వెచ్చనైంది. కాయకష్టం, పరాభవం, వేచిఉన్న ఏదో దూరదేశానికి, తెలియని ఏదో అవ్యక్తశక్తి ఈడ్చుకొనిపోతున్న ఒక వ్యక్తి వేదనపట్ల — అక్కడి ప్రతివస్తువూ సానుభూతిపూర్వకమైన చిరునవ్వు నవ్వుతున్నట్టుగా ఉంది. స్వరాలు కాదు, పాటకాదు - మానవ హృదయంలోని బాధాశ్రువులే వాతావరణాన్నంతా చెమ్మగిలచేసినట్టుంది. కఠినజీవితంతో పోరాడిపోరాడి అలసిసొలసిన మనోశరీరాల వ్రణాల భీకరబాధలు, లేమియొక్క కఠినహస్తంలో పడి నలిగినమనిషిలో సెలవేసిన అగాధబాధలు_ఇవన్నీ ఆ పాటలోని అతిసామాన్యమైన పదజాలంలో నిక్షిప్తంగావించబడి, ఆ పదాలు విదూరశూన్యాకాశపథంలోకి ఎగరవేసినట్టుగా ఉంది. కాని ఆ ఆకాశం ఎవరికీ మారుపలకలేదు.

థోమా ఒక ప్రక్కగా నిల్చుని గాయకులవంక భయంతో చూస్తున్నాడు. పాట ఒక అలలావచ్చి అతని గుండెలో దూసుకునిపోయింది. అతని ముఖం వణికిపోతోంది. అతను శాషా నల్లనికళ్ళవంక చూస్తున్నాడు. అవి రానురాను పెద్దవైపోతున్నట్టు కనిపిస్తున్నాయి. అతనికి పాడింది ఇద్దరు వ్యక్తుల్లా కనిపించలేదు. తనచుట్టూ ప్రతివస్తువూ పాడుతూ, ఏడుస్తూ, రోదిస్తూ, ఎక్కడికో వెర్రిగా వెడుతున్నట్టు తోచింది. అఖిలజీవజగత్తూ ఒక బాధాలింగనంలో ఇమిడినట్టుగా తోచింది. తనూ ఆసంగీతంతో శృతి కలుపుతున్నట్టుగా – ప్రజతో, నదితో, దూరతీరంతో ఆ పాటలో లీనమైపోతున్నట్టు తోచింది. అంతా నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడడంలేదు.

"ఏయ్! ఇలారా!" థోమా, రైతును పిలిచాడు. "నీవు బాగాపాడతావు." అన్నాడు. "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"స్టెపాన్!" అని చెప్పాడు రైతు.

" స్టెపాన్! ఆ కలపబద్దీలతీగెలు కోసెయ్! " అన్నాడు థోమా.

"మరి, వాళ్ళో?" అన్నాడు రైతు.

"కోసెయ్! నా మాట విను." అన్నాడు థోమా.

"వాళ్ళు మునిగిపోతారు."

"నీవొక పడవతీసుకొచ్చి వాళ్ళను తీసుకెళ్ళొచ్చులే." థోమాకు పెద్ద కేకవెయ్యాలనిపించింది. కాని నిగ్రహించుకున్నాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం. తరువాత ఒక పెద్దకేక వినిపించింది. 'సహాయం! సహాయం!" అని.

"మనుష్యుల్ని ముంచేస్తున్నారు!" అని అరిచాడు పెద్ద మనిషి.

"మీరు మనుషులా?" అన్నాడు ఫోమా.

అరుపులు, కేకలు పిక్కటిల్లాయి. ఫోమా నది నీటివంక చూస్తున్నాడు కలప బద్దీలు కంపిస్తున్నాయి. వాళ్ళు మునిగి పోతున్నారు. ఎవరో నీళ్ళలో కొట్టుకుంటూ తనవైపుకు వస్తున్నట్టు తోచింది ఫోమాకు. ఫోమా వంగి ఆ వ్యక్తి మెడపట్టుకున్నాడు. నల్లనికళ్ళు కనిపించాయి. అది శాషా. అతని హృదయం ఆనందంతో పొంగిపోతింది. అత నామెను పైకి లాగి హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు.

"నాకు చలివేస్తోంది." అన్నది శాషా, లాలింపుగా నవ్వుతూ. "నన్ను ముంచదలచుకున్నావా? అప్పుడేనా? ఇంకా కొన్నిరోజులు ఆగు!"

"సుద్దగొట్టిన రాయిలా మొద్దల్లే కనిపిస్తావు కాని, భలే పన్నాగం ఆలోచించావే?" అన్నది.

"ఇంకా వాళ్ళు అరుస్తూనేఉన్నారు."అన్నాడు ఫోమా.

"చస్తే చచ్చారులే." అన్నది శాషా. "వాళ్ళు మునిగి చస్తే మనల్ని సైబీరియా పంపుతారు."

వాళ్ళు త్వర త్వరగా వెడుతున్నారు. దూరంగా నదిలో ఒక చిన్నదీవిలా కనిపిస్తోంది. ఆదీవిలో నల్లటిమానవరూపాలు.

రాత్రి వారిపై దిగుతోంది.

---

# తొమ్మిదో అధ్యాయం

ఒక ఆదివారంనాటి మధ్యాహ్నం.

మయకిన్ తోటలో కూచుని టీ తాగుతూ కుమార్తెతో మాట్లాడుతున్నాడు.

"ఫోమా ఇలా అవుతాడనుకోలేదు. నాకొడుకే అవుతే వాడిలా పాడైపోతూంటే చూస్తూ ఊరుకునేవాణ్ణికాదు. సమర్థుణ్ణి చేసేవాణ్ణి." అంటున్నాడు మయకిన్.

లూబా నిమ్మకొమ్మతో ఆడుకుంటూ తండ్రిమాటలు వింటూ ఉంది. పూర్వం తండ్రికి దూరంగా ఉంటూవచ్చేది. ఇప్పుడిప్పుడు ఆయన్ను అర్థంచేసుకుంటోంది. ఆయన ఒంటరి తనానికి జాలి కనపడుతోంది.

"ఫోమాఆగడాన్ని న్యూస్ పేపర్లలోకూడా వ్రాశారు. ఇగ్నాట్ బ్రతికి ఉంటే ఏమయ్యేవాడో!" అన్నాడు మయకిన్.

"తగినపని చేశారు." అన్నది లూబా.

"ఎవరు వ్రాసిఉంటారంటావు?"

"నీ కెందుకు నాన్నా?"

"కాదమ్మాయ్. చెప్పు"

"చెబితే అతన్ని ఏమీ చెయ్యవుకదా?"

"చెయ్యనులే. చెప్పు"

"చిన్నప్పుడు మనింటికి వస్తూఉండేవాడు చూచావ్ నాన్నా – ఒక కుర్రాడు–"

"ఎవరమ్మాయ్?"

"యెజోవ్."

"వాడా? ఎంతవాడయ్యాడు?"

చాలాసేపటివరకూ వృద్ధుడు మౌనంగా కూచున్నాడు.

"మనిషికి స్వేచ్ఛ ఇవ్వబడింది. ఆలోచించి పని చెయ్యడానికి కాని, అనాలోచితంగా ఏ పనంటే అది చెయ్యడానికి కాదమ్మా?" అన్నాడు.

వలలో చేపచిక్కుకున్నట్టుగా వృద్ధుని పలుకుల వలలో చిక్కుకున్నది లూబా. ఏంచెప్పాలో తోచక ఏం మాట్లాడాలో తోచక అతనివంక తేరిపారచూస్తున్నది. కాసేపాగి,

"నాన్నా, టరస్‌ను గురించి నీఉద్దేశం ఏమిటి?" అన్నది.

"వాడిసంగతి జ్ఞాపకం చెయ్యకు. వాడూ ఇంతేనమ్మా". అన్నాడు మయకిన్.

"ఎవరో వస్తున్నట్టున్నారు!"

లూబా తిరిగి చూచింది. కెప్టెన్ ఎర్‌మాక్ వస్తున్నాడు. అతను రాగానే భయంతో దూరంగా నిలబడ్డాడు.

"ఎక్కడినించి వస్తున్నావు? ఏంజరిగింది?" అని ప్రశ్నించాడు మయకిన్.

"ఆ స్టీమర్..."

"ఏం జరిగింది?"

"9 వ నంబరు పడవ పగిలిపోయింది. కొందరికి బాగా గాయాలు తగిలాయి.

"నీవేం చేస్తున్నావు?"

"నేను కాదయ్యా"

"మరెవరు?"

"యజమానే ఈపని చేశాడు"

"నీవు ?"

"నన్ను కట్టిపడేశాడు"

"ఊఁ"

"అతనితోపాటు మరో స్త్రీకూడా వుంది."

"ఏమిటీ?"

"అవునయ్యా, బాగా పాడుతుందికూడా,"

"దానిసంగ తెవరడిగారు? అతని సంగతి చెప్పు."

"ఉద్రేకపడకు నాన్నా! ఇంతకూ అంత నష్టం కాలేదేమో." అన్నది లూబా.

"అదేమిటమ్మాయ్. పడవ కాదు పోయింది, మనిషి! మనిషి! వాడు నాకెంత అవసరమో మీకు తెలీదు." అని అక్కడినించి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు వృద్ధుడు.

ఈ సమయంలో ఫోమా పదిమైళ్ళ దూరంలో ఒక గుడిసెలో పడుకుని ఉన్నాడు. పడుకున్నది గడ్డిమీద. కిటికీలో నుంచి మేఘాలవంక చూస్తున్నాడు.

మేఘాలు పరుగెత్తుతూ వెడుతున్నాయి. ఒకమాటు కలుసుకుంటున్నాయి. ఒకమాటు చెదిరిపోతున్నాయి. ఫోమా మేఘాలవంక చూస్తున్నాడు. ఆ మేఘాలుకూడా తనలాగానే సబ్బంగానూ దుర్బలంగానూ కనుపిస్తున్నాయి. ఒకమాటు గత కొద్ది నెలల్లో జరిగిన విషయాలన్నీ జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. అతనికి ఒక పెద్ద ప్రవాహంలో కొట్టుకొనిపోతున్నట్టు తోచింది. అతని వెంటనే ఎందరో వస్తున్నారు. మంచివాళ్ళు చెడ్డ వాళ్ళు, వికృతాకారులు ఎందరో ఆ ప్రవాహంలో పడి తనవెంటే వస్తున్నారు. ఎవరో ఒక స్త్రీ వికృతగీతం పాడుతోంది. బ్రతికి

నన్నాళ్ళూ బ్రతికి చనిపోదామంటోంది. థోమాకు వీళ్ళంతా తనలాగా నే పశువుల్లాగా కనుపించారు. వీళ్ళూ అరుస్తూ కేక లేస్తూప డుతూ లేస్తూ ఆ ప్రవాహంలోపడికొట్టుకునిపోతున్నారు. వీళ్ళందరిమధ్యా ఒక్క శాషామాత్రమే నిర్మలంగా నిశ్చలంగా కనుపిస్తోంది. ఈ కల్లోలానికంతా అతీతంగా కనిపిస్తోంది. ఆమె తరహాలోమాత్రం ఎలాటి మార్పూ కనుపించడంలేదు.

ఒకరోజున థోమా, "మనం ఎంతడబ్బు తగలేశాం?" అన్నాడు.

"నిలవచేసిమాత్రం చేసేదేముంది?" అన్న దామె.

"నీవెవరు?" అన్నాడు థోమా.

"నాపేరు తెలీదా?"

"తెలుసు. పుట్టుపూర్వోత్తరా లడుగుతున్నాను."

"యారొస్లవల్ లో ఊక్లిచ్ లోపుట్టాను. అంతా భూమి మీద పుట్టినవాళ్ళమే." అన్నది.

ఒకోకమాటు "నే నెందుకు ఇలా అయిపోతున్నాను" అని చింతించసాగాడు థోమా.

ఈప్రశ్న అతనికి ఆశ్చర్యంకలిగించేది. అతనిమోచెయ్యి శాషాకు తగిలింది.

"జాగ్రత్త!" అన్నది.

"సరే. నీవు అనుకున్నంత మంచిదానివి కాదు."

"ఏం వచ్చింది?"

"ఏం లేదు"

శాషా తలతిప్పి బద్ధకంగా ఆవులించింది.

"నాకో కలవచ్చింది. మళ్ళీ పాటగత్తెనయ్యానట. ఒక పాట పాడుతున్నానట. నాముందు ఒక కుక్క నిలుచునిఉంది. నేనెప్పుడు పాట ఆపుతానాఅని చూస్తోంది. నేను పాట ఆపితే నన్ను మింగేస్తుంది. ఈలోగా నాగొంతు పడిపోతోందట. అబ్బ! కుక్క పళ్ళుకొరుకుతోందట. ఏమిటో ఈ కల!"అన్నది.

"సరే. ఈ పిచ్చివాగుడు చాలించు. నన్నుగురించి నీవేం అనుకుంటున్నావు?" అన్నాడు థోమా.

నీ విప్పుడే నిద్రలేచావు."

"నిద్రలేచాను; అవునులే. నన్నుగురించి నీ ఉద్దేశం ఏమిటో చెప్పు."

"ఎందుకూ పనికిమాలిన తాగుబోతువి."

"సరేకాని, నిజం చెప్పు."

"నేనేం అనుకోడంలేదు."

"అంటే?"

"ఏ మనిషికీ 'నీవు ఫలానా' అని చెప్పవేం. మాలాంటి స్త్రీలను అలాటి ప్రశ్నలు అడగకూడదు. నన్నుగురించి తెలుసుకునే తీరికే నాకులేదు. ఇహ ఇతరులనుగురించి ఏం చెప్పను?"

"నాకు ఇలాఉంటేనే బావుంది. ఏకోరికలూ లేకుండా."

"అబ్బాయ్! అతిగా ఆలోచించకు. ఆలోచించి లాభం లేదు. లేనిపోనివి కల్పించుకోకు. నిన్నుగురించి నేనేమీ చెప్పలేను. మనిషినిగురించి నిజం చెప్పడంకష్టం. ఎవరికి తెలుస్తుంది? తననుగురించి తనకే తెలీదు. అయినా నీవు ఇతరులకంటె కాస్త నయం."

"ఎలా?"

"మంచిపాట వింటే నీకళ్ళు చెమర్చుతాయి. ఏడుస్తావు. మంచివాడివి. కాని సాహసికుడివికూడా."

"నీవు సరిగా ఉన్నదిఉన్నట్లు చెప్పడంలేదు."

"సరే. నాకు తెలీదనుకో. ఇహా ఎక్కడికి వెడదామంటావ్?"

"నీవే చెప్పు."

"నిజ్నికి కాని కజన్‌కు కాని వెడదామా?"

"ఎందుకు?"

"ఎందుకేమిటి? తాగి కులాసా చెయ్యడానికి."

"ఇహాముందు తాగను"

"అన్నీ అబద్ధాలు"

"చూద్దువుగానిగా!"

"చూస్తాలే."

"తాగడం మంచిదంటావా?"

"మంచి విషయం ఒకటి చెప్పు"

"అబ్బ! ఏం మాటలు?"

"అదుగో! అన్నీ నాడవలే!"

శాషా నవ్వింది.

"అబ్బ! ఏమిటో ఈ జనం! చెట్లలా బ్రతికి కూలిపోతున్నారు. ఎందుకో ఈ బ్రతుకులు. నీవు ఎక్కడికి వెడుతున్నట్లు?" అన్నాడు ఫోమా.

"ఇహా చాలించు. నా సంగతి నీకెందుకు. నాదగ్గరనుంచి ఏం కావాలన్నా తీసుకో. కాని ఆత్మలో అడుగుపెట్టావంటే మాత్రం ఊరుకోను"

"ఆత్మ! ఆత్మ! నీకు ఆత్మంటూ ఉందా ?"

ఆమె మాట్లాడకుండా కూచుంది.

"ఎందుకలా మాట్లాడుతావు" అన్నది.

"అంతే !"

"జాగ్రత్త !"

ఆమె దుస్తులు వేసుకుంటోంది. దుస్తులు వేసుకుంటూ "నాఆత్మనుగురించి మాట్లాడే హక్కు నీకు లేదు. మీకంతాఆత్మ ఉండిచచ్చినట్టు ! మిమ్మల్ని నిప్పుల్లో మలమల మాడ్చినా పాపంలేదు. కాని నాకోపం వెలిబుచ్చను. ఆ కోపం వెలిబుచ్చితే ఇహ నాకు మిగిలేదేమీఉండదు." అన్నది శాషా.

గాలి విపరీతంగా వీస్తోంది. నది వరదలుకట్టి పారుతూ ఉంది. పడవను లేపుతున్న పనివాళ్ళ కేకలు వినవస్తున్నాయి. ఫోమా తెరచాపగడకు ఆనుకుని నిల్చుని ఆపనివాళ్ళను చూస్తున్నాడు. ఒకరుకాదు, ఇద్దరు కాదు, వేలమంది ప్రవాహంలా పనిచేస్తున్నారు. ఫోమాకు వాళ్ళలో తనూ కలిసిపోదామని పించింది. ఒకమూల నిశ్చలంగానిల్చోడం సిగ్గుచేటుగాతోచింది. ఒక కుర్రాడు పనిమీద పరుగెత్తుతూ పోతున్నాడు. 'ఇతనికెంత హాయి ఉంది?', అనుకున్నాడు ఫోమా.

"నా స్థానమెక్కడ? నా పనేమిటి? నేనేం కుంటివాడినా? గుడ్డివాడినా?" అని తలపోయసాగాడు ఫోమా. ఇహ అతను పట్టలేకపోయాడు. తనకూ ఆ శ్రామిక జనవాహినిలో కలిసిపోదామనిపించింది. అతని హృదయంలో ఏదో భీకరమైనశక్తి ప్రవేశించింది. తనూ అరుస్తూ వెళ్ళి పనిలో దూకాడు. లీవర్

తిప్పుతున్నాడు. అతని నరాలు కంపిస్తున్నాయి. రక్తం ఉడుకు తోంది. కళ్ళు తిరుగుతున్నాయి. ఒకకైపు, ఒక ఆకలి అతన్ని ముంచెత్తింది.

ఏదో అతని ఎదురొమ్ముకు తగిలింది. అతను వెనక్కు తూలాడు.

"పడవలేచింది" అన్నాడు కంట్రాక్టరు.

ఫోమా ముఖాన్ని చల్లనిగాలి తాకింది. ఫోమా మళ్ళీ గుడిసె చేరేసరికి బాగా అలిసిపోయాడు. "అబ్బ విసుకెత్తింది." అన్నాడు. ఈ కాస్తపడవ ఎత్తడానికేనా ఇంత శ్రమపడింది అనిపించింది ఫోమాకు.

" అబ్బ! విసుకెత్తుతోంది. ఈ విసుగు పోయేమార్గం చెప్పు." అన్నాడు ఫోమా.

"ఎందుకు విసుకు?" అన్నది శాషా.

"ఏమో!"

"విసుకంటే నీకేదో అసంతృప్తి ఉందన్నమాట."

"ఏమో ఎలా తెలుస్తుంది."

అయినా, వెదకిచూచుకో?"

"ఆలోచించలేను."

"అబ్బాయ్! నీబుర్ర మట్టిబుర్ర!"

"ఒక్కొక్కసారి ఆలోచిస్తాను. కాని ఏమీ లాభం కనుపించదు. అంతా శూన్యం ?" శాషా ఏదో ఆలాపనచేస్తోంది.

"నాకు తాగుడంటే అసహ్యంగాఉంది. ఎప్పుడూ ఒకే మనుష్యులు, ఒకే విలాసాలు, ఒకే తాగుడు—రోతవేస్తోంది!" అన్నాడు ఫోమా.

శాషా ఫోమావంకచూచి నవ్వింది.

"నాకు కావలసినంత డబ్బుంది. అన్నీ ఉన్నాయి. అయినవాళ్ళూ ఉన్నారు. అయినా శాంతిలేదు." అన్నాడు ఫోమా.

"నీవు పెళ్ళిచేసుకోడం మంచిది.," అన్నది శాషా.

"ఎందుకు?"

"మెడ కో బండకొయ్య ఉండాలి!"

"సరేకాని—ఇప్పుడు నీతో ఉంటున్నాను. మీరంతా ఒకేరకం."

తరువాత ఫోమా కాసేపు మెల్లగా ఊరుకున్నాడు.

"నేను నిన్ను విడిచి వెడుతున్నాను తెలుసా?" అన్నది శాషా.

"ఎక్కడికి వెడతావ్?" అన్నాడు ఫోమా.

"ఎక్కడికో! అయినా వెళ్ళడంమాత్రం నిజం."

"ఎందుకు వెళ్ళడం?"

"నీవు ఎప్పుడూ అనవసరప్రసంగంచేస్తుంటావు. ఒంటిగా ఉంటుంది నీతో."

"నిజంగానా?"

"ఊఁ"

"నేనూ వెడతాను."

"నీది చలచిత్తం. నీలాంటివాళ్ళూ నాలాంటివాళ్ళూ ఇలాగే అవుతారు." కాసేపు ఇద్దరూ మాట్లాడకుండా ఊరుకున్నారు.

"అయితే నిజంగా వెడతావా?" అన్నాడు ఫోమా.

"వెడతాను. నీవూ నాతో రా. కులాసాగా కాలం గడుపుదాం" అన్నది శాషా.

మరుసటిరోజు ఉదయం శాషా ఫోమా ఉస్టెయిరేవులో ఉన్నారు. తీరంలో గుమిగూడిన జన సమూహంలో మయకిన్ గుర్తించాడు ఫోమా.

"ఎవరో నన్ను కనిపెడుతున్నారు" అన్నాడు ఫోమా.

"ఆహా! ఏం ధైర్యం!" అన్నది శాషా. "అబ్బాయి గారికి చీవాట్లు తగులుతాయిలే."

తీరంలో దిగగానే, "ఎక్కడికోయ్ ప్రయాణం?" అంటూఫోమాను మయకిన్ పలకరించాడు.

"నా పనులమీద వెడుతున్నాను"— అన్నాడు ఫోమా.

"మంచివాడివిలే! ఆ అమ్మాయి ఎవరు!"

"నా సఖురాలు."

"నీతో మాట్లాడాలి."

"సరే."అని శాషావైపు తిరిగి, "శాషా నీవు ఊళ్ళోకి వెళ్ళి హోటల్లో గదితీసుకో. నేను తరువాత వస్తాను."అన్నాడు ఫోమా. తరువాత ఫోమా మయకిన్ హోటల్ కుబయలు దేరారు. దోవలో ఇద్దరూ మాట్లాడుకోలేదు. హోటల్లోకి వెళ్ళగానే మయకిన్ క్వాస్ పానీయం తెప్పించాడు. ఇరువురూ కూచున్నారు.

"నాకు బ్రాందీకావాలి." అన్నాడు ఫోమా.

"పేకముక్కలు సరిగా కలవనప్పుడు మొదటే తురుపు కొట్టడం మంచిది." అన్నాడు మయకిన్.

"నా ఆట మీకు తెలీదు."

"నేను చూచిన ఆటల్లో అంతే."

వెయిటర్ పానీయాలు తెచ్చాడు. ఫోమా తాగుతూ:
"తండ్రీ! మిమ్మల్ని ఒక విషయం సూటిగా అడుగుతున్నాను. నా ఆస్తి, నా వ్యాపారం అంతా మీరు తీసుకోండి. నాకు స్వాతంత్ర్యం ఇవ్వండి. నాదోవన నన్ను పోనీండి." అన్నాడు ఫోమా.

ఇలా అడుగుతాడని ఫోమాకే తెలీదు.

"మిమ్మల్ని అర్థిస్తున్నాను. నాదోవన నన్ను పోనీండి. నన్ను హాయిగా బ్రతకనివ్వండి." అన్నాడు.

"బ్రాందీ బాగా పనిచేసిందే. ఇదేం వెర్రి? దోవతప్పి మాట్లాడుతున్నావబ్బాయ్!" అన్నాడు మయకిన్.

"కాదు. మీకు తెలీదు. ఆస్తులు వదలి సుఖం శాంతి పొందిన మహాత్ములున్నారు."

"నా రోజుల్లో నేను ఎవరినీ అలాటివారిని చూడలేదు."

"తండ్రి! నా మాట వినండి"

"అబ్బాయ్! ఈ వెర్రి వదులు. లోకంలో ప్రతి మనిషీ తన పని చెయ్యాలి."

"ఏమో!"

మయకిన్ పలుకులు మొదటినుంచి ఫోమాకు అలవాటైనవే. కాని అతని హృదయం స్వాతంత్ర్యంకోసం అర్రులు చాచుతోంది.

"నీ సాహసం కేవలం అవివేకం." అన్నాడు మయకిన్.

ఫోమా కుర్చీమీదనుంచి లేచాడు.

"ఇక వెడతాను. నా దోవన నన్ను పోనీండి" అన్నాడు.

"వెళ్ళు, కాని నిన్ను వదలను" అన్నాడు మయకిన్.

"చూదాం"

ఫోమా వెళ్ళాడు. మయకిన్ ఒంటిగా మిగిలిపోయాడు. వెయిటర్‌ను పిలిచి: "దీనికంతా నే నెంత ఇచ్చుకోవాలి ?" అన్నాడు.

# పదో అధ్యాయం

ఫోమా పూర్తిగా మారిపోయాడు. మయకిన్‌తో తగువు పడకపూర్వం, బుద్ధిపూర్వకంగా కాకుండా ఊరికనే తాగేవాడు బ్రతుకుమీద విసుగుపుట్టి తాగేవాడు. కాని, ఇప్పుడు పగతో తాగుతున్నాడు. పూర్తిగా నిరాశ చెంది పగతో తాగుతూ భ్రష్ట జీవితాన్ని గడుపుతున్నాడు. మనుష్యులమీద పగ, ఆ పగవల్ల పుట్టిన అహంభావం – వీటితో కన్నూ మిన్నూ కానక సంచరిస్తున్నాడు. ఒక్కోమాటు తనమీద తనకే పగ. తనమీద తనకే అసహ్యం. అందుకు ఆశ్చర్యపడేవాడు కూడా. తనచుట్టూ పోగయ్యే జనంకూడా తనలాగానే వ్యర్థులుగాను దుర్బలులుగాను కనిపించారు. కాని, వాళ్ళకూ తనకూ ఒకటే వ్యత్యాసముంది. ఈ విషయం తనకు తెలుసు, వాళ్ళకు తెలీదు. లేక తమ అంధ జీవితాలకు అది అడ్డు తగులుతుందేమో అని వాళ్ళు తెలిసినా తెలీనట్టు ఉంటున్నారేమో. వాళ్ళలో ఒక దృఢత్వం కాని, ఒక పట్టుదలకాని అతనికి కనిపించడంలేదు. తాగని సమయాల్లో అసహ్యంగాను, అవివేకంగాను కనిపిస్తున్నారు. తాగిన సమయాల్లో అంతకంటె అసహ్యంగా కనిపిస్తున్నారు. అతనికి

ప్రేమించదగినవారు, గౌరవించతగినవారు ఒక్కరూ కని పించడంలేదు. వాళ్ళపేర్లు కూడా అతనికి తెలీదు. ఎవరిని ఎక్కడ చూచాడో, ఎక్కడ కలుసుకున్నాడో కూడా అతనికి జ్ఞాపకంలేదు. ఒక విధమైన అసహ్యంతో వాళ్ళకు కోపం తెప్పించేవిధంగా ప్రవర్తించేవాడు. రాత్రింబగళ్ళు రకరకాల విలాసమందిరాల్లో కాలక్షేపంచేసేవాడు. అతను వెళ్ళే ఆయా ప్రదేశాల తరగతులపైనే అతని పరిచయాలు కూడా ఆధారపడి ఉండేవి. పెద్ద పెద్ద హోటళ్ళకు వెళ్ళినప్పుడు జూదగాళ్ళు, నటులు, విటులు, గాయకులు, మడిమాన్యాలు పూర్తిగా నశించి పోయి భ్రష్టజీవితానికి అలవడిన అభాగ్యులు అతనిచుట్టూ పోగయ్యేవారు. మొదట్లో అతన్ని వాళ్ళు అదోలా చూచారు. తమ అభిరుచులనుగురించి, నాజూకులనుగురించి గొప్పలు చెప్పు కున్నారు, కాని తరువాత పెంపుడుకుక్కల్లా అతనిచుట్టూ తిరగసాగారు. అతనిదగ్గర డబ్బు తీసుకునేవారు. అతను లెకలే లేకుండా డబ్బు బ్యాంకులనుండి తెచ్చి, ప్రాంశరీనోట్లు వ్రాసిచ్చి తెచ్చి, డబ్బు విరజిమ్మేవాడు. చౌకబారు సారా కొట్లకు, హోటళ్ళకు వెళ్ళినప్పుడు—మంగళ్ళు, గుమాస్తాలు, చిన్నచిన్న ఉద్యోగస్థులు అతనిచుట్టూ రాబందుల్లా మూగే వారు. వీళ్ళమధ్య అతనికి ఎంతో హాయి అనిపించేది. వీళ్ళు ఎంతో పరిశుద్ధంగాను, పరిశుభ్రంగాను కనిపించేవారు. 'పరి శుభ్ర' సమాజం అనుకోబడే ఆ పెద్దమనుష్యులంత వికృతంగా ఉండేవారు కారు వీళ్ళు. అంత భ్రష్టులూ కారు. అంతకంటె తెలివికలవాళ్లుకూడా. వీళ్ళను బాగా అర్థంచేసుకోగలిగాడు థోమా. అతనిలో ఒక్కోసారి తీవ్రోద్రేకాలను మేలుకొలిపి

వారు వీళ్ళు. వీళ్ళలో గాఢమైన ఎక్కువ మానవత్వం కనిపించేది. కాని ఆ పెద్దమనుష్యుల్లాగానే వీళ్ళుకూడా డబ్బంటే పడిచచ్చేవారు. అతన్ని మసిపూసి మారేడుకాయచేదామని వీళ్ళూ యత్నించేవారు. ఈ విషయం చూచి అతను వాళ్ళ ముఖాన్నే నవ్వేవాడు. గేలిచేసేవాడు. మనుష్యులు కనపడితే చాలు, వారితో కలహం పెట్టుకునేవాడు.

ఇక స్త్రీలుకూడా లేకపోలేదు. ఘోమా తన ఇష్టం వచ్చినట్టు డబ్బు విరజిమ్మి స్త్రీలను కొనేవాడు. కొందర్ని చౌకగా కొనేవాడు. మరికొందర్ని ఎక్కువధరకు కొనేవాడు. అందకత్తెలకూ అందంలేనివాళ్ళకూ అందరికీ ఇష్టంవచ్చినట్టు డబ్బు విసిరేవాడు. వాళ్ళనుచూచి నవ్వేవాడు. అసహ్యంగాను అవమానకరంగాను మాట్లాడేవాడు. కాని తాగిఉన్నప్పటికీ వాళ్ళ ముందు అతనికి సిగ్గు పోయేదికాదు. వాళ్ళందరూ అతని కళ్ళకు అనాథులైన పసిపిల్లలమాదిరి అగుపించేవారు. ప్రతి స్త్రీ కంటెకూడా తనకు ఎంతో బలమున్నట్టు, ప్రతిస్త్రీకూడా తన కంటె ఎంతో హీనంగాఉన్నట్టు అతనికి కనిపించేది. కాని గర్వపోతులంటే అతనికి కోపంవచ్చేది. కోపంవచ్చినప్పుడు వాళ్ళను తిట్టేవాడుకాని, అతనెన్నడూ ఆడవాళ్ళమీద చెయ్యి చేసుకోలేదు. ఒకనాటి సాయంత్రం ఒక హోటల్లో తాగుతున్నప్పుడు ఇలాటి స్త్రీ ఒకతె అతన్ని చెంపమీద కొట్టింది. ఆమె బాగా తాగిఉంది. అతను సగం తాగిఉన్నాడు. అప్పుడతను కోపంతో లేచి వణికిపోతూ "నీవీ పనిచేసినందుకు నీతల పగులగొట్టి ఉండేవాణ్ణి. కాని ఎప్పుడూ స్త్రీమీద చెయ్యిచేసుకోను. వెళ్ళు. వ్యభిచారిణి! దీన్నిక్కడనుంచి లాక్కుపోండి." అని అరిచాడు

కాజాన్ వచ్చిన కొద్దిరోజులకు శాషా ఒక నోడ్కా కాపుదారు కొడుక్కు ఉంపుడుకత్తె అయింది. అతనుకూడా ఫోమాతో కలిసి జల్సాచేస్తూనేఉన్నాడు. కామానదీతీరంలో ఉన్న ఏదో ఒక కొత్తస్థలానికి తన కొత్తయజమానితో కలిసి వెడుతూ శాషా, ఫోమాతో ఇలా అన్నది.

"వస్తాను అబ్బాయ్! మళ్ళీ బహుశా కలుసుకుంటాం-మనిద్దరం ఒకేబాటలో వెడుతున్నాము కాబట్టి. కాని నీ మనస్సును ఎలాపడితేఅలా పోనివ్వకు. వెనక్కు తిరిగి చూచుకోకుండా అనుభవించు. అంబలి తాగినతరువాత కుండపగులగొట్టు. సెలవు."

అలాఅని ఒక్కమాటు అతని పెదవులపై గట్టిగా ముద్దెట్టుకుంది. ఆమెకళ్ళు మరింత నల్లనయ్యాయి. ఆమె వెడుతున్నందుకు ఫోమాకు సంతోషంగానేఉంది. ఆమెతో విసుగెత్తిపోయాడుకూడా. కాని అతనిలో ఏదో బాధకలిగి ఆమెనుంచి కళ్ళు తిప్పుకుని మెల్లగా

"మీ ఇద్దరికీ పొత్తు కుదురుతుందో లేదో! ఎప్పుడు సరిగాలేకపోతే అప్పుడు మళ్ళీ నాదగ్గరికి రా." అన్నాడు.

"మంచిది." అన్నదామె. తరువాత ఎందుకోకాని, ఆమె పగలబడి నవ్వింది. ఆమె ఇలా నవ్వడం ఫోమా ఎన్నడూ చూడలేదు.

ఫోమా రోజులతరబడి ఇలా జీవిస్తున్నాడు. బ్రతికిన బ్రతుకే బ్రతుకుతున్నాడు. వెళ్ళినచోటికే వెడుతున్నాడు. చూచినజనాన్నే చూస్తున్నాడు. ఎవ్వరూ అతనిలో ఇసుమంతైనా ఉదారభావాలు కలిగించడంలేదు. పైగా తనే వాళ్ళ

కంటె అధికుడననుకోసాగాడు. ఈ జీవితంనుంచి విముక్తి పొందే అవకాశం అతని మనస్సులో దృఢంగా నాటుకోసాగింది. విముక్తికోసం ఆ కాంక్ష మరింత ఎక్కువైంది. ఈ కల్లోలానికి దూరమైన జీవనాంచలాలకు వెడుతున్నట్టు ఊహించుకోసాగాడు. ఎన్నో రాత్రులు ఒంటిగాఉండి గట్టిగా కళ్ళుమూసుకున్నప్పుడు అతనికొక చిత్రం కనిపించేది. లక్షలమంది జనం నల్లటి చీకటి ముద్దలా పోగయిఉన్నారు. ఎక్కడో ఒక పెద్ద లోయ. చుట్టూ కొండలు. లోయనిండా మంచు. ఈ జనసమూహమంతా ఆ లోయలో క్రిక్కిరిసి ఉంది. చాటలో బియ్యపుగింజలా కనిపిస్తోంది. ఈ జనసమూహపు కాళ్ళక్రింద భూగర్భంలో దాగి అదృశ్యమై ఒక పెద్ద తిరగలి ఉన్నట్టూ, ఆ తిరగలి వీళ్ళను విసురుతూ ఉన్నట్టూ, వీళ్ళు గిజగిల కొట్టుకుంటూ ఉన్నట్టూ, కనిపించసాగింది. కొందరు జనం అప్పుడే పట్టి బుట్టల్లో వేసిన ఎండ్రకాయల్లా ఉన్నారు. ఒకరికొకరు చుట్టుకుంటున్నారు. కరుచుకుంటున్నారు. ప్రాకుతున్నారు. కాని ఎవరూ ఈ బంధం నుండి విముక్తులు కాజాలకపోతున్నారు.

ఈ జనసమూహంలో థోమాకు పరిచితవదనాలుకూడా కనిపించాయి. అదుగో! థోమా తండ్రి రొమ్ము విరిచి అందరినీ తోసుకుంటూపోతున్నాడు. పోయిపోయి ఎక్కడో దూరాన జనసమూహపుకాళ్ళక్రింద అదృశ్యమైపోతున్నాడు. అదుగో, మయకిన్! పాములాగా కాళ్ళక్రిందినుంచి సందుచేసుకుని పోతున్నాడు అదిగో, లూబా! ఏడుస్తూ బాధపడుతూ తండ్రి వెంట వెడుతోంది. మధ్యమధ్యలో వెనకపడిపోతోంది. అందరికీ దూరంగా తొలగి ఇతర్లకు దోవచేస్తూ, మెల్లగా నడుస్తూ

వెడుతోంది అన్‌ఫీసా అత్త. కొవ్వొత్తిదీపపు కొసల ఆమె రూపం ఆ చీకట్లో వణుకుతూ కనిపిస్తోంది. అది ఆరిపోతుంది. చీకట్లో కలిసిపోతుంది. పెలాగెయా, సూటిగా ఉన్న రోడ్డు మీద త్వరత్వరగా ఎక్కడికో వెడుతోంది. అదిగో, సోఫియా పావ్‌లోవ్‌నా మెడిన్‌స్కాయా! తను చావిట్లో వదలివచ్చినప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది. ఆమె కళ్ళు పెద్దవిగా ఉన్నాయి. కాని ఆ కళ్ళలో ఏదో పెద్దభయం కనిపిస్తోంది. శాషాకూడా ఇక్కడే ఉంది. ఎవరినీ లెక్కచేయకుండా తన పాటలు పాడుకుంటూ జీవనకుహరాల్లోకి చొచ్చుకొని పోతోంది. నవ్వులు, అరుపులు, కేకలు, పాటలు, ఏడ్పులు;— ఈ లోయలో గుమికూడిన మానవ శరీరాల కుప్పపై వ్రేలాడుతున్నాయి. పడుతున్నారు జనం! లేస్తున్నారు జనం! ప్రాకుతున్నారు జనం! ఒకరినొకరు తొక్కుకుంటున్నారు. ఒకరి బుజాలమీద ఒకరు ఎక్కుతున్నారు. అంధుల్లా వెడుతున్నారు! చివరకు అదృశ్యులైపోతున్నారు. డబ్బు, గబ్బిలాల్లాగా వీళ్ళ తలలమీద ఎగురుతోంది. ఆ డబ్బును అందుకోడానికి జనం చేతులు చాచారు. గలగల మోగుతుంది డబ్బు. సీసాలు పగులుతాయి; కార్కులు బుస్సని ఉబుకుతాయి. ఎవరో వెక్కివెక్కి ఏడుస్తారు ఒక స్త్రీ కంఠస్వరం విషాదంగా ఇలా పాడుతుంది.

"బ్రతికినన్నాళ్ళూ బ్రతకవోయ్!
ఆ తరువాత ఏ మగునో. ఎవరికి తెలుసునోయ్!
భూమిపై పచ్చిక కూడా మొలవదేమోనోయ్!"

ఈ భీకరచిత్రం ఘోమా మనోఫలకంలో స్థిరంగా ముద్రిత మైపోయింది. నానాటికీ స్పష్టమవుతూ వచ్చింది. అతనిగుండెల్లో ఒకవిధమైన పెద్ద కల్లోలం బయలుదేరింది. ఒక అవ్యక్తస్థితి, అస్పష్టమైన ఒకానొక సంక్షుభిత భావన అతనికి కలిగింది. భయము, తిరుగుబాటు, కోపము, జుగుప్స, పగ, పట్టుదల — ఇవన్నీ వాహినుల్లావచ్చి నదీగర్భంలో కలిసినట్టు అతనిలో కలిశాయి. ఇవన్నీ అతని హృదయంలో సలసలకాగి బుడగల్లా లేచి ఒక తీవ్రమైన బలీయమైన వాంఛను రేకెత్తించాయి. ఆ తీవ్రవాంఛ అతనిగొంతును నులిమివేసేది. మాటాడలేక కళ్ళ వెంట నీళ్ళుకారేవి. బిగ్గరగా కేకలుపెడుతూ అరవాలనిపించేది. తోడేలులా పెడబొబ్బలుపెట్టి మనుష్యులందరినీ భయభ్రాంతు లుగా చేయాలనిపించేది. వాళ్ళ మూర్ఖతను, అవివేకాన్ని సరి దిద్దాలనిపించేది. తన నూత్నజీవితంలో జనించిన దేదో, వాళ్ళ కల్లోల అహంకారజీవితంలో పోయవలెననిపించేది. వాళ్ళతో ఏవో కొన్ని దృఢమైన మాటలు బిగ్గరగాచెప్పి వాళ్ళందరినీ ఒకే దిక్కుకు నడిపించాలనిపించేది. వాళ్లను ముట్టడించి వాళ్ళ తలలు గట్టిగా పట్టుకోవాలనుకునేవాడు. ఒకరినుండి ఒకరిని చీల్చాలనుకునేవాడు. కొందరిని చావమోదాలనుకునేవాడు. అందరినీ నిందించి పరాభవించి వాళ్ళపైన ఒకానొక బ్రహ్మాండ మైన అగ్నివర్షం కురిపించాలనుకునేవాడు.

కాని అతనిలో ఏమీలేదు. అందుకు అవసరమైన మాటలూ లేవు, అగ్నిలేదు. కేవలం వాంఛ మాత్రమే ఉన్నది. ఇన్నాళ్ళనుంచీ హృదయంలో రేగిపోతున్న ఆ వాంఛను తీర్చు కోవడం అతనికి అసాధ్యంగా కనిపించసాగింది. తను జీవితానికి

దూరంగా, పైనఉండి, ఆ అగాధమైన లోయలోని మనుష్యుల కోలాహలాన్ని కనిపెడుతున్నట్టు చిత్రించుకున్నాడు. తను తన కాళ్ళపై గట్టిగా ఒక నిశ్చయంతో నిలబడి ఉన్నట్టు చిత్రించుకున్నాడు. కాని తన నోటివెంట మాటలేదు. తను మూగవాడు. మాట పెగిలినట్టయితే ఇలా కేకలుపెట్టి ఉండేవాడు.

"మీరంతా ఎలాంటి బ్రతుకు బ్రతుకుతున్నారు! మీకు సిగ్గులేదా?" ఇంకా ఇలాగే తిట్టేవాడు. కాని వాళ్ళకు తన కంఠం వినిపించినట్టయితే మళ్ళీ ఎదురుప్రశ్న వేసి ఉండేవారు.

"అయితే మమ్మల్ని ఎలా బ్రతకమంటావు?" ఈ ప్రశ్న విని తాను, తానున్న ఉన్నతప్రదేశంనుండి ఒక్కమాటుగా ఆ అగాధలోయలోని తిరగలిరాతి అట్టడుగునకు దూకేవాడు. ఆ మనుష్యులకాళ్ళకింద నలిగినలిగి చితికిపోయి తానూ తిరగలిరాతి కోరల్లో చిక్కుకునేవాడు. అప్పుడు వాళ్ళంతా తన నాశనం కళ్ళారాచూచి ఒక్కపెట్టున పగలబడి విరగబడి నవ్వేవారు.

అప్పుడప్పుడు ఈ పీడకల పెట్టే రాపిడికి అతనికి పిచ్చెక్కిపోయేది. అతని పెదవులనుండి అర్థరహితమైన, అసందర్భమైన మాటలు కొన్ని వెలువడేవి. తనలోని ఈ వేదనకు స్వేదం కురిసేదికూడా. ఒక్కోమాటు తను అతిగా తాగడంవల్ల పిచ్చివాడనైపోతున్నానని అతనికి అనిపించేది. ఆ కారణంవల్లనే తన మనోఫలకంలో ఈ భయంకర చీకటిచిత్రం కొట్టుమిట్టాడుతున్నదని భావించేవాడు. తన సంకల్పబలంతో విశ్వప్రయత్నం చేసి ఈ దృశ్యాలను, ఉద్రేకాలను దూరంగా తరిమేవాడు. కాని తాను తాగకుండా ఒంటిగా ఉన్నప్పుడు మళ్ళీ వెంటనే

ఈ మైకంవచ్చి అతన్ని బంధించేది. దానిబదులుకు అతను సొమ్మసిల్లేవాడు. విముక్తి పొందాలనే ఆకాంక్ష అతనిలో అంతకంతకూ బలీయం కాజొచ్చింది. కాని తన సిరిసంపదల సంకెళ్ళను బద్దలుకొట్టుకుని బయటపడేశక్తి అతనికి లేకపోయేది. తన రక్షకపిత మయకిన్ ఇప్పుడు తన వ్యాపారవ్యవహారాదు లన్నీ నడిపించడానికి న్యాయమైన సంపూర్ణహక్కుదారైనాడు. అంచాత అతను నిత్యాం తనను తీవ్రంగా హెచ్చరిస్తూ తన బాధ్యతలను గుర్తించేటట్టుచేయ ప్రయత్నిస్తున్నాడు. అందుకు తాను మొహమాటపడవలసివస్తోంది. అప్పులవాళ్ళు తరుచుగా తనవద్దకువచ్చి డబ్బివ్వమని వేధిస్తున్నారు. కంట్రాక్టర్లువచ్చి పడవకేవునుగురించి ఒప్పందాలు చేసుకోవడానికి గొంతుమీద కూచుంటున్నారు. పనివాళ్ళు, గుమాస్తాలు—అంతకు ముందు నుంచీవున్న లావాదేవీలు పరిష్కరించడానికీ చర్చించడానికీ ఉత్తరాలు వ్రాస్తున్నారు. స్వయంగా వస్తున్నారు. వీరంతా తనకోసం వెదికి వెదికి తుదకు ఏ సారాకొట్లోనో తనను పట్టు కుంటున్నారు. ప్రశ్నలమీద ప్రశ్నలువేసి తాము చేయాల్సిన పనులనుగురించి అడిగేవారు. అతను ఒక్కొక్కమాటు వాళ్ళడిగింది ఇసుమంతైనా అర్థంకాక ఏదో నోటికివచ్చినట్టు సమాధానం చెప్పేవాడు. లేక ఫలానావిధంగా చెయ్యమని ఉత్తర్వు చేసేవారు. వాళ్ళు తనపట్ల అసహ్యాం చూపుతున్నారని అతను గమనించే వాడు. ఎప్పుడుబట్టినా వాళ్ళు తను చెప్పినట్టు నడుచుకోక అందుకు పూర్తి విరుద్ధంగా సంచరించడంకూడా అతను చూచే వాడు. కాని వేరేవిధంగాను, ఇంకా మంచి పద్ధతిలోను వాళ్ళా పని చేసుకుపోతుండేవారు. దీనివల్లతన వ్యవహారాల్లో మయకిన్

జోక్యం ఉన్నదనీ, అతని తెలివితేటలవల్లనే తన పనులలా సాగి పోతున్నాయనీ, ఆవిధంగా తనను అతనివైపుకు తిప్పుకున్నాడనీ గ్రహించేవాడు. మళ్ళీ అదేసమయంలో తన వ్యాపారానికి తాను యజమానినికాదనీ, తాను కేవలం అందులో ఒకభాగం మాత్రమేననీ— అదికూడా అముఖ్యమైన భాగమనీ గుర్తించే వాడు. ఇది మరీ అతన్ని ఉద్రిక్తపరిచేది. ఆ వృద్ధుడినుంచి దూరంగా తొలగాలనీ, తాను నాశనమైనాసరే, వ్యాపారం నుంచి పూర్తిగా విడిపడిపోవాలనీ అనుకునేవాడు. కోపంతో రెచ్చిపోయి సారాకొట్లచుట్టూ, సానికొంపలచుట్టూ తిరిగి డబ్బు విరజిమ్మేవాడు. కాని ఇది ఎంతోకాలం సాగలేదు. మయకిన్ బ్యాంకులలో ఉన్న డబ్బంతా తీసుకుని అక్కౌంట్లు మూసివేశాడు. ఇక తాను ప్రాంశరీనోట్లు వ్రాసి ఇచ్చినా వెనుకటిమాదిరి ఎవరూ అప్పులివ్వడానికి ఇష్టపడక పోవడంకూడా త్వరలోనే గమనించాడు ఫోమా. ఇది అతని గర్వాన్ని, అహంభావాన్ని తీవ్రంగా దెబ్బకొట్టినట్టయింది. అతని ఆగ్రహం ప్రజ్వలించింది. తరువాత ఫోమా పిచ్చివాడై పోయాడనీ, అతనికొక సంరక్షకుణ్ణి ఏర్పరచటం అవసరమనీ వ్యాపారజగత్తులో ఒక పెద్ద పుకారు లేవదీశాడు మయకిన్. ఈ విషయం తెలిసేసరికి ఫోమా మరింత భయకంపితుడైనాడు. మయకిన్ ఎంతటి శక్తిసామర్థ్యాలు కలవాడో, ఫోమాకు తెలీ లేదు. ఈ విషయంలో అతను మరొకరితో సంప్రతించి వారి సలహా తీసుకోనూలేదు. వ్యాపారప్రపంచంలో మయకిన్ మాటకు తిరుగులేదనీ, అతని శక్తికి మించినది లేదనీ, అతను ఏదనుకుంటే అది చేసితీరగలడనీ - ఫోమా నమ్మాతాడు.

తన విషయంలో మయకిన్‌జోక్యం ఉన్నందుకు మొదట్లో అతను బాధపడేవాడు. కాని తరువాత సహించి తన భ్రష్ట జీవితాన్నే కొనసాగిస్తూ, తాగుతూ తన చుట్టూ ఉన్న మనుష్యులతో తిరుగుతూ వచ్చాడు. అదొక్కటే తన జీవితానికి తృప్తినిచ్చేదని భావిస్తూ వచ్చాడు. రోజు రోజుకూ అతను - మనుష్యులంతా తనకంటె అధ్వాన్నంగా ఉన్నారనీ అర్థరహితమైన జీవితం గడుపుతున్నారనీ, నిశ్చయించుకోసాగాడు. వాళ్ళ జీవితాలకు వాళ్ళు కర్తలు కారనీ-కేవలం జీవితాలకు బానిసలనీ-దానికి తలవొగ్గి నడుస్తున్నవారిని నమ్ముతూవచ్చాడు. అంచేత తన చుట్టూ ఉన్న తాగుబోతుల జీవితంలో తప్పునే చూడడానికి యత్నిస్తున్నాడు కాని మరేమీ చూడదలుచుకోవడంలేదు. భ్రష్టజీవితం గడుపుతున్నా, తానే అందరికన్న మిన్నగా ఉన్నాననే గర్వంతో సంచరిస్తూవచ్చాడు.

ఒకనాడు ఫోమా సారాఅంగట్లో ఉండగా, సగం మత్తులో ఉన్న అతని పక్కవాడొకడు జీవితాన్ని గురించి నిందావాక్యాలు పలుకసాగాడు. వాడు చిన్నమనిషి. భయపెట్టే కళ్ళు. మాసిన గడ్డం.

మనుష్యులమధ్య దోవచేసుకుని బ్రతుకుదామని ఎంతో ప్రయత్నించాను. అన్నివిధాల తంటాలు పడ్డాను. ఎద్దులా పని చేశాను. కాని జీవితం నన్ను పక్కకు నెట్టింది. కాళ్ళతో నన్ను మర్దించి అవకాశంలేకుండా చేసింది. నా సహనమంతా చచ్చింది. ఏమ్! అందుకే తాగడం మొదలెట్టాను. నేను నాశనమైపోతానని నాకు తెలుసు. కాని ఏంచేయను? నాకు తెరచిఉన్న దోవ ఇదొక్కటే.'' అన్నాడా చిన్నమనిషి.

"వెర్రివాడా! మనుష్యులమధ్య దోవచేసుకోవాలని ఎందుకనుకున్నావు? వాళ్ళకు వైదొలగి సరైన మార్గాన పోవల్సినమాట. దూరంగా నిల్చుని మనుష్యుల్లో నీ స్థానం ఏదో చూచుకుని అప్పుడు సరైన దోవతొక్కాలి." అని చెప్పాడు ఫోమా, అసహ్యించుకుంటూ.

"నీమాటలు నా కర్థంకావు." చిన్నమనిషి తన పిట్టతల ఊపుతూ అన్నాడు. ఫోమా తృప్తిగా నవ్వాడు. "అర్థం చేసుకోవలసినవాడివి నీవు కాదా?" అన్నాడు ఫోమా. "కాదు. నే ననుకోవడం ఈశ్వరుడే ఇలా చేశాడని—"

"ఈశ్వరుడు కాదు, మనిషి. మనిషే జీవితాన్ని ఏర్పాటు చేసుకున్నాడు!" అంటూ ఫోమా తన సాహసానికి తానే ఆశ్చర్యపడ్డాడు. ఆ చిన్నమనిషికూడా ఫోమా మాటలకు భయపడి వెనక్కుతగ్గాడు. "ఈశ్వరుడేనా కారణభూతుడు?" అనడిగాడు మళ్ళీ.

"అనుకుంటాను. చేసుకున్నవారికి చేసుకున్నంత."

"సరే; అయితే నీవు అతన్ని ఒక్క గింజకూడా ఎక్కువ అడగడానికి వీల్లేదన్నమాట. అదికాదోయ్, వెర్రివాడా! నీ జీవితానికి నీవే కారణభూతుడవు కా. ఈశ్వరుడు నీమంచిచెడ్డలు విచారణచేస్తాడు. మనమంతా అతని సేవకులం. ఆయన దృష్టిలో మనఅందరి విలువా ఒక్కటే. అర్థమైందా?"

ఇలా ఫోమా ఒక్కోమాటు తనకే ఆశ్చర్యం కలిగే టంత సాహసంతో మాట్లాడేవాడు. ప్రవర్తించేవాడు. రకరకాల ఊహాలునిప్పురవ్వల్లా అతని బుర్రలో మెరిసేవి.

ఈవిధంగా ఫోమా అడుగడుగున దిగబడే ప్రమాదంతో బురదలో నడుస్తున్నాడు. అయినప్పటికీ అతని రక్షకపిత మయకిన్ ఒక చిన్న నదిచేపలా దూరంగా పొడిచోట కూచుని అటూ ఇటూ కదులాడుతూ ఫోమా జీవితాన్ని తీక్షణంగా కనిపెడుతున్నాడు.

ఫోమాతో పోట్లాడినతరువాత మయకిన్ ఇంటికివచ్చాడు అతనిముఖం చిన్నదిగా నల్లగా అయిపోయింది. దిగులుగా చిరాకుగా కనిపిస్తున్నాడు. కళ్ళలో కాంతిలేదు. ముఖంమీది ముడతలు మరింత లోతుగా స్పష్టంగా కనిపిస్తున్నాయి. తండ్రిని చూడగానే లూబా అతనికేదో జబ్బుచేసిందని అనుకుంది. అతను కాళ్ళీడ్చుకుంటూ మెల్లగా గదిలోకివచ్చాడు. కూతురు అడిగే ప్రశ్నలకు అయిష్టంగా ముక్తసరిగా సమాధానాలు చెప్పాడు. తుదకు ఆమె నిలా కేకలువేశాడు.

"నన్ను ఒంటరిగా ఉండనీయి. అనవసరవిషయాల్లో జోక్యం కలిగించుకోకు."

ఆకుపచ్చగా తీక్షణంగావుండే తండ్రికళ్ళలో ఇప్పుడేదో దిగులు, విచారము, అలసట నిండిఉండడం చూచేసరికి లూబాకు అతనిమీద జాలి కలిగింది. ఏం జరిగిందో అడిగి తెలుసుకోవడం తన ధర్మమని భావించింది. మయకిన్ వెళ్ళి భోజనంచేసే బల్ల ముందు కూచున్నాడు అప్పుడామె తండ్రిని సమీపించి ప్రేమతో అతని భుజాలమీద చేతులువేసింది. అతని కనులలోకి మృదువుగాను, ఆత్రుతగాను చూస్తూ ఇలా అడిగింది.

"నాన్నా! నీకు జబ్బుగాఉందా? నాతో చెప్పవూ?"

ఆమె ఎప్పుడోకాని ఇలా ముచ్చటగా మాట్లాడదు. ఆమె ఇలా మాట్లాడినప్పుడల్లా ఒంటివాడైన ఆ వృద్ధుడి హృదయం ద్రవించేది. ఎంచాతనోకాని ఆతడంత ప్రతిస్పందించక పోయినా ముచ్చటపడకుండామాత్రం ఉండగలిగేవాడుకాదు. భుజాలమీదనుంచి ఆమెచేతులు తొలగిస్తూ ఇలా అన్నాడు.

"నీవు వెళ్ళి కూచో అమ్మాయి! ఏమిటీ ప్రతిదానికీ గోరంతలు కొండంతలు చేస్తావ్!"

కాని లూబా వెళ్ళలేదు. తండ్రి కళ్ళలోకి తదేకంగా చూస్తూ కొంచెం కోపంతో ఇలా అంది. "నాన్నా! నాతో ఎప్పుడూ ఎందుకు పసిపిల్లతో మాట్లాడినట్టు మాట్లాడతావు?"

"నీవు పెద్దదానివయ్యావు కాని, నీ మనస్సు మాత్రం పసిపిల్ల మనస్సులాగానేఉంది. ఇక వెళ్ళి భోజనానికి కూచో."

ఆమె మెల్లగా వెళ్ళి తండ్రికి ఎదురుగా కూచుంది. మయకిన్‌కు సాధారణంగా భోజనం త్వరగా చేసే అలవాటు. కాని ఇప్పుడు మాత్రం భోజనంచేయడానికి ఎక్కువ వ్యవధి తీసుకున్నాడు. కాబేజీపులుసు పోసిన పళ్ళెంలో చెంచాను చాలసేపు కలియపెడుతున్నాడు. పులుసును చాలాసేపు పరిశీలిస్తున్నాడు.

"నీ తండ్రి మనస్సులో ఉన్న భావాలు నీ పసిమనస్సుకు తెలుస్తాయా ఏమిటి?" అన్నాడు హఠాత్తుగా. లూబా తన చెంచా అవతల పడేసింది.

నీళ్ళునిండిన కళ్ళతో ఇలా అంది.

"నాతో ఎందుకునాన్నా, అలా మాట్లాడుతావు? నేను ఒంటరిదాన్నని నీకు తెలుసు. నేనిలా బ్రతకడం ఎంత కష్టంగా

ఉందో కూడా నీకు తెలుసు. అయినా ఎన్నడూ ఒక్కమాటైనా ప్రేమతో మాట్లాడవు. నీవుకూడా ఒంటరివాడవై పోయావు. నీకూ కష్టంగానే ఉంది. నాకు తెలుసు. కాని అందుకు కారణం నీవే. ఆ తప్పంతా నీదే!"

"నీవుకూడా మాటలు నేర్చుకున్నావే! సరే, ఇంకా ఏమిటో చెప్పు?" అంటూ ఆ వృద్ధుడు నవ్వాడు.

"తెలివికలవాడననే గర్వం నీకు చాలా ఎక్కువగా ఉంది నాన్నా!"

"ఇంకా ఏముందో చెప్పు?"

"అదే మాత్రం మంచిదికాదు. అందుకు నాకు చాలా బాధగాఉంది. నన్నెందుకూ ఎప్పుడూ అసహ్యించుకుంటావు? నీకంటె నాకు దిక్కెవరున్నారు చెప్పు నాన్నా." ఆమె కళ్ళ వెంట బొటబొటమని నీళ్ళు కారాయి. తండ్రి అది గమనించాడు. అతని ముఖం వణికిపోయింది.

"అమ్మాయీ! నీవు పసిపిల్లవు కాకుండా ఉంటే, నీకూ మార్ఫా పూసడ్ నిట్జాలాంటి బుద్ధి ఉన్నట్టయితే— అప్పుడు నే నీ లోకాన్ని లెక్కపెట్టేవాణ్ణేకాదు. అందర్నీ చూచి నవ్వేవాణ్ణి లూంబా! ఫోమాను చూచికూడా. సరే. ఇక రా. ఏడవకు"

ఆమె కన్నీరు తుడుచుకుంటూ "ఫోమా విషయమేమిటి?" అని అడిగింది.

"ఏముంది? ఎదురుతిరుగుతున్నాడు. 'ఆహా, ఆహా!' అంటాడతను 'నా ఆస్తి తీసుకపొండి. నాకు స్వేచ్ఛ ఇవ్వండి!'

అంటాడతను. మనశ్శాంతికోసం మఠంలో చేరతాట్ట. అదీ ఘోమాకు పుట్టిన బుద్ధి."

"కాని, ఏమిటిది?" అనడిగింది లూబా ఆందోళనతో.

"ఏమిటది? అతిగా తాగడంవల్ల వచ్చిందో, మరెందుకు వచ్చిందో? ఇక అతన్ని ఆ ఈశ్వరుడు రక్షించాల్సిందే! అతను కేవలం వైరివాడై పోతుంటే నేను హోరాహోరీ పోట్లాడి ఉండేవాణ్ణి. ఇప్పు డది కాదు. నాతో ముఖాముఖీ యుద్ధానికి దిగాడు. అంతులేని పొగరుబోతుతనం, సాహసం ఏర్పడ్డాయి. కాని ఇంకా చిన్నవాడు. హృదయంలో కుట్రలేదు.

"అంతా తాగేస్తాను. అంతా పొగలా ఉఫ్‌న ఊదేస్తాను అంటా డతను. ఎలా తాగుతాడో అతనికి చూపిస్తాను!" అంటూ మయకిన్ తన చెయ్యి పైకెత్తాడు. పిడికిలి బిగించి మళ్ళీ ఇలా చెప్పసాగాడు. "ఎంత సాహసం? ఈ వ్యాపారాన్ని స్థాపించిన దెవరు? దాన్ని వృద్ధిచేసిందెవరు? నీవా? కాదు. నీ తండ్రి నలభై ఏండ్లకష్టం, నలభై ఏండ్ల చెమట, ఇందులో ధారపోశాడు. నీవు-నీవు దీన్ని నాశనంచేస్తావా? మేమువర్తకులం. మా జాతి అంతా ఒకేఒక తాటిమీద నడిచి సర్వం సాధించి గమ్యం చేరేంతవరకూ విశ్రమించనివాళ్ళం. మేము వర్తకులం, వ్యాపారస్తులం. శతాబ్దాలనుంచీ రష్యాను మా భుజస్కంధాలపై మోసుకునివచ్చాం. ఇప్పటికీ మోస్తున్నాం. దివ్యజ్ఞానసంపన్నుడైన పీటర్ చక్రవర్తికి మా విలువ తెలుసు. మాకు ఎలా తోడ్పడ్డాడు! మాకు వర్తకసరళి బోధించడానికై గ్రంథాలు ముద్రణవేయించాడు. ఆయన ఆజ్ఞప్రకారం 1720 లో ముద్రించబడిన గ్రంథం-అదిగో! ఇంకా నాదగ్గర ఉంది. అవును.

ఎవడైనా ఈ విషయం గ్రహించాలి. ఆయన గ్రహించాడు. మాకు దోవచేశాడు. ఇప్పుడు మా కాళ్ళమీద మేము నిలబడ్డాం. మాస్థానం మాకు ఉన్నది. మాకు దోవఇవ్వండి! మానవజీవిత నిర్మాణానికి మేము పునాదివేశాం. ఇటుకలూ, రాళ్ళకూ బదులు మేమే భూమిమీద పరున్నాం. ఇప్పుడు మేము అంతస్థులు నిర్మిస్తాం. పనిచేయడానికి మాకు స్వాతంత్ర్యం ఇవ్వండి! అసలుసమస్య అక్కడా ఉన్నది. కాని ఫోమ్‌కాకు ఇది అర్థంకావడంలేదు. కాని అర్థంచేసుకోవాలి. కార్యరంగంలోకి దూకాలి. అతని తండ్రి ఇచ్చిన ఆస్తి ఉంది. నేను చనిపోయిన తరువాత నాదికూడా కలుస్తుంది. పిచ్చిపిల్లవాడా! పని చెయ్యి! కాని అతను కాళ్ళుముడుచుకు కూచుని కాకిగోలచేస్తున్నాడు. కాదు, ఆగు! నిన్ను ఎత్తి తగినస్థానంలో కూచోబెడతాను!”

క్రోధోద్రేకంతో ఆ వృద్ధుడికంఠం రుద్ధమైపోతోంది. అతనికళ్ళు నిప్పుకణికల్లా జ్వలింపసాగాయి. ఆందోళనతో ఉక్కిరిబిక్కిరైపోతున్నాడు.తనకుమారై కూచున్న చోట ఫోమా కూచున్నాడని ఊహించుకుని ఆమెవంక జ్వలిస్తున్నకళ్ళతో చూచాడు. అతనిచూపులకు ఆమె భయచలితురాలైంది. కాని అమె తన తండ్రికి అడ్డురాలేకపోయింది.

“మన తండ్రులూ తాతలూ ఒక దోవ వేశారు. మనమూ ఆ దోవలోనే నడవడం మంచిది.” అన్నాడు వృద్ధుడు. వృద్ధుడు తల వాల్చుకున్నాడు. విషాదకంఠస్వరంతో మళ్ళీ ఇలా చెప్పసాగాడు. “నా బ్రతుకంతా ఇలా శకలాలైపోయింది. ఒక కొడుకు ఖైదీ అయినాడు. మరొకడు తాగుబోతైనాడు. అమ్మాయ్! నేను చనిపోయేటప్పుడు, ఈ

నా కృషంతా ఎవరి కిచ్చి పోను?" అలా చింతింపసాగాడు మయకిన్. కలవరంతో కుమార్తెవంక చూస్తున్నాడు. ఆమె నిశ్శబ్దంగా ఉంది. "అమ్మాయ్! నీవు నాకు చెప్పు. నీవు చదువుకున్నదానివి. జీవించడం ఎలాగో చెప్పు?" అతను అకస్మాత్తుగా అడిగిన ఈ ప్రశ్నలు ఆమెను కలవరపెట్టసాగాయి. మయకిన్ హఠాత్తుగా ఆగి తలెత్తి చూచాడు. లూబా హఠాత్తుగా ఇలా అంది :

"నాన్నా ! దుఃఖించకు. తారాస్ ఇంకా బ్రతికే ఉన్నాడు. మళ్ళీ తిరిగొస్తాడు."

అది విని మయకిన్ ఇలా అన్నాడు. "చిన్నప్పుడు వంగని చెట్టు మాను అయినతరువాత వంగదు. తారాస్ ఏమైపోయినా నాకు పర్వాలేదు. ఒక విధంగా ఫోమాయే వాడికంటె నయం. ఆ! ఇంతకూ అబ్బాయిని సమయానికి జ్ఞాపకంచేశావు. మంచిదే!"

ఒక క్షణం క్రితం దిగాలుపడిపోయిన వృద్ధునిలో మళ్ళీ ధైర్యంవచ్చింది. "ఒకమాటు తారాస్‌కు ఉత్తరం వ్రాసిచూద్దాం" అన్నాడు.

"నేను రాస్తానునాన్నా!" అన్నది లూబా, ఆనందంతో పొంగిపోతూ.

"నీవు వ్రాస్తావా? సరే, అలాగే వ్రాయి. వ్రాసేటప్పుడు నాకు చెప్పు" అన్నాడు వృద్ధుడు.

"అలాగే, నాన్నా !" అన్నది అమ్మాయి.

"నీకు త్వరలో పెళ్ళి చేయాలనుకుంటున్నాను. ఒక సంబంధంకూడా చూచాను." అన్నాడు వృద్ధుడు.

"అతను స్మోలినా నాన్నా?" అని అడిగింది లూబా ఆతృతతో.

"అయితే ఏంచేస్తావేమిటి?" అన్నాడు మయకిన్.

"ఏంచేయను. నా కతనెవరో తెలీదు." అన్నది లూబా.

"తెలీకపోతే తెలిసేటట్టుచేస్తా. నీకు కళ్యాణసమయం వచ్చింది దమ్మాయ్. ఫోమామీద నా కంత ఆశలు లేవు."

"నే నతనిమీద ఆశపెట్టుకోవడంలేదు నాన్నా. అతనికీ నాకూ పొత్తేమిటి?"

"నీ విలా అనకూడ దమ్మాయ్! నీవు జాగ్రత్త చేసుకుంటే వా డిలా అయివుండేవాడు కాదు."

ఆమె ఆలోచనానిమగ్నురాలైంది. లూబా ఇప్పుడిప్పుడే వివాహాన్ని గురించి ఎక్కువగా ఆలోచిస్తోంది. ఆమె కేం చేయాలో తోచడం లేదు. ఎక్కడికి వెళ్ళాలో తోచడం లేదు. ఈ ఒంటరితనాన్నుంచి తప్పించుకోవడానికై వివాహం తప్ప మరి గత్యంతరంకూడా కనిపించడంలేదు. ఆమె చదివిన పుస్తకాల తాలూకు సారం మాత్రం ఆమెలో మిగిలిఉంది. ఆమెకు ఒక్కోసారి తండ్రి స్వాధీనం నుంచి తప్పించుకుని ఎక్కడికైనా వెడదామనిపిస్తుంది. ఒక్కోమాటు వివాహమే నయమనిపిసుంది. ప్రకృతి ప్రభావం ఆమె మీద ఉంది. పిల్లలను ఎత్తుకున్న తల్లులను చూచినప్పుడు ఆమెకు దిగులయ్యేది. అద్దంలో ముఖం చూచుకునేది. కళ్ళక్రింద నల్లని నీడలు కనిపించేవి. తనపైన తనకే జాలివేసేది. జీవితం తన్ను వెనకాల విడిచి ఎక్కడికో వెళ్ళిపోతున్నదనిపించేది. చిన్నప్పుడెప్పుడో చదువుకునే రోజుల్లో స్మోలిన్‌ను చూచింది. తరువాత

మళ్ళీ అతన్ని చూళ్ళేదు. ఈలోగా ఆమెకు తన అన్న జ్ఞాపకం వచ్చాడు. అతను జ్ఞాపకం రాగానే స్మోలిన్‌ను, తండ్రినీ మరిచి పోయింది. ఆమె అలా ఆలోచిస్తూ కూచుని ఉంటే తండ్రి ఆమె వంకచూచి "ఏమిటమ్మాయ్, ఆలోచిస్తున్నావ్?" అని అడిగాడు.

"అన్నీ క్షణికాలే." అంది లూబా.

"ఏ వన్నీ?"

"ప్రతిదీని. ఒకవారం క్రిందట నీతో అన్నయ్యను గురించి మాట్లాడడానికి వీల్లేకపోయింది. మరి ఇప్పుడో?"

"అవసరం అమ్మాయ్! అవసరం అన్నిటికంటె బలమైంది" అన్నాడు వృద్ధుడు. తరువాతమళ్ళీ ఇలా చెప్పసాగాడు. "అమ్మాయ్! ఇప్పుడు నాకు అరవైఏడేండ్లు. ఒక కాలు కాట్లో పెట్టుకుని కూచున్నాను, అయినా లోకం నాకెంతో అందంగా కనిపిస్తోంది. రోజు రోజుకూ లోకంలో కొత్త కొత్త అందాలు మొలకలెత్తుతున్నాయి. పూర్వం పూలు ఇంత ముచ్చటగా ఉండేవికావు. కొత్త కొత్త పడవలు, స్టీమర్లు ఎన్నెన్నో ఉత్పన్న మవుతున్నాయి. అంతా హాయిగానే ఉందికాని, నీలో జీవశక్తి మాత్రం కనిపించడం లేదు!"

తండ్రి ఇలా చెపుతోంటే ఆమె నేరంచేసినదానిలా అతనివంక చూచి చిరునవ్వు నవ్వింది. కాని అతనిపట్ల ఆమెకు గౌరవం మాత్రం ఎక్కువైంది.



ఫ్రోమా తాగుతూ తిరుగుతూ రాత్రింబవళ్లు సారా కొట్లల్లో కాలం గడుపుతున్నాడు. మనుష్యులపట్ల అతని అసహ్యం అంతకంతకూ ఎక్కువౌతోంది. తన్ను సాహసించి ఎదిరించేవ్యక్తి, ఎక్కడుంటాడో అని అన్వేషిస్తున్నాడు. ఒక రోజు సారాకొట్లో కూచుని ఇలా కేకవేశాడు: "సోదరులారా! నాకు రోతవేస్తోంది. మీతో అలసిపోయాను. నన్ను కొట్టండి. వెళ్ళకొట్టండి! మీరు వట్టి వెధవలు! కాని మీలో మీరు ఆప్తంగా ఉంటారు, నాతో మాత్రం అలా ఉండరు. ఏం? నేను తాగుబోతును కానా? నేను మాత్రం మీలాగా వ్యర్థజీవికానా? నన్ను మీరు అపరిచితుణ్ణిచూచినట్టుగా చూస్తారు. ఎందుచేత? నా డబ్బుతో తాగుతారు. మళ్ళీ నన్నే తిడతారు! నాకు తెలుసు. ఎందుచేత?"

అతనెంత పతితుడైనా ఉన్నవాడు కావడం వల్ల, అతని దగ్గరికి రావడానికి అందరూ జంకుతారు. పైగా అతను బలశాలికూడా. ఎదురుతిరిగి కొడితే ఎక్కడివాళ్ళక్కడ ఫరారు కావలసివస్తుంది. అంచాత అతనిముందు మాట్లాడడానికి ఎవరూ సాహసించేవారు కారు. అతను కోరేదికూడా సరిగ్గా అదే. తను అసహ్యించుకొనే ఈ జనాభాలో ఎవడో ఒకడు తనకు ఎదురు తిరిగి నిలబడాలనీ, ముఖాముఖీ వాగ్వాదంలోకి దిగాలనీ, అప్పుడు తను వాణ్ణి తల్లక్రిందులుగా పడేసి వాడి పతనాన్ని, ప్రమాదాన్ని కళ్ళారా చూచి ఆనందించాలనీ తీవ్రంగా ఆశించేవాడు.

ఏది వాంఛించాడో అదే అగుపించింది ఫోమాకు. ఒకనాడతను ఎవరూ తనను లెక్కచేయనందుకు ఉద్రిక్తుడై తన ప్రక్కనున్న తాగుబోతులతో ఇలా అరిచాడు."అబ్బాయిలూ, ఇక ఊరుకోండి! మీలో ప్రతిఒక్కరికీ తాగడానికీ తినడానికి ఇచ్చేదెవరు? మరచిపోయారా? నేను మిమ్ములనందరినీ కట్టడిలో పెడతాను! నన్నెలా గౌరవించాలో చూపిస్తాను! నేరస్థులారా! నేను మాట్లాడుతున్నప్పుడు మీరంతా నోళ్ళు కట్టేసుకోవాలి!

నిజానికి అందరూ మౌనంవహించారు. అతని ప్రీతిని కోల్పోతామనే భయంవల్లనో లేక గట్టివాడైన అతనిచే తన్నులు తినాల్సివస్తుందనే భయంతోనో అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. కోపాన్ని అణచుకుంటూ ఒక నిముషంపాటు అంతా ఊరుకున్నారు. తమభయం, నివ్వెరపాటు అతనికి అగుపించకుండుటకై ముఖాలు పళ్ళాలమీదికి వంచుకుని కూచున్నారు. ఫోమా వారందరివైపూ తృప్తిగా ఒకసారి చూచాడు. చిమ్మట వారి విధేయతకు, బానిసమనస్తత్వానికి సంతసిస్తూ డంబముతో ఇలాపలికాడు: "ఆహా! ఇప్పుడు మీ నోళ్ళన్నీ కట్టాయి. అదీ, అలా ఉండాలి! నేను చాలా కచ్చితమైన మనిషిని! నేను—

అంతలో గుంపులోంచి "సోమరిపోతా!" అని నిండైన కంఠస్వరంఒకటి వినిపించింది.

"ఏమిటీ? ఎవడా మాటన్నది?" ఫోమా గర్జించాడు. అప్పుడు బల్ల చివరనున్న ఒక విచిత్ర వ్యక్తి లేచి నిలబడ్డాడు. మనిషినిచూస్తే చీదరవుట్టేటట్టున్నాడు. చాలాపొడగరి. పొడు

గాటి కోటు వేసుకున్నాడు. నెరిసినజుట్టు. పెద్దతల. తలవెంట్రుకలు బిరుసుగా పైకి నిక్కపొడుచుకుని ఉన్నాయి. పచ్చని ముఖం. మాసినగడ్డం, గద్దముక్కులాంటి ముక్కు. అతన్ని చూడగానే ఫోమాకు స్టీమర్ డెక్ లుకడిగే కుంచె జ్ఞాపికివచ్చింది. అత నంత గమ్మత్తుగా ఉన్నందుకు సరదాపడ్డాడుకూడాను. "భలే బాగున్నావు!" అన్నాడు ఫోమా పరిహాసంగా. "ఏమిటోయ్, కుక్క మొరిగినట్టు మొరుగుతున్నావ్? నే నెవర్నో తెలుసా?" అన్నాడు మళ్ళీ.

విషాదం అభినయించే నటుడిలా ఆ వ్యక్తి ఫోమావైపు తన చెయ్యి చాచాడు. గారడివానిలా పొడుగాటి వ్రేళ్ళు ఆడిస్తూ బొంగురుగొంతుతో ఇలా అన్నాడు: "తండ్రికి తప్ప పుట్టినవాడవు నీవు. అతని కొక కుళ్ళురోగంవంటివాడవు నీవు. అతను మనుషుల్ని దోచుకున్నా నీకంటె నయం."

ఇలా తనకు ఎదురుదెబ్బతగులుతుందని ఫోమా అనుకో లేదు. అంచాత ఆగ్రహావేశంతో అతనిహృదయం కుంచించుకు పోయింది. కళ్ళు భయంకరంగా పెద్దవిచేశాడు. అహంభావం వల్ల జవాబుచెప్పడానికి మాటలు దొరక్క ఊరుకున్నాడు. ఎదురుగానిలబడ్డ ఆ వ్యక్తిమాత్రం సచేతనంగా, మృగంలా కనుగుడ్లుతిప్పుతూ ఇలా సాగించాడు: "బుద్ధిహీనుడా! నిన్ను మేము గౌరవించాలా? నీ వందుకు అర్హుడవా? అసలు నీ వెవరు? తండ్రి ఐశ్వర్యం తగలబెడుతున్న తాగుబోతువు! అనాగరికుడవు! నేను - ప్రఖ్యాతకళాకారుణ్ణి - కళారాధకుణ్ణి. నీతో కలిసి తాగుతున్నందుకు నీవు గర్వపడాలి! నీవు తాగే ఈ బుడ్డిలో ఏంపోశారో తెలుసా? పొగాకురసంలో మంచిగంధం,

బెల్లపునీరు పోశారు. దీన్ని తాగి నీవు ద్రాక్షసారాయి తాగుతున్నా ననుకుంటున్నావు. గుర్రాన్నీ, గాడిదనూ ఒకేగాట కట్టేసే బుద్ధిహీనుడవు నీవు!"

అప్పుడు ఫోమా ఆ చిత్రకారునిమీదికి ఉరికి "ఒరేయ్ పనికిమాలిన పక్షీ!" అంటూ గర్జించాడు. కాని ఎవరో అతన్ని పట్టుకున్నారు. అలా పట్టుబడి, తప్పించుకోడానికి పెనుగులాడుతూ మారుపలకలేక అవతలివాడు చెప్పేది తప్పనిసరిగా వింటున్నాడు. "దోచుకున్న రూబుళ్ళలోంచి కొద్దికోపెకులు మనుష్యులముఖాన పారేసి, అందుకొక పెద్ద నాయకుణ్ణని చెప్పుకుతిరుగుతున్నావా! నీవు రెండుమార్లు దొంగవు. ఒకమాటు రూబుళ్ళన్నీ దోచుకుని దొంగవయ్యావు. మళ్ళీ ఆ రూబుళ్ళలోంచి కొద్ది కోపెకులు పారేసి కృతజ్ఞతను దోచుకుంటూ రెండోమారు దొంగ వయ్యావు! కాని నే నందుకు సమ్మతించేవాణ్ణి కాను. దుర్మార్గాన్ని ఎదుర్కోవటానికే జీవితం అంకితంచేసినవాణ్ణి నేను! నీ ముందు నిలబడి నిర్భయంగా ఇలా చెప్పగలను. 'నీవు బుద్ధిహీనుడివి, బిచ్చగాడివి. ఎందుకంటే నీవు భాగ్యవంతుడివి కనుక! జ్ఞానమంతా ఈ ఒక్కమాటలో ఇమిడిఉంది: 'భాగ్యవంతులందరూ బిచ్చగాళ్ళు!' ఇది ప్రసిద్ధమైన సత్యం!" అన్నాడు కళాకారుడు.

ఇప్పుడు ఫోమా గొర్రెపిల్లలా అయిపోయాడు. చుట్టూమూగిన జనంమధ్య నిస్సహాయుడై నిల్చుని పిడుగులా కురిపించిన కళాకారుడి మాటలు విన్నాడు. ఆ మాటలు వినే సరికి ఫోమాకు తనలోఉన్న ఏదో వ్రణాన్ని ఎవరో గీరి, తన దురదపెట్టేబాధను ఉపశమనం చేసినట్టుగా అనిపించింది. జనం

ఉద్రిక్తులవుతున్నారు. కొందరు కళాకారుణ్ణి అలా మాట్లాడ కుండాచేయడానికి యత్నించారు. మరికొందరు ఫోమాను మరె క్కడికో లాక్కుపోవడానికి చూచారు. కాని ఫోమా ఒక్క మాటకూడా మాట్లాడకుండా జనాన్ని ప్రక్కకునెట్టి కళాకా రుని మాటలు వినసాగాడు. అలా వింటూ అందరిసమక్షంలో తాను పొందిన పరాభవానికి లోలోపల ఏదో సంతసిస్తున్నట్లు కనిపించాడు. ఆ మాటలవల్ల ఉద్రిక్తమైన అతని బాధ, అతని హృదయానికి ఏదో ఉపశాంతి కలిగిస్తున్నట్లు అనిపించింది. కళాకారుడు ఇంకా సాగిస్తూనే ఉన్నాడు.

"జీవితానికి కర్తవు నీవే ననుకుంటున్నావా ? నీవు డబ్బుకు దాసోహమనే నీచమైన బానిసవు." అన్నా డతను. గుంపులో ఎవరో వెక్కిళ్ళు ప్రారంభించారు. మధ్యమధ్య "ఓరి నీపాడుగాను'' అని తిడుతున్నారు. ఎవరో ఒక బొద్దుముఖం, మాసినగడ్డం కల వ్యక్తి ఫోమాను చూచి జాలిపడ్డాడో లేక ఈ గందరగోళానికి విసిగిపోయాడో తెలీదుకాని ... మొత్తానికి ముందుకొచ్చి చేతులాడిస్తూ ఇలా అన్నాడు: "అయ్యలారా ! ఇక పోనీయండి! ఇదేం బాగాలేదు ! ఎందుకంటె, మనమంతా పాపులమే! నిశ్చయంగా అందరమూకూడాను ! నామాట నమ్మండి!"

"సరే, ఇంకాచెప్పు. అన్నీ చెప్పు! నిన్నేమీ అననులే" అనిగొణిగాడు ఫోమా.

గోడలకున్న అద్దాలలో ఈ తొంగుబోతుల గుంపంతా ప్రతిబింబిస్తోంది. వాళ్ళ అసలు ఆకారాలకంటె అద్దంలో ఆకా రాలు మరీ అధ్వాన్నంగా, అసహ్యంగా అగుపిస్తున్నాయి.

"నేనిక మాట్లాడ దలుచుకోలేదు! ముత్యాలవంటి సత్యాలను నీ ముందు పారబోయదలుచుకోలేదు." అంటూ కళాకారుడు, ఠీవిగా తలఎత్తి ముందుకువచ్చాడు. జనాన్ని తప్పించుకుని బయటికి వెళ్ళిపోతున్నాడు. అతను పోతుంటే వెంబడించ ప్రయత్నించాడు ఫోమా. "అబద్ధమాడుతున్నావు! ఆగు! నీవు నన్ను రెచ్చగొట్టావు. మళ్ళీ ఇప్పుడు ఉపశాంతికల్గించు" అన్నాడు.

ఫోమాను వెళ్ళనీయకుండా గుంపంతా అడ్డంతగిలింది. అతను వారందరినీ నెట్టుకుని వీధిలోకి పరుగెత్తాడు. ఇప్పు డతని ఉద్రేకమంతా చల్లారింది. రోడ్డు ప్రక్కన నిల్చుని వీధిలోకి చూస్తూ సిగ్గుతో ఇలా అనుకోసాగాడు: "ఆ వెధవ నన్ను చూచి పరిహసించాడు నా తండ్రిని దొంగక్రింద జమకట్టారు. నే నెలా సహించగలిగాను?" అప్పటికి బాగా చీకటి అలుముకుంది. చుట్టూ నిశ్శబ్దం. చంద్రుడు దివ్యంగా ప్రకాశిస్తున్నాడు. చల్లని పిల్లవాయువులు వీస్తున్నాయి. ఫోమా అంగలు పంగలు వేస్తూ నడుస్తున్నాడు చల్లగాలికి ఎదురుగా, అతనిముఖంమీద చల్లదనం పడుతోంది. భయంభయంగా. దిక్కులు కలియచూస్తున్నాడు. తాగుబోతులెవరూ తనవెంట రాకుండా ఉంటే బాగుండునని అనుకుంటున్నాడు. అందరికళ్ళ ఎదుటతనకు తలవొంపులు జరిగినట్టు గ్రహించుకున్నాడు. ప్రసిద్ధికెక్కిన ఒక వర్తకుని కుమారుడైన తనను ఎవడో ఒకడు పదిమందిలో నిలబెట్టి తిట్టి పరిహసించి పరాభవిస్తే – అందుకు తానేమీ చేయలేకపోయానని తలపోయసాగాడు. "నాకు తగినశాస్తి జరిగింది! తగినశాస్తి జరిగింది! తలకాయలేకుండా ప్రవర్తించకు-

తెలిసిందా? పైగా నేనే కోరి తెచ్చుకున్నాను. ప్రతివాడి విషయంలో జోక్యం కలిగించుకున్నాను. అందుకు ప్రతిఫలం అనుభవించొద్దూ!'' అని తనలో అనుకోసాగాడు

ఈ ఆలోచనలు తనమీద తనకే జాలికలిగించాయి. విచారం, దిగులు ముంచివేశాయి. వీధులవెంట విధివిరామం లేకుండా తిరుగసాగాడు– ఏదో తనలో దృఢత్వాన్ని వెదుకుతున్నట్టు. కాని తనలో అంతా ఆందోళన, అలజడి. ఒక స్పష్టమైన రూపం లేకుండా అతని హృదయాన్ని పీడించసాగాయి. ఏదో భయంకరమైన, బాధాకరమైన స్వప్నంలో ఉన్నట్టు– అతను నదిఒడ్డుకు చేరుకున్నాడు. ఒడ్డున ఉన్న దూలాలమీద కూచున్నాడు. చిన్న చిన్న అలలతో నిండి నిశ్శబ్దంగా, నల్లగా ఉన్న నీటివంక చూడసాగాడు. విశాలహస్తాలతో పరుచుకుని ప్రశాంతంగా నిశ్శబ్దంగా ప్రవహిస్తున్న నదీవాహిని తన గుండెలో బ్రహ్మాండమైన బరువులు మోసుకొనిపోతున్నట్టు కనిపించింది. నది అంతా నల్లటి పడవలతో, ఓడలతో నిండిఉంది. ఓడల్లోని దీపాలు, ఆకసంలోని నక్షత్రాలు, నదీజలంలో ప్రతిఫలిస్తున్నాయి. చిన్నచిన్న అలలబారులు, మెల్లగా మృదువుగా రోదిస్తూ దాదాపు థోమాకాళ్ళముందున్న ఒడ్డుకు ఒరుసుకుంటున్నాయి. ఆకాశం దిగులుగా బుసలువిడుస్తూ నిశ్వసించింది. థోమాపై ఏకాంతం విరుచుకుపడింది.

“ఓ ప్రభూ! జీసస్ క్రైస్ట్! నేనెంతటి వ్యర్థుణ్ణి, రాజీపడ్డుణ్ణి. నాలో ఏమీలేదు. ఈశ్వరుడు నాలో ఏమీ ఉంచలేదు. నేను పట్టెడొల్ల! నేనెందుకు పనికివస్తాను? ఓ జీసస్ ప్రభూ!'' అంటూ థోమా విచారంగా ఆకసంవంక తదేకంగా చూస్తూ విలపించ

సాగాడు. క్రీస్తు జ్ఞాపకం రావడంవల్ల ఫోమాకు ఏదో కొంత హాయి అనిపించింది తన ఒంటరితనాన్ని ఉపశమింపచేస్తున్నట్లు తోచింది. బరువుగా నిశ్వసించి నిశ్శబ్దంగా ఈశ్వరుణ్ణి ఉద్దేశించి ప్రార్థించసాగాడు. "ఓ ప్రభూ, జీసస్ క్రైస్ట్! ఇతరులు తమ కేమీ తెలీకపోయినా తెలిసినట్టు భావించుకుంటారు. అంచాతనే వాళ్ళకు బ్రతకడం తేలిక అయింది. మరి నేను – నాకు న్యాయం కనిపించదు. ఇక్కడ అంధకారం. నేను ఒంటరిగా ఉన్నాను. ఎక్కడికి వెడదామన్నా నాకు చోటు లేదు. ఎవరికీ ఏం చెప్పడానికీ నాకు శక్తి లేదు. నే నెవరినీ ప్రేమించను – ఒక్క నా రక్షకపితను తప్ప. కాని అతనికి హృదయం లేదు. అతన్ని ఏదో విధంగా శిక్షించవలసినవాడవు నీవే! తనకంటె మంచివాడు, తెలివైన వాడు ఈ భూమిమీద లేడని అతను అనుకుంటాడు. అందుకు బాధ్యుడవు నీవే. అలాగే నావిషయంకూడా. ఏదో దురదృష్టం నాకోసం వచ్చిఉన్నట్టయితే, ఏదో వ్యాధివచ్చి నన్ను తీసుక పోయినట్టయితే – ఎంతబాగుండేది. కాని నేనిక్కడ ఉక్కు ముక్కలా ఉన్నాను. నేను తాగుతున్నాను. విచ్చలవిడిగా విలాసజీవితం గడుపుతున్నాను. రొంపిలో బ్రతుకుతున్నాను. కాని దేహానికి ఏబురదా అంటడంలేదు. నాహృదయంమాత్రమే బాధతో పగులగొట్టుకుపోతోంది. ఓ ప్రభూ! ఇలాంటి బ్రతుకు ఎందుకోసం?"

ఫోమా చుట్టూ నిశ్శబ్దం అంతకంతకూ అగాధమై పోతోంది. రాత్రి అంతకంతకూ గాఢాంధకారంగా మారు తోంది. తీరానికి దాపులోనే ఒక పడవ లంగరు వేయబడి ఉంది. రెండువప్రక్కలకూ ఒరుసుకుని ఏదో ఏడుస్తున్నట్లు ధ్వని

చేస్తోంది. "ఇలాంటి బ్రతుకునుంచి నేను విముక్తి పొందడం ఎలాగ?" పడవవంక తదేకంగా చూస్తూ ఫోమా ఆలోచించ సాగాడు. "ఏవృత్తి నాకు సరిపడుతుంది? అందరూ పనిచేస్తున్నారే!" హఠాత్తుగా ఒక ఆలోచన అతనికి తట్టింది. అది ఎంతో గొప్పదిగా కనిపించిం దతనికి: "తేలికపనికంటె కష్టమైన పనే చౌకగా దొరుకుతుంది! ఒకడు ఒక రూబుల్‌కోసమే పని చేస్తాడు. తన యావచ్ఛక్తినీ ధారపోస్తాడు. మరొకడు తన ఒక్క చిటికెనవ్రేలు చూపించి వెయ్యిరూబుల్సు తీసుకుంటాడు. ఈ ఆలోచనవల్ల అతని కెంతో ఉత్సాహం కలిగింది. మనిషి బ్రతుకులోఉన్న మరొక అన్యాయాన్ని వాళ్ళ బ్రతుకులో దాచిపెట్టుకున్న మరొక మోసాన్ని, కనిపెట్టినట్టనిపించింది. తన పడవకాపలావాళ్ళలోఒకడైన ఇల్యాను జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. అతను వృద్ధుడు. తనవంతు కాపలా అయిపోయినతరువాత కూడా ఒక స్నేహితుడికోసం వరుసగా ఎనిమిదిగంటలసేపు కణకణ మండే నిప్పులముందు కూచుని కాపలా కాస్తుండేవాడు. అందు కతనికి వచ్చే ప్రతిఫలం పది కోపెక్‌లు మాత్రమే. ఉక్కిరిబిక్కిరిఅయ్యే వేడిముందు అలా పని చేసిచేసి ఒకనాడు జబ్బుపడ్డాడు. అప్పు డతను స్టీమర్ అంచులమీద పడుకుని ఉండడం చూచి ఫోమా అతన్ని "ఎందు కిలా జీవితం నాశనం చేసుకుంటున్నావు?" అని ప్రశ్నించాడు. అందుకు ఇల్యా "నీకు నూరు రూబుల్సు ఎంత విలువైనవో అవసరమైనవో నాకు ప్రతి కోపెక్కూ అంతకంటె ఎక్కువ విలువైనదీ, అవసరమైనదీను. అందుకే ఇలా మంటల్లో మ్రగ్గిపోతూ పనిచేస్తున్నాను" అని జవాబు చెప్పాడు. అలా చెప్పి ఆ వృద్ధుడు బాధతో

పగులగొట్టుకపోతున్న తన శరీరాన్ని మెలికలు తిప్పి ఫోమాకు తన వెన్ను చూపించాడు.

కాపలావాణ్ణిగురించి వచ్చిన ఆలోచనలతో ఫోమాకు హఠాత్తుగాను, అప్రయత్నంగాను కష్టించి పనిచేసే పేదప్రజ లందరిమీందా సానుభూతి కలిగింది. అలాటి శ్రమలుపడుతూ వాళ్ళెందుకు బ్రతుకుతున్నారో అని ఫోమాకు ఆశ్చర్యంకలిగింది. "వాళ్ళెందుకుబ్రతకడం? భూమిమీంద వాళ్ళకున్న సుఖమేమిటి? ఎప్పుడూ వెట్టిచాకిరిచేస్తూనికృష్టంగా బ్రతుకుతారు. సరైన తిండి లేదు. మంచి బట్టలేదు. తాగుడుకూడా చాల హీనమైన సారానే తాగుతారు. అరవై ఏండ్లు పైనబడ్డ వృద్ధుడుకూడా యువకులతోపాటు పనిచేస్తాడే!" అనుకున్నాడు ఫోమా. వళ్ళొంచి పనిచేసే ఈ పేద కార్మిక ప్రజానీకమంతా అతని కంటికి ఒక పురుగుల ప్రోగులా కనిపించింది—ఎప్పుడూ ఏదో ఒకటి తినడానికై భూమిమీంద పోరాటం సలుపుతున్న పురుగులప్రోగు. తాను కలుసుకున్న ఇలాటి పేద కార్మికులంతా అతని కళ్ళ ముందు కనిపించారు. ఒక్కొక్కవ్యక్తి ఒక్కొక సంఘటన వరుసగాగుర్తుకురాసాగాయి. బ్రతుకునుగురించి వాళ్ళుమాట్లాడే మాటలు, వాళ్ళుచెప్పే సమాధానాలు—ఒకప్పుడు పరిహాసం గాను, మరొకప్పుడు దీనంగాను, వాళ్ళు చెప్పే సామెతలు, వాళ్ళు పాడే విషాదగీతాలు—ఇవన్నీ ఒకదానితరువాత ఒకటి ఫోమాకు జ్ఞప్తికిరాసాగాయి. ఒకనాడు తన ఆఫీసులో ఎఫిమ్ నావికులను కూలికి మాట్లాడి తీసుకొచ్చిన గుమాస్తాతో అన్న మాటలుకూడా అతనికి జ్ఞాపకంవచ్చాయి.

"కొందరు లోపుఖిన్ రైతులు కూలికి పనిచేస్తామని ఇక్కడికివచ్చారు. అంచాత వాళ్ళకు నెలకు పది రూబుల్స్ కంటె ఎక్కువ ఇవ్వొద్దు. గత వేసవిలో వాళ్ళ పరిస్థితిఅంతా చట్టుబండలై పోయింది. కనుక ఇప్పుడు వాళ్ళకు డబ్బు అవసరం అంతాఇంతా కాదు. చచ్చే ఇరకాటంలోపడ్డారు. ఎంతఇచ్చినా కళ్ళకద్దుకుని పనిచేస్తారు."

దూలాలపైకూచున్న ఫోమాశరీరం సుళ్ళుతిరిగి పోతోంది. ఆ అంధకారంనుంచి, ఆ నదీప్రవాహంనుంచి; అనేక రకాల మానవరూపాలు నిశ్శబ్దంగా అతనిముందు ప్రత్యక్షమైనాయి—నావికులు, పడవకూలీలు, కాపలావాళ్ళు, గుమాస్తాలు, వెయిటర్లు, ముఖానికి రంగు పులుముకుని సగం మత్తులో ఉన్న స్త్రీలు, సారాకొట్లముందు వసారాల్లోపడి పొర్లుతుండే వాళ్లు- వీళ్ళంతా నీడల్లాగ గాలిలో తేలిపోతున్నారు.వీళ్ళనుంచి ఏదో చెమ్మగిలిన ఉప్పరపువాసన వస్తోంది.నల్లగా, చిక్కగాఅల్లుకున్న-మానవరూపాలసమూహాలు మెల్లగానిశ్శబ్దంగా శిశిరాకాశంలోని మేఘాలవలె కదిలిపోతున్నాయి. మృదువైన అలల కలకలంనుంచి ఏదో విషాదసంగీతం వచ్చి అతని హృదయాన్ని నింపింది. దూరంగా ఎక్కడో నదిఆవలిఒడ్డున కట్టెల ప్రోగుఒకటి భగభగ మండుతోంది. అన్నివైపులనుంచీ అంధకారం వచ్చి దానిని ఆలింగనంచేసుకుంటోంది. దానిని ఇంచుమించు తనలోకి పీల్చుకుంటోంది. అంధకారంలో ఆ మంట గజగజవణుకు తోంది. ఎర్రని చుక్కలాగా అతికష్టంమీద కంటికి కనిపిస్తోంది. మళ్ళీ అంతలో అగ్నిజ్వాలలు పై కెగశాయి. అంధకారం వెనుకంజ

వేసింది. అగ్నిజ్వాల ఊర్ధ్వముఖంగా ప్రయాణంచేయడం స్పష్టమే. తరువాత అది మళ్ళీ అణగిపోయింది.

"ఓ ప్రభూ! ఈశ్వరా!" బాధతో, విచారంగా పలవించ సాగాడు ఫోమా. దుఃఖం తీవ్రంగా అతని హృదయాన్ని బ్రద్దలు చేసుకుని ఉబికివస్తోంది "ఇక్కడ నేను ఒంటిగా ఉన్నాను. ఆ నిప్పు ఉన్నా నేను ఒంటరిగాణ్ణి. నాకు ఏమాత్రం వెలుగు రావడంలేదు. కేవలం ఆవిరి, పొగ తప్ప మరేంలేదు. ఎవడైనా ఒక తెలివిగల మనిషిని కలుసుకోగలనా! ఎవడో ఒకడు మాట్లాడడానికి. ఒంటిగా జీవించడం ఏమాత్రం నావల్ల అయ్యే పనికాదు. నేనేమీ చేయలేను. ఒక మనిషిని కలుసుకోవాలనే నా కోరిక."

దూరంగా నదిమీద రెండు పెద్ద ఎర్రటిమంటలు కని పించాయి. వాటికిపైన మూడోది. దూరంగా మందధ్వని ప్రతి ధ్వనించింది. ఏదో నలుపు ఫోమావైపుకు కదిలివస్తోంది. "ఒక స్టీమర్ ప్రవాహానికి ఎగువగా పోతోంది. అందులో నూరు మందికి పైగానే మనుష్యులు ఉండిఉండవచ్చు. కాని ఎవరూ కూడా నాకు ఒక్క ఆలోచనఅయినా చెప్పరు. వాళ్ళు ఎక్క డికి ప్రయాణంచేస్తున్నదీ వాళ్ళందరికీ తెలుసు. వారిలో ప్రతి ఒక్కరికీ ఏదోఒకటి తన స్వంతం అనేది ఉన్నది. ప్రతి ఒక్కడికి తనకేంకావాలో తెలుసు. మరి నేనూ? నాకేం కావాలి? ఆ విషయం నాకెవరు చెపుతారు? అలాంటి మనిషి ఎక్క డున్నాడు?" అనుకున్నాడు ఫోమా.

స్టీమర్ దీపాలు నదిలో ప్రతిఫలించి విచలితమౌ తున్నాయి. కాంతిమిళితమైన నదీజలాలు మందంగా మర్మర

ధ్వనులుచేస్తూ స్టీమర్‌కి దూరంగా తోసుకుని ప్రవహిస్తున్నాయి. స్టీమర్ పర్వతమంత నల్లటిచేప మాదిరిగా కనిపిస్తోంది.

ఈ భయంకర బాధాకరమైన రాత్రి గడిచిన కొద్దిరోజుల తరువాత ఫోమా మళ్ళీ వళ్ళుతెలీకుండా తాగి కైపులోపడ్డాడు. అతని సంకల్పానికి విరుద్ధంగా తలవనితలంపుగా సంభవించింది ఇది. తాగుడుమీదికి మనస్సు పోకుండా నిగ్రహించుకోవాలని నిశ్చయించుకున్నాడతను. అందుకని నగరంలో ఒక పెద్ద ఖరీదైన హోటలు కెళ్ళి అక్కడ భోజనంచేద్దామనుకున్నాడు. అక్కడైతే చౌకబారు సారాకొట్లలో మాదిరి అల్లరిచిల్లరి తాగుబోతు మూకంతా పోగుకాదనీ, తను ఒంటరిగా ప్రశాంతంగా ఉండవచ్చుననీ భావించుకున్నాడు. కాని అతననుకున్నట్టు జరగలేదు. హోటల్లో అడుగుపెట్టాడో లేదో, అక్కడ శాపానుఉంపుడుకత్తెగా తీసుకెళ్ళిన సారాకాపుదారుకొడుకు అతనికి తటస్థపడ్డాడు. ఫోమాను చూచీచూడ్డంతోటే పరుగెత్తుకుంటూ వచ్చి కౌగలించుకున్నాడు. సంతోషం పట్టలేక నవ్వసాగాడు.

"ఆహా! చిక్కనే చిక్కావు నాయనా! ఇక్కడతేలావే! నే నీ హోటలుకొచ్చి ఇవాళ్టికి మూడురోజులు. ఒంటరిగా తోచక చస్తున్నాను. నగరమంతా గాలించినా నాకు నచ్చిన మనిషి ఒక్కడూ కనిపించలేదు. చివరకు విసుగెత్తి పత్రికల వాళ్ళతో పరిచయం ఏర్పరుచుకున్నాను. మాంచి హుషారైన గుంపులే. మొదట్లో నన్నుచూచికాస్త వేషాలు వేయబోయారు. కాని, తరువాత చప్పబడ్డారు. అందరం చచ్చేట్టు తాగాం. మళ్ళీ ఇవాళ కూడా వాళ్ళిక్కడికి వస్తారు ఒట్టేసి చెపుతున్నాను. సోదరా! నిన్ను వాళ్ళకుపరిచయంచేస్తాలే. వాళ్ళలో న్యాయాలు

వ్రాసే రచయితకూడా ఒకడున్నాడు— ఒకమాటు నిన్నుగురించి వ్రాశాడే, అతను! అతని పేరేమిటి? భలే సరదాఅయినవాడులే! అలాటివాడు ఒక డెప్పుడూ వెంట ఉండాలి సోదరా. కాస్త డబ్బు మనది కాదనుకున్నావూ అంటే— నీఇష్టం. తైతక్క లాడతాడనుకో! ఇంతకూ నీవు భోజనంచేశావా?" అనడిగాడు సారాకాపుదారుకొడుకు.

అతను పొడుగ్గా ఉన్నాడు. ఎర్రనిముఖం. కపటంలేని మనిషి. గొంతుమాత్రం ఒక ఊరికి వినిపిస్తుంది. అతని అరుపులకు ఫోమా ఉక్కిరిబిక్కిరై చివరి కిలా చెప్పాడు:

"ఇంకాలేదు. సరేకాని అలెగ్జాండ్రా ఎలాఉంది?"

"ఎలాఉందా? నీ అలెగ్జాండ్రా వట్టి దండగచేటు. అంత వళ్ళుబరువుమనిషిని నే నెక్కడా చూళ్ళేదు. విచిత్రమైనపిల్ల! మాటాలేదు, పలుకూలేదు. దిగాలుపడి కూచుంటుంది. దాని పాడుగాను! అలాంటిదానితో ఎవడుంటాడు బాబూ! ముట్టుకుంటే కప్పపిల్లలా నీళ్ళుగారిపోతుంది! నేను దాన్ని వదిలెయ్యదలుచుకున్నాను."

"అవును. దానిదగ్గర హుషారుండదు." అన్నాడు ఫోమా, సాలోచనగా.

"ప్రతిమనిషి తన విధిని తాను చక్కగా నిర్వహించాలి. ఒకడికి ఉంపుడుకత్తెగా ఉన్నప్పుడు వాణ్ణి అన్నివిధాలా సుఖపెట్టి వాడికి కొత్తఊపిరి పొయ్యాలి. అబ్బె! దానిదగ్గర అలాటిలక్షణం ఏమీ లేందే! సరేకాని, ఒకచుక్క వేసుకుందామా?" అన్నాడు సారాకాపుదారుకొడుకు.

ఇంకేం? ఇద్దరూ తాగారు. మామూలుగానే మస్తుగా తాగారు.

సాయంత్రంవేళకు ఒక పెద్ద గుంపు హోటల్లో పోగయ్యింది. రొద బయలుదేరింది. ఫోమా మాంచి కైపుమీద ఉన్నాడు. కాని దిగులుగా నిశ్శబ్దంగా వున్నాడు. అక్కడ పోగైన గుంపుతో బరువైన కంఠస్వరంతో ఇలా మాట్లాడసాగాడు:

"అదీ నే నర్థంచేసుకున్నది: కొందరు మనుషులు పురుగులు, మరికొందరు పిచ్చుకలు. ఆ పిచ్చుకలే ఈ వర్తకులు. వీళ్ళు ఆ పురుగులను ముక్కులతో పొడుచుకుని తింటారు. అందుకే వీళ్లు పుట్టింది. అదే వీళ్ళపని. మరి మనబోటివాళ్ళం దేనికీ కొరగాము. వ్యర్థంగా, అనాలోచితంగా జీవిస్తున్నాం. మనము ఎవ్వరితోనూ పోలము. మనమంతా వ్యర్థులం, అప్రయోజకులం. మరి తక్కినవాళ్ళంతా దేని కుపయోగపడుతున్నారో! అదొక్కటే మీ రాలోచించాల్సిన విషయం. సోదరులారా! మనలో-మన అందరిజీవితాల్లో ఎప్పుడూ ఏదో ఒక విడ్డూరం-ఒక అతీతమైనది - ఉంటూనేఉంది. మన హృదయాలు అతీతమైనవి! మన జీవితాలు అతీతమైనవి! అదే ఇతరుల్లకూ మనకూ తేడా! స్నేహితులారా! అందుకే నేను దుఃఖిస్తాను. నేను దేనికోసం? నే నెందుకు పనికివస్తాను? నేను అసమర్థుణ్ణి, అప్రయోజకుణ్ణి! నన్ను చంపండి! చంపితేనన్నా చస్తానేమో! నాకు చావాలనిఉంది!"

ఫోమా ఏడ్చాడు. అతనికళ్ళవెంట బొటబొటమని నీళ్ళు కారాయి. తప్పతాగి నల్లగాఉన్న ఒక పిట్టంతమనిషి అతని దగ్గిరికి వచ్చాడు అతని సరసన కూచున్నాడు. అతనికి ఏదో

జ్ఞాపకంచేయడానికి ప్రయత్నిస్తున్నాడు. అతన్ని ముద్దాడడాన్కికి ప్రయత్నిస్తున్నాడు. తరువాత ఒక చాకుతో బల్లమీద పొడుస్తూ బిగ్గరగా అరవసాగాడు :

"నిజం, నిజం! అంతా నిశ్శబ్దంగా ఉండండి! ఈమాటల్లో మహాశక్తి ఉంది. ఈమాటల్లో మణిపూసలున్నాయి. మాట్లాడ నివ్వండి! రష్యన్ అంతరాత్మపలికే ఈ వేదవాక్కులు అందరూ వినండి! గర్జించు, గార్డియెవ్! గర్జించు! దిక్కులు పిక్కటిల్లేలా గర్జించు !" అన్నా డా పిట్టమనిషి. అలాఅంటూ అతను ఫోమా భుజాలు పట్టుకుని అతని వక్షస్థలంమీద పడ్డాడు. తన గుండ్రని తలను ఫోమాగడ్డంక్రింద దూర్చి అటూఇటూ నెరుమసాగాడు. అంచేత ఫోమాకు అతని ముఖాన్నిచూచే అవకాశం లేక పోయింది. ఫోమాకు అతనిపై కోపంవచ్చింది. అతన్ని అవతలికి నెడుతూ ఉద్రిక్తుడై అరవడం మొదలెట్టాడు.

"వెళ్ళు, వెళ్ళు! నీముఖం ఎక్కడుంది!"

తాగుడుగుంపంతా పగలబడి నవ్వింది. నవ్వులు, కేకలు మిన్నుముట్టాయి. సారాకాపుదారు కొడుకు ఎవరితోనో కేకలు పెడుతున్నాడు.

"నా దగ్గరికి రండి.! తిండి, తిప్పలు, పడక, పానం; అంతా నేనే చూస్తాను. నెలకు ఇంతని డబ్బు ఇస్తాను. ఆ కుక్కల ముఖాన ఆ కాగితం పారెయ్యండి. నేనింకా ఎక్కువ ఇస్తాను!" అని అరుస్తున్నా డతను.

గుంపంతా కైపెక్కి ఊగుతోంది. ఒకరి నొకరు తోసు కుంటున్నారు. ఒకరిమీద ఒకరు పడుతున్నారు. గుంపువచ్చి ఫోమామీద పడుతోంది. మళ్ళీ మధ్యమధ్య దూరంగా తప్పు

కుంటోంది. తను త్వరలోనే చితికి పచ్చడైపోతాననిపించింది థోమాకు. బ్రహ్మాండమైన తుపాను చెలరేగిన ఒక పెద్దనదిలో తాను ప్రయాణంచేస్తున్నట్టు థోమాకు అనిపించసాగింది. కాళ్ళు నిలదొక్కుకుంటూ భయంతో బిగ్గరగా అరవసాగాడు:

"మనం ఎక్కడికి ప్రయాణంచేస్తున్నాం? కెప్టెన్ ఏడీ?"

తాగుబోతుమూకంతా అర్థరహితమైన వికటాట్టహాసాలు చేస్తూ అతని ప్రశ్నకు సమాధానం చెప్పింది. ఆ నల్లటి పిట్టంత మనిషి, బొంగురుగొంతుతో ఒక పొలికేకపెట్టి ఇలా జవాబు చెప్పాడు: నిజం, నిజం! చుక్కానీ తెరచాపా లేని ఓడ మనది. కెప్టెన్ ఎక్కడున్నాడు? ఎక్కడ? ఏమిటీ? అహ్హాఅహ్హా హ్హా!"

థోమా ఈ పీడకలనుంచి మేలుకొనేసరికి, తానొక చిన్నగదిలో ఉన్నట్టు గ్రహించాడు. గదికి రెండు కిటికీ లున్నాయి. మొట్టమొదట అతనికంటపడింది ఒక ఎండిపోయిన చెట్టు – కిటికీఅవతలప్రక్కన ఆనుకునిఉంది. చెట్టుకు ఆకుల్లేవు. పెద్దపెద్ద ఎండిన కొమ్మలుమాత్రం కిటికీకి అడ్డంగా నిలబడి గదిలోకి వెలుగు రాకుండాచేస్తున్నాయి. బయట వర్షంపడుతోంది. కిటికీఅద్దాలమీద వానజల్లులు పడి పెద్ద ధ్వనిచేస్తున్నాయి. నీళ్ళు ధారకట్టిపోతున్నాయి. భూమిమీద పడే వాననీరు ఏడుస్తున్నట్టుగా ధ్వనిచేస్తోంది. అంతలో కాగితంమీద కలంపెట్టి వ్రాస్తున్న బరబర చప్పుడు, ఏదో గొణుగుడు వినిపించాయి.

థోమాకు తల భారంగాఉంది. తలంతా పగులగొట్టుకపోతున్నట్టుగాఉంది. తలగడమీద పెట్టుకున్న తల అతికష్టం మీద ప్రక్కకుతిప్పి చూచాడు. చిన్నమనిషి ఒకడు బల్ల

ముందు కూచునిఉన్నాడు. మనిషి నల్లగా అగుపిస్తున్నాడు. కాగితంమీద కలంపెట్టి బరబర రాసేస్తున్నాడు. తల అష్టవంకర్లు తిప్పుతున్నాడు. భుజాలు ఎగరేస్తున్నాడు. రాత్రిపూట వేసుకునే దుస్తులు వేసుకున్నాడు. మధ్యమధ్య కుర్చీని అటూఇటూ జరుపుకుంటున్నాడు. ఎడమచెయ్యి బల్లమీద గట్టిగా ఆనించి అప్పుడప్పుడు వేళ్ళతో నుదుటిమీద రుద్దుకుంటున్నాడు. అతని కాళ్లు, చేతులు, చెవులు; అన్ని అవయవాలూ కదులుతున్నాయి. కాళ్ళకు చెప్పుల్లేవు. అతను తల తిప్పి ఫోమావంక చూచాడు. అతని పల్చని పెదవులు అదురుతున్నాయి. ఏదో రహస్యంగా చెపుతున్నట్టు తోచింది. సన్నటి మీసం. కోటేరు లాంటి ముక్కు. ఇలాటి లక్షణాలతో ఉన్న ఆ చిన్న మనిషి ఫోమావంక చూచి చిరునవ్వు నవ్వాడు. అతని అవలక్షణాలు చూచి విసిగెత్తిపోయిన ఫోమా ఒకమాటు గదిఅంతా కలయ చూచాడు. గోడలకు పొడుగాటి మేకులు కొట్టి ఉన్నాయి. వాటికి వార్తాపత్రికలు తగిలించి ఉన్నాయి. గది పైకప్పుకూడా కాగితాలతోనే అంటించిఉంది. ఒకప్పుడు తెల్లటికాగితాలే అవి. కాని ఇప్పుడు బూజుపట్టి పొగచూరి నల్లగా కనిపిస్తున్నాయి. అక్కడక్కడ చిరిగి చీలికలు వ్రేలాడుతున్నాయి. నేలమీద మాసిన బట్టలు, బూడ్సులు, పుస్తకాలు, చిరిగిన కాగితంముక్కలు చిందరవందరగా పడేసిఉన్నాయి.

ఆ చిన్నవ్యక్తి చేతిలోకలం దించి, బల్లమీదికి వంగాడు. వ్రేళ్ళతో బల్లమీద దరువువేస్తూ మెల్లగా నీరసించిన కంఠస్వరంతో పాడసాగాడు.

"భయపడక నగారా మ్రోగించు!
వెనుచూడక సమరం సాగించు!
ఇదేనోయ్ దరిద్రులకు సందేశం!
ఇదేనోయ్ అభాగ్యులకు ఆదేశం!"

పాట విని ఫోమా బరువుగా నిశ్వసించాడు.

"నాకు కొంచెం కావాలి, ఇప్పిస్తారా?"అని అడిగాడు.

"ఆహా!" అంటూ ఆ చిన్నమనిషి కుర్చీలోంచి గెంతి ఫోమాదగ్గరికి వచ్చాడు. ఫోమా, శైనపుగుడ్డ పరిచిన చిన్న సోఫాలో పడుకుని ఉన్నాడు. "ఎలా ఉన్నావు స్నేహితుడా! సోడా కావాలా? కాగ్నాక్ కలిపి ఇవ్వనా? లేక వట్టి సోడా ఇవ్వనా?" అనడిగాడు మళ్ళీ.

"కాగ్నాక్ కలిపితే మంచిది." అన్నాడు ఫోమా, తదేకంగా ఆ చిన్నవ్యక్తి ముఖంలోకి చూస్తూ.

వెంటనే అతను తలుపు దగ్గరికి వెళ్ళి "ఎగొరోవ్నా!" అని కేకవేసి మళ్ళీ ఫోమావైపు తిరిగి "నీవు నన్ను గుర్తుపట్ట లేదా ఫోమా ఇగ్నాటిచ్?" అని అడిగాడు.

"ఏదో లీలగా జ్ఞాపకం ఉంది మనిద్దరం ఇదివరకెక్కడో కలుసుకున్నట్టుంది." అన్నాడు ఫోమా.

"ఒకమాటు కాదు. నాలుగేండ్లపాటు కలిసి ఉన్నాం. ఎప్పటి మాటోలే అది యెజోవ్!" అన్నాడా వ్యక్తి.

"ఆరి దేవుడా! నిజంగా నీవేనటోయ్?" అన్నాడు ఫోమా. ఫోమా నివ్వెరపోయాడు. మెల్లగా సర్దుకుని సోఫాలోంచి లేచాడు.

"ఒక్కొక్కమాటు నాకూ అలాగే అనిపిస్తుంది సోదరా! వాస్తవాలకూ సందేహాలకూ చాలా వ్యత్యాసముంది." వాస్త

వాలు ఇనపగుండ్లు. సందేహాలు రబ్బరుబంతులు! అన్నాడు యెజోవ్. అతనిముఖం విచలితమైంది. ఏకారణంవల్లనో గుండె మీద చేతులు పెట్టుకున్నాడు.

"సరే కాని, అప్పుడే నీ వెంత ముసలాడివై పోయావ్! ఆహా! నీ వయస్సెంత?" అనడిగాడు ఫోమా.

"ముప్ఫయ్."

"యాభై ఏండ్లవాడిలా కనిపిస్తునావు. ఏం? నీకూ బ్రతుకు భారంగానే ఉందా? చూడబోతే మస్తుగా తాగుతున్నట్టున్నావు కూడా."

తన చిన్ననాటి స్నేహితుడు, సహాధ్యాయుడు అయిన యెజోవ్‌ను అలాటి స్థితిలో చూడవలసివచ్చినందుకు ఫోమా విచారించాడు. అతను చిన్నప్పుడెంతో ఉల్లాసంగా చిచింద్రీలా ఉండేవాడు. ఇప్పు డొక అస్థిపంజరంలా అయిపోయాడు. ముడతలుపడ్డముఖం, లోతుగా గుంజుకుపోయిన దౌడలు, అలసిన కళ్ళు. మనిషి అన్ని విధాలా ఛిద్రమై చితికిపోయినట్టు కనిపిస్తున్నాడు. పాప మా దుర్బలుడు నీళ్ళసీసామీద మూత తీయడానికి విశ్వప్రయత్నం చేస్తుంటే, ఫోమాకు జాలివేసింది.

"అవును. బ్రతుకు నిన్ను పీల్చి పిప్పిచేసింది. ఎంతో కష్టపడి చదువుకున్నావుకూడా. శాస్త్రాలను ఎంత మథించినా అవి మనిషికి ఉపయోగపడేటట్టు లేవు" అన్నాడు ఫోమా.

"తాగు" అంటూ యెజోవ్, ఫోమాకు గ్లాసు అందించాడు.

"శాస్త్రాలు, సైన్సు దేవుళ్ళతాగే సారాయి. కాని అది వోడ్కామాదిరి బాగా పులియబెట్టి పొంగించలేదు.

అంచేతనే మనకు ఎక్కువ ఉపయోగపడకుండాపోయింది సైన్సు మనిషిసుఖానికి పనికిరాదు సోదరా! పైగా బ్రతుకుతున్న మనుషులు దాన్ని ఉపయోగిస్తే తలనొప్పి వస్తుంది కూడా. ఎందుకలా గటగట తాగేస్తున్నావు?" అన్నాడు యెజోవ్.

"నేనా? ఇంతకన్నా నేను చేయగల పనేముంది.?" అంటూ ఫోమా, నిండుగా నవ్వాడు.

యెజోవ్ నేత్రాలు అర్ధనిమీలితాలైనాయి. ఫోమా ముఖంలోకి సాన్వేషణగా చూచాడు. "నిన్నరాత్రి నీ వన్న మాటలు గుండెల్లో శూలాలు పొడిచినట్టుగా ఉన్నాయి. ఎంచేత అలా మాట్లాడావంటావ్? నాకు తెలుసు. నీకు బ్రతుకు పచ్చగాలేదు." అన్నాడు యెజోవ్.

ఫోమా బరువుగా నిట్టూరుస్తూ సోఫాలోంచి లేచాడు. "నాదీ ఒక బ్రతుకేనా? అర్థంలేని బ్రతుకు. ఒంటిగా బ్రతుకుతున్నాను. ఏ విషయమూ నా కర్థంకాదు. ఆశ్చర్యంవేస్తోంది. బ్రతుకుమీద తుపుక్కున ఉమ్మేసి దూరంగా ఎక్కడికో ఎవరి కంటా పడకుండా వెళ్ళాలనిపిస్తుంది. అన్నిటికీ దూరంగా పోవాలనిపిస్తుంది. బ్రతుకు భరించలేకున్నాను." అన్నాడు ఫోమా వెగటుపుట్టినట్టుగా.

"గొప్పగా చెప్పావు. బ్రతుకుమీద అసంతృప్తి అనేది వర్తకశిఖామణుల విలాస శయనాగారాల్లోకి చొచ్చుకుని పోయింది. వాళ్ళు తాగే పానీయాల్లోనూ, తినే కాబేజీపులుసులోనూ పడి చచ్చిన లక్షలాది మానవకోటి అంతరాత్మల్లో

నృత్యంచేసింది. చెప్పు స్నేహితుడా! నీ కథంతా పూసగుచ్చి నట్లు చెప్పు. ఒక నవల వ్రాసుకుంటాను.'' అన్నాడు యెజోవ్.

''ఇదివరకే నన్ను గురించి ఏదో వ్రాశావటగా ?'' అనడిగాడు ఫోమా, తన మిత్రునిముఖంలోకి సాన్వేషణగాచూస్తూ.

''అవును. వ్రాశాను. దాన్ని నీవు చదివావా?''

''లేదు. అవకాశం దొరకలేదు.''

''ఏం వ్రాశానని నీకు చెప్పారు?''

''ఏదో నన్ను తెలివిగా తిట్టావట''

''ఊ! ఇంతకూ నీవు చదవలేదుగదా !''

''చదువుతాను. నన్ను గురించి అంతగా వ్రాసింది చదవకుండా ఉంటానా ?

యెజోవ్ కూడా తనలాగే అంతగా ఎందుకు భ్రష్టుడై పోయాడో అడిగి తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది ఫోమాకు. చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకున్నందువల్ల ఫోమా హృదయంలో ఒకవిధమైన కరుణ, జాలి కలిగాయి. తన బాల్య జీవితమంతా జ్ఞప్తికివచ్చింది. ఒక్కమాటు ఆ మధురస్మృతులన్నీ మనస్సులో మెరిశాయి. చినచిన్న దీపకాంతుల్లా కుండా ఉంటానా?''

యెజోవ్ కూడా తనలాగే అంతగా ఎందుకు బ్రష్టుడై పోయాడో అడిగి తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది ఫోమాకు. చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకున్నందువల్ల ఫోమా హృదయంలో ఒకవిధమైన కరుణ, జాలికలిగాయి. తన బాల్య జీవితమంతా జ్ఞప్తికివచ్చింది. ఒక్కమాటు ఆ మధుసర్మృతులన్నీ మనస్సులో మెరిశాయి. చిన్న చిన్న దీపకాంతుల్లా కళ్ళ

ముందు తళుక్కుమన్నాయి యుజోవ్ బల్లదగ్గిరికి వెళ్ళి రెండు గ్లాసుల్లో టీ పోసి తీసుకొచ్చాడు. "రా. టి తాగు. నీ విషయ మంతా నాతో చెప్పు" అన్నాడు యెజోవ్.

"చెప్పాల్సిందేమీ లేదు. బ్రతుకులో ఏ విషయాన్నీ నేను చూడలేదు. శూన్యమైన జీవితం నాది! నీ విషయం నీవు నాకు చెప్పు. ఎలాగైనా నీవు నాకంటే తెలివైనవాడివి. చదువు కున్నవాడివి. ఏదో ఒక విశేషముంటుంది." అన్నాడు ఫోమా.

ఇద్దరూ టీ తాగిన తరువాత యెజోవ్ చెప్ప నారంభించాడు.

"అవును సోదరా! బ్రతుకులో నేను చాలా చూచాను. నాకో మాస్టరుండేవాడు. అతని పేరు సాచ్‌కోవ్. ఇప్పు డతనొక పెద్ద డాక్టరు. 'నీవు గొప్పవాడివవుతావు. బాగా చదువుకో' అంటూండేవాడు నన్ను. నేనల్లా ఏముంది చెప్పు? నీకు తెలుసు కదా? పేదకుటుంబంలో పుట్టినవాణ్ణి. కోర్టులో జవానుకొడు కంటే ఎవడు చూస్తాడు. మాబోటివాళ్ళకు చదువే పెద్ద ధన రాశి. చదువుకుని విజ్ఞానం సంపాదించి, నన్ను నేను బాగుచేసు కోవడమే కాకుండా, దేశానికీ సంఘానికీ సేవ చేయాలను కున్నాను. మాస్టరు చెప్పినట్టు కష్టపడి చదువుకున్నాను. అతని మాటలునమ్మాను, పతితమానవకోటికి వెలుగును సత్యాన్ని ప్రసాదించాలని ఆశించాను. కాని ఆ మాస్టరు వట్టి దున్నపోతు. వాడిమాటలు నమ్మి చెడ్డాను. ఇప్పటికి ఇరవై ఏండ్లు గడిచినా మేము – సామాన్య ప్రజానీకం ఇంతగా వృద్ధిపొందినా – మాకు మోక్షం కలగలేదు. విజ్ఞానం సంపాదించనూ లేదు. బ్రతుకులో వెలుగు చూడనూ లేదు. పూర్వంలాగానే ఇప్పటికీ రష్యాదేశం

దీర్ఘవ్యాధితో కుళ్ళిపోతోంది- అంతులేని వెధవలతోనూ పుండాకోర్లతోనూ దేశం నిండిపోయింది! కాని మేము - సామాన్య ప్రజలమైన మేమూ వాళ్ళ గుంపులోనే కలిసి పోతున్నాం మళ్ళీ అంటున్నాను - మా మాస్టరు వట్టి మొద్దు, అసమర్థుడు. మేయరు చేతుల్లో కీలుబొమ్మ. అతనెలా ఆడిస్తే అలా ఆడతాడు. కాని నేనూ సంఘంలో ఒక హాస్యగాణ్ణి అయిపోయాను. నన్ను గురించి ఈ నగరమంతటా తెలుసు సోదరా. నే నలా బజారునపోతోంటే, 'అడుగో యొజోవ్! ఉపన్యాసాలు ఉఫ్‌న ఊదేస్తాడు! ఎంత తెలివిగా తిడతాడను కున్నారు!' అని ఒకరితో ఒకరు చెప్పుకుంటూ పోతుంటారు జనం. ఇలాటి పేరు సంపాదించడం కూడా సామాన్యమైన పని కాదు సోదరా!"

యొజోవ్ ముఖం ముడతలుపడింది. ముఖాన్ని అష్టవంకరలు తిప్పుతూ చప్పుడుకాకుండా పెదవులతోనే నవ్వసాగాడు.

"ఇంతకూ నీ వనుకున్నది సాధించలేకపోయావన్న మాట!" అన్నాడు ఫోమా.

యొజోవ్ కుర్చీలోంచి గభాలున దుమికి కీచు గొంతుతో మళ్ళీ చెప్పసాగాడు:

"ఎవడైనా జీవితంలో పవిత్రుడుగా బ్రతకాలంటే, స్వేచ్ఛను పొందాలంటే, వాడికి అంతులేని శక్తిసామర్థ్యాలుండాలి నాకు ఉన్నాయి. నాకు అంతులేని తెలివితేటలు, ధారణశక్తి ఉన్నాయి. అందర్నీ ఆకర్షించేశక్తి ఉంది. కాని వీటన్నిటినీకూడా నాకు ఉపయోగపడని చముర్లకోసం, విజ్ఞానం కోసం వ్యర్థంచేసుకున్నాను. అమూల్యమైన కాలాన్నంతా

తగలబెట్టుకున్నాను పొట్టకోసినా అక్షరంలేని శుద్ధమొద్దుల గుంపునంతా పోగుచేసుకుని తల పగులగొట్టుకుంటూ వాళ్ళకు ఆరేండ్లపాటు చదువుచెప్పాను. ఇంతచేసికూడా వాళ్ళ తల్లి దండ్రులచేత అడ్డమైన్నతిట్లూ తిన్నాను. తినడానికి రొట్టె, తాగ డానికి టీ సంపాదించుకునేసరికే నాకు తలప్రాణం తోకకు వచ్చింది. కాళ్ళకు చెప్పుల్లేకుండా తిరిగాను. ధర్మసంస్థలచుట్టూ తిరిగి సహాయం చేయమని దరఖాస్తులు దాఖలుచేసుకున్నాను. దరిద్రుణ్ణనీ, అప్పుగానైనా డబ్బివ్వమనీ అర్థించాను. కాని లోకోద్ధారకులని చెప్పుకునే ఆ ధర్మపరులకు కాస్తయినా దయా దాక్షిణ్యాలున్నాయా? ఎందరి ఆత్మలను హింసిస్తు న్నారో వాళ్ళు అర్థంచేసుకున్నారా? వాళ్ళు రొట్టెకోసం దానంచేసే ప్రతిరూబుల్ లోనూ తొంభై తొమ్మిదిపాళ్ళు కాల కూటవిషమున్నదని వాళ్ళు గమనించారా? గర్వం, అహంకా రం తప్ప తమలో ఏ ధర్మగుణం లేదని వాళ్ళు గ్రహించారా? ధర్మం ఇచ్చేవాడు నీచుడు! దాన్ని పుచ్చుకునేవాడు అంత కంటె నీచుడు!

అలా చెపుతూ యెజోవ్ తప్పతాగినవాడికిమల్లే గదిలో చిందులు తొక్క నారంభించాడు. పళ్ళు కొరుకుతున్నాడు. తల ఊపుతున్నాడు. విరిగిన పక్షిరెక్కల్లా చేతులు గాలిలో ఆడిస్తున్నాడు. నిప్పుమీద సలసలకాగే నీళ్ళమాదిరిగా ఉన్నా డతను. ఫోమా అతనివంక ఆశ్చర్యపోయి, నిర్ఘాంతపోయి చూచాడు. ఫోమాకు అతనిమీద జాలికలిగింది. తిరిగీ అదే సమయంలో అతనలా బాధపడుతున్నాడుకదా అని సంతసిం

చాడుకూడా. "నేనొక్కణ్ణేకాదు ఇలా బాధపడేది. అతనుకూడా" అనుకున్నాడు ఫోమా తనలో.

యెజోవ్ తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తూనేఉన్నాడు. పటపట పగిలిన గాజుముక్కల్లా ఉంది అతని గొంతు. సంఘ ద్రోహులనే పేరుపెట్టి అందరినీ తిట్టిపోస్తున్నాడు. పైగా పెద్ద మనుష్యులుగా తిరిగేవారంతా సామాన్యప్రజానీకాన్ని ఎలా పీల్చి పిప్పిచేస్తున్నదీ, వాళ్ళనెంతగా హింసిస్తున్నదీ వివరించి చెపుతున్నాడు. "అతను ఎవర్ని తిడుతున్నట్టు? నాకేం అర్థం కావడంలేదు. మొత్తానికి తీవ్రంగా గాయపడ్డమనిషిలా మాత్రం కనిపిస్తున్నాడు." అనుకున్నాడు ఫోమా. అతన్ని అలా కొంత సేపుమాట్లాడనిచ్చి "బాగుందికాని, నీ ఈ మాటలన్నీ మనుష్యుల ముఖాన్నే అనగలవా?" అని అడిగాడు ఫోమా.

"తప్పకుండా ! అవకాశం వచ్చినప్పుడల్లా ఇలాటి మాటలు లక్ష అంటున్నాను. ప్రతి ఆదివారం వార్తాపత్రిక లో వ్యాసాలు వ్రాస్తున్నానుకూడా. కావాలంటే నీకు కొన్ని చదివి వినిపిస్తాను." అన్నాడు యెజోవ్.

ఫోమా సమాధానం చెప్పకముందే అతను గోడకున్న పత్రికలు కొన్ని చింపి వాటిలో విషయాలు చదవడం మొదలెట్టాడు. అలా చదివేటప్పుడు, రకరకాలుగా అభినయిస్తున్నాడు. గర్జించడం, వికృతంగా నవ్వడం, చిందులు తొక్కడం, చేతులూపడం; రకరకాల భంగిమల్లో గదంతా కలయ తిరుగుతున్నాడు. గొలుసు తెంచుకోడానికి యత్నిస్తున్న కుక్కలాగా దంతాలు బయటికిపెట్టి కొరుకుతున్నాడు. యెజోవ్ అనేకమందిని పేరు పేరు పెట్టి పత్రికలో తిట్టిపోశాడు. అవి వింటోంటే వారిలో

చాలామంత్రి వరకులు ఫోమాకు తెలిసినవాళ్ళే అనడంచేత అతను "తేలుకొండిలా ఎంతబాగా వీళ్ళందరినీ తిట్టిపెట్టాడు!" అనుకున్నాడు. అతని ఉపన్యాసధోరణికి ఫోమాకూడా ఉద్రిక్తుడవుతున్నాడు. అతని ఉద్రేకాన్ని చూచి యెజోవ్ ఇంకా ఉత్సాహం తెచ్చుకుని పత్రిక చదువుతున్నాడు. "మనుష్యుల్ని ఇలా నిందించి అవమానిస్తే దేవుడు నిన్ను మెచ్చుకోడు." అన్నాడు ఫోమా చివరకు విసుగెత్తి.

"నీవు ఊరుకో! ఒక్కక్షణం ఆగు!" అంటూ యెజోవ్ మళ్ళీ పత్రిక చదవసాగాడు.

చదవడం పూర్తిఅయిన తరువాత "అంతా విన్నావు కదా? ఇంతకూ నీవేమంటావు?" అని అడిగాడు యెజోవ్. "మొత్తంమీద నాకంత బాగా అర్థంకాలేదు. కాని శక్తికి సంబంధించినంతవరకూ నీవు చెప్పినవిషయాలు సత్యమే. అయినా నా మటుకు నేను శక్తివినియోగించాల్సిన పనిలేనప్పుడు దానితో అవసరమేముంది.? నేను దొంగలతో యుద్ధమన్నా చెయ్యాలి లేదా నేనే దొంగగా మారిపోవాలి. మొత్తంమీద నాకేదో పెద్దపని చేయాలనిఉంది. ఆపని బుద్ధితో కాకుండా చేతులతోను, రొమ్ములతోను చెయ్యాలి. మరి నేను చేసే పనేముంది? దుకాణానికి పోవడం అక్కడ రూబుల్ సంపాదించడం. దేనికా రూబుల్ ? దాంతో ఏంచేసుకోను? నాకు కావల్సింది స్వేచ్ఛ. అది దొరకలేదు. నీవు చెప్పే విషయాల్లోకూడా నాకది కనిపించడంలేదు" అని జవాబుచెప్పాడు ఫోమా.

"నీతెలివి అంతలో ఉన్నదన్నమాట. చదువుకుంటే ఇలా మాట్లాడవు. పుస్తకాలేమైనా చదివావా?"

"లేదు. అసలెవడికి కావాలి ఆ పుస్తకాలు! అవి ముట్టుకోవడమంటేనే నాకు భయం. ఇలాగే ఒకమ్మాయి నాకు తెలుసు. తాగుడుకంటే జాస్తి ఆమె చదువు పిచ్చి! అయినా వాటిమీద ఎందు కంతమోజు? ఎవరో ఏదో ఆలోచించుకుని వ్రాస్తాడు. దాన్ని అచ్చువేస్తాడు. ఇతర్లు చదువుతారు. చదువుంటే సరదాగా ఉంటే మంచిదే. కాని చదువుకుంటే జీవించడం తెలుస్తుందా? అంతా అబద్ధం. పుస్తకాలు వ్రాసింది కూడా మనలాంటి మనుష్యులే, దేవుళ్ళుకారు" అన్నాడు ఫోమా.

ఇలా కొద్దిరోజులు గడిచాయి. ఫోమా, యెజోవ్ నిత్యం కలుసుకుంటూ కబుర్లతో ప్రొద్దుపుచ్చుతున్నారు. ఒకనాడు యెజోవ్ ఫోమాతో "నీవు చిత్రమైనవాడివి. ఇవాళ మనం మస్తుగా తాగుదాం. మన స్నేహితులంతా ఒక సంఘం పెట్టారు. "ప్రెస్ వర్కర్ల యూనియన్." ప్రచురణకర్త దగ్గర నుంచి పనిఅంతా కంట్రాక్టు పద్ధతిలో కుదుర్చుకొనడానికి నిశ్చయించుకున్నారు. వాళ్ళు నన్ను రమ్మని ఆహ్వానం పంపారు. ఇద్దరం వెడదాం. కులాసాగా తాగుదాం" అన్నాడు.

ఫోమా సమ్మతించాడు. ఆసాయంత్రం ఊరి వెలుపల నున్న తోటలో స్నేహితులంతా సమావేశమయ్యారు. ప్రెస్‌లో పనిచేసే పన్నెండుమంది కంపోజిటర్లు శుభ్రంగా దుస్తులు వేసుకునివచ్చారు. ఫోమా, యెజోవ్ కూడా హాజరైనారు. ఫోమాను తన మిత్రులందరికీ పరిచయంచేశాడు యెజోవ్. వారంతా

తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. థోమా ఒక గచ్చపొద పక్కన క్రింద పడుకుని ఆ అపరిచితులను పరిశీలిస్తూ, వారి మధ్య తానొక బాటసారినని భావించుకోసాగాడు. కాని యెజోవ్ మాత్రం వాళ్ళలో సులభంగా కలిసిపోయాడు. వాళ్ళతో నవ్వుతూ, పేలుతూ, బ్రాందీ సీసాల మూతలు ఊడ దీస్తూ మహా ఉత్సాహంగా ఉన్నాడు. మామూలు కంటె ఆ నాడు యెజోవ్ అతి సామాన్యమైన దుస్తులు ధరించాడు కూడా.

"స్నేహితులారా! సోదరులారా! మీఅందరిమధ్య నా కెంతో ఆనందంగాఉంది. కాని నే నెవర్ని? కేవలం ఒక కోర్టు బంట్రోతు కొడుకును!........" ఇలా చెప్పుకపోతున్నాడు యెజోవ్.

థోమాకు ఆశ్చర్యం కలిగింది. "ఆ మాట దేనికీ చెప్పడం? తాను ఎవరికొడుకైతేమాత్రం ఏం? ఏమైనా తేడా ఉందా? తన తెలివినిబట్టి మనిషి గౌరవింపబడతాడు కాని, తండ్రినిబట్టికాదే!" అనుకోసాగాడు థోమా, తనలో

సూర్యుడు పశ్చిమాద్రిని చేరుతున్నాడు. ఒక పెద్ద నిప్పుముద్దలా కనిపిస్తున్నాడు. ఆకాశమంతా బంగారుకాంతులు విరజిమ్ముతున్నాయి. అడివిఅంతా నిశ్శబ్దమవుతోంది.

యెజోవ్ గంటకొట్టినట్లు మాట్లాడుతున్నాడు. శ్రమను గురించీ, శక్తినిగురించీ మాట్లాడుతున్నాడు. కార్మికలోకాని కేదో గొప్ప సందేశాన్ని ఇస్తున్నాడు. "మీరంతా పవిత్ర మైన కార్మికలోకానికి చెందినవాళ్లు. మీరంతా ఒకే పతాకం క్రింద నిల్చుని పనిచేస్తున్నారు........" చెప్పుకపోతున్నాడు యెజోవ్.

"అదంతా నిజమే నిక్రోలేమాట్విచ్! కాని మీరు మా కోసం ప్రచురణకర్తతో మాట్లాడాలి. మీ మాటను, పరపతిని ఉపయోగించాలి. జబ్బునపడటం, తాగటం ఒకేవిధంగా పరిగణించడానికి వీల్లేదు. కాని ఆ ప్రచురణకర్త విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. ఎవరైనా తాగితే, ఒక రోజు జీతం జుల్మానాక్రింద చెల్లించాలంటున్నాడు. జబ్బునపడ్డా అంతే. కాని జబ్బునపడ్డప్పుడు అది నిజమని రుజువుపర్చడంకోసం మేము డాక్టరు సర్టిఫికెట్టు దాఖలుచేసుకోవాలి. అందుకు అతనుకూడా మా స్థానంలో మరొకర్ని పనికి పెట్టుకుని జబ్బునపడ్డ వ్యక్తికి సగం జీతమైనా ఇవ్వాల్సిఉంటుంది. లేకపోతే మేము పనిచేయడం కష్టం. హఠాత్తుగా మంచాన పడితే మాకు దిక్కెవరు?" అన్నాడు గుంపులోంచి ఒకడు.

"అవును. అదంతా ప్రచురణకర్త బాధ్యతే. కాని మిత్రులారా! మీ అందరూ కలయికతో కట్టుగాఉండాలి." అన్నాడు యెజోవ్.

వాళ్ళ సందేహాలు, సమస్యలు—ఒక్కటికూడా ఫోమాకు అర్థంకావడంలేదు. కొందరు 'పెళ్ళిళ్ళు చేసుకోవడానికి, బిడ్డల్ని కనడానికీ మనకు తాహతులేదు" అంటున్నారు. మరికొందరు ఇంకా ఏదేదో చెపుతున్నారు. "భవిష్యత్తు మీదే! మీ చేతులతో మీరే నిర్మించాలి భవిష్యత్తును! అని ఉపన్యాసమిస్తున్నాడు యెజోవ్.

అందరూ గ్లాసుల్లో బ్రాందీ పోసుకున్నారు. "హుర్రా!" అని అరుస్తూ తాగుతున్నారు. "ఇప్పుడు మనమొక పాట పాడదాం." అన్నాడొక లావుగాఉన్న వ్యక్తి.

"అలాగే, రండి, రండి! అని కేకలువేశారు మరో ఇద్దరు.

కాని అంతలో మళ్ళీ యెజోవ్ లేచి నిలబడ్డాడు. బ్రాందీ గ్లాసు ఖాళీచేశాడు. మనిషి భూమికి బెత్తెడెత్తున లేచి ఉపన్యాసం ప్రారంభించాడు.

"సోదరులారా! ఇక నా తుదివాక్యాలు కొన్ని చెప్ప దలచాను........."

మళ్ళీ అంతా నిశ్శబ్దం. అందరూ యెజోవ్ వంక ఆసక్తితో ఆతృతతో చూడసాగారు.

"ఇక్కడున్నవారిలో ఇద్దరు వ్యక్తులు బ్రతుకును త్యజించారు. అందులో ఒకణ్ణి నేను—రెండో అతను ఆ కనిపించే ఎద్దంత మనిషి. మే మిద్దరంకూడా మనుష్యులందరికీ స్వేచ్ఛ, సుఖం కలగాలని వాంఛిస్తున్నవాళ్ళమే." అని చెప్పసాగాడు యెజోవ్.

అది విని గుంపులోంచి ఒకడు "నికొలేమాల్యోచ్! అతిథిగా వచ్చిన ఆ పెద్దమనిషిని అవమానించడం మనకు మంచిది కాదు." అన్నాడు.

"మనం ఇక్కడికొచ్చింది తాగి హాయిగా గడపడానికి మాత్రమే." అన్నాడు మరొకడు.

"అవును. ఆ పెద్దమనిషి పేరు ఇప్పు డనవసరం." అన్నాడు మూడోవ్యక్తి.

"మూర్ఖులారా! దయగల మూర్ఖులారా! అతన్ని జాలితలుస్తున్నారా? కాని అతనెవరో మీకు తెలుసా? మీ నెత్తురుపీల్చేవాళ్ళలో అతనూ ఒకడు!" అన్నాడు

యొజోవ్, ఉద్రిక్తుడై. "ఇక చాల్లెండి" అన్నారు మళ్ళీ గుంపు, యొజోవ్‌తో.

"సరే, మరికొంచెం తాగుదామా? లేక ఇళ్ళకు పోదామా" అన్నాడు ఒకవ్యక్తి.

"ఇల్లా? మనుష్యులలోనే చోటులేని మనవంటివాళ్ళకు ఇల్లెక్కడుందోయ్?" అన్నాడు యొజోవ్.

తరువాత యొజోవ్ ఫోమాను సమీపించి "ఇక్కణ్ణుంచి వెళ్ళిపోదామా?" అని అడిగాడు.

"ఇంకా కొంతసేపున్నా పర్వాలేదు. వీళ్ళంతా చాలా తెలివిగా, గమ్మత్తుగా ప్రవర్తిస్తున్నారు. అయినా వెడదాంపద!" అన్నాడు ఫోమా.

ఫోమా లేచినిల్చున్నాడు. తలమీద టోపీ తీసి కంపోజిటర్లతో "వెడతాను. సెలవు. మీరు చూపిన ఆదరాభిమానాలకు ఎంతో కృతజ్ఞుణ్ణి!" అని సవినయంగా అన్నాడు.

"వద్దు. ఇక్కడే ఉండండి! ఇప్పుడెక్కడికి వెడతారు? మేమంతా కలసి పాటలు పాడతాం." అన్నారు కంపోజిటర్లు, అతనిచుట్టూ మూగి. "లేదు. క్షమించండి. నేను వెళ్ళాలి." అన్నాడు ఫోమా.

"ఒక్క క్షణం ఆగండి! మీవెంట తోడుగావచ్చి మిమ్మల్ని దిగబెడతాంలెండి!" అన్నాడొకడు మెల్లగా.

ఫోమాకు వాళ్ళతో ఉండాలనేఉంది. మళ్ళీ ఎందుకో భయంగాకూడాఉంది. అంతలో యొజోవ్ ఫోమాకోటు పట్టుకుని "మనం వెడదాం రా! వాళ్ళు పాడుగాను, వాళ్ళగోల వాళ్ళు పడతారులే" అంటూ ఫోమాను తీసుకెళ్ళారు.

ఇద్దరూ కాస్తదూరం ఇవతలికి వచ్చినతరువాత "వాళ్ళంతో సంతోషంగా గడుపుదామనుకుంటే, నీవు అలాంటి ఉపన్యాసాలతో వాళ్ళ ప్రాణాలు తీస్తావేమిటి?" అని అడిగాడు ఫోమా.

"ఇక ఊరుకో. నీకు బుర్ర లేదు. నేను తాగిఉన్నాననుకున్నావా? నా శరీరం కైపెక్కిందిగాని, ఆత్మ తెలివిగానేఉంది. అదెప్పుడూ తెలివిగానేఉంటుంది! వాళ్ళంతా ఎటువంటివాళ్ళో ఎరుగుదువా? స్నేహం, సౌభ్రాతృత్వం, ప్రేమ, పవిత్రత; ఇవన్నీ వాళ్ళల్లోనే ఉన్నాయి." అన్నాడు యెజోవ్.

"ఈ సాధారణమైన మనుష్యుల్లోనా? ఏమో! మొత్తానికి వీళ్ళను చూస్తే సరదాగానే ఉంటుంది. రైతులు, కార్మికులు, వీళ్ళను చూస్తే, సరిగ్గా గుర్రాలను చూచినట్టుంటుంది. వాళ్ళు గుర్రాల మాదిరిగానే బరువులు మోస్తారు." అన్నాడు ఫోమా.

"వాళ్ళు మన జీవితాలను వీపునవేసుకుని మోసుకుపోతున్నారు తెలుసా? గుర్రాల మాదిరిగానే, అజ్ఞానంతోనూ, అడకువతోనూ. కాని వాళ్ళ అడకువ, అజ్ఞానంమనకుకలిగే దురదృష్టం. మనకు పెట్టిన శాపం!" అన్నాడు యెజోవ్.

అలా అంటూ యెజోవ్ అకస్మాత్తుగా మారిపోయాడు. నరనరాలు పెకల్చుకుని ఉద్రేకం తెచ్చుకున్నాడు. అవతల్నుంచి కంపోజిటర్లు పాడేపాట మందంగా వినిపిస్తోంది. యెజోవ్ కూడా గొంతెత్తి పాడసాగాడు.

"నాబ్రతుకే నను క్రూరంగా వంచించెను!
నాబ్రతుకేనను తీవ్రంగా హింసించెను!"

"అబ్బాయ్! ఈ గీతాలు నేను స్వయంగా వ్రాసిన వోయ్!" అన్నాడు పాడడం ఆపి యెజోవ్ మళ్ళీ.

"ఎన్నెన్ని కలలుకన్నాను నేను!

అన్ని నా ఎదలోన అణగారిపోయె!" అని పాడి "తమ్ముడూ! నాకంటె నీవే సుఖివి, ఎంచాతంటే నీవు మూర్ఖుడవు. మొద్దువు, మరి నేను--" అన్నాడు ఫోమాతో.

"ఏమిటా అధిక ప్రసంగం? వాళ్ళెలా పాడుతున్నారో విను." అన్నాడు ఫోమా ఉద్రిక్తుడై.

"ఒకరి పాటలు వినాల్సిన అవసరం నాకులేదు. నా పాటలు నాకున్నాయి. నాపాటలు నేనే పాడుకుంటాను. బ్రతుకులో పగిలిపోయిన హృదయగీతం అది." అంటూ యెజోవ్ మళ్ళీపాడాడు —

"ఎన్నెన్ని కలలుకన్నాను నేను!
అన్ని నా ఎదలోన అణగారిపోయె!
తీయ తీయని కలలు తిరిగి రావింక!
బ్రతుకు నా కలలను భగ్నంబుచేసె
పూలవంటి కలలు బూదియైపోయె!
ఎన్నెన్ని కలలుకన్నాను నేను!"

యెజోవ్ పాడడం ఆపి "తమ్ముడూ! నా స్వప్నాలు, ఆశలు ఒక అందమైన పూలతోట తమ్ముడూ! దాన్ని దగ్ధం చేశారు! మలమల మాడ్చివేశారు! అంతా నాశనమైపోయింది. ఇక నా హృదయంలో మృత్యువు తప్ప మరేం లేదు. పూలవంటి నాకలలన్నీ శవాలై పొర్లాడుతున్నాయి తమ్ముడూ!" అంటూ పెద్ద పెట్టున ఏడ్వసాగాడు. స్త్రీలాగా, శిశువు లాగా

ఏడ్వసాగాడు యెజోవ్. ఫోమాకు అతనిపై జాలివేసింది. అతని భుజం పట్టుకుని "ఏడవకు! నీవు నాకంటె బలహీనుడివిగా కనిపిస్తున్నావు తమ్ముడూ! ఊరుకో!" అని ఓదార్చాడు ఫోమా.

దూరంగా చీకటి. నిశ్శబ్దం. వాటిలోంచి వినవస్తున్న కార్మికుల గీతం. ఫోమా నల్లటిగోడ మాదిరిగా ఉన్న అడివి వంక చూచాడు. కార్మికులు పాడే గీతం అడివిలో ప్రతిధ్వనిస్తున్నట్టుగా ఉంది.

ఫోమాప్రక్కన నిల్చున్న యెజోవ్ మళ్ళీ విషాద కంఠ స్వరంతో పాడసాగాడు:

"ఓ ప్రభూ నా గానం విను!

నా వీణాగానం విను!

నా ఈ తుదిగానం విను !

నా ఆత్మకు శాంతి నివ్వు!"

అలా పాడి అతను వివశుడై నేలమీద పడిపోయాడు. ముఖంతో నేలను రాచుకుంటూ జబ్బుతో ఉన్న శిశువులా ఏడ్వసాగాడు.

"నికోలాయ్! ఏమిటిది? ఇలాఅయిపోయావేం? నీకు సిగ్గనిపించడంలేదా?" అన్నాడు ఫోమా అతని రెక్కపట్టుకుని లేవదీస్తూ.

కాని అతను సిగ్గుపడలేదు. నీళ్ళలోంచి బయటపడ్డ చేపలా అతను నేలమీదపడి గిజగిజ తన్నుకున్నాడు. ఫోమా లేవనెత్తబోతే, తన చేతులు అతనిభుజాలమీదవేసి అలాగే ఏడుస్తూ కూచున్నాడు.

"వెడదాం రా. కాస్త శాంతించు. తమ్ముడూ !" అన్నాడు ఫోమా, గట్టిగా.

బ్రతుకుమీద కోపంతో రగిలిపోతున్న ఫోమా, తన మిత్రుణ్ణికూడా జీవితం ఎంత బాధిస్తున్నదో చూచాడు. ఆ అంధకారంలో మిణుకుమిణుకుమను దీపాలతో మెరుస్తున్న నగరంవైపు తలెత్తి చూచాడు. అతనిహృదయం పగతో జ్వలించిపోయింది.

"పిశాచాల్లారా! మిమ్మల్ని శపిస్తున్నాను!" అని అరిచాడు ఫోమా.

## పదకొండో అధ్యాయం.

ఒకనాడు మయకిన్ సరుకు కొనుగోలు అమ్మకాలు జరిగే వ్యాపారకూడలినుంచి ఇంటికి వచ్చాడు. రాగానే కుమార్తెను పిలిచాడు.

"అమ్మాయ్, లూబా! ఇవాళ సాయంత్రం పెళ్ళికొడుకు వస్తున్నాడు. అంతా సిద్ధంచేసి ఉంచాలి. వంటతయారు చేయించు. వంటకాలు ఎలా ఉండాలో తెలుసా? ఘనంగా ఉండాలి. కమ్మగా ఉండాలి. తరువాత మన పాత వెండిసామానులన్నీ బయటపడెయ్యి. పండ్లూ, ఫలహారాలూ పెట్టే పాత్రలుకూడా. టేబుల్ మీద చూడగానే కళ్ళు చెదిరిపోవాలి అబ్బాయికి! తెలిసిందా? మన తాహతు, మన దర్జా, మన కున్న విలువైన వస్తుసంపద; అంతా అతని కళ్ళముందు కనిపించాలి! ఏమనుకున్నావో!" అన్నాడు మయకిన్, కుమార్తెతో.

లూబా కిటికీ దగ్గర కూచుని తండ్రి మేజోళ్ళు బాగు చేస్తోంది. ఆమె తలవొంచుకుని పూర్తిగా తన పనిలో నిమగ్నురాలై ఉంది.

"ఈ ఆర్భాటమంతా ఎందుకు నాన్నా?" అన్నది లూబా, విసుగ్గాను, అసమ్మతి తెలియజేస్తున్నట్టుగాను.

"కాస్త మమ్ముకు రుచి చూపించాలే పిచ్చిపిల్లా! ఏమనుకున్నావు మరి? అసలు ఉన్నదంతా ఆర్భాటంలోనే! పెళ్ళికూతురంటే గుర్రమనుకున్నావా?, ఎవడుపడితే వాడు కొనడానికి? కాదు. ఆడపిల్లను ఒకఅయ్యచేతుల్లో పెట్టాలంటే ఎన్నిఎత్తులు వెయ్యాలి, ఎన్ని జిత్తులు పన్నాలి!" అన్నాడు మయకిన్ తన సహజ చమత్కారధోరణిలో.

లూబా కొంచెంగా తలూపింది. చేతిలోపని అవతల పడేసి తండ్రివంక చూచింది. అలా చూచినప్పుడు అధికకోపంతోనూ, సిగ్గుతోనూ ఆమెముఖం ఎర్రబారింది. తరువాత మళ్ళీ మేజోళ్ళు తీసుకుంది. తల ఇంకా ఎక్కువగా దించేసుకుని తన పనిలో నిమగ్నురాలైంది. వృద్ధుడు శూన్యంలోకి తదేకంగా చూస్తూ అటూఇటూ పచారుచేయసాగాడు. ఏదో అగాధమైన, అతి క్లిష్టమైనసమస్యనుగురించిపర్యాలోచనచేస్తున్నట్టుగా తన గడ్డాన్ని లాక్కుంటున్నాడు.

తండ్రి తన మాట చెవినిపెట్టడని లూబాకు తెలుసును. పైగా వ్యతిరేకంగాను, అవమానకరంగాను మాట్లాడుతాడని కూడా ఆమె ఎరుగును. ఆమె తన భర్తను గురించీ, వైవాహిక జీవితాన్ని గురించీ ఎన్నెన్నో తీయటి కలలుకన్నది. స్నేహితుడే తనకు భర్తగా ఉండాలని కోరుకుంది. చదువు, సంస్కారం

ఉన్నవాడు కావాలనుకుంది. తనలాగే మంచిమంచి పుస్తకాలు చదువుకునేవాడై, అనిశ్చితంగాఉన్న తనవాంఛాసాఫల్యం కొరకు సహాయకారి కాగలవాడై ఉండాలని అపేక్షించింది. కాని ఆమె కన్న ఈ కలలన్నిటినీ సుడిగాలి వచ్చి ఎగరగొట్టేసింది. ఆమెతండ్రి ఆమెను స్మోలిన్‌కిచ్చి వివాహంచేయాలని నిశ్చయించాడు. అతని నిశ్చయానికి తిరుగులేదు. ఈ విషయం ఆమెహృదయంలో ఒక కఠినమైన, బాధాకరమైన కల్మషాన్ని నింపింది. అయినా ఆమె ఒక విషయం గమనించకపోలేదు. తోటి వర్తక కుటుంబాలలోని తన ఈడు ఆడ పిల్లలందరినీ ఆమె చూస్తూనేఉంది. వాళ్ళకు మంచి మంచి బట్టలు వేసుకుందామని తప్ప మరి వేరే ఆలోచన ఉండదు. తమ తల్లిదండ్రుల ఇష్టానుసారం వాళ్ళు కుదిర్చిన సంబంధాలనే చేసుకున్నారు. యౌవనంలో ఉండి జ్ఞానం వచ్చిన ఆడపిల్లలకు ఎలాటి భావాలుంటాయోకూడా ఆ తల్లిదండ్రులు విచారించలేదు. ఆ పిల్లలు కూడా వాళ్ళ నిర్ణయానికి బద్ధులై సంచరించారు. అందువల్ల తరువాత వారి సంసారజీవితంలో భార్యాభర్తల మధ్య పొరపులు ఏర్పడడంకూడా జరిగింది. ఇవన్నీ లూబా కళ్ళారా చూస్తూనేఉంది. కాని ఇప్పుడామెకూడా వివాహమాడడానికి సిద్ధపడింది. అందుకు కారణం లేకపోలేదు. తనకు ఇప్పటికే వయస్సు మళ్ళి పెళ్ళాడేకాలంకూడా దాటిపోయేస్థితిలో ఉన్నానని ఆమె గ్రహించింది. ఆమెతండ్రికూడా కుమార్తెకు త్వరలో పెళ్ళిచేసి తన వ్యాపారభారమంతా అల్లుడికి అప్పచెప్పాలని వాంఛిస్తున్నాడు. అంచాతనే ఆమె వివాహానికి అంగీకరించక తప్పింది కాదు. అయినప్పటికీ భర్తను ఎంచుకోవడంలో కుమార్తె

అభిరుచులు ఏమిటో తెలుసుకోవడానికి తండ్రి ఎన్నడూ ప్రయత్నించలేదు. ఆమెబుద్ధి ఇంకా అంతటి పరిపక్వదశకు రాలేదని అతని ఉద్దేశం. ఈ విషయాలన్నీ ఒక్కమాటు పర్యాలోచన చేసుకుంటూ ఆందోళన చెందసాగింది లూంబా. ఈ ఆందోళనలోనే ఆమె వేలు పుండుచేసుకుంది. సూది విరగ్గొట్టుకుంది. అయినా నోరు తెరిచి ఒక్కమాటకూడా చెప్పలేదు. తాను ఏంచెప్పినా అతనిహృదయం మారదనీ, తన క్షోభ అంతా అతనిముందు చెవిటివాడిముందు శంఖం ఊదినట్టు నిష్ప్రయోజనమనీ, ఆమెకు బాగా తెలుసును.

వృద్ధుడు అటూఇటూ పచారుచేస్తూనేఉన్నాడు. మనస్సులో మంత్రాలు జపిస్తున్నాడు. మధ్యమధ్య పెళ్ళికొడుకు సమక్షంలో ఎలా ప్రవర్తించాల్సిందీ కుమార్తెకు బోధిస్తున్నాడు. అలా చేస్తూచేస్తూ హఠాత్తుగా అతను ఏదో వేళ్ళతో గుణించాడు—ముఖం చిట్లించాడు, తరువాత మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

"ఊ!...ఇచ్చకాలాడినా, దైవభక్తి లేకుండా సంచరించినానన్నా ఈశ్వరుడే క్షమింపుగాక!...ఊ......మీఅమ్మ పచ్చలజోడు చెవులకు పెట్టుకో లూంబా." అన్నాడు మయకిన్.

"నాన్నా! ఇక చాలు. నన్ను ఒంటిగా ఉండనివ్వు!" అన్నది లూంబా బాధగాను అసౌఖ్యంగాను.

"లూంబా! నాదగ్గర నీ వేషాలేమీ పనికిరావు! ముందు చెప్పినట్టు చెయ్యి!" అన్నాడు మయకిన్.

మళ్ళీ వృద్ధుడు ఏదో వేళ్ళమీద లెక్కించడం మొద

లెట్టాడు. అలా వేళ్ళు లెక్కిస్తున్నప్పుడు అతనికళ్ళు చిన్న వైనాయి.

"నూటికి ముప్ఫయి అయిదు, బురిడీ వెధవ!...... నీ వెలుగు మామీద ప్రకాశింపచెయ్యి......" అన్నాడు వృద్ధుడు.

"నాన్నా!" భయకంపితయై పిలిచింది లూబా.

"ఏఁవమ్మా?"

"అతనూ...అతనంటే నీ కిష్టమేనా?"

"ఎవరు"

"అతనే, స్మోలిన్."

"స్మోలినా?"

చురుకైన కుర్రాడుకదూ! బ్రతుకుతగ్గ మనిషికి తగ్గమాటా ఉన్నాయి. సరే. ఇకనునే వెళ్ళాలి. నీవుమంచి బట్టలుకట్టుకో లూబా!?"

తండ్రి వెళ్ళిపోయిన తరువాత లూబా తన చేతిలోపని వదిలేసి తన కుర్చీమీద నడుంవాల్చింది. కళ్లు మూసుకుంది, గట్టిగా గుప్పిళ్ళు పట్టించి. ఆమె వ్రేళ్ళ కనుపులు తెల్లగా ఉన్నాయి. అవమానంవల్ల కలిగిన దుఃఖం ఆమెను ముంచి వేసింది తన భవిష్యత్తును గురించి విపరీతంగా భయపడసాగింది. అక్కడే కూచుని నిశ్శబ్దంగా భగవంతుణ్ణి ప్రార్థించుకోవడం మొదలెట్టింది.

"ఈశ్వరా! దయామయా! రక్షకుడా! అతనుసద్బుద్ధి కలవాడైతే ఎంత బాగుండును! ప్రభూ! దయామయా! అతను సత్పురుషుడయ్యేలా అనుగ్రహించు... సాధువు

అమ్యేలా చూడు ... ఒక్కమాటు ఆలోచించు! ఎవరో ముఖమెరుగని మనిషివచ్చి నీముందు నోరువిప్పుతాడు.... తరువాత నిన్ను తనదాన్నిగా చేసుకుంటాడు. అలా ఏండ్లు తరబడి జీవించాలి! ఎంతదారుణం! ఎంత భయంకరం! ఎంత సిగ్గు చేటు! ఓ యీశ్వరా! నా ప్రియమైన ప్రభూ! నాతో మాట్లాడడానికి ఒక్కరైనా ఉంటే ఎంత బాగుండేది! కాని నేను ఒంటరి దాన్ని, ఎప్పటికీ ఒంటరిదాన్ని! తారాస్ అయినా ఇక్కడ ఉంటే"...

ఇలా ప్రార్థించుకుంటూ అన్నను గురించి ఆలోచించేసరికి ఆమెకు మరింత తప్పుదోవతొక్కా ననిపించింది. తన దుస్థితికి తనే మరింత జాలిపడింది. ఆమె తన అన్నగారైన తారాస్‌కు ఒక పెద్ద ఉత్తరం వ్రాసింది. అందులో ఎన్నెన్నో విషయాలు పొందుపరచింది. తను అతన్నెంతగానో ప్రేమిస్తున్నాననీ, తన ఆశలన్నీ అతనిమీదనే పెట్టుకున్నాననీ తెలియ పర్చింది. వీలైనంత త్వరలో ఒకమాటు వచ్చి తండ్రిని చూచి పొమ్మని బ్రతిమాలుకుంది! తానూ తండ్రీ కలసి ఎలా జీవిస్తున్నదీ వివరాలతో విప్పిచెప్పింది. తండ్రి చాలా తెలివైనవాడనీ, ప్రతి విషయాన్ని చక్కగా అర్థంచేసుకోగలడనీ, కాటికి కాళ్ళు చాచుకునిఉండి ఒంటరిజీవితంగడుపుతున్నాడనీ, వ్రాసింది. అయినా అతనికి బ్రతుకుమీద అభిలాషపోలేదని, అతన్నిచూస్తే ఆశ్చర్యం వేస్తుందనికూడా వ్రాసింది. తనను ఆవృద్ధుడు ఎన్ని ఇక్కట్లు పెడుతున్నదీ కూడా అన్నగారితో మొరపెట్టుకుంది.

అన్నదగ్గర్నుంచి జవాబు వస్తుందని ఆమె రెండు వారాలపాటు ఆతృతతో కాచుకుని కూచుంది. చివరకు జవాబు

వచ్చింది. జవాబు రాగానే ఆమె వెర్రి ఆనందంతోను, ఆశా భంగంతోను వెక్కి వెక్కి ఏడ్చింది. అన్న వ్రాసిన జవాబు మూడు ముక్కల్లో ముగిసింది. పోనీ వాటిలోనైనా సారం లేదు. ఒక నెలరోజులలో ఏదో వ్యాపారంపనిమీద వోల్గా ప్రాంతానికి వస్తాననీ, అప్పుడు తండ్రి ఎలాటి అభ్యంతరమూ పెట్టకపోతే అతన్ని చూడ్డానికి వస్తాననీ అన్నగారు వ్రాశాడు. నిస్సారమైన, నిరుత్సాహకరమైన ఉత్తరం అది. ఆ ఉత్తరం చదువుకుని ఆమె ఏడ్చింది. ఉత్తరం ముఖానికి అడ్డంపెట్టుకుని కంట తడిపెట్టింది. చివరకు ఉత్తరాన్ని నలిపివేసింది. కాని కాగితం నలిగినంతమాత్రాన అందులోఉన్న కఠినవార్త కరుగుతుందా? ముక్తసరిగా మూడుముక్కల్లో ముగించిన ఈ ఉత్తరంలోని అక్షరాలపై ఒకానొక బలీయమైన, సాహసమైన చెయ్యి కనిపించిందామెకు. ఆ జాబులో ఒక ముఖం—తన తండ్రిలాగానే పల్చగా ముడతలుపడ్డ ముఖం—తన వైపు కోపంగా అపనమ్మకంతో చూస్తున్నట్టుగా తోచిందామెకు.

కొడుకు వ్రాసిన ఉత్తరం మయకిన్‌లో మరోరకమైన భావాన్ని రేకెత్తించింది. తారాస్ జాబు వ్రాశాడని తెలియగానే అతను ఉద్రిక్తుడైపోయి గబగబ కుమార్తెవద్దకువచ్చాడు. అప్పుడతని పెదవులపై ఎన్నడూలేని ప్రత్యేకమైన చిరునవ్వొకటి చిందులాడింది.

"ఏదీ? ఆ ఉత్తరం ఇలా తే. నాకోమాటు చూపించు హీ హీ హీ! చురుకైన ఈ కుర్రవాళ్ళు ఎలా వ్రాస్తారో కాస్త చూద్దాం. ఏవీ? నా కళ్ళద్దాలెక్కడున్నాయి? 'ప్రియమైన చెల్లాయికి' ఊ—" అన్నాడు మయకిన్.

వృద్ధుడు, తన కొడుకు వ్రాసిన ఉత్తరం మనస్సులో చదువుకున్నాడు. చదవడం పూర్తికాగానే దాన్ని బల్లమీద పెట్టి గదిలో ఒకమాటు అటూఇటూ పచారుచేశాడు. నిర్వేర పాటుతో కనుబొమలు పైకెత్తుకున్నాడు. తరువాత మళ్ళీ రెండోసారి ఉత్తరాన్ని చదివాడు. అటుపిమ్మట బల్లదగ్గర నిల్చుని, వ్రేళ్ళతో బల్లమీద దరువువేస్తూ ఆలోచనలో మునిగిపోయాడు.

ఇలా ఆలోచించి ఆలోచించి చివరకు

"పర్వాలేదు. ఉత్తరం ఘట్టిదే. అనవసరమైన మాటలు లేవు. అక్కడ చలికి అబ్బాయి కాస్త గట్టిపడటుంది. రానీ చెప్తాను. వ్యవహారం ఏదో తేలుద్దాం. చిత్రమే. ఊఁ. దావూద్ భక్తిగీతంలో చెప్పినట్టు 'నా శత్రువు తిరిగివచ్చినప్పుడు' – ఆ తరువాత ఏముందోమరిచిపోయానే. 'చివరకు నా శత్రువుయొక్క ఆయుధాలు నిస్సారమైపోయినాయి. రొదలమధ్య అతని జ్ఞాపక శక్తి నశించిపోయింది.' ఇలా ఇంకా ఏదోఉంది. సరే. రానీ. అతనూ నేనూ రెండోకంటపడకుండా వ్యవహారాలు చూచు కుంటాలే." అని చెప్పాడు మయకిన్.

ఆ వృద్ధుడు మెల్లగా నిశ్శబ్దంగా మాట్లాడడానికి ప్రయ త్నించాడు. సగర్వంగా చిరునవ్వునవ్వ యత్నించాడు. కాని ఆ నవ్వు విజయవంతం కాలేదు. అతనిముఖం మీది ముడతలు ఉద్రిక్తతతో ప్రకంపించసాగాయి. అతని ఆకుపచ్చ నేత్రాలు విచిత్రంగా మెరిశాయి.

"అతనికి మరో ఉత్తరం వ్రాయి లూబా. రమ్మను. మరేం భయంలేదు." అన్నాడు వృద్ధుడు.

లూబా తన అన్నకు రెండో ఉత్తరం వ్రాసింది. మొదటి ఉత్తరం మాదిరికాకుండా ఈసారి ఉత్తరం క్లుప్తంగాను మితంగాను వ్రాసింది. మళ్ళీ ఇప్పుడు అతని జవాబుకోసం ఎదురుచూస్తోంది. అసాధారణమైన తన అన్న ఎలా ఉంటాడో, ఎలా ప్రవర్తిస్తాడో అని ఊహించుకుంటూ కూచుంది. పూర్వం ఆమె సాధువులు, సన్యాసులు, పావన పురుషులు, పుణ్యమూర్తులు; వీరిపై నమ్మకంగలవారు ఎలాటి భయభక్తులు, గౌరవ భావాలు కలిగిఉంటారో, అన్నమీదకూడా అలాటి భావాలనే కలిగిఉండేది. కాని ఇప్పుడామెకు అతనంటే భయం ఏర్పడింది. అతను ఎన్నెన్నో బాధలుపడ్డాడు. యౌవనమంతా ప్రవాసంలోనే గడిపాడు. మనుష్యులను వారి చర్యలను విచారించి తీర్పు చెప్పడానికి తగిన హక్కు సంపాదించుకున్నాడు. ఇలాటి అన్న ఇప్పుడు తనను తప్పక ఇలా ప్రశ్నిస్తాడని ఆమె అనుకుంది.

"ఈ మగాణ్ణి నీవు నీఇష్టప్రకారం స్వేచ్ఛగా ప్రేమించి పెళ్ళాడబోతున్నావా ?"

ఇలా ఒకదాని తరువాత ఒకటి మలినమైన ఆలోచనలు ఆమె మనస్సులో మొలవసాగాయి. ఆమెను కలవరపెట్టి కఠినంగా హింసించసాగాయి ఆమె ధైర్యాన్ని కోల్పోయింది. నరాలు కంపించసాగాయి. పూర్తిగా నిరాశ చెందింది. అతికష్టంమీద కన్నీళ్ళు ఆపుకుంటోంది. ఇలాంటి స్థితిలో ఉండికూడా ఆమె సగం మైమరపుతో తండ్రి ఆజ్ఞలను శిరసావహించి నిర్వర్తించసాగింది. పెద్దబల్లవేసి దానిమీద పాత వెండి సామానులన్నీ అమర్చిపెట్టింది. అన్నిపనులూ చక్కబెట్టుకుని తాను బూడిదరంగు సిల్కుదుస్తులు ధరించింది. తరువాత

అద్దంముందు కూచుని చెవులకు పచ్చలు పొదిగిన అంటు జోడు పెట్టుకోసాగింది. ఆ పచ్చలజోడు పూర్వం గ్రుజిన్‌స్కి రాకుమారుడిది. కాని మయకిన్ దగ్గర దానిని కుదువపెట్టి ఆ రాకుమారుడు కొంత డబ్బు అప్పుతీసుకున్నాడు. తరువాత క్రమేణా అనేక విలువైననగలు, నాణాలు మయకిన్ హస్తగతమైనట్టే ఈ విలువైన పచ్చలుకూడా అతనిసొత్తు అయిపోయినాయి. లూబా తల్లి బ్రతికున్నప్పుడు వీటిని చెవులకు ధరిస్తూ ఉండేది.

అలా పచ్చల అంటుజోడు పెట్టుకుంటూ ఆమె అద్దంలో తన ముఖాన్ని తదేకంగా చూచుకుంటోంది. తన ముఖంలోని కలవరపాటును ఆమె గుర్తించింది. ఎర్రగాపండిన ఆమెగుండ్రటి పెదవులు చెక్కిళ్ళతో పోటిపడుతున్నాయి. ఆమె వక్షోజాలు సిల్కుదుస్తులమాటున పరిపూర్ణంగాను, బిగుతుగాను కనిపిస్తున్నాయి. ఏ పురుషుణ్ణయినా ఇట్టే ఆకర్షించగల చక్కదనం ఆమెలో కనిపిస్తోంది. చెవులకు ధరించిన పచ్చలజోడు పచ్చగా తళతళలాడుతూ ఆమె కొక శోభను కలిగిస్తున్నాయి. ఈ విషయం ఆమె అభిరుచికి ఆటంకమై కోపాన్ని తెప్పించింది. పైగా అవి ఆమె ఎర్రటి చెక్కిళ్ళను పాలిపోయిన పచ్చని నీడలతో కప్పుతున్నాయి కూడా. అందుకని ఆమె ఆ పచ్చల జోడును తీసివేసింది. ఒకచిన్న కెంపులజోడు ధరించింది. స్మోలిన్‌కు ఎలా అలంకరించుకుంటే ఇష్టమో ఆమెకు తెలీక తికమక పడసాగింది.

ఆమె కళ్ళక్రింద నల్లటి వరుసలా లేర్పడ్డాయి. అవి ఆమెకు అసహ్యంగా కనిపించాయి. వాటిని పౌడరుతో అద్దుకుని

నునుపుచేసుకోసాగింది. తన భర్తకానున్న స్మోలిన్‌నుగురించీ, ఆడజన్మ ఎత్తినందుకు తనకు పట్టనున్న దురదృష్టాన్నిగురించీ తలపోయసాగింది. తాను అసమర్థురాలైనందుకు అన్ని విధాల వ్యర్థురాలైనందుకు తన్ను తాను నిందించుకో సాగింది. పౌడరు అద్దుకున్నందువల్ల కళ్ళక్రింద నల్లటి వర్తులాలు అదృశ్యమైపోయాయి కాని, ఆ పౌడరు మరీఎక్కువై ప్రకాశవంతమైన ఆమె కళ్ళల్లోని చక్కదనాన్ని అపహరించింది. అంచాత ఆమె మళ్ళీ ఆ పౌడరంతా తుడిచివేసుకుంది. ఇలా ముస్తాబుచేసుకుని చివరసారి అద్దంలో చూచుకున్నప్పుడు తాను కళ్ళు చెదిరేటంత అందంగాఉన్నట్టు ఆమె నిశ్చితంచేసుకుంది. బాగా పుష్టిగా, అందంగా ఎదిగిన దేవదారుచెట్టులా ఉంది ఆమె. తా నింత అందంగా ఉన్నానని అనుకోనేసరికి ఆమె భయాలన్నీ కొంతవరకు తగ్గి మనశ్శాంతి కలిగినట్టయింది. ఆ పెళ్ళికూతురు ముస్తాబులో ఆమె నిండుగా కనిపిస్తోంది. వివాహ మాడడానికి అన్నివిధాలా తగిన ఓ చక్కని యువతిలా తయా రైంది. ఇలా ఆమె తన ముస్తాబు పూర్తిచేసుకుని గంభీరంగా నడుస్తూ భోజనశాలలోకి వెళ్ళింది.

ఆమె తండ్రీ, స్మోలినూ ఆమె కోసం వేచిఉన్నారు

లూబా ఒక్కక్షణం తలుపుదగ్గర ఆగి అవతలికి వెళ్ళ డానికి తటపటాయిస్తూ ఉండిపోయింది. తరువాత ముద్దొచ్చే తీరులో కళ్ళు తిప్పుతూ సగర్వంగా పెదవులు కదల్చుతూ వాకిట్లోకివెళ్ళింది. స్మోలిన్ లేచి నిల్చున్నాడు. ఆమెను కలుసు కోవడానికి ఎదురువెళ్ళి సవినయంగా తలవొంచాడు. అత నలా వినయంగా తలవొంచి కృతజ్ఞత తెలియచెయ్యడం ఆమెకు

నచ్చింది. నాజూకైన అతనివంటికి వేసుకున్న కోటుకూడా ఆమెకు ముచ్చట కలిగించింది. అతను చాలా స్వల్పంగా మారి నట్టు కనిపిస్తున్నాడు. అతనిజుట్టు ఇంకా ఎర్రగానే ఉంది. దగ్గరగా కత్తిరించి ఉంది. అతని ముఖంనిండా పుట్టుమచ్చలు మొలిచాయి. చక్కటి మీసకట్టు వచ్చింది. అతని కళ్ళు కూడా చాలా పెద్దవైనట్టు కనిపిస్తున్నాయి.

"చక్కటి కుర్రాడు. కాదా అమ్మాయ్?" స్మోలిన్‌ను చూపుతూ కుమార్తెను అడిగాడు మయకిన్.

ఆ యువకుడు ఆమెచేతిని గట్టిగా పట్టుకుని చిరునవ్వు నవ్వాడు.

"మనిద్దరం చిన్నప్పుడు కలిసి చదువుకున్నాం మరచి పోయావా?" అనడిగాడు స్మోలిన్, నిండైన కంఠస్వరంతో.

అంతలో మయకిన్ తన కళ్ళసైగతోనే కుమార్తెను హెచ్చరిస్తూ "మీ ఇద్దరూ తరువాత ముచ్చట్లాడుకుందురు గాని, ముందు నీవిక్కడికి కావల్సినవేమిటో చూడు లూబా. ఇంతలో అతనూ నేనూ కాస మాట్లాడుకుంటాం." అన్నాడు. తర్వాత స్మోలిన్‌తో "అయితే ఆఫ్రికన్ డిమిట్రిచ్! నీవు చెప్పినట్లు..." అని ఏదో చెప్పబోయాడు.

స్మోలిన్ లూబాతో "క్షమించు లుబోవ్ యాకొవ్లెవ్‌నా!" అన్నాడు చక్కదనాల కంఠంతో, తాను వెడుతున్నందుకు.

"ఓ! మరేం పర్వాలేదు." అన్నది లూబా.

అతను చాలా వినయవిధేయతలుగల కుర్రాడని ఆమె అనుకుంది. ఆమె వెనక్కు తిరిగి వెడుతూ అతను ఏం మాట్లా

డుతున్నదీ చాలా శ్రద్ధగా విన్నది. అతనికంఠస్వరం ఎంతో మృదువుగాను ఆత్మవిశ్వాసంతో నిండి ఉన్నట్టుగాను విని పించింది.

నే చెప్పిందేమిటంటే—నేను నాలుగు సంవత్సరాలపాటు రష్యను చర్మాలకూ తోళ్ళకూ, విదేశాల మార్కెట్లలో ఎలాటి విలువఉన్నదీ చాలా జాగ్రత్తగా పరిశీలనచేశాను. ముప్ఫయి సంవత్సరాల క్రితం మనదేశపు చర్మాలు, తోళ్ళు చాలా విలువైనవిగాను, మేలురకానికి చెందినవిగాను పరిగణింప బడేవి. కాని ఇప్పుడు వాటివిలువ తగ్గిపోతోంది. దాంతో పాటు ధరా తగ్గిపోతోంది. ఇలా జరగడం సహజమే దీనికంతకూ ప్రధాన కారణం చెప్పుతాను వినండి. మన తోళ్ళ పాగి శ్రామికులవద్ద, వర్తకులవద్ద తగినంత పెట్టుబడిలేదు. పరిశ్రమకు అవసరమైన శాస్త్రజ్ఞానమూలేదు. అంచాతనే వాళ్ళు నవీన పద్ధతుల ప్రకారం చర్మాలు తయారుచేయలేకపోతున్నారు. ఈకాలానికి కావల్సిన కొత్తకొత్త రకాలను సృష్టించలేకపో తున్నారు. అంతేకాదు. ఉత్పత్తికయ్యే ఖర్చులు తగ్గించుకో లేకపోతున్నారుకూడా. కనుక వాళ్ళు తయారుచేసే చర్మాలు నాసిరకంగానూ ఉంటున్నాయ్; చాలా ఖరీదుగానూ ఉంటు న్నాయి. ఉత్తమ తరగతికి చెందిన చర్మాలు, తోళ్ళు ఉత్పత్తి చేస్తుందని మనదేశానికి గొప్పకీర్తి ఉంది. ఇప్పుడు వీళ్ళంతా ఇలాచేస్తూ మన కీర్తికి పెద్దకళంకం తెస్తున్నారు. మొత్తం మీద నే చెప్పేదేమిటంటే – ఈచిన్నచిన్నఉత్పత్తిదారులవల్ల, పెట్టుబడి లేనందువల్ల, శాస్త్రీయ విజ్ఞానంతో నవీన పద్ధతులపై నవీనవస్తుసామాగ్రితో పరిశ్రమను వృద్ధిపరచడానికి

శక్తి లేనందువల్ల — మన చర్మపరిశ్రమ పూర్తిగా దెబ్బ తింటోంది. ఇలాంటి వాళ్ళంతా మనదేశానికి మాయనిమచ్చలు! మన వ్యాపారానికి వేరు పురుగులు!" అన్నాడు స్మోలిన్.

విద్యావివేకంతోనూ, నమ్రతతోనూ, నిగర్వంతోనూ చెప్పిన స్మోలిన్ మాటలు తన తండ్రిని న్యూనతపరుస్తాయని లూబాకి నిపెట్టింది.

"ఊఁ! మరోవిధంగా చెప్పాలంటే నీ ఉద్దేశం ఒక పెద్ద ఫ్యాక్టరీ పెట్టి ఈ చిన్న చిన్న వ్యాపారస్తులందర్నీ పడగొట్టాలనికదూ? ఆ పెద్ద తిమింగిలం ఈ చిన్నచిన్న చేపలన్నిటినీ మింగేయాలనికదూ" అడిగాడు మయకిన్ ఇలా అడిగేటప్పుడు అతను ఒక కన్ను లూబామీదా, ఒక కన్ను స్మోలిన్ మీదా వేసిఉంచాడు.

"కాదు, కాదు! నా ఉద్దేశమల్లా ఒక్కటే. రష్యాదేశపు గౌరవాన్నీ, కీర్తినీ నిలబెట్టాలి. రష్యన్ చర్మాలకూ, తోళ్ళకూ విదేశమార్కెట్లలో విలువ పడిపోకుండా చూడాలి. అంతే. అంచాత నవీనపద్ధతులపై శాస్త్రీయవిజ్ఞానంతో వస్తువుల నుత్పత్తిచేయాలనీ, అందు కవసరమైన ఫ్యాక్టరీ ఒకదాన్ని ఆదర్శప్రాయంగా నిర్మించాలనీ, తన్మూలంగా దేశగౌరవాన్ని కాపాడాలనీ నా ఆకాంక్ష......" అన్నాడు స్మోలిన్, ఆ వృద్ధుడి అభిప్రాయాన్ని శాంతంగానే ఖండిస్తూ.

"అయితే ఈ ఫ్యాక్టరీ పెట్టడానికి ఎంతడబ్బు అవసరమంటావు?" అనడిగాడు మయకిన్ సాలోచనగా.

"సుమారు మూడు లక్షలు!" అన్నాడు స్మోలిన్.

తనకోసం నాన్నగారు ఇంతడబ్బు వెచ్చించరని లూబా తనలో అనుకుంది.

"నా ఫ్యాక్టరీలో బూడ్సులు, బెల్టులు, సంచులు, గుర్రాలకు ముస్తాబుచేసే జీను మొదలైన వస్తువులు తయారు చేయబడతాయి." అన్నాడు స్మోలిన్ మళ్ళీ.

"దీనిమీద నీకెందు కింత మక్కువ? ఇలా కలలుకంటే ఏమొస్తుందసీ?" మళ్ళీ వృద్ధుడు ప్రశ్నించాడు.

"కలలుకనడంలేదు. మన దేశంలో పరిస్థితులన్నీ పరిశీలించి సరిగ్గా తూచి లెక్కవేశాను. ఒకమిషను కనిపెట్టే మెకానిక్ బుద్ధి ఎంత ప్రశాంతంగాను, సునిశితంగాను ఉంటుందో, వస్తూత్పత్తి చేసేవాడి బుద్ధికూడా అంత నింపాదిగా సునితంగా ఉండితీరాలి ఒక గొప్పపని గొప్పగానే చేయాలని కాంక్షించే మెకానిక్ తాను కనిపెట్టే యంత్రంలోని అతిసూక్ష్మమైన మరయొక్క చలనంకూడా జాగ్రత్తగా పరిశీలించి లెక్కవేసుకుంటాడు. రష్యాలో మాంసం వ్యాపారాన్ని గురించీ, పశుసంపద అభివృద్ధిని గురించీ అతిశ్రద్ధగాను, లోతుగాను పరిశీలించి కొన్ని విషయాలు వ్రాసిపెట్టి ఉంచాను. తమ రవి ఒక్కమాటు చదవాలని కోరుతున్నాను." అన్నాడు స్మోలిన్.

"సరే, ఆ వివరాలన్నీ లోకానికి పంచిపెట్టు. ఆసక్తిని కలిగిస్తాయి. ఇంతకాలం నీవు యూరప్‌లో కాలం వృథా చెయ్యలేదని కూడా ప్రతివాడూ గ్రహిస్తాడు. సరే ఇక మనం నోరు కాస తీపి చేసుకుందామా? మన పూర్వకాలపు రష్యన్ పద్ధతిలోనే తిందాంలే!" అన్నాడు మయకిన్, ఒక చిన్నచిరునవ్వునవ్వి.

"ఎలా ఉన్నావు లుబోవ్ యాకొవ్‌లెవ్‌నా ?" అని అడిగాడు స్మోలిన్, చాకు, ముండ్ల గరిటె తీసుకుంటూ.

"ఎలాఉంటుంది! బద్ధకంగా గడిపేస్తున్నది కాలం. మా ఇంట్లో అదే గృహిణి, యజమాని; అంతా అదే. ఇంటి పనులన్నీ చక్క బెట్టుకోవడంతోనే దానికి సరిపోతుంది. కాసేపు కులాసాగా గడపడానికికూడా నోచుకోలేదు పిల్ల." అని కుమార్తె బదులు తానే సమాధానం చెప్పాడు మయకిన్.

"వ్యవధీలేదూ వేరే మార్గమూలేదు. వర్తకులు జరిపే వినోదాలకూ, విందులకూ వెళ్ళడం నాకేమాత్రం ఇష్టముండదు" అని తానుకూడా జవాబుచెప్పింది లూబా.

"పోనీ, నాటకాలు చూడ్డానికి థియేటర్‌కు వెడతావా?" అన్నాడు స్మోలిన్.

"అంతగా నాటకాలకుకూడా వెళ్ళను. వెళ్ళడానికెవరూ తోడు ఉండరుకూడా."

"నాటకాలు! థియేటర్లు!" అంటూ బుసలు విడిచాడు మయకిన్. 'వాటిని గురించి చెప్పడమంటే నీకు మహాఇష్టంగా ఉండిఉండవచ్చు. కాని నే చెప్తాను విను! వర్తకులందరినీ వెర్రి వెంగళాయలకింద జమకడుతూ అక్కడ నాటకాలు ఆడతారు. ఇది నీవు నవీనమనీ, ఫ్యాషన్ అనీ అనవచ్చు. చూస్తున్నంత సేపూ సరదాగా ఉండవచ్చుకూడా. కాని అదేంతమాత్రం నిజంకాదు. నగర కౌన్సిల్‌లో మొట్టమొదటివాడు వర్తకుడు. వ్యాపారానికి తలమానికంగా నిల్చున్నవాడు వర్తకుడు. ఆ నాటకశాలలకు స్వంతదార్లుకూడా వర్తకులే! ఇలాంటి వర్తకు

లందర్నీ వాళ్ళు వెర్రివెంగళప్పల క్రింద జమకట్టడం సాహసం కాదా? పోకిరీతనం కాదా? వాళ్ళు నాటకాల్లో చూపించే వర్తకులు, వాస్తవజీవితంలో ఉన్నవాళ్ళు కారు. పోనీ చరిత్రాత్మక నాటకాలన్నా అయితే, నిజాలు కాకపోయినా వాటిలో కొంత అర్థమున్నదని అనుకోవచ్చు. పాటలు, పద్యాలు, నృత్యాలు మొదలైనవాటితో నిండిన జార్ చక్రవర్తి జీవితం, లేక హేమ్లెట్, లేక సోర్సెరెస్, లేకపోతే వాసిలిసా—ఇలాంటివన్నీ. వీటిల్లో వాస్తవజీవితం ఉండనిమాట నిజమే. ఎంచాతనంటే ఇవన్నీ గడచిన జీవితానికి సంబంధించినవికాని, ప్రస్తుతానికి సంబంధించినవికావు. ఇవి నిజాలైనా కాకపోయినా—ఇవి గొప్ప నాటకాలుగానే పరిగణింపబడుతున్నాయి. గొప్ప ప్రదర్శనాలుగా రక్తికడుతున్నాయి. కాని మరి నీవు ప్రస్తుత జీవితాన్నే నాటకంగా చూపదలుచుకున్నప్పుడు — యదార్థ జీవితంలోని మనిషిని యదార్థంగానే చూపవలసిఉంటుంది. నీ స్వంత రంగులన్నీ ఆ పాత్రకు పులమకుండా దాని సహజమైన రంగులోనే దాన్ని చూపించాలి!"

ఆ వృద్ధుడిమాటలువిని స్మోలిన్ నమ్రతగా చిరునవ్వు నవ్వాడు. "నీతండ్రికి జవాబు చెపుతాను, మరిపందెంవేస్తావా?" అన్నట్లు లూబావంక కోరగంట చూచాడు.

"సరేకాని నాన్నా! చాలామంది వర్తకులు, వర్తక కుటుంబాలలోనివారు చదువు, సంస్కారం, నమ్రత, నాగరికత లేకుండా మొరటుగా వుంటున్నమాట యదార్థం! ఇది నీవు ఒప్పుకుని తీరాలి." అన్నది లూబా, కొంచెం కలవరపాటుతో

"అవును. మన కర్మకాలి అదొక యదార్థమైంది!" అంటూ స్మోలిన్ అంగీకారసూచకంగా తల ఆడించాడు.

"ఉదాహరణకు థోమానే తీసుకో....." అంటూ ఆ అమ్మాయి మళ్ళీ ఏదో చెప్పబోయింది.

"ఓ! మీరెలాగైనా చిన్నవాళ్ళు, చదువుకున్నవాళ్ళు. మీచేతుల్లో ఎప్పుడుబట్టినా పుస్తకాలేగా ఉండేవి!" అన్నాడు మయకిన్, కుమార్తెమాటకు అడ్డువచ్చి.

"కాని నీవు ఏసమాజంలోనూ సభ్యురాలివిగా చేరలేదా? ఈఊళ్ళో అన్నిరకాల సమాజాలూ ఉన్నాయి" అన్నాడు స్మోలిన్, లూబాతో.

"అవును. నాకు తెలుసు. కాని నేను వేటితోనూ సంబంధంలేకుండా బ్రతుకుతున్నాను." అన్నది లూబా, నిశ్వసిస్తూ

"అమ్మాయికి ఇల్లే వైకుంఠం! మాఇంట్లో ఎన్నిరకాల వస్తువులున్నాయి ఏంకథ? ఎప్పుడూ వీటన్నిటినీపరిశుభ్రంగాను, చక్కగాను అమర్చిఉంచాలి. లెక్కపెట్టలేనన్ని వస్తువులు!" అన్నాడు మయకిన్, మధ్యలో అందుకుని.

తన హుందాను తెలియజేస్తూ తానలా మాట్లాడినందుకు మయకిన్ తృప్తిగా నవ్వాడు. ఒకమాటు టేబిల్‌మీద ధగధగ మెరిసిపోతున్న రకరకాల వెండిసామాన్లవైపు చూచి తలాడించాడు తరువాత వస్తువులు పట్టకుండావున్న అల్మరావంక చూచాడు. స్మోలిన్ ఇవన్నీ చూడాలనేతలంపుతోనే మయకిన్ అలా చేశాడు. ఇంకేం? స్మోలిన్‌కూడా ఈ వస్తువులన్నిటినీ క్రీగంట పరిశీలించి చూచి వ్యంగ్యంగా చిరునవ్వు నవ్వాడు. తరువాత మళ్ళీ స్మోలిన్ లూబాముఖంవంక చూచాడు. ఆ

చూపుల్లో ఏదో స్నేహమూ, జాలీ ఉన్నట్టు ఆమెకు కనుపించాయి. వెంటనే ఒక పల్చటి సిగ్గుతెర వచ్చి ఆమె చెక్కిళ్ళను కప్పివేసింది. ఆమె భయంభయంగా తనలోతాను ఆనందిస్తూ ఇలా అనుకుంది:

"భగవంతుడా! రక్షించావ్!

పెద్ద కంచు లాంతరునుండి వెలువడే కాంతి గదిలో వస్తువులన్నిటిమీదా పడింది. అన్నీ తళతళ మెరిశాయి. గదంతా ఇంకా ప్రకాశవంతమైన వెలుగుతో నిండింది.

"మనచిన్ననాటి ఈ ఊరంటే నాకెంతో ఇష్టం! అందమైన ఊరు. అన్నివిధాలా తగిన ఊరు. ఇలాంటి ఊళ్ళో పని చేయాలంటే ఎవడికైనా ఉత్సాహం పుట్టుకొస్తుంది. ఈ ఊళ్లో ఉన్న చక్కటి దృశ్యాలు చూస్తుంటేనా ఎలాటివాడికైనా కష్టపడి పట్టుదలతో పనిచేయాలనీ, హాయిగా బ్రతకాలనీ అనిపిస్తుంది. పైగా ఈ ఊరినిండా తెలివైనవాళ్ళూ, మేధావులూ ఉన్నారు. అది సరేకాని ఈ ఊరినుంచి వచ్చే ఘనాపాటైన వార్తాపత్రిక పేరేమిటి? అదేమిటో తెలిస్తే మేము చందా కట్టి తెప్పించుకోవాలనుకుంటున్నాం." అన్నాడు స్మోలిన్, ఆ అమ్మాయి వంక చూచి సస్నేహంగా చిరునవ్వు నవ్వుతూ.

"మేము అంటే ఎవరు?" అనడిగాడు మయకిన్.

"నేనూ, ఉర్వాంట్జోవ్, ష్చుకిన్——"

"బాగుంది, చాలాబాగుంది! వాళ్ళ నోళ్ళు మూయించడానికి ఇదే తగిన సమయం. ఇదివరకెప్పుడో ఆ పని జరగాల్సిన మాట! ముఖ్యంగా ఆ యెజోవ్‌గాడు! వాడు నోరు కదిపితే చాలు మనుష్యుల్ని రంపంకోసినట్టు కోస్తాడు. వాడి నోరు

ఎక్కడ నౌకాల్లో చూసి నొక్కు! చేసేపని జాగ్రత్తగా చెయ్యి!" అన్నాడు వృద్ధుడు, వేళ్ళతో బల్లమీద దరువు వేస్తూ.

సోలిన్స్కి మరొకమాటు లూబానంక క్రీగంట చూచి మందహాసం చేశాడు. మరొకమాటు ఆ అమ్మాయిహృదయం ఆనందంతో పులకించింది. ఆమెముఖంలో ఎక్కడలేని సిగ్గు వచ్చిపడింది. మనస్సులో పెళ్ళికొడుకును ఉద్దేశించే మాట్లాడుతున్నా పైకిమాత్రం తండ్రితో ఇలాఅంది :

"ఆఫ్రికన్ డిమిట్రిచ్ ఆ పత్రిక కొనడంలో ఉద్దేశం నీవనుకున్నట్టు వాళ్ళ నోళ్ళుమూయించడానికని కాదు. మరి నాకు తెలిసినంతవరకూ ఇలా అని అర్థం చేసుకుంటున్నాను."

"లేకపోతే ఆ పత్రిక కొనడం దేనికి? కేవలం వ్యర్థప్రలాపాలు, బూకరింపులు, అనవసరపు అలజడి తప్ప అందులో ఏమీఉండదు— ఎప్పుడైనా మేము — వర్తకులం మా విషయాలు అందులో కావాలని వ్రాస్తే తప్ప." అన్నాడు వృద్ధుడు భుజాలు ఎగురవేస్తూ.

"మీరు వ్యాపారదృష్టిలో చూచినప్పటికీ పత్రికాప్రచురణ చాలా లాభకరమైనది. కాని ఇది కాకుండా పత్రికాప్రచురణకు ప్రధానోద్దేశం వేరేఉన్నది. అది స్వంత ఆస్థిహక్కులను కాపాడడం, వాణిజ్య, పారిశ్రామిక రంగాల అభివృద్ధికోసం పాటుపడడం." అన్నాడు స్మోలిన్ సబోధకంగా.

"నేనూ అదే చెప్పేది—ఆ పత్రిక వర్తకుడిచేతుల్లో పడితే మంచి ఉచ్ఛస్థితికి వస్తుంది." అన్నాడు మయకిన్.

"కాని నాన్నా !........." ఏదో చెప్పబోయింది లూబా.

స్మోలిన్ సమక్షంలో తన మనోభావాలు విప్పిచెప్పాలనుకుంది ఆఅమ్మాయి. తాను అతన్ని అర్థం చేసుకున్నాననీ, తాను కేవలం విలాసంగా దుస్తులు ధరించి వినోదాలతో కాలక్షేపంచేసే మామూలు వర్తకుల పిల్లలవంటి పిల్లనుకాననీ ఆమె చెప్పాలనుకున్నది. ఆమెకు స్మోలిన్ నచ్చాడు. ఇంత కాలం విదేశాలలో ఉండివచ్చిన వర్తకుణ్ణి, ఇంత చక్కగా, ఇంత వినయ విధేయలతో సంచరించిన వాణ్ణీ, ఊళ్ళో అందరినీ ఉఫ్‌న ఊదేసే తెలివితేటలుగల తన తండ్రితో ఇంత చక్కగా సమర్థనీయంగా మాట్లాడి అతన్ని ఒప్పించగలవాణ్ణీ, మంచి మంచి దుస్తులు ధరించి అన్నివిధాలా ఆకర్షణీయంగాఉన్నవాణ్ణీ-ఆమె తన జీవితంలో ఇంతవరకెన్నడూ కలుసుకోలేదు. ఇన్ని సద్గుణాలు కల స్మోలిన్ ఆ పిల్లమనస్సుకు ఇట్టే నచ్చాడు.

పెళ్ళిఅయిన తరువాత తననుకూడా అతనితోపాటు విదేశాలకు తీసుకెళ్ళమని అడుగుదామని ఆలోచించిందామె. ఈ ఆలోచన మనస్సులోకి రాగానే తాను తండ్రికి చెప్పాలనుకున్నవిషయం ఇట్టే మరిచిపోయింది. విపరీతమైనసిగ్గు ముంచుకొచ్చిఒక్కమాటకూడా మాట్లాడలేకపోయింది. ఇలా అవడం స్మోలిన్‌దృష్టిలో తనకు మర్యాద భంగమని కూడా భయపడింది.

"నీవు ఊరకే, మాట్లాడేస్తున్నావు నాన్నా! అసలు విషయం — ఇంటికొచ్చిన అతిథికి ద్రాక్షరసం ఇవ్వడంకూడా మరిచిపోయావు." అన్నదామె చివరకు.

"ఆపని చెయ్యాల్సింది నీవు. ఇంటి ఆమెవు నీవే కదమ్మా!" అన్నాడు తండ్రి.

"ఓ! మరేం పర్వాలేదు. మీరు నాకోసం అనవసరమైన శ్రమలు తీసుకోకండి. పానీయాలు పుచ్చుకోవడం నాకంతగా అలవాటు లేదు." అన్నాడు స్మోలిన్, ఆదుర్దాగా.

"ఎప్పుడు తీసుకోకపోయినా, ఇప్పుడు తీసుకోవాలి" అన్నాడు మయకిన్.

"నిజమే. కాని ఎంతో తప్పనిసరైనపరిస్థితిలోతప్ప నేను పానీయాలు పుచ్చుకోను. అదైనా ఒకటి - రెండు గ్లాసులు - బాగా అలిసిపోయి. వంట్లో బాగుండకుండాఉంటేనే. పానీయాలు తాగడంలోనే ఆనందమున్నదని నేననుకోను. చదువు, సంస్కారంకల మనిషి ఆనందించగల విషయాలు ఇంకా అనేకం ఉన్నాయి"

"ఉదాహరణకు స్త్రీలా?" అని అడిగాడు మయకిన్, కళ్ళార్పుతూ.

"పుస్తకాలు, థియేటర్లు, సంగీతం!" అన్నాడు స్మోలిన్ లూబావంక క్రీగంటచూస్తూ.

ఈ మాటలు విని లూబా సంతోషంతో పొంగిపోయింది. కాని మయకిన్ ఆ యువకునివంక అదోలాచూచి హఠాత్తుగా మూలిగినట్టు ఇలా అన్నాడు :

"రోజులు మారాయి! పూర్వం పెద్దపెద్దకుక్కలుకూడా చిన్న రొట్టెముక్క తిని ఊరుకునేవి. ఈకాలంలో చిన్న కుక్కపిల్లలుకూడా మీగడపెడితేకాని నాకడంలేదు. నా నోరు అంత మంచిదికాదు నాయనా! నీవు ఎలాగైనా బుద్ధిమంతుడవు. పౌర

పాటుంటే క్షమించు. కాని అసలు ఇప్పుడున్న పరిస్థితి చెప్పాను. అంతే! కేవలం నిన్నుగురించి అనడంలేదనుకో."

లూబామొఖం వెలవెలబోయింది. భయవిచలితయై స్మోలిన్‌వంక చూచింది. కాని అతను ఎనామెల్ ప్లేటుమీది పనితనాన్ని పరిశీలనగా చూస్తూ, మీసాలు సరిదిద్దుకుంటు న్నాడు. చూడబోతే ఆ వృద్ధుడిమాటలు అతను విన్నట్టుగా లేదు. అయినా అతని కళ్ళుమాత్రం మామూలుకంటె నల్ల పడ్డాయి. పెదవులుకూడా గట్టిగా బిగించుకుని ఉన్నాడు.

"అయితే అబ్బాయీ! మూడులక్షలుంటే జెండా ఎగ రేసి ఫ్యాక్టరీకి యజమానివై పోతావన్నమాట. అంతేనా?" అన్నాడు మయకిన్ అదోలా.

"ఒక్క ఏణ్ణర్థంలో మొదట తయారైన సరుకంతా మార్కెట్‌లోకి వచ్చేస్తుంది. నా చేతులమీదుగా తయారైన బంగారంలాంటి సరుకు!" అన్నాడు స్మోలిన్, నిశ్చితంగా ఆ వృద్ధుడివంక చూస్తూ.

"పోతే ఆ సంస్థ స్మోలిన్‌కూ మయకిన్‌కూ చెందినదే. మరెవరికీ అందులో చోటు లేదు, అవునా? బాగుంది. కొత్త దోవ తొక్కడానికి నాకిది తగిన వయస్సు కాదు. ఏమంటావు? కాడు రమ్మంటున్నది, ఊరు పొమ్మంటున్నది! ఇదీ నా పరిస్థితి. మరి దీనికేమంటావు?" అన్నాడు మయకిన్.

అందుకు జవాబివ్వకుండా స్మోలిన్ అదోలా బిగ్గరగా నవ్వసాగాడు. "నాతో పరిహాసాలాడుతున్నారు." అన్నాడు చివరకు.

అతను పగలబడి నవ్వడం చూచి వృద్ధుడు కంపించి పోయాడు. తెలీకుండానే అతని కొకవిధమైన జంకు, త్రుళ్ళుపాటు కలిగాయి. ఆ ముగ్గురూ ఒక నిముషంపాటు నిశ్శబ్దంగా ఊరు కున్నారు.

"అవును. మేము ఆ విషయం ఆలోచించుకోవాలి. 'నేను' ఆ విషయం ఆలోచించుకోవాలి. ఒక నిముషంపాటు నే నవతలికి వెడతాను. మీ యిద్దరూ మాట్లాడుకోండి." అన్నాడు మయకీన్. అలా అంటున్నప్పుడు అతను తల ఎత్త లేదు. చెప్పడం పూర్తి చేసిన తరువాత మాత్రం, కుమార్తె వంక, స్మోలిన్ వంకా తదేకంగా చూచాడు.

వృద్ధుడు వెళ్ళిపోయాడు. ఆ యువతీయువకులు ముచ్చట చేసుకోవడానికి యత్నించారు. కాని ఎవరూ మాట్లాడడానికి సాహసించలేకపోయారు. మూగ మొద్దుల్లా అలా ఎంతో సేపు కూచోవడం అసహ్యంగా వాళ్ళకు తోచింది కూడా. లూబా ఒక నారింజపండు తీసుకుని దాని చర్మం వలుస్తూ ఆలోచించు కోసాగింది. స్మోలిన్ తన మీసాలు దువ్వుకుని ఎడమ చేతిలో ఉన్న చాకుతో చమత్కారంగా నారింజముక్కలు అందు కున్నాడు.

"ఇలా బిడియం విడిచి మాట్లాడుతున్నందుకు క్షమించు! నీకు మీనాన్నదగ్గర ఉండడం కష్టమనిపించడంలేదా లుబోవ్ యాకొవ్‌లెవ్‌నా? ఆయన అంతా వెనకటికాలం మనిషి. ఆ తరంవాడు. పైగా నీవేమీ అనుకోకుంటే మరోమాట చెప్తాను. అతను హృదయంలేని మనిషి!" అన్నాడు స్మోలిన్ నిమ్మళంగా.

లూబా, ఆ ఎర్రటి జుట్టుగల యువకుని వంక, కృతజ్ఞతతో తదేకంగా చూచింది. "చాలా కష్టంగా ఉంది! కాని ఏం చేయను? అలవాటుపడ్డాను. కాని, ఆయనకూడా వృద్ధుడైపోయాడు." అన్నది లూబా, అంగీకరిస్తూ.

"ఓ! ఆ విషయం నేను కాదనడంలేదు. కాని నీవు - నీవు యౌవనంలో ఉన్నావు. అందగత్తెవు. చదువు, సంస్కారం కలదానివి. బ్రతుకును గురించి నీభావాలు వేరుగా ఉంటాయి. మరి ఆయనకూ నీకూ ఎలా పొత్తు?" అన్నాడు స్మోలిన్.

ఇలా అంటూ అతను మృదువుగా చిరునవ్వునవ్వాడు. ఆనవ్వులో ఎంతో ప్రేమ, జాలి ఇమిడిఉన్నాయి. అతని కంఠస్వరంఎంతోమృదువుగా,వినేవాళ్ళకు ఎంతోహాయి గొలుపుతూ ఉంది. ఆఅమ్మాయి హృదయంలో ఏదో వెచ్చదనం కలిగింది, సుఖాన్ని అపేక్షిస్తున్న ఆమెకోర్కె అంతకంతకూ ప్రకాశవంతంగా జ్వలించసాగింది. ఈ వంటరితనంనుంచీ, ఈబానిస బ్రతుకునుంచీ త్వరలోనే బయటపడగలనుకదా అనే ఆకాంక్ష ఆమెలో ఇప్పుడు దీపజ్యోతిగా వెలుగొందసాగింది.

# పన్నెండో అధ్యాయం.

నదిమీద పొగమంచు దట్టంగా పరుచుకుంది. స్టీమర్ మధ్యమధ్యలో మందంగా కూతవేస్తోంది. స్టీమర్ నలుప్రక్కలా శీతలమేఘాలు ఆవరించాయి. సిగ్నళ్ళ మ్రోతలు వినిపిస్తున్నాయి. స్టీమర్‌లో నిల్చుని చూస్తే దోవా, తెన్నూ కనిపించడంలేదు. అంతటా పొగమంచు. నీరుకాని, తీరంకాని, ఆకాశం కాని కనిపించడంలేదు.

స్టీమర్ దీపాలు మిణుకు మిణుకు మంటున్నాయి. నిర్జీవంగా కనపిస్తున్నాయి. స్టీమర్‌లో ఒకమూల ఉప్పుచేపల పీపాలున్నాయి. కొందరు జనం ఒక ఎలెక్ట్రిక్ లాంతరు క్రింద గుమికూడిఉన్నారు. కొందరు పడుకున్నారు. కొందరు కూచున్నారు. అందరి ముఖాలూ ఒక వ్యక్తి వంక శ్రద్ధతో చూస్తున్నాయి. అతను కొన్ని పెట్టెలమీద కూచుని దృఢకంఠస్వరంతో **ఇలా** చెప్తున్నాడు:

"భగవంతుని క్షమాశక్తి అంతమయ్యే ఘడియలు దగ్గర పడ్డాయి. ఆయన కోపానలజ్వాలలు ఇక మనుష్యుల్ని దగ్ధం చేస్తాయి. ఇక ఆయన కారుణ్యాన్ని మన మెలా సంపాదించ గలం."

ఫోమా కాబిన్‌లో ఒంటిగా కూచోలేక బయటికివచ్చి నిల్చుని ఈ బోధకుని పలుకులు వింటున్నాడు. రకరకాలజనం అతనిచుట్టూ మూగిఉండడం గమనించాడు. ఆ బోధకుని ముఖం ఫోమాకు ఎక్కడో చూచినట్టనిపించింది. "మనం

ఈశ్వరునికి ఎంతో ఋణపడి ఉన్నాం.” అన్నాడొక కూలీ. “మనం ప్రార్థించాలి.” అన్నాడు మరొకడు. “ప్రార్థి స్తేమాత్రం మనపాపాలు పోతాయా?” అన్నాడు ఇంకొకడు. బోధకు డిలా చెప్పాడు. “ఆత్మను కేంద్రంగా చేసుకుని భావాలను దృఢం చేసుకో. పాపంనుంచి విముక్తి పొందాలనే వాంఛదృఢం చేసుకో” అలాచెప్పి అతను తలవొంచి జపమాల తిప్పుకోవ డం మొదలెట్టాడు. “అసలే మనం ఆలోచించాలన్నమాట. లోకంలో మనుష్యులకు ఆలోచించే తీరిక ఎక్కడుంది?” అన్నా డొక పామరుడు. “మనచుట్టూ అంతా కల్లోలమే.” అన్నాడు మరొకడు. “మనం ఎక్కడికైనా ఎడారిలోకి వెళ్ళాల్సిందే.” అన్నాడు వేరొకడు. “అందరూ వెళ్ళలేరు.” అన్నాడు ఇంకొకడు.

తరువాత నిశ్శబ్దం. ఒకసన్నని స్టీమర్ కూత వినిపించింది. ఫోమా టార్పాలిన్‌కు ఆనుకుని నిల్చుని తనచుట్టూ ఉన్న ప్రతి శబ్దాన్నీ వింటున్నాడు. అనిశ్చితమైన మంచులోగుండా మానవజీవితం ఎక్కడికో అవ్యక్తంగా సాగిపోతోంది. ఫోమాకు ఆ బోధకునితో మాట్లాడుదామనిపించింది. అతని కంఠస్వరంలో ఏదో ఆకర్షణ, శక్తి ఉన్నాయి. హఠాత్తుగా ఫోమాకు ఒక విషయం స్పష్టంగా స్ఫురించింది. ఆబోధకుడు తప్పకుండా వృద్ధు డైన అనానీ షురోవ్ కుమారుడే అయిఉంటాడనిపించింది. అతనికి ఆశ్చర్యం కలిగింది. వెంటనే ఆ బోధకునివద్దకు వెళ్ళి అతని పక్కనే కూచుని “తమరు ఇర్‌గిజ్‌నుంచి వస్తున్నారా స్వామీ?” అని అడిగాడు. బోధకుడు తలెత్తిచూచాడు.

“నేను అక్కడకూడా ఉండేవాణ్ణి.” అన్నాడుబోధకుడు.

"తమ స్వస్థలం అదేనా ?"

"లేదు."

"తమ రిప్పుడు అక్కడనుంచేనా రావడం."

"లేదు. సెయింట్ స్టీఫెన్ మఠాన్నుంచి వస్తున్నాను"

తరువాత సంభాషణ ఆగిపోయింది.

అతను షురోవ్ అవునో కాదో అడిగే సాహసం ఫోమాకు లేకపోయింది.

"మంచువల్ల మన ప్రయాణం ఆలస్యమయ్యేటట్టుంది." అన్నారు ఎవరో.

"ఆలస్యం కాకుండా ఉంటుందా!" అన్నాడు మరొకడు.

అంతా నిశ్శబ్దంగా ఫోమావంక చూస్తున్నారు. యువకుడు, అందగాడు అయిన ఫోమా చక్కగా ముస్తాబు చేసుకుని అందరినీ ఆకర్షిస్తున్నాడు. అంతా తనకోసం, తన మాటలకోసం ఎదురుచూస్తున్నారని అతనికి తోచింది. ఈ విషయం అతనికి కోపంకూడా తెప్పించింది. అతను కాసేపాగి "మిమ్మల్ని ఇదివరకెక్కడో చూచినట్టున్నాను స్వామీ!" అన్నాడు.

"కావచ్చు" అన్నాడు బోధకుడు, అతని వంక చూడకుండా. "తమతో మాట్లాడాలనిఉంది."

"సరే, కానీయి."

"నాతో రండి."

"ఎక్కడికి."

"నా కాబిన్‌లోకి."

బోధకుడు ఫోమాముఖంలోకి చూచి ఒక క్షణం ఆగి "సరే" అన్నాడు.

ఇకవురూ లోనికి వెళ్ళి కూచున్నారు. కుర్చీ మాసి పోతుందేమో అన్నట్లు ఎంతో భద్రంగా కూచున్నాడు బోధకుడు.

"తమపేరేమిటి స్వామీ?" అడిగాడు థోమా.

"మిరాన్!"

"మైఖేల్ కాదా?"

"మైఖేల్ ఎందుకు కావాలి?"

"మా ఊళ్ళో షురోవ్ అనే వర్తకుని కుమారుడొక డుండేవాడు. అతనుకూడా ఇర్గిజ్ వెళ్ళాడు. అతని పేరు మైఖేల్!" థోమా నిశ్చలంగా మిరాన్‌స్వామి వంక చూచాడు. కాని అతను మాత్రం శుద్ధ బుద్ధస్వరూపంలా ఉన్నాడు.

"నే నెప్పుడూ అలాటి వ్యక్తిని కలుసుకున్నట్లు లేదు. అతన్ని గురించి అడగడానికా నన్ను పిలిచావు?" అన్నాడు బోధకుడు.

"అవును"

"నే నెప్పుడూ మైఖేల్ షురోవ్‌ను కలుసుకోలేదు. సరే వెళ్ళొస్తాను." అంటూ లేవబోయాడు బోధకుడు.

"కాసేపు కూచోండి స్వామీ! తమతో మాట్లాడాలి." అన్నాడు థోమా.

దూరంనుంచి ఏదో మందంగా చప్పుడు వినిపిస్తోంది. థోమా కిటికీతలుపు తెరిచాడు. మంచులోనుంచి ఏవో చలిస్తున్న దీపాలు కనిపిస్తున్నాయి. మళ్ళీ మంచులో కలిసిపోతున్నాయి.

"ఎంత భయంకరం!" అన్నాడు థోమా తలుపుమూస్తూ.

"దేనికి భయం?" అన్నాడు బోధకుడు.

"చూడండి! రాత్రీ కాదు పగలూ కాదు. చీకటీ కాదు వెలుగూ కాదు. ఏమీ కనిపించడంలేదు. ఎక్కడికి వెడుతున్నామో తెలియదు" అన్నాడు థోమా.

"నీలో అంతర్జ్యోతిని వెలిగించుకో. అప్పు డంతా కనిపిస్తుంది."

బోధకుని జపమాల నిశ్శబ్దంగా తిరుగుతోంది. "నా కో విషయం చెప్పండి స్వామీ! తమలాగా బంధు మిత్రులను త్యజించి ఏపనీ లేకుండా పరిపూర్ణ స్వాతంత్ర్యంతో దేశదిమ్మరిగా తిరగడం మంచి దేనంటారా?" అనడిగాడు థోమా.

మిరాన్‌స్వామి తలెత్తి చూసి పసిపిల్లాడిలా నవ్వాడు. థోమాను స్పృశించి ఇలా అన్నాడు:

"ఇహవిషయాలు నన్నిటినీ వదిలిపెట్టు. వాటిలో మాధుర్యం లేదు. పాపానికి దూరంగా తొలగిబ్రతుకు! దుర్మార్గానికి దూరంగా తొలగి బ్రతుకు!"

"అదికాదు స్వామీ! నేనంత పాపినికూడా కాదు. నాకు విషయాలు అవగతం కావాలి. నే నదీ కోరుతున్నది!" అన్నాడు థోమా.

"ప్రపంచానికి నీవు పరాఙ్ముఖుడ వైతే, పొలాలుదాటి, పర్వతాలుదాటి, లోయలుదాటి, స్వాతంత్ర్యం వెదుక్కుంటూ దూరంగా వెళ్ళి, విశాలవిశ్వంలోకి వెళ్ళు. నీచుట్టూ పెరుగుతున్న అడవులు మేలుకొని ఈశ్వరుని రహస్యాన్ని నీకు వినిపించడం మొదలెడతాయి. పక్షులు కిలకిలారావములతో ఈశ్వర మహిమను గానంచేస్తాయి. ఆకాశం వంక చూడు! నీవూ ఈశ్వరుడూ తప్ప లోకంలో మరెవరూ లేరనిపిస్తుంది."

బోధకుని మాటలు సన్నని సంగీతంలా వినిపించాయి థోమాకు. అతనికి అన్ఫీసా అత్త చెప్పిన కథలన్నీ జ్ఞాపకం వచ్చాయి. వేసవికాలంలో ఒక రోజు. అతను ఎంతో దూరం నడిచి వెళ్ళాడు. ఒక చిన్న సెలయేరు. చల్లని నీళ్ళు. నీళ్ళలో పూలవాసన. అతనా చల్లని నీళ్ళు తాగాడు. నిద్రపోతున్న అడవి. చెట్ల కొమ్మలను చీల్చుకుని వస్తున్న సూర్యకిరణాలు. అంతా నిశ్శబ్దం! పక్షుల కిలకిలారవాలు. జీవితం కలలాఉంది. అక్కడ కల! ఇక్కడ ఇల! ఇక్కడ మనం ఈపొగమంచులో స్వేచ్ఛకోసం పోరాడుతూ నిల్చున్నాం.

"నీకు అక్కడ బంధాలు లేవు." అన్నాడు బోధకుడు.

"మీరెంతో బాగా మాట్లాడతారు." అన్నాడు థోమా.

స్టీమర్ కూత వినిపించింది. హార్బర్ దగ్గరికి వస్తోంది బోధకుడు సెలవు తీసుకున్నాడు.

"ఊళ్ళోకి వెళ్ళిన తరువాత ఒకమాటు వచ్చి కలవండి" అన్నాడు థోమా.

స్టీమర్ రేవు చేరుకుంది. థోమా బయటికి వచ్చాడు. అంతటా పొగమంచు. జనం దిగిపోతున్నారు. స్టీమర్ మళ్ళీ మెల్లగా మంచుమబ్బుల్లోకి సాగిపోయింది. బోధకుడు, రేవు, జనం, రొద; అన్నీ కలలా మళ్ళీ థోమామనస్సులో చెరిగి పోయాయి. థోమా సముద్రంలాఉన్న పొగమంచులోకి చూచాడు. అతనికి ఆకాశం గుర్తుకొచ్చింది. ఆకాశం ఎక్కడుందో! ఆకాశం కనిపించడం లేదు!

ఆ మరుసటి రోజు మధ్యాహ్నం ఫోమా యెజోవ్ గదిలో ఉన్నాడు. యెజోవ్ బల్లమీద నిల్చుని స్థానికవార్తలు చెపుతున్నాడు.

"ఎన్నికలు మొదలెట్టారు. నీ రక్షకపితను వర్తకులు మేయర్‌గా నిలబెడుతున్నారు. దయ్యంలా వదిలేట్టు లేదు! తన కూతుర్ని స్మోలిన్‌కిచ్చి పెళ్ళిచేస్తాట్ట. వాడు నీకు తెలుసుగా? ఆఫ్రికస్కా కూడా ఒక పెద్ద గొప్పవాడై పోయాడు."

"ఈగొడవ పోనిద్దూ." అన్నాడు ఫోమా. "నీవింకా తాగుతూనే ఉన్నావా?" అని అడిగాడు.

"ఆ తాగుతూనే ఉన్నాను. ఏం తాగితే?" అన్నాడు యెజోవ్. యెజోవ్ ఈకలుతీసిన కోడిపెట్టలా ఉన్నాడు. "నా హృదయంలో బాధ ఆర్చుకోడానికి తాగుతాను." అన్నాడు.

నేను వెళ్ళి ఒకమాటు ముసల్లాణ్ణి చూచిరావాలి" అన్నాడు ఫోమా.

"చూచిరా" అన్నాడు యెజోవ్.

"వెళ్ళగానే ఉపన్యాసం మొదలెడతాడేమో!" అన్నాడు ఫోమా.

"అయితే, వెళ్ళకు."

"లేదు, వెళ్ళాలి."

"అయితే వెళ్ళూ."

"నీవొక హాస్యగాడివి!" అన్నాడు ఫోమా.

ఫోమా వెళ్ళిపోయాడు. యెజోవ్ పాడుతున్నాడు.

"భయపడకోయ్, ఢంకా మ్రోగించు" అని.

"నీవే ఒకఘంటకావు! ఇక నీవు ఘంటకా మ్రోగించడమేమిటి?" అనుకున్నాడు ఫోమా, వీధిలోకి వస్తూ.

ఫోమా మయకిన్ ఇంటికి రాగానే ముందు లూబా కనిపించింది. ఆందోళనతో ఉత్సాహంతో త్వరత్వరగా మాట్లాడుతూ వచ్చింది "నీవా? ఇలా అయిపోయావేం? ఇంత చిక్కిపొయ్యావేం? మహా మంచిజీవితం గడుపుతున్నావన్నమాట" అన్నదామె. అంతలో ఆమెముఖం కలవరంతో విచలితమైంది "ఫోమా! నీవు విన్నావా? నీకు తెలుసా? అదిగో, బయట ఎవరో గంట మోగిస్తున్నారు. అతనే అనుకుంటాను." అంటూ ఆమె బయటికి పరుగెత్తింది. ఆమె వెళ్ళేటప్పుడు ఆమె తొడుక్కున్న గౌను రుసరుసలాడింది.

ఫోమా ఆమెతో మాట్లాడేఅవకాశంకూడా లేక అలాగే ఆశ్చర్యంతో నిలిచిపోయాడు. ఇంతలో మయకిన్ సెలవు దుస్తుల్లో ముస్తాబై బయటికి వచ్చాడు. ఫోమాను తేరిపార చూచి "ఎలా ఉన్నావోయ్? ఏ గాలికి కొట్టుకొచ్చావ్?" అని అడిగాడు.

"ఇంతకంటె నాతో చెప్పవలసిన మాటలు లేవా?" అన్నాడు ఫోమా.

హఠాత్తుగా తన రక్తకపిత వణికిపోవడం ఫోమా గమనించాడు. మయకిన్ కాళ్ళు గజగజ వణికిపోతున్నాయి. కనురెప్పలు ఆర్పుతున్నాడు. ఎంతో యత్నంమీద తలుపుబోదె పట్టుకుని నిల్చుంటాడు. అతనికి మూర్ఛ వస్తుందేమోఅని ఫోమా దగ్గరికి వచ్చాడు.

"అడ్డం తొలుగు! అవతల ఉండు!" అన్నాడు వృద్ధుడు.

మళ్ళీ అతనిముఖం మామూలుగాఅయింది. ఫోమా ఒక్కఅడుగు వెనక్కువేసి నిల్చున్నాడు. తనప్రక్కనే ఒకవ్యక్తి ఉండటం గమనించాడు. పొట్టిగా, బొద్దుగాఉన్న ఆవ్యక్తి మయకిన్‌ను "నాన్నా! ఎలాఉన్నావు? కులాసా?" అని అడిగాడు.

"నీ వెలా ఉన్నావ్ తారాస్?" అని అడిగాడు వృద్ధుడు.

ఫోమా కలవరంతో ప్రక్కకు తొలగి నిల్చున్నాడు. విప్పారిన కళ్ళతో ఆ తండ్రీ కొడుకుల సమాగమాన్ని చూస్తున్నాడు. తండ్రి కొడుకువంక నిశ్చలంగా నిశ్శబ్దంగా చూస్తున్నాడు కొడుకు మూడడుగులదూరంలోనిలబడిఉన్నాడు. అతని జుట్టు అప్పుడే నెరిసిపోయింది. అతను తనతండ్రివంక తన విశాల నేత్రాలతో చూస్తున్నాడు. అతని వెనకాలనుంచి భయంతోను, ఆనందంతోను చలితమవుతున్న లూబా ముఖం ఫోమాకు కనిపించింది. ప్రార్థనాపూర్వక నయనాలతో ఆమె తండ్రివంక చూస్తోంది. ఆమె ఏడ్చేటట్లుగా ఉంది. అంతా ఒక క్షణంపాటు ఆ ఉద్వేగాలబరువుతో నిశ్చలంగా నిశ్శబ్దంగా ఉన్నారు. మయకిన్ కంపితస్వరం ఆ నిశ్శబ్దానికి భంగం కలిగించింది.

"నీవెంత ముసలివాడవైపోయావు తారాస్?" అన్నాడు.

కొడుకు నవ్వాడు. తండ్రి తలుపుదగ్గర్నుంచి ఒక అడుగు ముందుకు వచ్చాడు. తారాస్ కూడా ఒక అడుగు ముందుకు వచ్చాడు. తండ్రి చెయ్యి చాచి "ఇరువురం కౌగిలించుకుందామా? అన్నాడు.

ఇరువురు వృద్ధులూ ఆలింగనంచేసుకున్నారు. లూబా కంఠం ఆనందంతో రుద్ధమైంది. ఫోమాకు ఊపిరిసలపడంలేదు.

"బిడ్డలు—మీరు హృదయానికి గాయాల్లాంటివారు, కాని ఆనందం ఇచ్చేవాళ్ళుకారు." అన్నాడు తండ్రి. ఇలా అని కుమార్తె వంక చూచి "అమ్మాయ్! ఆనందంతో కరిగిపోయి నట్టున్నావు కాని, ఇక వెళ్ళి కాస్త టీ తీసుకురా." అన్నాడు.

లూబా వెళ్ళింది. తరువాత తారాస్‌కు ఫోమాను పరిచయం చేశాడు మయకిన్.

"ఇతను నా రక్షకకుమారుడు — ఇగ్నాట్ గార్డియెవ్ కుమారుడు. నీకు జ్ఞాపకముందా?" అన్నాడు.

"నాకన్నీ జ్ఞాపకమే." అన్నాడు తారాస్.

"సరే, ఇంతకూ నీవు పెళ్ళి చేసుకున్నావా?"

"చేసుకున్నాను. కాని భార్య పోయింది."

"పిల్లలు?"

వాళ్ళూ పోయారు. ఇద్దరుండేవాళ్ళు."

"అయ్యో! నాకుమనుమలులేకుండాపోయారన్నమాట!"

"నేను పొగ తాగొచ్చా?" అడిగాడు తారాస్.

"ఓ! నీవు చుట్టలు కాలుస్తున్నావా?"

"చుట్టలంటే మీకిష్టంలేదా?"

"ఆ నాకన్నీ ఇష్టమే. చుట్టలుకాల్చడం శ్రీమంతుల లక్షణం."

"మనం అంతకంటె తక్కువని ఎందుకనుకోవాలి?"

"నేను తక్కువని అనుకుంటున్నాననా? ఊరికనే అలా అన్నాను. కేవలం అభిమానంవల్ల నా కొడుకు పదిహేడు

సంవత్సరాలపాటు తండ్రితో మాట్లాడకుండా దూరంగా ఉన్నాడట. నీకు తెలుసా?" అన్నాడు మయకిన్.

"తండ్రి అతనిమాట వినకపోవడంవల్ల!"అని ఆ విషయం జ్ఞాపకంచేశాడు తారాస్.

"సరే, అయిందేదో అయిపోయింది. గతాన్ని తవ్వుకోవడ మెందుకు? ఇంతకూ నీవు ఏమేమి చేశావో, ఎక్కడెక్కడున్నావో, సోడా ఫ్యాక్టరీకి ఎలా వచ్చావో ? – ఆ కథంతా చెప్పు."

"అదొక పెద్దకథ" అని మొదలెట్టాడు తారాస్, మెల్లగా. "నేను స్వేచ్ఛగా బ్రతికే అవకాశంరాగానే రెమిజోవ్‌ల బంగారుగనుల సూపర్నెంటు ఆఫీసులో గుమాస్తాగా చేరాను."

"వాళ్ళను నేనెరుగుదును. బాగా ధనికులు. ముగ్గురు అన్నదమ్ములు కదూ ? నాకు వాళ్ళందర్నీ తెలుసు. ఒకడు కుంటివాడు, ఒకడు వెర్రివాడు, ఒకడు లోభి. సరే ఇక చెప్పు."

"నే నక్కడ రెండు సంవత్సరాలు పనిచేశాను. తరువాత అతని కూతుర్ని పెళ్ళిచేసుకున్నాను."

ఆ సూపర్నెంటుకూతుర్నేనా? మంచిపని చేశావు?" అన్నాడు మయకిన్.

తారాస్ కాసేపు ఆలోచిస్తూ మెల్లగా కూచున్నాడు. వృద్ధుడు అతని విషాదవదనంవంకచూచి తన కుమారుని అర్థం చేసుకున్నాడు.

"అయితే నీభార్యతో సుఖంగానే ఉన్నావన్నమాట. అయినా ఏంచెస్తాంలే. చచ్చేవాళ్ళు చస్తుంటే, బ్రతికేవాళ్ళు

బ్రతుకుతుండాలి. నీకింకా ఈడుమించిపోలేదుకూడా. నీభార్య పోయి ఎన్నాళ్ళయింది?"

"ఇది మూడో సంవత్సరం"

"అయితే నీవు సోడా ఫ్యాక్టరీకి ఎలా వచ్చావు?"

"అది మా మామగారిది."

"నీజీత మెంత?"

"ఇంచుమించు అయిదు వేలు."

"తక్కువజీతం కాదులే." అన్నాడు మయకిన్.

తారాస్ తండ్రివంక చూచి "సరేకాని, నేను ఖైదీనని మీరెలా అనుకుంటున్నారు?" అని అడిగాడు. అదివిని తండ్రి ఆశ్చర్యపోయాడు.

"నిన్ను సైబీరియా పంపించారన్నారు. నిజమేనా?" అడిగాడు తండ్రి.

"నన్ను ఆరుసంవత్సరాలు సైబీరియాపంపిస్తే 'లెనా'లో ఉన్నాను. మాస్కోలో తొమ్మిదినెలలు ఖైదులో ఉన్నాను. అంతే!"

"ఇదేమిటి, ఇక్కడ అలా పుకార్లు పుట్టించారు?" అన్నాడు తండ్రి.

"అదొక అర్థంలేని పుకారులే." అన్నాడు తారాస్.

"అంతే!"

ఫోమా ఇంతసేపూ ఒక మూల కూచుని ఈ సంభాషణ వింటున్నాడు. లూబా చెప్పిన మాటలను బట్టి తారాస్ మరోవిధంగా ఉంటాడనుకున్నాడు. కాని అతనూ అందరిలాగానే ఉన్నాడు. సోడా తయారుచేయడంలో ఉండే లాభాలను

గురించి తండ్రితో మాట్లాడుతున్నాడు. అతను బానిస ఖైదీ కాదు. లూబా చెప్పింది అబద్ధం! మధ్య మధ్యలో లూబా వచ్చి తొంగిచూచి పోతోంది. ఆమె ముఖంలోనూ, కళ్ళలోనూ ఆనందం కనిపిస్తోంది మెల్లగా అడుగులు వేసుకుంటూ వస్తోంది. ఏదో ఒక విధంగా మెడనిక్కించి అన్నవంక చూస్తోంది. ఫోమా ఆమెవంక పరిశ్నార్థకంగా చూస్తున్నాడు. కాని ఆమె గమనించడంలేదు పళ్ళాలూ, సీసాలూ తీసుకుని అటూ ఇటూ పరుగెత్తుతోంది.

"చూచావా, నా కొడుకేలాంటివాడో?" అన్నాడు మయకిన్ ఫోమాతో. ఇంతలో లూబా వచ్చి అందరినీ భోజనాలకు పిలిచింది. తండ్రీకొడుకులు లోపలకు వెళ్ళగానే ఫోమా లూబా చెయ్యి పట్టుకున్నాడు.

"ఏమిటి" అన్నదామె.

"ఏమీలేదు నీకు సంతోషంగా ఉన్నదా అని అడుగుదామనుకుంటున్నాను" అన్నాడు ఫోమా.

"ఆ. లేకేం?" అన్నది లూబా.

"దేనికి సంతోషం?"

"అంటే నీ ఉద్దేశం?"

"ఏమీ లేదు ఊరికనే అడుగుతున్నాను."

"నీవు చాలా చిత్రమైన మనిషివి!" అన్నది లూబా.

"తారాస్ కూడా అందరిలాంటి మనిషే" అన్నాడు ఫోమా.

"అన్నయ్యను గురించి నా ముందు మాట్లాడకు." అన్నది లూబా. ఆమెతిరిగి వెళ్ళిపోతూ ఒక్కమాటు ఫోమాను చూచి కసురుకుంది.

ఫోమా పగలబడి నవ్వాడు. అతనికి భోజనాలగదిలోకి వెళ్ళా లనిపించలేదు. అక్కడ ముగ్గురూ హాయిగా కబుర్లా డుతూ, నవ్వుతూ కూచున్నారు. వాళ్ళ గొంతులు ఇక్కడ ఫోమాకు వినిపించాయి. వాళ్ళ నవ్వులూ వినిపించాయి. ఇప్పుడు లూబా తనను ద్వేషించినట్టుగా లోకమంతా తనను ద్వేషిస్తే ఎంతో హాయిగా ఉంటుం దనిపించింది ఫోమాకు. ఇప్పుడు వాళ్ళు తనను చూచి జాలిపడుతున్నారో, లేక నవ్వు తున్నారో అతనికి బోధపడటంలేదు. అతనికి వెంటనే అక్క ణ్ణుంచి వెళ్ళిపోదామనిపించింది. వీధిలో అడుగుపెట్టగానే మయ కిన్లందరూ తన్ను చూచి పరాభవించారనీ, పరిహసించారనీ అనిపించింది. ఇంతకూ లోకంలో తనకు దగ్గరైనవాళ్ళు వాళ్ళే. అతని కళ్ళముందు తన రక్షకపితముఖం కనిపించింది. తరువాత తారాన్‌ముఖం, అతనిప్రక్కనే వంగి వడ్డనచేస్తున్న లూబా ముఖం కనిపించాయి. "నన్నలా చూచేవాళ్ళెవరున్నారు? ఈ లోకంలో ఎవరూలేరు" అనుకున్నాడు తనలో. అలా ఆలో చిస్తూ నదీతీరం చేరుకున్నాడు. అక్కడ రకరకాల జనం రక రకాల వస్తువులు మోసుకుని పోతున్నారు. త్వరలో పని ముగించుకుని ఇళ్ళకు వెడదామనుకుంటున్నారు. శాంతికోసం, విశ్రాంతికోసం అర్థిస్తున్నట్టుగా నది చప్పుడుచేస్తూ ప్రవహి స్తోంది. ఫోమా నదిఒడ్డున నిల్చున్నాడు.

"నాకు కొంచెం బ్రాందీ ఇప్పిస్తారా ?" ఒక కంఠస్వరం వినిపించింది. ఫోమా ప్రక్కకు తిరిగి చూచాడు. ఒక వ్యక్తి నిలుచుని ఉన్నాడు. గడ్డం పెరిగిఉంది. కాళ్ళకు చెప్పుల్లేవు. చిరిగిన చొక్కా. గాయంలా ఉబ్బినముఖం. "వెళ్ళు" అన్నాడు ఫోమా.

"షావుకారూ! నీవు పోతూ నీ డబ్బును తీసుకునిపోవు. ఒకగ్లాసు బ్రాందీ పోయించు. నీకు చెయ్యి జేబులోపెట్టే ఓపిక కూడా లేదా?" అన్నా డా వ్యక్తి.

ఫోమా అతనివంక చూచి "అడగాల్సినపద్ధతి ఇదేనా?" అన్నాడు.

"మ రెలా అడగమంటారు ? పది కోపెక్‌లభాగ్యానికి మీకు సాష్టాంగపడమంటారా?" అన్నా డా వ్యక్తి.

ఇదిగో, తీసుకో !" అంటూ ఫోమా, నాణాన్ని విసిరేశాడు.

"పదిహేను కోపెక్‌లా ? మరో పదిహేనుపారేస్తే కాళ్ళమీదా చేతులమీదా సారాకొట్టుకు వెడతాను."

"వెళ్ళు !" అన్నాడు ఫోమా.

"అడిగినప్పుడు ఇవ్వనివాడికి-ఎప్పుడూ ఏమీ ఉండదు!" అంటూ అతను వెళ్ళిపోయాడు.

ఫోమా అతనివంకచూచి "ఎంతభ్రష్టుడైతే మటుకేం? ఎంతసాహసం ! బిచ్చం అప్పుఅడిగినట్టు అడుగుతాడు. ఇలాంటి వాళ్ళకు ఇంతసాహసం ఎలావస్తుందో !" అనుకున్నాడు. బరువుగా నిశ్వసించి తనకుతాను ఇలా జవాబుచెప్పుకున్నాడు.

"స్వేచ్ఛ ఉన్నవాడికి సాహసం వస్తుంది. అతనికి సంకెళ్లు లేవు. అతను విచారపడవలసిన విషయంకాని, భయపడవలసిన విషయంకాని లేదు. నాకుమాత్రం విచారపడవలసిన విషయం, భయపడవలసిన విషయం ఏముంది?" ఈ రెండు ప్రశ్నలూ ఫోమా హృదయంలో కలవరం కలిగించాయి. బరువులు మోస్తున్నవాళ్ళు "దుబినుష్కా" అనే రష్యన్ పల్లెపదాన్ని పాడుతున్నారు. ఫోమాకు ఈ గీతం విన్నప్పుడు ఆనందం, అసూయ, రెండూ కలిగేవి. లావుగా, బొద్దుగాఉన్న ఒకవ్యక్తి పనివాళ్ళను అదిలిస్తున్నాడు. ఫోమాకు కోపం వచ్చింది.

"ఏమిటిది?" అన్నాడు ఫోమా.

"మీకెందుకు?" అన్నాడా వ్యక్తి.

"నాకవసరం ఉంది. పని చేస్తున్నది వాళ్ళూ, రొప్పు తున్నది నీవూ!" అన్నాడు ఫోమా.

"జాగ్రత్తగా మాట్లాడాడు!" అన్నాడా వ్యక్తి. అలా అంటూ అక్కణ్ణుంచి పరుగెత్తి వెళ్ళాడు. ఫోమాకూడా ఎవరినో తిట్టాలనే కోరికతో అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం మళ్ళీ మయకిన్ల ఇంటికి వెళ్ళాడు. వృద్ధుడు ఇంట్లోలేడు. లూబా, ఆమెఅన్న టీ తాగుతూ కూచుని ఉన్నారు. తలుపుదగ్గరికి వెళ్ళేసరికి తారాసు గొంతుక విని పిస్తోంది.

"నాన్న ఎందుకూ అతన్ని గురించి అలా ఆనసపడ తాడు?" అంటున్నాడు తారాసు. ఫోమాను చూడగానే ఆగి పోయాడు. లూబాముఖం కలవరపడింది "నీవా" అన్నది.

"నన్ను గురించే మాట్లాడుకుంటున్నారు." అనుకున్నాడు ఘోమా తనలో.

"నీవు విందుకు వెడుతున్నావా?" లూబా అడిగింది.

"ఏ విందుకు?" అని అడిగాడు ఘోమా.

"కనునోవ్ కొత్త స్టీమర్ కొన్నాడు. ప్రారంభోత్సవం చేస్తున్నాడు. తెలీదా? అన్న దామె.

"నన్ను పిలవలేదు." అన్నాడు ఘోమా.

"ఎవర్నీ పిలువలేదు. తన్ను గౌరవించదలచుకున్న వాళ్ళంతా రావచ్చు నన్నాట్ట". అన్న దామె.

"అయినా ఎవడికక్కావాలి?"

"అక్కడ మంచి తాగుడు పార్టీ కూడా ఉందట!"

"తాగదలచుకుంటే నాడబ్బుతో నేను తాగగలను"

"నాకు తెలుసులే." అన్నది లూబా, భావయుక్తంగా తల ఆడిస్తూ.

తారాస్ టీ చెంచా వ్రేళ్ళమధ్య ఇరికించుకుని దానితో ఆడుకుంటున్నాడు ఘోమావైపు, లూబావైపు పరిశీలనగా చూస్తున్నాడు.

"నా రక్షకపిత ఏడీ?" అని అడిగాడు ఘోమా.

"బ్యాంకుకు వెళ్ళాడు. అక్కడ డైరెక్టర్ల సమావేశం జరుగుతోంది. ఆఫీసర్ల ఎన్నికకూడా జరుగుతుంది."

"వాళ్ళు మళ్ళీ ఆయన్నే ఎన్నుకుంటారు."

"తప్పకుండాను."

మళ్ళీ సంభాషణ ఇంతలో ఆగిపోయింది. ఘోమా, అన్ననూ చెల్లెల్నీ గమనిస్తూ కూచున్నాడు. తారాసు, చేతిలో

చెంచా క్రిందపడేసి మెల్లగా టీ తాగుతున్నాడు. గ్లాసు చెల్లెలి దగ్గరికి జరిపాడు. ఆమెను చూచి చిరునవ్వు నవ్వాడు. ఆమె కూడా చిరునవ్వు నవ్వింది. గ్లాసులో పంచదార కలుపుకుంటూ ఉంది. తరువాత ఆమెముఖం బాష్పపూరితమైంది. ఏదో అడగడానికి ఆమె సిద్ధపడుతున్నట్టుగా ఉంది. తరువాత మెల్లని కంఠస్వరంతో తన అన్నను గౌరవంగా ఇలా అడిగింది.

"మళ్ళీ మనం ఆపిన సంభాషణ ప్రారంభిద్దామా?"

"నీ ఇష్టం." అన్నాడు తారాసు, ముక్తసరిగా.

"నీవేదో చెప్పావు. కాని నాకు అర్థంకాలేదు. ఏమి టది? నీవు చెప్పినవిధంగా ఇదంతా కేవలం ఊహాజనితోన్మాదమే అవుతుంది. అయితే, స్వప్నతుల్యమే అయితే—ఇక జీవితంతో అసంతృప్తి పొందినవ్యక్తి చేయవలసిన కర్తవ్యం ఏమిటి? అనికదూ నే నడిగింది ?"

ఆమె తనదేహాన్నంతా తన అన్నవైపుకువంచి ఈప్రశ్న అడిగింది. ఆమెకళ్ళు, అతను ఏం జవాబు చెపుతాడో అని కనిపెట్టుకుని ఉన్నాయి. అతను ఆమెవంక నీరసంగాచూచి, తల వాంచుకుని ఇలా చెప్పడం మొదలెట్టాడు—

"జీవితంలో ఈ అసంతృప్తి ఎందుచేత కలుగుతున్నదా అని మనం ఆలోచించవలసిఉంటుంది. నాఉద్దేశంలో దీనికి మొట్ట మొదటి కారణం పనీ పాటా లేకపోవడం. శ్రమపట్ల ఏమాత్రం గౌరవం లేకపోవడం. ఇక రెండో కారణం: మన శక్తిని మనం సరిగ్గా తూచుకొని లెక్కవేసుకోకపోవడం. మనుష్యులలో చాలామంది తమశక్తికి మించిన పనులు చేస్తామని అనుకుంటూ ఉంటారు. కాని నిజం ఆలోచిస్తే మనిషికి అవసరమైనశక్తిచాలా

స్వల్పమే. తన శక్తిసామర్థ్యాలకు అనువైన పనిని ఎన్నుకొని దానిని జాగ్రత్తగా నిర్వహించుకరావాలి నీవు ఏపని చేస్తున్నావో ఆ పనిపట్ల నీకు సంపూర్ణమైన ఆసక్తి ఉండాలి. అప్పుడే ఆపని కేవలం పనిమాత్రమేకాకుండా ఒక సృష్టికూడా అవుతుంది. చేసింది ఒక చిన్న కుర్చీనే కావచ్చు. కాని దానినే ఆసక్తితోనూ ప్రేమతోనూ చేస్తే అదే ఒక చక్కని అందమైనవస్తు వవుతుంది. అన్నివిషయాల్లోనూ ఇంతే. 'స్మైల్సు' వ్రాసిన గ్రంథాలు చదివి చూడు. నీకే తెలుస్తుంది. నీ వా గ్రంథం చదవలేదా? అది చాలా గొప్ప పుస్తకం. లుబక్ చదివిచూడు. మొత్తంమీద ఆలోచిస్తే ఇంగ్లీషుజాతి గొప్ప జాతి యని తెలుస్తుంది. బాగా శ్రమించేజాతి అది. అందుచేతనే పారిశ్రామిక, వాణిజ్యరంగాలలో ఇంత అద్భుతమైన అభివృద్ధి గాంచింది. వాళ్ళకు శ్రమపడటం ఒక మతంలాంటిది. సంస్కృతి యొక్క ఔన్నత్యం ఎప్పుడూ శ్రమపైననే ఆధారపడిఉంటుంది. సంస్కృతి పెరిగేకొలదీ మనుష్యుల కోర్కెలు తీరుతుంటాయి. వాళ్ళకి జీవితాలలో ఆటంకాలుకూడా తగ్గిపోతాయి. అవసరాలన్నీ తీరినప్పుడే మనిషి ఆనందం అనుభవించడానికి సాధ్యమవుతుంది! చూచావా మరి! మనిషి సౌఖ్యానికీ పనికీ ఎంత సన్నిహిత సంబంధం ఉన్నదో!"

తారాస్ మయకిన్ నెమ్మదిగానూ, బరువుగానూ మాట్లాడాడు. లూబా తన కనుబొమలు ముడుచుకుని, శ్రద్ధతో అతనివైపుకు వాలి, అతను చెప్పిన మాటలన్నీ విన్నది. ప్రతి మాటా విని ఆకళింపు చేసుకున్నది.

"సరేకాని, ప్రతివిషయమూ మనిషికి రోతగా కనిపిస్తే అప్పుడు మనిషి ఏంచేయాలి?" అని అడిగాడు ఫోమా.

"మనిషికి రోతగా కనిపించే విషయం మచ్చుకు ఒకటి చెప్పు" అన్నాడు తారాస్.

"ప్రతిదీనూ. దేంట్లోనూ సుఖం కనిపించదు; ఏదీ బాగున్నట్టు తోచదు, వ్యాపారం, పని, మనుష్యులు, వాళ్ళు చేసే పనులూ—— అన్నీ అసహ్యంగానే కనిపిస్తాయి. లోకంలో అంతా మోసంగానే కనిపిస్తుంది. మనలోని శూన్యత్వాన్ని దాచుకోవడానికి మనం దించుకున్న ఒక అడ్డుతెర- అనిపిస్తుంది వ్యాపారం! ఇదంతా ఏమిటో, చెప్పు మరి!" అన్నాడు ఫోమా.

"నీవు చెప్పే దేమిటో నాకెంతమాత్రం అర్థంకావడం లేదు." అన్నాడు తారాస్.

లూబా తనవంక కోపంగా చూడటం గమనించి ఫోమా మాట్లాడకుండా ఆగిపోయాడు.

"నీకు అర్థం కావడంలేదా? అయితే, ఇలా చెపుతాను విను! ఒక మనిషి పడవలో ప్రయాణంచేస్తున్నాడనుకో. పడవ మంచిదే కావచ్చు కాని, ఆ పడవక్రిందనున్న లోతంతా ఒకటే. పడవ ఎంత గట్టిదైనా అగాధమైన ఆలోతుచేత మనిషి ఆకర్షింపబడితే-అప్పుడతన్ని ఏపడవా రక్షించలేదు." అన్నాడు. ఫోమా, కొద్ది క్షణాలు ఆగి.

తారాస్ ఫోమావంక అదోలా చూచాడు. వ్రేళ్ళతో బల్లమీద దరువువేస్తున్నాడు. లూబా కుర్చీలో అటూ ఇటూ కదులుతోంది. గోడ గడియారపు పెండ్యులం మందంగా సెకండ్లను తెలుపుతోంది. ఫోమాహృదయం మెల్లగా

కొట్టుకోసాగింది. ఇక్కడ అతని బాధాచలిత హృదయాంతో సానుభూతి కనపరిచే ప్రాణి ఒక్కటీ లేదని వేదనతో కొట్టుకో సాగింది.

"పనితోనే మనిషి బ్రతుకంతా పరిపూర్ణత చెందినట్లు కాదు. పనివల్ల న్యాయం జరుగుతుందనీ నమ్మకంలేదు. కొందరు బ్రతికినంతకాలం ఏపనీలేకుండా బ్రతుకుతారు. అయినప్పటికీ పనిచేసేవాళ్ళబ్రతుకులకంటే వీళ్ళబ్రతుకులే హాయిగా, తీయగా ఉంటాయి. దీన్నిఏమంటారుమరి? కొందరుగుర్రాల్లా పనిచేస్తారు. మరికొందరు వారిమీద ఎక్కి సవారీచేస్తారు. ఇంతకూ ఈశ్వర సాన్నిధ్యంలో 'మీరు ఎందుకు బ్రతికినట్టు?' అని వీరిని ప్రశ్నిస్తే 'మాకు ఆవిషయం ఆలోచించే తీరిక లేకపోయింది. బ్రతికినంత కాలం ఏదో పనిచేస్తూనే బ్రతికాం'అని సమాధానం చెపుతారు. వారికి ఆజ్ఞలిచ్చినవారూ అంతే. వారికీ ఆవిషయం తెలీదు. తనెందుకోసం జీవిస్తున్నాడో ప్రతిమనిషీ ప్రధానంగా తెలుసుకోవాలి." అన్నాడు థోమా.

తరువాత కొద్దిసేపు మౌనంగా ఉండి మళ్ళీ ఇలా చెప్ప సాగాడు థోమా.

"పనిచేయడం, డబ్బు సంపాదించడం, ఇళ్ళు కట్టడం, పిల్లలను కనడం, చనిపోవడం—ఇదేనా మనిషి జీవితానికి అర్థం? కాదు. జీవితానికి మరేదో అర్థం ఉండితీరాలి! మనిషి పుట్టి పెరిగి చనిపోతున్నాడు. ఎందుకని? మనమంతా ఈ విషయం విధిగా ఆలోచించాలి మన జీవితాలకు అర్థం లేదు. ఎంత ఆలోచించినా అర్థం కనిపించదు. పైగా ఏ విషయంలో చూసినా అసమానతే కనిపిస్తుంది. కొందరు భాగ్యవంతులు—

కొందరు నిరుపేదలు, కొందరు ఉన్నవారు—కొందరు లేనివారు. కొందరు రాజులు - కొందరు సేవకులు. ఏమిటి ఇదంతా? లక్షమంది ప్రజలు బ్రతకడానికి సరిపోయే డబ్బు ఒక్క భాగ్యవంతుడి దగ్గర మూలుగుతూ ఉంటుంది. పైగా ఆ భాగ్యవంతుడు పనీపాటా లేక సోమరిగా జీవిస్తాడు. మరి పేదలు రాత్రింబగళ్లు నడుంవంచి కష్టంచేస్తారు. అలా బ్రతికినంత కాలం కష్టం చేస్తూనే ఉంటారు. అయినా వాళ్ళ దగ్గర రాగి డబ్బుకూడా ఉండదు. ఏమిటి ఇదంతా? ఇంత అసమానత్వం లోకంలో కొట్టుమిట్టాడుతూఉన్నా మళ్ళీ మనుషుల్ని చూస్తే పెద్ద భేదమేమీ ఉన్నట్టు కనిపించదు. కొందరు కట్టుకోడానికి గుడ్డపేలిక లేకపోయినా, తామూ శ్రీమంతులకుమల్లే ఘనమైన సిల్కుదుసులు ధరించినట్టు ఊహించుకుంటూ బ్రతుకుతారు. ఏమిటి ఇదంతా?"

ఫోమా ఇంకా చెప్పేవాడేకాని అంతలోనే తారాస్ హఠాత్తుగా లేచి "ఇక చాలు, నే వెళ్ళిపోవాలి" అంటూ వెళ్ళిపోబోయాడు. ఫోమా మాట్లాడడం ఆపి లూబావంక చిరునవ్వుతో చూచాడు.

"ఈ వేదాంతమంతా ఎక్కడ నేర్చుకుని వచ్చావు?" అన్నది లూబా.

"ఇది వేదాంతంకాదు భయంకరమైన బాధ! కళ్ళు తెరిచి చూడు! నీకే తెలుస్తుంది." అన్నాడు ఫోమా.

"సరే, అసలు విషయం ముందు మాట్లాడుకుందాం లూబా!" అని మొదలెట్టాడు తారాస్.

"నిరాశావాదం, ఆంగ్లోసాక్సన్ జాతికి పూర్తిగా విభిన్నమైనది. బైరన్‌లోనూ స్విఫ్ట్‌లోనూ నిరాశావాదం ఉన్నదని అంటారుకాని, నిజంగాచూస్తే వారు వెలిబుచ్చింది నిరాశావాదం ఎంతమాత్రమూ కాదు. అసంపూర్ణమైన జీవితంపట్ల, మానవునిపట్ల, తమ వ్యతిరేకతను మాత్రమే వారు వెలిబుచ్చారు. మరి ఇది నిరాశావాదం ఎలా అవుతుంది? కాని ఒక విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తుంది. మనం అనుకున్నట్టు వారు వెలిబుచ్చిన నిరాశావాదం, గడ్డకట్టిన, తూచిన, అచేతనమైన నిరాశావాదం మాత్రం కాదు."

ఇలా లూబాతో చెపుతూ చెపుతూ తారాసు, మధ్యలో హఠాత్తుగా ఫోమామాట జ్ఞప్తికి తెచ్చుకుని అతని వైపు తిరిగాడు. వీపువెనుక రెండుచేతులూ పెనవేసి పట్టుకున్నాడు. తొందపూపుతూ మళ్ళీ ఇలా చెప్పసాగాడు.

"నీవు చాలా ప్రధానమైన ప్రశ్నలు లేవనెత్తావు. నీకు నిజంగా వాటిని గురించి తెలుసుకోవాలనిఉంటే, నీవు గ్రంథ పఠనచేయాలి. గ్రంథాలలో మానవజీవితాన్ని నిర్వచిస్తూ, జీవితం ఎందుకోసమో, జీవిత పరమావధి ఏదో – మొదలైన విషయాలపై పెద్దలు తమ అమూల్యమైన అభిప్రాయాలు వెలిబుచ్చారు. మరి నీసంగతేమిటి? నీవు గ్రంథాలు చదివావా?"

"లేదు!" అని చెప్పాడు ఫోమా, ముక్తసరిగా.

"అయ్యో!"

"పుస్తకాలంటే నా కిష్టంలేదు,"

"అహ! అలా కాదు. అవి ఏదోవిధంగా కొంతవరకు నీకు ఉపయోగపడతాయి." అన్నాడు తారాస్. అలా అంటు

న్నప్పుడు అతని పెదవులపై ఒక చిన్న చిరునవ్వుతెర వచ్చి పోయింది.

"పుస్తకాలా? నా చుట్టూఉన్న మనుష్యులే నాకు ఉపయోగపడటం లేదు. నా ఆలోచనలనూ అనుమానాలనూ వాళ్ళే పరిష్కారం చేయలేకపోతున్నారు. అలాంటప్పుడు ఇక పుస్తకాలవల్ల నాకేం ప్రయోజనం కలుగుతుంది! అవి నాకెలా తోడ్పడుతాయి! లాభంలేదు." అన్నాడు ఫోమా చిరచిరలాడుతూ.

తారాస్ అభిప్రాయాలు ఫోమాకు ఏంతమాత్రంనచ్చ లేదు. పైగా అతని వైఖరే తనకు విరుద్ధంగా కనిపించింది. ఫోమాకు అసహ్యము, విసుగుదల కూడా కలిగాయి. అక్కణ్ణుంచి వెళ్ళిపోతే బాగుండుననుకున్నాడు. కాని మళ్ళీ అదే సమయంలో, లూబాతో ఆమె అన్నను గురించి అవమానకరంగా ఏవో కొన్ని మాటలు మాట్లాడాలనుకున్నాడు. అందుకని తారాస్ గదిలోంచి వెళ్ళిపోయేదాకా అక్కడేకనిపెట్టుకునికూచున్నాడు, లూబా టీ కప్పులు కడుగుతోంది. దేనిని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు ఆమె ముఖం స్పష్టపరుస్తోంది. పరధ్యాన్నంగా ఉండడంవల్ల ఆమె అజాగ్రత్తగా పనిచేస్తోంది. కప్పులు కడిగేటప్పుడు ఆమె చేతులు వణికిపోతున్నాయి. తారాస్ గదిలోనే పచారుచేస్తున్నాడు. మధ్య మధ్య వెండి సామానులతో నిండిఉన్న అల్మరా దగ్గర నిల్చుంటున్నాడు. అల్మరా అద్దాల తలుపులపై వ్రేళ్ళతో దరువువేస్తూ, లోపలఉన్న వెండి సామానులు పరిశీలనగా చూస్తున్నాడు. అతనికళ్ళు అర్ధనిమీలితాలై ఉన్నాయి. అప్పుడప్పుడు ఈలలు

వేస్తున్నాడు కూడా. గోడ గడియారపు పెండ్యులం మందంగా, బద్ధకంగా ఊగుతూ సెకండ్లను తెలుపుతోంది. అది అల్మారా అద్దాల తలుపులో ప్రతిఫలిస్తోంది. పళ్ళు ఇకిలిస్తున్న పెద్ద వికృతముఖంలా కనిపిస్తోంది.

లూబా రెండుమూడుసార్లు ఫోమావంక ప్రశ్నార్థకంగా చూచింది. ఆ చూపుల్లో ఏదో అయిష్టత, అసమ్మతి, ఆతృత అగుపిస్తున్నాయి. ఇది ఫోమా గమనించాడు. తాను ఆమెకు అడ్డంగా ఉన్నాననీ, తానక్కడనుంచి వెళ్ళిపోవాలని ఆమె కోరుకుంటున్నదనీ, ఫోమా గ్రహించాడు. ఇలా గ్రహించుకుని కూడా అతను చిరునవ్వుతో ఇలా అన్నాడు:

"ఈ రాత్రికి నేనిక్కడే ఉండాలనుకుంటున్నాను లూబా! మీనాన్నగారితో మాట్లాడాల్సిన పనిఉంది. పైగా మాఇంట్లో మాత్రం ఎవరున్నారు? ఒంటరిగా గడపాలంటే కష్టంగా ఉన్నది కూడా."

"అయితే వెళ్ళి మర్ఫూషాతో చెప్పు. నీకా మూలగదిలో పక్కా అదీ ఏర్పాటు చేస్తుంది." అన్నది లూబా. ఈమాట ఆమె ఎంతో ఆదుర్దాగా చెప్పింది.

"అలాగే." అన్నాడు ఫోమా.

ఫోమా అక్కణ్ణుంచి లేచి భోజనశాలలోంచి బయటికి వచ్చేశాడు. అతనిలా బయటికి వచ్చాడో లేదో, అంతలోనే లోపల తారాస్ తన చెల్లెలిని ఏదో మెల్లగా అడుగుతూ ఉండడం ఫోమాకు వినిపించింది.

"నన్నుగురించేనా!" అనుకున్నాడు ఫోమా వెంటనే. ఇలా అనుకునేసరికి హఠాత్తుగా అతని మనస్సులోకి

ఒక దురాలోచన దూకుతూవచ్చింది.

"నన్ను గురించి ఈ పెద్దపెద్ద తెలివికలవారంతా ఏం చెప్పుకుంటున్నారో నేనెందుకు వినకూడదూ?" అని అనుకున్నాడు.

ఫోమా తనలో తాను మెల్లగా నవ్వుకున్నాడు. వెనక్కి మళ్ళి మెల్లగా మునివేళ్ళమీద నడుస్తూ నిశ్శబ్దంగా భోజనశాలకు ఆనుకుని ఉన్న రెండోగదిలోకి వెళ్ళాడు. ఆగదిలో దీపం లేదు. అంతా చీకటిగా ఉంది. భోజనశాల తలుపు దగ్గరగా వేసి ఉండడంవల్ల సందుల్లోంచి సన్నని వెలుతురు మాత్రం వచ్చి ఫోమాఉన్నగదిలో పడుతోంది. ఫోమా గుండెలు దడదడ కొట్టుకోసాగాయి. వేగంగా ఊపిరి పీలుస్తున్నాడు. ద్వేషంతో చిరునవ్వు నవ్వుకున్నాడు. ఊపిరంతా బిగబట్టి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ తలుపుదగ్గరకి వెళ్ళాడు. తలుపు చాటున నిల్చుని లోపల వాళ్ళుమాట్లాడుకునే మాటలు వినసాగాడు.

"వట్టి మొరటు మనిషి!" అంటున్నాడు తారాస్. తరువాత లూబా మెల్లగాను, తొందర తొందరగాను చెప్పడం మొదలెట్టింది.

"అతనెప్పుడూ తప్పతాగి తిరుగుతున్నాడు. భయంకరమైన జీవితాన్ని గడుపుతున్నాడు! విపరీతంగా ప్రవర్తిస్తున్నాడు! మరి కారణమేమిటో తెలీదు కాని, మొత్తానికి ఇదంతా హఠాత్తుగా పుట్టుకొచ్చింది. మొదట వైస్ గవర్నర్ అల్లుణ్ణి పట్టుకుని క్లబ్‌లో పడేసి కొట్టాడు. అదే మొదలు! ఆ మచ్చమాపుచేయడానికి నాన్నగారుపడ్డ తిప్పలు అన్నీ ఇన్నీ కావు. అదృష్ట

వశాత్తూ ఆ వైస్ గవర్నర్ అల్లుడు వట్టి పోకిరీ అనీ, తుంటరి వాడనీ పేరుపడడంవల్ల సరిపోయింది. అతను తాగుడుకూ, జూదాలాడి మోసంచెయ్యడానికి పెట్టినపేరట. అందువల్ల గాని, లేకపోతే ఎందాకా వచ్చేదో! అక్కడికీ ఈ గొడవంతా మాపుచేయడానికి నాన్నగారు రెండువేల రూబుళ్ళు ఖర్చు పెట్టాల్సివచ్చింది. నాన్నగారు ఇక్కడ ఈ గందరగోళంలో తన్నుకుంటూ ఉంటే, అక్కడ ఫోమా ఒక గుంపుకు గుంపు జనాన్ని వోల్గా నదిలో ముంచడానికి పూనుకున్నాడు !" అని చెపుతోంది లూబా.

"ఆహా! ఎంత దారుణం! ఎంత భయంకరం! మరి ఇలాంటి పెద్దమనిషి జీవితాన్ని గురించీ, జీవిత పరమావధిని గురించీ పెద్దపెద్ద నీతులు వల్లిస్తాడు దేనికి?" అన్నాడు తారాస్.

"మరోమాటు ఏంజరిగిందో తెలుసా? అతను స్టీమర్ మీద జల్సాచేస్తున్నాడు. అతనిచుట్టూ అతనిలాంటి జనమే ఒక పెద్ద గుంపు ఉంది. వాళ్ళతో 'మీరంతా ప్రార్థిస్తారా? లేక మిమ్మల్నందరినీ నదిలో తోసెయ్యమంటారా?' అని హఠాత్తుగా అడిగాడు. అతని బలాన్ని చూచి అక్కడున్న వారెంతో భయంతో గజగజలాడిపోయారు. 'నేను మిమ్మల్ని నదిలో తోసి నా దేశానికి సేవచేస్తాను. మీలాంటి వ్యక్తులు ఈ లోకంలో అనవసరం. మీలాంటి నిష్ప్రయోజకులందరినీ లోకంలో లేకుండాచేసి భూమాతను తేలికచేస్తాను' అని అతను అనేసరికి వాళ్ళంతా కేకలు, పెడబొబ్బలు పెట్టడం మొదలెట్టారట." అని చెప్పింది లూబా.

"నిజంగా? అయితే భలేమాట మాట్లాడాడే!"

"ఏమనుకున్నావు మరి? వట్టి రాక్షసుడు! ఇటీవల ఇలాటి మాటలు ఎన్నోసార్లు మాట్లాడాడు. ఎంతో డబ్బు తగలేశాడుకూడా."

"సరేకాని, నాకో విషయం చెప్పు. నాన్నగారు ఇతని వ్యవహారాలన్నీ చూస్తున్నారు కదా? ఏ పద్ధతులపై చూస్తున్నట్టు? నీకు తెలుసా?"

"నాకు తెలీదు. కాని నాన్నకు పూర్తి రక్షకబాధ్యతలన్నీ ఉన్నాయి. ఏం అలా అడిగావు?"

"ఊరికనే అడిగాను. అతనిది మంచి గట్టి వ్యాపారమే కాని, వట్టి నాటుపద్ధతిలో సాగుతోంది. అయినప్పటికీ చాలా మంచి వ్యాపారం. సరిగా చక్కదిద్దుకుంటూ వస్తే బంగారు గనిలా లాభాలు సంపాదించవచ్చు."

"ఫోమా ఏమీ చెయ్యడు అంతా నాన్నగారి చేతుల్లోనే ఉంది."

"అయితే అది మంచిదే!"

"ఒక్కోసారి చూశావా? అతని ఆలోచనలు, అతని మాటలు ఎంతో నిజమనిపిస్తాయి. అతనూ ఎంతో మంచివాడయ్యేవాడని అనిపిస్తుంది. కాని అతని విపరీతమైన మాటలన్నా, అతని విపరీతమైన వాదనలన్నా, అతని విపరీతమైన జీవితమన్నా నాకుసరిపడదు. ఏపరిస్థితిలోనూ వాటిని సరిపెట్టుకోవడానికి నేనొప్పుకోను." అన్నది లూబా.

"ఇలాంటివాణ్ణిగురించి మాట్లాడుకోవడంవల్ల మనం కాలం వృధాచేసినవాళ్ళమవుతాం. అతని కింకా పసితనం వద

లేదు. ఆ పసితనమే అతనెందుకూ కొరగాడని తెలుపుతోంది.'' అన్నాడు తారాస్.

''అదికాదు. అప్పుడప్పుడతను ఒక పసిపిల్లవాడిలా కనిపిస్తాడు. పూర్వం మరీఎక్కువగా అలా కనిపిస్తూఉండేవాడు.

''నే చెప్పేదీ అదే - అతను పసివాడని. అలాంటి మతిలేనివాణ్ణిగురించీ, వ్యర్థుణ్ణిగురించీ మాట్లాడిమాత్రం లాభం ఏమిటి? మన మెంతచేటు మాట్లాడినా అతని అవివేకం, అనాగరికత అట్లాగే ఉంటాయి. అలా ఉండాలనే అతను కోరుకుంటున్నాడు. ఆ విషయం స్పష్టంగా తెలుస్తూనేఉంది. వెనుకటి ఒక ఎలుగుగొడ్డు కాడిమానులు వంచిందని చెప్పే కట్టుకథ ఉన్నది చూచావ్ ? ఇతనుకూడా అలాగే విరుద్ధంగా ప్రవర్తిస్తాడు!'' అన్నాడు తారాస్.

''నీవు చాలా కఠినంగా మాట్లాడుతున్నావు అన్నయ్యా!'' అన్నది లూబా.

''అవును. నేను కఠినుణ్ణే. మనుష్యులకు కాఠిన్యమే అవసరం అమ్మాయ్. మనం - మన రష్యనులజీవితం సులువుగా చులాగ్గాఉంటుంది. మనకు నీతినియమాలు లేవు. మనకు కారణాలు, కట్టుబాట్లు లేవు. మనం భోగలాలసులం. సులువుగా, చులాగ్గా జీవితం సాగిపోతేసరి, సంతృప్తిపడి ఊరుకుంటాం. ఇలా కలలూ గిలలూ కనడం ఆడపిల్లకూ అబ్బాయిలకూ బాగుంటుంది కాని జీవితంలో ఒక ఆదర్శంకోసం పాడుబడేవాడికి సరిపోవు. జీవితమంటే టాలాటోలీవ్యవహారం కాదు.'' అన్నాడు తారాస్.

"ఒక్కోమాటు ఫోమాను చూస్తుంటే నాకు చాలా జాలివేస్తుంది. ఇకముందు అతను ఏమయిపోతాడో ?"

"నేనా విషయం ఎప్పుడూ ఆలోచించను. ప్రత్యేకంగా అతను ఏమీ అయిపోడు. పెద్దమంచీ జరగదు, చెడూ జరగదు. డబ్బంతా తగలేసి చివరకు నాశనమైపోతాడు. అంతకంటె ఏమవుతాడు? అయినా ఏమయిపోతే మాత్రం ఎవరికా్కవాలి ? అసలిలాంటి వ్యక్తులు ఈరోజుల్లో చాలా అరుదు. ఈకాలంలో వర్తకుడు విద్యయొక్క విలువ ఏమిటో తెలుసుకుంటున్నాడు. అతను-అతను, నీపెంపుడు అన్న ఉన్నాడే-ఊరికే నాశనమైపోతాడు. అంతే !"

"ఆమాట నిజం!" అన్నాడు ఫోమా తలుపు తెరచి గడపదగ్గర నిల్చుని.

ఫోమాముఖం వివర్ణమైంది. అతని పెదవులు వణుకుతున్నాయి. తారాస్ముఖంలోకి చూచాడు. మందమైన కంఠస్వరంతో ఇలా చెప్పాడు.

"నిజం! నేను నాశనమయ్యేమాట నిజం ! అలా కావడం మంచిదే. ఎంతత్వరలో నాశనమైతే అంతమంచిది."

లూబా కుర్చీలోంచి ఎగిరిపడి లేచింది. లేచి తారాస్ దగ్గరికి పరుగెత్తుకుని వెళ్ళింది. తారాస్ గదిమధ్యలో ప్రశాంతంగా నిల్చునిఉన్నాడు. చేతులు చొక్కాజేబుల్లో పెట్టుకుని ఉన్నాడు.

"ఫోమా ! ఎంత సిగ్గుచేటుపని చేశావు ! నీవు తలుపు చాటున నిల్చుని వింటున్నావా? అయ్యో, ఫోమా! ఎంత సిగ్గుచేటు !" అన్నదామె గాభరాపడుతూ.

"నీవు మాట్లాడకమ్మాయ్ ! పిల్లిపిల్ల !" అన్నాడు ఫోమా, ఆమెతో.

"అవును. దొంగచాటుగా నిల్చుని మాటలు వినడం మంచిపనికాదు" అన్నాడు తారాస్.

"కాకపోవచ్చు కాని నిజాన్ని తెలుసుకోవాలంటే దొంగచాటుగా ఉండే తెలుసుకోవాలి. అది నాతప్పుకాదు!" అన్నాడు ఫోమా.

"ఫోమా! దయచేసి నీవిక వెళ్ళు!" అని ప్రార్థేయ పూర్వకంగా అడిగింది లూబా. అలా అంటూ ఆమె భయముతో తన అన్నకు దగ్గరగా నిలబడింది.

నీవు నాతో చెప్పాల్సిన విషయాలు ఏమైనా ఉన్నాయా ?" అని అడిగాడు తారాస్, నింపాదిగా.

"నేనా ? నేనేంచెప్పగలను ? విషయాలన్నీ తెలిసినవాడవు నీవు. ఏ విషయమూ తెలీనివాణ్ణి నేను!" అన్నాడు ఫోమా.

"అయితే, నీవు నాతో చర్చించాల్సిన విషయం ఏమీ లేదన్నమాట." అని అడిగాడు తారాసు మళ్ళీ.

"లేదు." అని జవాబిచ్చాడు ఫోమా.

"సరే, సంతోషం."

తరువాత తారాసు లూబా వంక చూచి "నాన్నగారెప్పుడొస్తారు ?" అని అడిగాడు.

ఫోమా అతని వంక చూచాడు. ఎంచాతనోగాని అతని మీద గౌరవంకలిగింది. తనంతటతానే ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. తన ఇంటికి వెళ్ళాలనిపించలేదు. విశాలంగా,శూన్యంగా

ఉన్న తన ఇంటికి వెళ్ళాలనిపించలేదు. తన ఇంట్లో తనువేసే ప్రతి అడుగూ తనలో ఏదో ప్రతిధ్వనిని మేలుకొలుపుతూ ఉంటుంది. అతని కేంచేయాలో తోచలేదు. ఒంటిగా వీధిలో నడుస్తున్నాడు. సంధ్యాకాంతి విషాదంగా పరుచుకుంటూ ఉంది. అతనికి తారాసు మయకిన్ తలపుకు వచ్చాడు. "తండ్రిలాగానే ఇతనూ గట్టిమనిషి. ఒక్క నిమిషంకూడా తీరిగ్గా ఉండడు. ఇతనూ నాలిముచ్చురకమే! కాని లూబా మాత్రం అతన్నొక రుషిగా భావిస్తుంది. వట్టి పిచ్చిపిల్ల! నాకెంత దీర్ఘోపన్యాసం ఇచ్చాడు! న్యాయమూర్తిలా తీర్పులు చెప్పాడు. కాని ఆమె మాత్రం నామీద ఎంతో దయగా ఉంది." అనుకున్నాడు ఫోమా తనలో.

కాని ఈ ఆలోచనలన్నీ అతనిలో ఎలాంటి చలనాన్నీ కలిగించలేదు. తారాసుపట్ల ద్వేషమూ కలగలేదు, లూబాపట్ల సానుభూతీ, అనురాగమూ కలగలేదు. కాని అతనికి ఏదో బాధను, అసంతృప్తిని మోసుకొనిపోతున్నట్టనిపించింది. ఆ బాధా, ఆ అసంతృప్తీ ఏమిటో అతనికే అర్థంకావడంలేదు. అది అతని హృదయంలో సెలవేస్తోంది. అతని హృదయం చీముపట్టిన పుండులాగా బాధపెడుతోంది. ఆ బాధ రానురానూ ఎక్కువవుతోంది. ఆ బాధ తాలూకు జివ్వులన లాగుతున్నట్టు చప్పుడుకూడా వింటున్నాడు. దాన్ని ఎలా ఉపశమనం చేసుకోవాలో తెలీక — కేవలం దాని ఫలితం కోసం వేచి ఉన్నాడు.

అతని రతుకపిత మయకిన్ బండి అతనిప్రక్కగా వెళ్ళింది. బండిలో కూర్చునిఉన్న మయకిన్‌ను అతను చూచాడు. కాని

అదికూడా అతనిలో ఎలాంటి చలనాన్నీ కలిగించలేదు. వీధి లాంతర్లు వెలిగించేవాడు గబగబ అతని ప్రక్క నుంచి వెళ్ళాడు. వెళ్ళి ఒక దీపస్తంభానికి నిచ్చెన ఆనించి పైకెక్కుతున్నాడు. అతని బరువుకు ఆ నిచ్చెన ఊగి పడబోయింది. అప్పుడతను దీపస్తంభాన్ని గట్టిగా కరుచుకుని కోపంతో బిగ్గరగా తిట్టుకో సాగాడు. చేతిలో మూటపట్టుకుని పోతున్న ఒక అమ్మాయి ఫోమాను రాచుకుని "క్షమించండి!" అన్నది. అతను ఆమె వంక చూచి ఏమీ చెప్పకుండా ఊగుతున్నాడు. తరువాత సన్నగా వానజల్లు పడడం మొదలెట్టింది. సన్నటి వానబిందువులు వీధి లాంతర్ల మీదా, దుకాణాల కిటికీల అద్దాలమీదా ఒక మసకదుమ్ములాగా పడుతున్నాయి. దీనివల్ల అతనికి ఊపిరి సలపడంలేదు.

"యెజోవ్ గదికివెళ్ళి ఈరాత్రి అక్కడ గడపనా? అక్కడైతే కొంచెం తాగనుకూడా తాగవచ్చు." అనుకున్నాడు ఫోమా

ఇలా అనుకుని అతన్ని చూడ్డానికి వెళ్ళాడు. కాని అతన్ని చూడాలనిగాని, అతనితో కలసి తాగాలనికాని, వాంఛ అతనిలో ఏమాత్రమూ లేదు.

యెజోవ్ యింట్లో మరోవ్యక్తి కనిపించాడు. ముఖం గొగ్గులుగొగ్గులుగా నల్లకప్పువేసినట్టుగా ఉంది. కళ్ళు పెద్దవి. అతను నిశ్చలంగా, కోపంగాఉన్నాడు. మొద్దుగానున్న పై పెదవి. సైనికుల మీసాల్లాంటి మీసాలు. ఒక పాతపడిన వడక కుర్చీలో కూచునిఉన్నాడు. యెజోవ్ మరోకుర్చీలో కాళ్ళు అడ్డంగా వ్రేలాడవేసుకుని కూచునిఉన్నాడు. బల్లమీద పుస్త

కాలు, పత్రికలు పడేసిఉన్నాయి. వాటిమీద ఒక వోడ్కా-సీసా ఉంది.

"ఎక్కడెక్కడ తిరిగి వస్తున్నావ్ ?" అని అడిగాడు యెజోవ్ ఫోమాను చూడగానే. "ఇతనే గార్డియెవ్!" అంటూ ప్రక్కనున్న వ్యక్తికి, పరిచయంచేశాడు.

ఆవ్యక్తి ఫోమావంక చూచి "క్రాప్‌నోష్‌కోవ్" అని తన పేరు చెప్పుకున్నాడు.

ఫోమా ఒకమూల తివాచీమీద కూచున్నాడు. యెజోవ్‌తో "ఇవాళరాత్రికి ఇక్కడఉండాలని వచ్చాను" అన్నాడు.

"సరే, ఇక కానీయి వాసిలీ" అన్నాడు యెజోవ్ ఆ ప్రక్కనున్నవ్యక్తితో.

ఆ వ్యక్తి ఫోమావంక అనుమానాస్పదంగా చూస్తూ కీచుగొంతుతో యెజోవ్‌నుద్దేశించి ఇలా చెప్పసాగాడు :

"నాఉద్దేశంలో - నీవు అవివేకులను అనవసరంగా ఆడి పోసుకున్నందువల్ల లాభంలేదు. 'మసానిలో' ఒకపెద్ద అవివేకి. అయినా ఆవిషయంలో ఎంతగొప్పగా ప్రవర్తించాడు! అలాగే 'వింకెల్రీడ్' కూడా ఒక శుద్ధ మొద్దు. అయినా ఆరాజోద్యోగులతో ఎంత సాహసంగా ఢీకొన్నాడు! ఇలాంటి అవివేకులు, ఇంకా ఎంతోమందిలేరూ? అయినప్పటికీ వాళ్ళు సాహసికులు. కాని ఈ తెలివికలవారంతా పిరికిపందలు. ఎక్కడైనా ఎదురు దెబ్బ తగిలిందీఅంటే దానిని ఎదుర్కోవడానికి సిద్ధపడరు. 'ఏం లాభం? వృధాగా మనం నాశనమైపోతామేమో?' అని ఊరుకుంటారు. ఏమీచెయ్యలేక దీపస్తంభాలమాదిరి నిలబడి తుదకు ఊపిరి విడుస్తారు. మరి మూర్ఖుడున్నాడు చూచావ్ ? అలా

లేదు. మూర్ఖుడెప్పుడూ ధైర్యశాలి! గోడ ఎదురొచ్చినాసరే సాహసంతో ముందుకురికి తలమోటిస్తాడు. పగిలితే పగిలింది తల - ఏం? ఒకవేళ ఆ మూర్ఖుడు గోడకు తలమోటించి సందు చేశాడూ అంటే - అప్పుడీ తెలివికలవారంతా వెళ్ళి ఆ సందును వెడల్పుచేసి పెద్దద్వారాలు నిర్మిస్తారు. ఈ పనంతా తామే చేశామని, దానివల్ల వచ్చే గౌరవప్రతిష్ఠలన్నీ వాళ్ళే పొందుతారు. లేదు, నికోలే మాట్వేచ్, సహేతుకం కాకపోయినా సాహసమనేది ఎప్పుడూ మంచిదే!'

"వాసిలీ! నీవు మాట్లాడేదంతా వట్టిచెత్త!" అన్నాడు యెజోవ్, అతనివైపు చెయ్యి చాపుతూ.

"ఓ! అయితే కావచ్చు. కడుపునిండా తిండికూడా లేకుండా నే నెలా అవస్థపడుతున్నాను? అయినప్పటికీ నేను అంధుణ్ణి కాదు. అన్ని విషయాలూ చూడగలను. బుర్రకలవాళ్ళు అనేకమంది ఉన్నారు. కాని వాళ్ళవల్ల ఏమాత్రం మంచి జరగడం లేదు. తెలివైనవాళ్ళంతా తామెలాటిమార్గం తొక్కాలన్నందీ బాగా ఆలోచించి, అనుభూతిపొంది ఉత్తమ మార్గాన్ని చేపట్టేటంతవరకూ ఈ అవివేకులదే పైచేయిగా ఉంటుంది. అప్పటివరకూ వీళ్ళు ఆ అవకాశాన్ని తీసుకుని పెచ్చుమీరి ప్రవర్తిస్తూనే ఉంటారు. అంతే!" అన్నాడు వాసిలీ

"కొంచెం ఆగు!" అన్నాడు యెజోవ్.

"వీల్లేదు! నేనివ్వాళ డ్యూటీమీద ఉన్నాను. ఇప్పటికే చాలా ఆలస్యంచేశానుకూడా. రేపొచ్చి కలుస్తానులే—రానా?"

"రా! కులాసాగా గడుపుదాం."

"నీవు చేసేది అంతకన్నా ఏముంది!"

వాసిలీ తిన్నగా వళ్ళు సవరించుకుని పడక కుర్చీలోంచి

లేచాడు. తన దయ్యాయంత చేత్తో యొజోవ్ సన్నటి చేతిని పట్టు కుని గట్టిగా నొక్కాడు.

"వెడతాను, సెలవు!"

తరువాత అతను ఫోమా వంక చూచి తల ఊపి గది లోంచి అవతలికి వెళ్ళిపోయాడు.

"చూచావా?" అని యొజోవ్ ఫోమాను అడిగాడు. చేత్తో తలుపువైపు చూపిస్తూ. అవతలికి వెళ్ళిపోతున్న ఆవ్యక్తి అడుగులచప్పుడు పెద్దగా వినిపిస్తూనే ఉంది.

"అతనెవరు? ఏంచేస్తుంటాడు?" అడిగాడు ఫోమా.

"అసిస్టెంటు మెకానిక్. పేరు వాస్కా క్రాష్నోష్ కోవ్. అలాంటివ్యక్తి నిఉదాహరణగాతీసుకోవాలి. అతని సంగతి చెప్తాను విను. అతను తన పదిహేనవ ఏట చదువు ప్రారంభించాడు. చదవడం, వ్రాయడం నేర్చుకోవడం మొదలెట్టాడు. ఇప్పు డతనివయస్సు ఇరవై ఎనిమిది. ఈ స్వల్ప కాలంలో అతను చదివిన పుస్తకాలు అన్నీ ఇన్నీకావు. వాటిని లెక్కపెట్టాలంటే ఏదేవుడో దయ్యమో దిగి రావల్సిందేకాని నావల్లకాదు. ఇప్పటికి రెండు భాషలను క్షుణ్ణంగా మధించి వాటిల్లో మహాపండితుడైనాడు. ఇక ఇప్పుడు విదేశాలకు వెళ్ళనున్నాడుకూడా." అని చెప్పాడు యొజోవ్.

"దేనికోసం?" అడిగాడు ఫోమా.

"ఇంకా దేనికోసం వెడతాడు? చదువుకోసమే! అక్కడ మనుష్యు లెలాజీవిస్తున్నదీకూడా పరిశోధనచేస్తాట. మరిక్కడ నీవు ఉండనే ఉన్నావు, ఎత్తుపడ్డ గొడ్డులాగా!— దేనికి?"

"బుద్ధిహీనులను గురించి అతను అన్నమాటలు అక్షరాలా నిజం. ఫోమా తెలివిగా మాట్లాడాడు" అన్నాడు.

"ఏమో ఆ విషయం నాకు తెలియదు. ఎందుకంటే నేను బుద్ధిహీనుణ్ణి కాను కనుక"

"బుద్ధిహీనుడెప్పుడూ సాహసంతో ముందుకు దూకుతాడు. తెలివైనవాళ్ళను ఒక్కదెబ్బలో పడగొడతాడు. ఈ మాట అతను బాగా చెప్పాడు."

"మళ్ళీఅదేనా ? ముందు వాడిబుర్ర చెడింది ? అసలీ విషయం పోనీ. మరోవిషయం మాట్లాడుకుందాం. మయకిన్ కొడుకు మళ్ళీవచ్చాట్ట, నిజమేనా ?"

"అవును, నిజమే."

"అలా...గా !"

"వస్తేఏం ?"

"ఏమీలేదులే."

"మరెందు కడిగావు ?"

"ఊరకనే. విశేషమేమీలేదు."

"నీవు లేదనిచెప్పినా నీముఖాన్నిబట్టి ఏదో ఉన్నట్టే నాకు తోస్తోంది."

"అతని కొడుకును గురించి అంతా మాకు తెలుసు. అతని విషయం విన్నాం."

"మీరు విన్నారు. కాని నేనతన్ని కనులారా కన్నాను."

"సరే. అత నెలాంటివాడు ?"

"ఎలాంటివాడో ఎవడికి తెలుసు ? ఆ దయ్యాన్నో, భూతాన్నో అడగాలి! అయినా అతని విషయంతో నాకేం పని ?"

"వాళ్ళనాన్నలాగే ఉంటాడా ?"

"ఇత నింకా లావుగాను, బలుపుగాను ఉంటాడు. ఇత నిలో ఇంకా ఎక్కువ గంభీరత ఉంది. మనిషి నిర్దాక్షిణ్యంగాను, నిర్లక్ష్యంగాను ఉంటాడనుకో."

"అంటే అర్థం యాష్కాకంటే కూడా ఇంకా చెడ్డవా డన్నమాట. సరేకాని తమ్ముడూ! నీజాగ్రత్తలో నీవుఉండు. లేకపోతే వాళ్ళు నిన్ను పీల్చి పిప్పిచేస్తారు. చెపుతున్నా."

"సరే, చేయనీ!"

"వాళ్ళు నిన్ను దోచుకుంటారు. సొంతం తువరంచేస్తారు. నీవు బుక్కాపకీరువై పోతావు. ఆ తారాస్ ఉన్నాడు చూచావ్? యెకత్రింగ్‌బర్గులో వాళ్ళమామగారంతటివాణ్ణి మస్కాకొట్టాడు. అతని ఆస్తి అంతా అతితెలివిగా చర్మం ఒలిచినట్టు ఒలుచుకున్నాడు. అలాంటి ఘను డతను!"

"అంతగా అతనికి బుద్ధిపుడితే నన్నుకూడా ఒలుచుకో నీయి. ఒక్కమాట కూడా బదులు చెప్పను. పైగా 'కృతజ్ఞత' కూడా తెల్పుతాను."

"అయితే ఇంకా ఆ పాత పాటే పాడుతున్నావన్న మాట?"

"అవును"

"అంతా వదులుకుని స్వేచ్ఛగా ఉండాలనా?"

"అవును"

"ఇక ఊరుకో! దేనికి నీకు స్వేచ్ఛ? దాంతో ఏం చేద్దామని? నీవెందుకూ పనికిరావనే విషయం నీకు తెలి యదూ? నీ చదువుకూడా అంతంతమాత్రమేననీ, కనీసం కట్టెలుకొట్టుకుని బ్రతకడానికికూడా పనికిరావనీ నీవెరగవూ?

నేనైతేనా? నాకే కనుక ఈమాత్రం తినడానికి రొట్టె, తాగడానికి నోడ్కా కూడా లేకుండా స్వేచ్ఛ పొందాల్సిన అవసరం వచ్చి ఉంటేనా!" అంటూ యెజోవ్ గభాలున ముందుకు దూకి ఫోమాకు ఎదురుగా నిలబడ్డాడు. ఉపన్యాసం ఇస్తున్నట్టుగా పెద్ద గొంతుతో అరవడం మొదలెట్టాడు.

"గాయాలతో ఛిన్నాభిన్నమైపోయిన నా ఆత్మశకలాలను మళ్ళీ ఒకచోట పోగుచేసుకునేవాణ్ణి. వాటికి నా హృదయాన్ని పిండిన నెత్తురు పోసేవాణ్ణి. ఈ మేధావులు, పెద్ద మనుష్యులు అని చెప్పుకునే సంఘానికి ఎదురుగా నిల్చొని దాని ముఖాన తుపుక్కున ఉమ్మేసేవాణ్ణి. దాని పాడుగాను సంఘం! నేను వాళ్ళకిలా చెపుతాను: మీరు పురుగులు! నా దేశానికి వేరుపురుగులు! తరతరాలనుంచీ కోటానుకోట్ల రష్యన్ ప్రజల నెత్తురు, కన్నీళ్ళు తాగి మీరు బ్రతుకుతున్నారు. ఓ, మీరు నల్లులు! చీరపోతులు! మీ దేశం మిమ్మల్ని ఎంత ప్రేమతో పోషించింది? ఆ ఋణం మీరెలా తీర్చుకుంటారు? గతచరిత్ర కన్నీళ్ళను కనకంగా మారుస్తారా? నెత్తురు బొట్లను నవరత్నాలుగా చేస్తారా? జీవితం సుఖవంతంకావడానికి మీరు చేసిన సేవ ఏమిటి? పోనీ మీరు జీవితంలో సాధించినదేమిటి? మీ అంతటమీరే ఓడిపోయామని ఒప్పుకుంటారా? మీ అంతట మీరే పరిహాసాలపాలు కావడానికి సమ్మతిస్తారా?"

ఇలా చెపుతూ యెజోవ్ కోపోద్రిక్తుడై కాళ్ళతో భూమిని తన్నాడు. పళ్ళు పటపట కొరుకుతూ ఫోమావంక తదేకంగా చూడసాగాడు. అతనికళ్ళు నిప్పుకణికల్లా అయినాయి.

అతని చూపుల్లో కోపజ్వాలలు వెడలుతున్నాయి. కోపోద్రిక్తమైన క్రూరమృగంలా కనిపిస్తున్నాడు.

"నేను వాళ్ళతో ఇలా చెపుతాను: 'మీరు! మీరు వ్యర్థప్రలాపాలతో కాలం వృథాచేస్తారు. మీ తెలివితేటలు బహుకొద్ది. శక్తి బొత్తిగా శూన్యం. మీరంతా పిరికిపందలు! మీ హృదయాలు తూలికా తల్పములవంటివి ఉదాత్త భావాలు, నీతులు వాటినిండా నిండిఉంటాయి. సృజనాత్మకమైన శక్తి ఆ మెత్తని, వెచ్చని తూలికా తల్పాల్లో పడుకునిఎప్పుడూ నిశ్శబ్దంగా నిద్రిస్తూఉంటుంది. అంచాతనే మీ హృదయాలు కొట్టుకోవడానికి మారుగా, మెల్లగా ఉయ్యాలలూగినట్లు ఊగు తుంటాయి.' ఇలా చెప్పి నేను నాహృదయరక్తంలో వ్రేలు ముంచి, దాంతో ఈ వేదవాక్కులన్నీ వాళ్ళ నుదుటిమీద వ్రాస్తాను. ఆత్మ, హృదయం లేనివాళ్ళంతా కుళ్ళి కుళ్ళి చచ్చే వాళ్ళు. ఓ! ఎలా యాతన అనుభవిస్తారు! నా చేతిలో కొరడా చురుకైనది, నాచెయ్యి గట్టిది! నాకు కనికరంలేదు! వాళ్ళు యాతన అనుభవిస్తారు! కాని ఇప్పుడనుభవించరు. ఎందుకంటే వాళ్ళు తమ బాధలను గురించి చాలా ఎక్కువగా, చాలా తరుచుగా, చాలా బిగ్గరగా, చెప్పుకుంటున్నారు కనుక! వాళ్ళ వన్నీ అబద్ధాలు! నిజమైన బాధ ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉంటుంది. నిజమైన ప్రేమ ఎప్పుడూ నిండుగా ఉంటుంది. నిజమైన ఉద్రేకం ఎప్పుడూ నిప్పులా ఉంటుంది. దానికి ఆనకట్టలు లేవు. ఉద్రేకం! ఉద్రేకం! మానవహృదయాల్లోంచి ఉద్రేకం ఎప్పుడూ ఉబికి వస్తుంది? మనమంతా దౌర్భాగ్యులం. ఎంచాతనంటే, మనకు ఉద్రేకంకాదు ఉన్నది, ఉదాసీనత మాత్రమే!"

యొజోవ్ ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. పెద్ద దగ్గుతెర వచ్చింది. అలా ఎంతోసేపు ఖళ్ళుఖళ్ళునదగ్గుతూ పిచ్చివాడిలా చేతులూపుకుంటూ గదంతా కలయతిరిగాడు. చివరకు మళ్ళీ ఫోమాముందుకొచ్చి నిల్చున్నాడు. అతనిముఖం వివర్ణమైపోయింది. కళ్ళుమాత్రం నెత్తురు కురుస్తున్నట్టున్నాయి. బరువుగా, బాధగా ఊపిరి పీలుస్తున్నాడు. అతని పెదవులు విపరీతంగా అదురుతున్నాయి. పదునుగాఉన్న అతని చిన్న పళ్లు బయటికి కనిపిస్తున్నాయి. పొట్టిగా కత్తిరించిన అతని క్రాపు, నాలుగువైపులా నిటారుగా నిక్కపొడుచుకున్న అతని తల వెంట్రుకలు – అప్పుడే నీళ్ళలోంచి బయటపడేసిన చేప పిల్లలా అగుపిస్తున్నాడు. అత నిలాంటి స్థితిలో ఉండగా చూడడం ఫోమా కిదే మొదటిసారి కాదు. అతనిలా తీవ్రోద్రేకోన్మత్తుడై ప్రవర్తించడం ఫోమా అనేకసార్లు చూచాడు. ఈసారి కూడా ఫోమా, అగ్నివర్షంలా వర్షిస్తున్న అతని మాటలన్నీ శ్రద్ధగా, నిశ్శబ్దంగా విన్నాడు. అయితే వాటిఅర్థమేమిటో గ్రహించడానికి అతను ప్రయత్నించలేదు. యొజోవ్ ఎవర్నిగురించి ఇంతగా నిందిస్తున్నాడో కూడా ఫోమాకు సరిగా అర్థంకాలేదు. మొత్తానికి యొజోవ్‌మాటలు సలసలకాగే నీటిబుడగల్లాగా అతని హృదయాన్ని వేడెక్కించి అతన్ని ఉద్రిక్తపరిచాయి.

"ఆదార్భాగ్యులైన సోమరిపోతులకు ఇలా చెప్తాను: చూడండి ! మీతో ప్రమేయం లేకుండానే, మిమ్ముల్ని వెనకాల వదిలేసి జీవితం సాగిపోతోంది!" అని మళ్ళీ తన ఉపన్యాసాన్ని సాగిస్తున్నాడు యొజోవ్.

"ఓ! చాలాబాగుంది! నికోలే! నీవు నిజంగా వీరుడివి! పద! ముందునడువు! ఈమాటలు సూటిగా వాళ్ళముఖాన అను!" అని ఫోమాకూడా ఉద్రిక్తుడై అరిచాడు. ఫోమా తన పడకకుర్చీలో అటూఇటూ కదలసాగాడు.

కాని యెజోవ్‌కు ఎవరి ప్రోత్సాహంతోనూ అవసరం లేకపోయింది. అతను ఫోమా చెప్పేమాటలు బొత్తిగా విని పించుకోవడమూ లేదు. అతని ప్రోత్సాహాన్ని స్వీకరించడమూ లేదు. తన ధోరణి, తాను సాగిస్తూనేఉన్నాడు:

"నాశక్తి ఏమిటో నాకు తెలుసు. నాశక్తికిగల పరిమితులేమిటో నేను పూర్తిగా ఎరుగుదును. వాళ్ళంతా నామీద విరుచుకపడతారు. 'నోరు కట్టేసుకో! మాట్లాడక పడుండు!' అంటారు వాళ్ళు నన్ను. నన్ను దూరంగా తోస్తారు. ఇదంతా తెలివిగాను, చప్పుడు కాకుండాను చేస్తారు. అధికారము, బలము అనే ఉన్నత సౌధాల్లోంచి అట్టడుగున అగాధంలోఉన్న నన్ను చూచి నిశ్శబ్దంగా వెక్కిరిస్తారు. నాకు తెలుసు. నాదేముంది? నేను పిట్టంత మనిషిని. అదీ పాటలు పాడే బుల్ బుల్ పిట్టనుకూడా కాను! వాళ్ళతో పోల్చిచూస్తే నేను, అవివేకినే. నేనల్లా ఏముంది? ఏదో వ్యాసాలు వ్రాసుకునే పత్రికారచయితను. జనానికి ఉల్లాసం కలిగించడమే నేను జీవితంలో చేయగల పని. వాళ్ళు నన్ను చూచి అరవనీ, నన్ను నోరెత్తకుండా చేయనీ! వాళ్లు నాముఖంమీద కొట్టే దెబ్బలన్నీ సహిస్తాను. కాని నాహృదయోద్వేగం మాత్రం ఆగిపోదు! అదెప్పుడూ సాగిపోతూనే ఉంటుంది. నేను వాళ్ళతో ఇలా చెపుతాను;

"అవును. నేను అవివేకినే, మూర్ఖుణ్ణే! కాని మీ పైన నాకుగల మొట్టమొదటి అవకాశం ఏమిటంటే, ఒకానొక సత్యం! ఇన్ని గ్రంథాలలో కూడా మనిషికి మించిన సత్యం ఒక్కటికూడా ఉన్నట్లు వక్కాణించలేదు! మనిషి! ఈ విశాల విశ్వానికంతకూ మానవుడే కేంద్రం! ఆ మానవుడే చిరంజీవియై ఈ యావత్ప్రపంచాన్నీ తనలో ఇముడ్చుకుని సాగిపోతున్నాడు! మరి మీరూ! మాటలఅర్థం అణుమాత్రం తెలీకపోయినా ఆ మాటలకోసమే మీరు అవతలివాణ్ణి గాయపరుస్తారు, బాధిస్తారు. ఆ మాటలకోసమే మీరు హృదయాలను, ఆత్మలను హింసిస్తారు. కాని ఇప్పటికీ మీపాపం ఊరికేపోదు. నామాట నమ్మండి! ఒక బ్రహ్మాండమైన ప్రళయం వస్తుంది! భూమిని పూర్తిగా శుభ్రపరుస్తుంది. గాలివానకు చెట్లకొమ్మలు కొట్టుకపోయినట్టుగా మీరంతా అశేషంగా తుడిచిపెట్టుకపోతారు! మానవ వాక్కులో ఒకేఒక ఉదాత్తమైన, ఉన్నతమైన మాట ఉన్నది! అందరికీ అర్థమయ్యేది, అందరికీ ప్రియమైనది! ఆ మాట "స్వేచ్ఛ!"

"అద్భుతం! ఈమాటలతో వాళ్ళకు బుద్ధిచెప్పు" అని అరిచాడు ఫోమా. ఫోమా తన పడకకుర్చీలోంచి ఎగిరి ముందుకు దుమికాడు. యెజోవ్ భుజాలు గట్టిగా పట్టుకున్నాడు. జ్వలిస్తున్న నేత్రాలతో యెజోవ్ ముఖంలోకి వంగి చూచాడు. పగతోను వగపోను దుఃఖిస్తున్నట్టుగా గద్గదస్వరంతో ఇలాచెప్పాడు:

"అయ్యో, నికోలే! నాయనా! నిన్నుచూస్తే చచ్చేటంత విచారంవేస్తోంది! ఎంత విచారపడుతున్నానో మాటలతో చెప్పలేను యెజోవ్!"

"ఏమిటిది? ఎందు కిలా అయిపోయావు?" అని కేక వేశాడు యెజోవ్. అతను ఫోమాను అవతలికి తోసివేశాడు. తలవనితలంపుగాను, విచిత్రంగాను ఫోమా గుండె పగలడం చూచి యెజోవ్ కూడా నిర్ఘాంతపోయాడు.

"అయ్యో, తమ్ముడూ! మండుతున్న నిప్పులాంటి మని షివి నీవు! నీ ప్రయత్నాలన్నీ వృథా అయిపోయి నీ విలా కూలి పోతున్నందుకు ఎంతో దిగులుగా ఉంది!" అన్నాడు మళ్ళీ ఫోమా, కంఠస్వరాన్ని తగ్గిస్తూ గంభీరంగా.

"ఎవరు? నేనా? నేను కూలిపోతున్నానా? అబద్ధం!"

"అబ్బాయీ! ఒకమాట చెప్పుతాను విను. నీవు ఎవ రినీ ఏమీ అనలేదు! నీతో మాట్లాడేవాళ్ళు, నీమాటలు వినే వాళ్ళు ఒక్కరూ లేరు. నీఘోష ఎవరు వింటారు? నేనొక్కణ్ణి మాత్రమే!"

"నిన్ను పిశాచాలు పీక్కుతిన!" అంటూ యెజోవ్, తననెవరో కొట్టినట్టు, కుట్టినట్టు కోపావేశంతో అరిచాడు. అవ తలికి ఎగిరి దుమికాడు.

తరువాత ఫోమా అతన్ని సమీపించి బాధతో సాను భూతి చూపిస్తున్నట్టుగా ఇలా అన్నాడు:

"చెప్పు! ఇంకా నాతో చెప్పు! నీ సందేశాన్ని మోసు కునిపోయి తగినచోట అందిస్తాను. అదంతా నాకర్థమైంది. ఈ సందేశంతో ప్రజలను దహిస్తాను! కొంచెం ఓపికపట్టు! నాకూ అవకాశం వస్తుంది."

"అవతలికి వెళ్ళు!" మళ్ళీ వెర్రిగా అరిచాడు యెజోవ్. ఫోమా తనను పట్టుకుని పెనగులాడడంవల్ల యెజోవ్ వెనక్కు

జరిగి గోడను ఆధారం చేసుకోవలసివచ్చింది. ఫోమాను దూరంగా నెట్టివేయడానికి అతను విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కోపంతో కాళ్ళతో నేలను తన్నాడు. వళ్ళు కొరికాడు.

కాని ఇదేసమయంలో గదితలుపు తెరువబడింది. ఒక నల్లటిస్త్రీ గడపదగ్గర ప్రత్యక్షమైంది. ఆమెముఖం కోపోద్రిక్తమై ఉంది. ఆమె చెంపలకూ తలకూ కలిపి ఒకరుమాలు చుట్టుకుంది. తల వెనక్కి పోనిస్తూ చెయ్యి యెజోవ్ వైపు చాచింది. కీచుగొంతుతో బుస్సుమని బుసకొడుతున్నట్టు ఇలా చెప్ప సాగింది :

"నికోలే మాట్వేచ్! ఇలా మాట్లాడుతున్నందుకు మన్నించు! కాని నీ వ్యవహారం దుర్భరంగా ఉంది! దున్న పోతుల్లా ఏమిటీ అరుపులు, కేకలు! రోజూ ఎవడో ఒకడు నీగదిలోకి వస్తూనే ఉంటాడాయె నీవు చేస్తున్న అల్లరికి పోలీసులు కూడా నాఇంటిచుట్టూ మూగుతున్నారు. వీల్లేదు. ఇక నీగోల భరించలేను బాబూ! ఇప్పటికే నాకు తలప్రాణం తోకకు వచ్చింది. దయచేసి రేపే గది ఖాళీ చెయ్యండి. ఇదేం ఇల్లను కున్నావా లేక అడివి అనుకున్నావటయ్యా? మేము కాపరా లుండాలనుకున్నావా లేక కాల్వలోపడి చావాలనుకున్నావా? పైగా పెద్దతెలివికలవాణ్ణనీ, చదువుకున్నవాణ్ణనీ అంటావే? ఇదేనా, నీతెలివీ, చదువూను? అందులోనూ రచయితవా? హుఁ! భలేవాడివి! చుట్టూ కాపరాలుండేవాళ్ళు నీ అల్లరికి హడలిచస్తున్నారు. రాత్రీ, పగలూకూడా నిద్రలేకుండా చేస్తున్నావు. పైగా నేను పంటినొప్పితో బాధపడుతున్నాను. నిన్ను వేడుకుంటున్నాను నాయనా! నేనీబాధ పడలేను! రేపు

ప్రొద్దున్నే నా ఇల్లు నాకు ఖాళీచేసిఇవ్వు. గోడకు నోటీసు అంటించి పోలీసువాళ్ళకు తెలియపరుస్తాను.”

ఆమె చాలా తొందరతొందరగా మాట్లాడింది. ఆమె మాటలుకొన్ని, ఆమె కీచుగొంతులోను, బుస్సుమనే శబ్దంలోను వినిపించకుండాపోయాయి. బయటికి వినిపించినమాటలు మాత్రం ఉద్రేకంగాను, కీచుగొంతుతోను వినిపించాయి. ఆమె చెంపలకు చుట్టుకున్న రుమాలుకొసలు పైకిలేచి చిన్న కొమ్ముల మాదిరిగా కనిపిస్తున్నాయి. ఆమె మాట్లాడుతున్నప్పుడు దౌడలు కదిలి, వాటితోపాటు ఆ కొమ్ములుకూడా విచిత్రంగా కదిలాడుతున్నాయి. ఆమె గమ్మత్తయిన ఆకారం, ఆమె కలవరపాటు చూచేసరికి ఫోమాకు కాళ్ళూచేతులూ చల్లబడ్డటయినాయి. మెల్లగా పడకకుర్చీలో కూలబడ్డాడు. యెజోవ్ మాత్రం ముఖాన చెమట తుడుచుకుంటూ ఆమె వంక నిశ్చలంగా తేరిపారచూస్తూ ఆమె మాటలు విన్నాడు.

“కనుక ఇప్పటికైనా తెలిసిందా!” అన్నదామె తలుపవతలికి వెడుతూ—“మరిచేవు, రేపు ఖాళీచెయ్యాలి. ఛీ! ఎంత సిగ్గుచేటు!” అనుకుంటూ ఆమె తలుపు మూసుకుని వెళ్ళిపోయింది.

“దయ్యం!” అని గొణిగాడు యెజోవ్, తలుపు వైపు చూస్తూ.

“అవును! ఎటువంటి ఆడది! ఎంత నిక్కచ్చి!” అన్నాడు ఫోమా, యెజోవ్ వంక నివ్వెరపోయి చూస్తూ.

యెజోవ్ భుజాలు పైకెత్తి బల్ల దగ్గరికి వెళ్ళాడు. ఒక అరగ్లాసు వోడ్కా పోసుకుని గటగట తాగేశాడు. బల్లముందు

తలవొంచుకుని కూచున్నాడు. ఒక నిముషంపాటు నిశ్శబ్దమైంది. తరువాత ఫోమా భయంభయంగాను, మెల్లగాను ఇలా చెప్పాడు.

"ఎందుకిలా ముంచుకొచ్చింది! రెప్పవాల్చడానికికూడా మనకు వ్యవధిలేక చస్తున్నామే, ఇంతలోనే ఈ పిడుగొచ్చి పడిం దేమిటి! అయ్యో!"

"నీవు! నీవల్లనే! ఇక ఊరుకో! నువ్వు పాడుగాను! ఇదంతా నీవల్లనే! పడుకుని నిద్రపో! రాక్షసుడా! పీడకల! అయ్యో!" అన్నాడు యెజోవ్ మెల్లగా. అతను ఫోమా వంక కోపంతో తదేకంగా చూచాడు.

ఇలా అంటూ యెజోవ్ పిడికిలి బిగించి ఫోమాను కొట్టేటంతగా గద్దించాడు. మళ్ళీ కొంచెం బ్రాందీ గ్లాసులో పోసుకుని తాగేశాడు.

కొద్ది నిముషాల తరువాత ఫోమా తన దుస్తులు తీసి వేసి పడక కుర్చీలో పడుకున్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో యెజోవ్‌ను పరికించసాగాడు. యెజోవ్ బల్ల దగ్గరున్న ఒక మాటమీద అసహ్యమైన పద్ధతిలో కూచుని ఉన్నాడు. నేల మీదికి తదేకంగా చూస్తున్నాడు. అతని పెదవులు నిశ్శబ్దంగా వణుకుతున్నాయి. ఫోమా ఆశ్చర్యపోయాడు. యెజోవ్‌కు తనమీద ఎందుకు కోపంవచ్చిందీ అతనికి అర్థంకాలేదు. ఇంటి యజమానురాలు వచ్చి గది ఖాళీచెయ్యమని కేకలువేసి నందుకు అతనికి కోపంవచ్చినట్టుగా కనిపించడంలేదు. ఎందుకంటే అలా అరుపులు, కేకలు పెట్టింది అతనే అయిన కారణాన. ఏమీ పాలుపోక తికమకపడసాగాడు ఫోమా.

"ఓ! పిశాచం!" అంటూ పళ్ళు బయటపెట్టి గొణు క్కున్నాడు యెజోవ్.

ఫోమా తలగడమీదినుంచి మెల్లగా తలపైకెత్తాడు! యెజోవ్ చాలా బరువుగా, నిశ్శబ్దంగా నిశ్వసిస్తున్నాడు. మళ్ళీ బ్రాందీసీసావైపు చెయ్యి పోనిస్తున్నాడు. అప్పుడు ఫోమా మెల్లగా అతనితో ఇలా అన్నాడు.

"మనం ఏదైనా హోటలుకు వెడదాం పద. ఇప్పటికింకా ప్రొద్దేమీపోలేదు."

యెజోవ్ అతనివంక చూచాడు. చేతులతో తలరుద్దు కున్నాడు. విచిత్రంగా, వికృతంగా నవ్వడం మొదలెట్టాడు. తరు వాత లేచి ఫోమాతో ముక్తసరిగా ఇలా అన్నాడు:

"నీవు బట్టలు వేసుకో!"

ఫోమా బద్ధకంగాను, అసహ్యంగాను పడకకుర్చీలో అటూ ఇటూ పొర్లుతూ ఉండడం చూచి కోపంతో మళ్ళీ ఇలా అరిచాడు యెజోవ్:

"కానీ, త్వరగా కానీయి! ఎందుకూ పనికిరాని శుద్ధ మొద్దువు!"

"నన్ను తిట్టకు! ఎవతో ఆడది వచ్చి, వ్యర్థంగా నోరు పారేసుకునిపోయినందుకు, అంతకోపమా?" అన్నాడు ఫోమా, సమాధానపడుతున్నట్టుగా చిరునవ్వు నవ్వి.

యెజోవ్ ఫోమా వంక చూచాడు. తుపుక్కున ఉమ్మేసి పగలబడి నవ్వసాగాడు.

---

# పదమూడో అధ్యాయం.

"అందరూ వచ్చినట్టేనా ?" అని అడిగాడు, ఇల్యా ఎఫి మొవిచ్ కననోవ్.

తను తయారుచేయించిన కొ త్తసీమర్ కొసన నిల్చుని అక్కడచేరిన అతిథులందరివంక ఒకమాటు చూచాడు.

"అంతా వచ్చినట్టే ఉన్నారే !" అన్నాడు.

ఎర్రగా, బొద్దుగా, ఆనందంగా ఉన్న తనముఖాన్ని ఎత్తి కెప్టెన్‌వంక చూచి ఇలా కేకవేశాడు :

"ఇక వదిలిపెట్టు పెట్రూష్కా !"

"సరేనయ్యా !"

కెప్టెన్ తన పెద్ద బట్టతల బయటపడేటట్టుగా టోపీ తీశాడు. క్రాస్ చేసుకుని భగవంతుణ్ణి ధ్యానించాడు. ఆకాశం వంక చూచి, విశాలాగాఉన్న నల్లటిగడ్డాన్ని తడుము కున్నాడు. గొంతు సవరించుకుని ఇలా తన ఉత్తర్వు జారీ చేశాడు :

"వెనక్కు !"

అతిథులంతా అతన్ని నిశ్శబ్దంగాను, శ్రద్ధగాను అవలో కిస్తున్నారు. వాళ్ళందరూకూడా క్రాస్‌చేసుకుని దేవుణ్ణి ధ్యానించారు. వాళ్ళందరూ తమ టోపీలు, ఎత్తైన హేట్లూ, పైకి ఎగరేశారు. అవన్నీ ఆకాశంలో గుమికూడిన పక్షుల మాదలాగా కనిపిస్తున్నాయి.

"భగవంతుడా! నీ ఆశీర్వాదాన్ని మాకు ప్రసాదించు!" అన్నాడు కననోవ్, ఉద్రిక్తుడై.

"ముందుకు వెళ్ళనీ!" అని ఆజ్ఞాపించాడు కెప్టెన్.

'ఇల్యామురొమిడ్స్' అనే పేరుగల ఆ స్టీమర్ బరువుగా నిట్టూర్చి ఒక పెద్ద పర్వతంలాగా కదలసాగింది. ఒక హంసలా మందగమనంతో పోతోంది.

"ఎంత చక్కగా బయలుదేరింది! అన్నాడు, లుప్ గ్రిగరోవ్ రెజినికోవ్. అతను పొడుగ్గా, సన్నగా, అందంగా ఉన్నాడు. అతను వ్యాపార విషయాల్లో సలహాదారుగా ఉంటున్నాడు. ఎంత చక్కగా బయలుదేరింది! నాట్యానికి బయలుదేరే అప్సరసలాగా, ఏమాత్రం కదలిక లేకుండానే కదిలిందే!" అన్నాడు మళ్ళీ.

"వేగం తగ్గించండి!" అన్నాడు కెప్టెన్.

"ఇది స్టీమర్ కాదు ఒకపెద్ద తిమింగిలం!" అన్నాడు ట్రోఫిమ్ జుబోవ్. ఇతను చర్చిలో వార్డెన్‌గా ఉంటున్నాడు. ఊళ్ళో అందరికీ అధికవడ్డీలకు డబ్బు అప్పిస్తుంటాడు కూడా.

ఆరోజు చల్లగా ఉంది. మేఘావృతమైన ఆకాశం నదీ జలాల్లో ప్రతిఫలిస్తోంది. అంచాత నదీవాహిని స్తబ్ధంగా కనిపిస్తోంది. కొత్తగా వేసిన రంగులతో తళతళలాడుతూ స్టీమర్ సాగిపోతోంది. నల్లటిపొగ విడుస్తూఉంది. ఆ పొగ ఒకబరువైన మేఘంలాగా ఆకాశంలో వ్రేలాడుతోంది. స్టీమర్ నదీవాహినిని చీల్చుకుంటూ పోతోంది. నదీజలాలను ఇరుప్రక్కలకూ తోసివేస్తోంది. స్టీమర్‌కు రెండువైపులాఉన్న కిటికీఅద్దాలూ, కేబినూ సంతృప్తిగా నవ్వుతున్నట్టు తళతళ మెరుస్తున్నాయి.

"గౌరవనీయులైన అతిథి మహాశయులారా! ఇప్పుడు మనం ఈశ్వరునికి సమర్పించవలసింది సమర్పించాం. ఇక చక్రవర్తికి సమర్పించవలసింది సమర్పించేటందుకుగాను ఈ గాయకులను అనుమతిస్తారా?" అన్నాడు కననోవ్. నెత్తిమీంద టోపీ తీసి అతిథులందరికీ సవినయంగా వంగి నమస్కరించాడు. అతిథులు జవాబు చెప్పకముందే, చెయ్యి నోటిదగ్గర పెట్టుకుని గాయకులతో ఇలా అన్నాడు: "గాయకులారా! "వర్ధిల్లు" అనే గీతం ఆలాపించండి!"

వెంటనే ఇంజను వెనకాలఉన్న మిలిటరీ ఆర్కెస్ట్రా అంతా ఒక్కమాటుగా పిక్కటిల్లింది. సాయిక ...

మంచి మంచి చెప్పులు వేసుకున్నవాళ్ళు, చక్కటి కోట్లు వేసుకున్నవాళ్ళు. అందరూ మెల్లగా భోజనాలు వడ్డించిన బల్లల దగ్గరికి నడిచిపోతున్నారు. లుప్ రెజిన్‌కోవ్ మయకిన్‌తో భుజం భుజం కలిపినడుస్తున్నాడు. అతని మీదికి వంగి అతని చెవిలో ఏదో చెపుతున్నాడు. మయకిన్ అది విని మందహాసం చేస్తున్నాడు. ఫోమా, తన రక్షకపిత ఎంతో బలవంతం చెయ్యగా అక్కడికి వచ్చాడు. అక్కడచేరినవారిలో తనకు తగిన స్నేహితుడెవడూ ఫోమాకు కనిపించలేదు. అతనికి అందరూ రోతగా కనిపించారు. అతను ఏంచెయ్యాలో తోచనివాడిలాగా ఒక [illegible] ఒంటిగా నిలుచున్నాడు. గత రెండు రోజుల

నీకేంతక్కువ ? కావల్సినంత భాగ్యం ఉంది. నీతో సరితూగు వాళ్ళు వాళ్ళలో ఎంతోమంది లేరు. అందరితోనూ సమాన హోదాలో ప్రవర్తించడం నేర్చుకోవాలి. రా!" అని తన రక్షకపిత మయకిన్ అన్నమాటలు ఫోమాకు జ్ఞాపకంవచ్చాయి.

"కాని ముందు నాకోమాటచెప్పు. అసలు నేనడిగిన విషయాన్ని గురించి నాతో ఎప్పుడు మాట్లాడతావు?" అని అడిగాడు ఫోమా.

"అంటే నీ వనేది, వ్యాపారంనుంచి నిన్ను విడుదలచేసే విషయం కదూ ? హు ! ఆవిషయం తర్వాతమాట్లాడవచ్చులే. ఎంత చిత్రమైనమనిషివి! అదిసరే కాని, ఇదంతా వదిలిపెట్టి తరు వాత ఏంచేస్తావు? సన్యాసుల్లాగా మఠంలో చేరతావా?" అని అడిగాడు మయకిన్.

"అప్పటి విషయం చూద్దాం." అన్నాడు ఫోమా.

"సరేలే, అయితే, అంతా వదిలిపెట్టిన తరువాత అప్పుడు సన్యాసుల మఠంలో చేరవచ్చు కాని, ఇప్పుడు మాత్రం నాతో రా. త్వరగా తయారుకా. ఆ ముఖంకాస్త కడుక్కో, ముఖమంతా ఉబ్బిఉంది. లూంబా నడిగి సెంటుతీసు కొనికాస్త కోటుమీద చల్లుకో !" అన్నాడు మయకిన్.

ఇలా మయకిన్‌కూ తనకూ జరిగిన సంభాషణ అంతా జ్ఞాపకం వచ్చింది ఫోమాకు.

ఫోమా స్టీమర్ దగ్గరికి వచ్చేసరికి ప్రార్థన జరుగు తోంది. అతను ఒకప్రక్కన నిల్చుని ఆ కార్యకలాపాన్నంతా చూడాసాగాడు.

వర్తకులందరూ నిశ్శబ్దంగానిలుచ్చున్నారు. ముఖాల్లో భక్తి, శ్రద్ధ కనిపిస్తున్నాయి. బరువుగా నిట్టూరుస్తూ, వంగుతూ, లేస్తూ, ఆకాశంవంక కళ్ళెత్తిచూస్తూ, ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నారు. ఫోమా ఒకమాటు ఒకరివంక, మరొకమాటు మరొకరి వంక; ఇలా అందరినీ చూచాడు. వారందరిని గురించీ తాను విన్నవీ, కన్నవీ అతనికి జ్ఞాపకంవచ్చాయి.

వాళ్ళలో లుప్ రెజిన్కోవ్ ఉన్నాడు. అతను పూర్వం మొదట్లో ఒక సానికొంపనుపెట్టి దాన్ని నడుపుతూ ఉండేవాడు. అలాంటివాడికి అకస్మాత్తుగా సిరి ఎత్తుకుంది. అతను సానికొంప నడిపేరోజుల్లో సైబీరియానుంచి ఒకశ్రీమంతుడు వచ్చాడు అతన్ని లుప్ చంపాడని వినికిడి. ఇక జుబోవ్ సంగతి. జుబోవ్ పూర్వం రైతులవద్దనుంచి నులక కొనేవాడు. రెండుమార్లు దివాలా కూడా తీశాడు. పోతే కననోవ్ ఇరవైఏండ్లక్రితం లూటీ చేయించాడు. అందుకోసం అతన్ని విచారించి శిక్షించారు కూడా. అంతేకాదు. ఒక ఈడేరని పిల్లను చెరిచిన నేరానికి ఇప్పటికీ అతనిమీద కేసు విచారణ సాగుతోంది. అతనేకాక, ఇలాంటినేరమే చేసినందుకు జకర్ కిరిలోవ్ రొబుస్తోవ్నుకూడా కోర్టుకు లాగారు. రొబుస్తోవ్ లావుగా, పొట్టిగా ఉంటాడు. గుండ్రటి ముఖం. నవ్వుతూ ఉండేకళ్ళు. అతను వర్తకుడు ఇలా అక్కడ సమావేశమైన ప్రతి ఒక్కరిని గురించీ ఏదో ఒకఅసహ్యకరమైన విషయాన్ని ఫోమా వినేఉన్నాడు.

ఇంతేకాదు. అతనికి మరోవిషయంకూడా తెలుసు వాళ్ళందరూకూడా కననోవ్నుచూచి అసూయపడుతున్నారు. నానాటికీ కననోవ్సంపత్తి అభివృద్ధిచెందుతూఉంది. రోజు

రోజుకూ అతని స్త్రీమర్ల సంఖ్య పెరుగుతూఉంది. వీళ్ళంతా ఒకరి కొకరు విరోధులే! ఒకరంటే ఒకరికి పడదు. ఒకరినొకరు చూచి నరుక్కునేటంత ద్వేషంతో ప్రవర్తిస్తుంటారు. వ్యాపారంలో ఒకరికొకరు తీవ్రంగా పోటీపడతారు. ఒకరినొకరు మోసగించుకుంటారు. ఒకరిసొమ్ము ఒకరు నిర్దాక్షిణ్యంగా దోచుకుంటారు. ఒకరిగుట్టు మరొకరికి తెలుసు. ఒకరుచేసే దుర్మార్గాలన్నీ మరొకరికి తెలుసు. కాని వీళ్ళలో ఇన్ని విభేదాలు, ఇన్ని వైరుధ్యాలు ఉన్నప్పటికీ—ఇప్పుడు, ఇక్కడ అందరూ కలిసి అదృష్టశాలియైన కననోవ్ చుట్టూ మూగినప్పుడు ఒక పెద్ద చీకటి ముద్దగా కలిసిపోయి, అన్నివిభేదాలూ మరచిపోయి, ఒకే వ్యక్తిలాగా నిల్చున్నారు. ఈ గుంపుచుట్టూ ఏదో ఒక అదృశ్యమైన ఆవరణ ఉన్నట్టుగా ఫోమాకు కనుపించింది. అందుచేతనే ఫోమాకు వాళ్ళపట్ల అసహ్యము, భయము కలిగాయి. వాళ్ళకు దూరంగా ఉండడం మంచిదనికూడా అనుకున్నాడు.

"వేషగాళ్ళు! మోసగాళ్ళు!" అని అనుకున్నాడు ఫోమా తన్నుతాను ప్రోత్సహించుకుంటూ.

వాళ్ళంతా మెల్లగా దగ్గారు. నిట్టూర్పులు విడిచారు. వంగి తమలో తాము శిలువగుర్తు చేసుకుంటూ ఈశ్వరుణ్ణి ధ్యానించారు. మతగురువుచుట్టూ ఒక పెద్ద నల్లరాతిగోడలాగా నిశ్చలంగా, దృఢంగా నిల్చున్నారు.

"ఇదంతా ఒకనటన!" అనుకున్నాడు ఫోమా తనలో.

ఫోమాప్రక్కనే గూనివాడు, ఏకాకి అయిన పావ్లిన్ గుష్చిన్ నిల్చునిఉన్నాడు—అతను వెర్రివాడైన తన

తమ్ముడి ఆస్థి కాజేసి, అతని బిడ్డలను వీధులపాల్జేసి ఎంతో కాలం కాలేదు. పాపం! వాళ్ళు బిచ్చగాళ్ళయి, పిచ్చివాళ్ళయి వీధుల వెంట తిరిగి అడుక్కుంటున్నారు. అలాటి గుస్చిన్ అక్కడ నిల్చుని బావురుమంటున్న ఆకాశంవంక తన ఒంటి కంటితో చూస్తూ,

"ఓ ప్రభూ! నామీద నీ కోపాగ్నివర్షం కురిపించకు! నీ ఆగ్రహానికి నన్ను గురిచేయకు!" అని ప్రార్థిస్తున్నాడు.

అత నిలా నటిస్తున్నప్పటికీ – నిజంగా అతను భగవంతుని మీద పరిపూర్ణ భక్తివిశ్వాసాలుఉంచే ప్రార్థిస్తున్నట్టుగా అని పించింది ఫోమాకు.

"ఓ ప్రభూ! ఈశ్వరా! విశ్వరక్షణార్థమై, లోక కళ్యాణార్థమై, ఒక పెద్దఓడ కట్టమని నీ సేవకుడైన నోవాను ఆజ్ఞాపించావు. అలాగే ఈ పడవను కూడా రక్షించు! దీనిని కాపాడడానికై శుభకరుడు, శాంతిదాయకుడు అయిన నీ దేవదూతను పంపించు! ఈ పడవపై ప్రయాణంచేసేవారందరినీ వేయి కళ్ళతో కనిపెట్టిఉండేలా అనుగ్రహించు!" అంటూ పురోహితుడు తన గంభీరమైన కంఠస్వరంతో ప్రార్థనాగీతాన్ని గానం చేశాడు. అలా గానంచేస్తేటప్పుడు ఆయన కళ్ళు పైకెత్తాడు. రెండు చేతులూ ఆకాశంలోకి చాచాడు.

వెంటనే వర్తకులంతా ఒకేమాటు సమశ్రుతిలో తమ చేతులు విశాలంగా ఊపుతూ శిలువగుర్తు చేసుకుని ఈశ్వరుణ్ణి ధ్యానించారు. అందరిముఖాలు ఒకే ఒకముద్ర – ప్రార్థనాశక్తి లోని విశ్వాసముద్ర వహించాయి.

ఈ దృశ్యాలన్నీ ఫోమామనస్సులో గాఢంగా నాటుకున్నాయి. కాని వెంటనే ఒకానొక సంశయాన్నీ, కలవరపాటునూ రేకెత్తించాయి. "వీళ్ళందరూ ఇంతగా ఈశ్వరుణ్ణి గాఢమైన భక్తివిశ్వాసాలతో సేవిస్తున్నారే - కాని వీళ్ళు మనిషిపట్ల ఎందుచేత అంతక్రూరంగా ప్రవర్తిస్తున్నారు!" అనే సందేహము, సంభ్రమము ఫోమాకు కలిగాయి. దాంతో అతనికి వాళ్ళవేషాలు, వాళ్ళమోసాలు కనిపెట్టవలెననే పట్టుదల, కుతూహలము పుట్టుకొచ్చాయి. వాళ్ళు వంచకులేనని తనలో తాను దృఢపర్చుకోగలందులకై వారిచర్యలు జాగ్రత్తగా కనిపెట్టసాగాడు.

గంభీరమైన వారి దృఢత్వం అతన్ని కోపోద్దీపితుణ్ణి చేసింది. వారి ఆత్మవిశ్వాసము, విజయసూచకాలైన వారిముఖాలు, వారి కంఠస్వరాలు, వారి నవ్వులు —— వికవికలు పకపకలు; అన్నీ అతనికి కోపం కలిగించాయి. అప్పటికీ అందరూ భోజనాలకై బల్లముందు కూచున్నారు. బల్లమీద భోజనం సిద్ధంగా ఉంది. ఆకలితో ఆతృతతో అక్కడ పెట్టి ఉన్న మూడు గజాల పెద్దచేపను ప్రశంసిస్తున్నారు. పెద్దపెద్ద ఎండ్రకాయలు, రకరకాల ఆకుకూరలు బల్లలమీద పరిచి ఉన్నాయి. ట్రోఫిమ్ జుబోవ్ మెడచుట్టూ రుమాలు కట్టుకుని దయ్యంలా ఉన్న ఆ చేపవంక సంతోషంతో అర్ధనిమీలిత నేత్రాలతో చూచాడు. తన ప్రక్కనే కూచున్న పిండివర్తకుడు యోనా యుష్కోవ్‌తో ఇలా అన్నాడు.

"యోనా నికిఫొరిచ్ ! చూడవోయ్, ఇదెంత పెద్ద చేపో ! పెద్ద తిమింగిలంలా ఉంది ! నీలాంటివాణ్ణి మోసుకెళ్ళే

బుట్టగా ఉపయోగిస్తుంది. బూటులోంచి కాలుదూరిపోయినట్టు నీ విందులోంచి దూరిపోవచ్చు. అహ్హా,హ్హా,హా,హా !"

పొట్టిగా, బొద్దుగా ఉన్న యోనా జాగ్రత్తగా దుండు లాంటి తన చెయ్యి చాచి, వెండిబానలో ఉన్న ఉప్పుచేపను స్పృశిస్తూ, పెదవులు చప్పరించి లొట్టలువేశాడు. తనముందున్న సీసాలవంక ఓరగా చూచి కన్నుగీటాడు.

కననోవ్‌కు ఎదురుగా ఒక బల్లమీద పోలెండునుంచి ప్రత్యేకంగా తెప్పించిన వోడ్కా ఒక పెద్ద పీపానిండా పోసి ఉంది. ఇంకా రకరకాల ఆహారపదార్థాలు, చిత్రవిచిత్రరూపాలలో పేర్చి కూర్చబడి చవులూరిస్తున్నాయి.

"మహాశయులారా! మిమ్మల్నందరినీ అర్థిస్తున్నాను! తమ చిత్తమొచ్చిన ఆహారాన్ని పుచ్చుకోండి. తమలో ప్రతి ఒక్కరి అభిరుచికీ అనువైన ఆహారాన్ని తెప్పించి ఉంచాను. ఇదిగో! ఇవి మన రష్యన్ పదార్థాలు. ఇవి విదేశపదార్థాలు! అన్నీ ఉన్నాయి! మీకు ఏదికావాలంటే అది స్వీకరించండి! అన్ని పదార్థాలూ కలపడం మంచిది. ఎవరి కేదికావాలో చెప్పండి! ఎవరికైనా నత్తగుల్లలుకావాలా? లేక ఈ ఎండ్రకాయలు కావాలా? ఇవి ఇండియానుంచి వచ్చాయట!" అని కననోవ్, అతిథులను మర్యాదచేస్తున్నాడు.

జుబోవ్ తన ప్రక్కనేఉన్న మయకిన్‌తో ఇలా అంటున్నాడు.

"మన పురోహితుడున్నాడు చూచావ్? నౌకా నిర్మాణసందర్భంలో చేయవలసిన ప్రార్థనచేశాడుగాని, గృహ నిర్మాణసందర్భంలో చేయవలసిన ప్రార్థనచేయలేదు. నా

ఉద్దేశ్యంలో నౌకకూడా ఒక గృహంలాంటిదే. ఎంచేతనంటే నావికులు, పడవవాళ్ళు నిత్యం నౌకలోనే నివసిస్తూ కాలంవెళ్ళ బుచ్చుతారు కాబట్టి—కనుక నౌకనుకూడా ఒక గృహంగానే ఎంచుకుని గృహనిర్మాణ శంకుస్థాపన సందర్భంలో చేయవలసిన ప్రార్థన మాత్రమే చేయవలసిఉంది. మన పురోహితుడు అలా చెయ్యలేదు. అదీ విషయం! సరే, ఇంతకూ నీవు ఏ పానీయం పుచ్చుకుంటావు?"

"నేను ద్రాక్షరసాలంటే పడిచచ్చేవాణ్ణికాదులే! నాకు కాస్త సోడ్కా పోయించు. చాలు!" అన్నాడు మయకిన్ తారాసొవిచ్.

ఫోమా బల్లచివర కూచునిఉన్నాడు. అతని చుట్టూ కొందరు సామాన్యమైన అపరిచిత అతిథులు కూచున్నారు. మధ్య మధ్యలో వృద్ధుడు తనవంక చురచుర చూడడం గమనిస్తూనేఉన్నాడు ఫోమా. "నేనిక్కడ వీళ్ళ మర్యాదకు భంగంకలిగేలా ప్రవర్తిస్తానేమో అని భయంతో నావైపు అలా చూస్తున్నాడు." అనుకున్నాడు ఫోమా.

యెఫ్చ్రోవ్ అనే బానపొట్టగల నౌకానిర్మాత కర్కశ కంఠస్వరంతో "సోదరులారా! నాకు చిరుచేపలు లేనిదే గొంతులో ముద్దదిగదు! అసలు నేను మొదటిముద్దలోనే చిరు చేపను రుచిచూడాలి! అదినా అలవాటు స్వభావం!"అన్నాడు.

"గాయకులారా! 'ప్రెషియన్‌మార్చ్' గీతాన్ని ప్రారంభించండి!" అన్నారొకరు.

"ఆగండి! 'చక్రవర్తి వర్ధిల్లుగాక!' అనే గీతాన్ని మొదలెట్టండి!" అన్నారు మరొకరు.

"సరే. ఆ గీతాన్నే ప్రారంభించండి" అన్నారు కొందరు.

సంగీతం ప్రారంభమైంది. ఇంజన్లు విడిచిన పొగధ్వనులు, మరచక్రాల చప్పుళ్ళు, సంగీతంతో శృతికలిపి ఒక పెద్ద మంచు తుపానులాగా వినిపించసాగాయి. వేణువులు విచిత్రంగా వినిపించాయి. క్లారినెట్లు సన్నగా కీచురాళ్ళలా పాడాయి. తూర్యారావాలు గర్జించాయి. బూరలు పాడాయి. మద్దెళ్ళు మ్రోగాయి. పెద్దపెద్ద ఢంకాధ్వానాలు చెలరేగాయి. ఈ శబ్దాలన్నీ సమ్మిళితమై నదీప్రవాహాన్ని చీల్చుకుంటూ వెళ్ళాయి. ఆకాశంలోకి ఎగసి గాలిని తాడించాయి. ఈ ధ్వనులమధ్య మనుష్యులు మాట్లాడుకునే మాటలు వినిపించడంలేదు. ఈ ధ్వనులన్నీ ఏకమై ఒక మహోగ్రమైన తుపానులాగా సంగీతం వినిపించసాగింది. అంచాత ఒకరితో ఒకరు బిగ్గరగా - గొంతులు చించుకుంటూ మాట్లాడుకోవలసివచ్చింది. మధ్యమధ్య ఇంజన్లు కోపంగా బుస్సుమని ధ్వనిచేస్తున్నాయి. ఈ ధ్వనిలో ఒకవిధమైన జుగుప్స, భీభత్సం కనిపిస్తున్నాయి.

"నీవు నాకు ప్రాంశరీనోటు రద్దుచేయని విషయం నేను చచ్చినా మరిచిపోను" అంటున్నాడు ఒకవ్యక్తి.

"ఇక చాల్లే! లెక్కలూ, డొక్కలూ చూచుకోవాల్సిన స్థలం ఇదేనా?" అంటున్నాడు బ్రాబ్రోవ్.

"సోదరులారా! ఇక ఉపన్యాసాలు కానిద్దాం!" అన్నారొకరు.

"గాయకులారా! ఇక ఆపండి!" అన్నారు మరొకరు.

"బ్యాంకుకు రా! నోటుఎందుకు రద్దుచేయలేదో అక్కడ చెపుతాను." అంటున్నాడు ఒకవ్యక్తి.

"గాయకులారా! ఆపండి గానం!" అన్నారు ఇంకెవరో.

"ఆపండి! ఉపన్యాసం మొదలెట్టాలి!" అన్నారు మరొకరు.

"'మైదానాల్లో' అనేపాట పాడండి!" అన్నారు వేరొకరు.

"కాదు! 'మేడమ్ అన్‌గోట్' అనేపాట!" అన్నారు ఒకరు.

"కాదు కాదు! యాకోవ్ తారాసొవిచ్! నీవు మాట్లాడవయ్యా!" అన్నారు ఇంకొకరు, మయకిన్‌తో.

"దీన్ని 'స్ట్రాస్‌బర్గ్ పిండివంట' అని అంటారు" అన్నాడొక పెద్దమనిషి, ఇంకా భోజనంచేస్తూనే.

"ఉపన్యాసం! ఉపన్యాసం!" అంటూ గోలపెట్టారు వేరొకరు.

"పిండివంటా? ఇది పిండివంటలా కనిపించటంలేదు. అయినా ఒకమాటు తినడానికి ప్రయత్నించి చూస్తాను!" అంటున్నాడొకడు, ఇంకా తిండిధ్యాసలోనేఉండి.

"మయకిన్! నీవు మాట్లాడవయ్యా! నీవు మాట్లాడు!" అని ఒత్తిడిచేస్తున్నాడు ఒకాయన, మయకిన్‌ను.

"సోదరులారా! ఇవాళ ఎంత హాయిగాఉంది!"

"'లాబెల్లీ హెలెన్‌లో' ఆ అమ్మాయి నగ్నంగా రంగస్థలంమీదికి వచ్చేదయ్యా! అదేమి చిత్రమో?" అంటున్నాడు రొబుస్తోవ్ బిగ్గరగా, ఆ గోలలోంచి.

"అయితే జాకోబ్ ఇస్సాను మోసంచేశాడన్నమాట! అవునా? ఆహా!"

"నేనిప్పుడు మాట్లాడలేను. నా నాలిక ఒక సుత్తెకాదు. పైగా నా వయస్సుకూడా మళ్ళిపోయింది." అంటున్నాడు మయకిన్.

"రా మయకిన్! మా అందరికీ ఆశాభంగం కలిగించకు, నిన్ను వేడుకుంటున్నాం!"

"నీవు మాట్లాడి మమ్ముల్ను గౌరవించు."

"నిన్ను మేయర్‌గా ఎన్నుకుంటాం!"

"మయకిన్ తారాసొవిచ్! మాతో గమ్మత్తులెందుకు? బ్రతిమలాడించుకోకుండా ఉపన్యాసం కానీయి!"

"మహాశయులారా! నిశ్శబ్దంగా ఉండండి! ఇప్పుడు మయకిన్ యాకోవ్ తారాసొవిచ్ కొన్నిమాటలు మాట్లాడనున్నాడు. ఇష్!"

సరిగ్గా ఆక్షణంలో అంతా నిశ్శబ్దమైంది. ఎవరిదో కోపోద్రిక్తమైన గుసగుస ఇలా వినిపించింది.—

"వెధవలంజ! నన్నెలా గిచ్చిందనుకున్నావ్?"

"నిన్ను 'ఎక్కడ గిచ్చింది?" అని బాబ్రోవ్ అడుగుతున్నాడు.

అంతా పగలబడి నవ్వారు. మళ్ళీ వెంటనే సద్దుమణిగింది. మయకిన్ లేచినిల్చుని గొంతు సవరించుకున్నాడు. బట్ట తల నిమురుకుంటూ ఒకమాటు అక్కడున్న వర్తకులందరినీ కలయ చూచాడు.

"సోదరులారా! చెవులు చాటలంత చేసుకుని శ్రద్ధగా వినండి!" అన్నాడు కననోవ్, సంతృప్తితో.

మయకిన్ చిరునవ్వునవ్వుతూ ఉపన్యాసం ఇలా ప్రారంభించాడు.

"వర్తక ప్రముఖులారా! తెలివికలవారు, చదువుకున్నవారు మాట్లాడేటప్పుడు ఒక విదేశపదాన్ని ఉపయోగిస్తుంటారు. ఆ పదం సంస్కృతి. ఇప్పుడు ఆ పదాన్ని గురించి నాకు తోచినంతవరకూ తమకు నివేదించబోతున్నాను."

"చూచారా? ఎంత గొప్ప విషయం మొదలెట్టాడో! పాకంలో పడ్డాడు. అదీఏతు!" అన్నాడొకవ్యక్తి మధ్యలో.

అంతలో మరొకరు

"ఇష్! మాట్లాడకు!" అని హెచ్చరించారు. తిరిగి మయకిన్ కంఠస్వరాన్ని హెచ్చించి ఇలా మాట్లాడసాగాడు.

"మహాశయులారా! వార్తా పత్రికలలో మనవర్తకులను గురించి, ఈ సంస్కృతితో మనకు పరిచయంలేదనీ, ఈసంస్కృతి మనకు అవసరంలేదనీ, ఈ సంస్కృతిని మనం అర్థంచేసుకోలేమనీ తరుచు వ్రాస్తూ ఉంటారు. మనం అనాగరికులమనీ, సంస్కారం లేనివాళ్ళమనీ అంటారు. కాని, సంస్కృతి అంటే ఏమిటి? వృద్ధుణ్ణి అయిన నాకు ఇలాంటి మాటలు వింటున్నా, చదువుతున్నా చాలా కష్టంగా ఉంటుంది! కాని ఒకరోజున ఈమాటకు నిజంగా అర్థమేమిటో తెలుసుకోవాలని పట్టుపట్టాను."

మయకిన్ ఇక్కడ ఆగి ప్రేక్షకు లందరివంక వకమాటు కలయచూచి విజయపూర్వకమైన మందహాసంతో మళ్ళీ మొదలెట్టాడు.

"నేను చాలాకాలం పరిశోధించగా తేలిన విషయం ఏమిటంటే 'సంస్కృతి' అనే మాటకు అర్థం 'పూజ' అని.

అనగా జీవితంలో వ్యవస్థపట్ల, వ్యాపారంపట్ల అధికమైన ప్రేమానురాగాలు ప్రకటితంచేయడమన్నమాట! ఇదీ అసలైన అర్థమనుకున్నాను. అంటే వ్యాపారాన్నీ, వ్యవస్థనూ ఎవడు ప్రేమిస్తాడో, తన విలువనూ జీవితంయొక్క విలువనూ తెలుసుకుని, జీవితాన్ని ప్రేమించి, జీవితవ్యవస్థను ఎవడు ప్రేమిస్తాడో—అతను సంస్కారం కలిగినవాడన్నమాట! మంచిది.''

ఇలా చెపుతూ మయకిన్ వణికాడు. అతని ముఖంనిండా ముడతలు కిరణాల్లాగా విశాలంగావిస్తరించుకునిఉన్నాయి. అతని నవ్వుతున్న కళ్ళనుంచి పెదవుల వరకూకూడా ఈ ముడతలు స్పష్టంగా విప్పారి ఉన్నాయి. అతని బట్టతల ఏదో ఒక నల్లటి నక్షత్రంలా గోచరిస్తోంది.

వర్తకులంతా శ్రద్ధగాను, నిశ్చలంగాను, నిశ్శబ్దంగాను అతనినోటివంక తదేకంగా చూడసాగారు. అతనెప్పుడు ఏంచెప్తాడో అని అందరూ కుతూహలంగా ఉన్నారు. అందరిముఖాల్లోనూ శ్రద్ధాసక్తులు కనిపిస్తున్నాయి. అందరూ శిలాప్రతిమల్లా కూచుని వింటున్నారు.

మయకిన్ మళ్ళీ ఇలా ప్రారంభించాడు:

''ఆమాటకు అర్థం అదే అయ్యేటట్లయితే మనలను అనాగరికులని, సంస్కృతి లేనివారని అనడం కేవలం అవివేకం. వాళ్ళకు ఆ మాట ఒక్కటే తెలుసుకాని, ఆ మాటయొక్క అర్థంకాని, దానిమూలం కాని తెలీదు. కాని మనకు దాని మూలం, సారాంశం అన్నీ తెలుసు. మనం కార్యోన్ముఖులం. నిజమైన జీవితదృష్టి మనకు ఉంది. జీవితాన్ని నిజంగా పూజించేది మనమేకాని వాళ్ళుకాదు. వాళ్ళు తర్కాన్ని ప్రేమిస్తారు.

మనం కార్యక్రమాన్ని ప్రేమిస్తాం. వాళ్ళు ఊరికే తర్కించుతూ కూచుంటారు. మనం కార్యరంగంలో దూకి పనిచేస్తాం! వర్తక ప్రముఖులారా! మన సంస్కృతికీ, మన కార్యాసక్తికీ ఒకచిన్న ఉదాహరణ చెపుతాను వినండి! ఈ వోల్గానదినే తీసుకోండి! ఇది మన కన్నతల్లిలాగా ప్రవహిస్తోంది. ఈ వోల్గానదిలోని ప్రతి జలబిందువూ, మన గౌరవ ప్రతిష్టలను ప్రకటించి మనపై వాళ్ళు వేసిన నిందలను రూపుమాపుతుంది. మహనీయుడైన పీటర్ చక్రవర్తి ఈ నదిపై పడవలంటూ ప్రారంభించి ఒక వంద సంవత్సరాలు మాత్రమే కావస్తోంది. కాని ఇప్పుడు వేలకొలదీ స్టీమర్లు ఈనదిలో ప్రయాణం చేస్తున్నాయి. ఈ స్టీమర్లన్నీ నిర్మించిందెవరు? రష్యన్ పనివాడు! ఒక నిరక్షరాస్యుడు! ఒక సామాన్య మానవుడు! బ్రహ్మాండమైన ఈస్టీమర్లూ, ఈ పడవలూ, అన్నీ ఎవరివి? మనవే! వీటన్నిటినీ ఎవరు కనిపెట్టారు? మనమే! ఇవన్నీ మన మేధస్సుయొక్క, మన శ్రమయొక్క ఫలితాలే! ఇందులో మనకెవరూ సహాయం చేసిందిలేదు. అంతా మన స్వయంకృషి ఫలితమే! అంతా మనం సాధించిందే! వోల్గా నదిమీద దారిదోంగతనాన్ని మనమే రూపుమాపాం. వందల కొలదీ, వేలకొలదీ మైళ్ళవరకూ స్టీమర్ వ్యాపారాన్ని నడిపించాం! వోల్గానదీతీరంలోకల్లా గొప్పపట్టణం ఏది? మనదే! గొప్పగొప్ప వర్తకులు, మేధావులు ఉన్న పట్టణంకూడామనదే. మనవూళ్ళోకల్లా గొప్పగొప్ప భవనాలు, మేడలు, ఎవరివి? మనవర్తకులవే! పేదలకోసం ఎక్కువగా పరిశ్రమించేదీ, వాళ్ళ దానధర్మాలకోసం వందలు, వేలు రూబుళ్ళు ఖర్చుపెట్టే దెవరు? మనమే! చర్చిలు, పెద్దపెద్ద గుళ్ళు, గోపురాలు కట్టిం

చిందెవరు? మనమే! ధర్మశాలలు, అన్నసత్రాలు, పేదవాళ్ళ శరణాలయాలు కట్టించిందెవరు? మనమే! ప్రభుత్వానికి ఎక్కువ పన్ను చెల్లిస్తున్నదెవరు? మనమే! మనల్ని నిందించేవాళ్ళను నిందించుకోనివ్వండి. మనకేం లోటులేదు. మనంచేసినఅమూల్యమైన కృషిమాత్రం అద్దంలా స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. మహాశయులారా! జీవితాన్ని ప్రేమించేదీ, మానవాళికి తోడ్పడేదీ మననే. మానవాభ్యున్నతికి మనసారాపాటుపడేదీ మనమే. మనమే శ్రామికులంకూడా! కాని వాళ్ళు మనల్ని నిందిస్తున్నారు. నిందించనివ్వండి!...

"గాలి వీస్తుంది, ఆ గాలికి చిన్న రేకులచక్రంకదులుతూ చప్పుడు చేస్తుంది. గాలి వీచడం ఆగిపోగానే, చక్రం చప్పుడు చేయడంకూడా ఆగిపోతుంది. అంతే! అది ఎందుకూ పనికిరాని ఆటవస్తువు. అలాగే వీళ్ళు పెట్టేగోలకూడా. ఇది కేవలం డబ్బామోత. తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్ళు బెదురుతాయా? కాని ఒక ప్రశ్న అడుగుతాను. వీళ్ళు ఎన్నడైనా, జీవితాన్ని అభివృద్ధిచేశారా? ఏమో! నేను వినలేదు. కాని మనం చేసిన కృషి స్పష్టం. సాటి వర్తక ప్రముఖులారా! మన భూమికి సారం మీరే!" అని తన ఉపన్యాసం ముగిస్తూ మయుకిన్ తన చేతిలోని పానపాత్ర పైకెత్తి "శ్రామికులు, ప్రేమికులు అయిన తన్యావర్తకులు వర్ధిల్లుదురుగాక! మాతృదేశగౌరవాన్ని వాళ్ళు శాశ్వతంగా నిల్పుదురుగాక! జై! జై!" అంటూ పానపాత్రను ఖాళీచేశాడు.

వర్తకులందరూ ఒక్కమాటుగా, ఉద్వేగంగా ప్రతిస్పందించి పెద్దగా కేకలుపెట్టారు. జై జై ధ్వానాలుచేశారు. ఆ

కేకలకు భూకంపం పుట్టినట్లనిపించింది. అక్కడున్న ప్రతివస్తువూ కంపించిపోయింది.

"యాకోవ్ మయకిన్ మానవమాత్రుడుకాడు! అతను ఈశ్వరుని విజయశంఖం! దేవతల జయభేరి!". అని అరిచాడు జుబోవ్, తన పానపాత్రను మయకిన్‌కు అందిస్తూ.

కుర్చీలు అటూ ఇటూ కదుపుతూ, వాటిమీదఉన్న సీసాలు, వస్తువులూ పడిపోయేలా తోసుకుంటూ అత్యధిక ఉత్సాహంతో ఆనందబాష్పాలు రాలుస్తూ, వర్తకులంతా మయకిన్ దగ్గరికి పరుగెత్తి అతనిచుట్టూ చేరారు. చేతుల్లోని పాన పాత్రలు ఒక్కమాటుగా పైకెత్తారు.

రోబుస్తోవ్ భుజం పట్టుకుని ఊపుతూ "ఇప్పుడు మయకిన్ చెప్పిన ఉపన్యాసం ఎంత గొప్పగాఉన్నదో విన్నావా?" అన్నాడు కననోవ్.

"మయకిన్ తారాసొవిచ్! ఇలారా! మమ్మల్ని కౌగలించుకోనియ్యి!" అన్నాడొకవ్యక్తి.

"నిన్ను ఆకాశంలోకి ఎత్తనీయి మయకిన్"! అన్నాడు మరోవ్యక్తి.

"మళ్ళీ గానం మొదలెట్టండి!" అన్నాడు ఇంకోవ్యక్తి.

"గానం ఎవడికికావాలి? ఆపెయ్యండి!" అని అరిచారు ఇంకెవరో.

"యాకోవ్ మయకినే మనకు ఒక గొప్పగానం!" అన్నారు ఒకరు.

"ఎంత గొప్పబుర్ర! ఎంత గొప్పమేధస్సు!" అన్నారు మరొకరు.

"నా సోదరులందరిలో నేను కొద్దివాణ్ణి! అయినా భగవంతుడు నాకు విజ్ఞానం ప్రసాదించాడు" అన్నాడు మయకిన్.

"నీవన్నది నిజంకాదు!" అన్నారొకరు.

"మయకిన్! నీవు త్వరలో చనిపోనున్నావు! ఎంత విచారకరం! అప్పుడు మా దుఃఖం చెప్పడానికి వీల్లేదు. మమ్మల్నందరినీ ఏంచేసిపోతావు మయకిన్!" అన్నాడు మరో వ్యక్తి దీనంగా.

"కాని అప్పుడు జరగబోయే అంత్యక్రియల మహోత్సవం ఎంత కన్నులపండువగా ఉంటుందో!" అన్నాడు మరో పెద్ద మనిషి.

"మహాశయులారా! మనం మయకిన్ కోసం 'మయకిన్ నిధి' అంటూ ఒకటి ఏర్పాటుచేద్దాం. అందుగ్గాను నే నిప్పుడే ఒక వెయ్యి చందా ఇస్తున్నాను."

"ఆగవయ్యా! ఏమి టంత తొందర!"

"నిశ్శబ్దం! ఆగండి! మళ్ళీ మయకిన్ మాట్లాడు తున్నాడు."

"మహాశయులారా!" అంటూ మళ్ళీ మయకిన్ ఉపన్యాసం ప్రారంభించాడు. "ఇంతేకాదు. మరో విషయం. జీవితంలో కల్లా అగ్రగాములం మనమే! కారణం మనం శ్రామికులం కూడా కావడమే."

"నిజం!"

"అయితే, నిజంగా నీవు కూడా శ్రామికుడవేనా?"

"ఆగండి! అతన్ని చెప్పనివ్వండి!"

"అనాది రష్యన్ ప్రజలం మనమే. మనరక్తం అసలైన సిసలైన రష్యన్ రక్తం! మనలోంచి వెలువడేదంతా అసలైన రష్యన్ జాతీయతత్వంతో కూడుకున్నది. అంచాతనే అది స్వచ్ఛమైనదీ, మచ్చలేనిదీ! నిజమైన రష్యన్‌జాతిని నిర్మించిన వాళ్ళం మనమే!" అని చెప్పసాగాడు మళ్ళీ మయకిన్.

"నీవన్నది నిజం! రెండూ రెండూ కలిస్తే నాలుగు అవడం ఎంతనిజమో, నీవన్నదికూడా అంతనిజం!" అని అభినందించాడు ఒకవ్యక్తి.

"ఆహా! ఎంతకొద్దిలో గొప్ప విషయాన్ని విప్పి చెప్పావూ!" అని ఉబ్బిపోయాడు మరోవ్యక్తి.

"పాములాంటి తెలివితేటలు ముసలాడివి!"

"గొర్రెపిల్లలా అమాయకుడు వృద్ధుడు!"

వర్తకులంతా అతనిచుట్టూ మూగారు. అతన్ని మాట్లాడనివ్వలేదు. నెమ్మదిగా అతని మాటలు వినలేక ఉద్రిక్తులవుతున్నారు. ఉద్రేకంతోనూ ఉత్సాహంతోనూ గొడవచేస్తున్నారు. కొందరతన్ని రాచుకుని పోతున్నారు. కొందరతన్ని భుజంతడుతున్నారు. కొందరు ముద్దాడుతున్నారు. మరి కొందరు అతనివంక నిశ్చేష్టులై తదేకంగా చూస్తున్నారు.

"ఇక నృత్యం చేద్దాం"అని అరిచారు కొందరు మధ్యలో.

యాకోవ్ తారాసొవిచ్ మయకిన్, నదివంక వేలుపెట్టి చూపుతూ "ఇదంతా మనసృష్టే! ఇదంతా మనకృషే!" అన్నాడు.

హఠాత్తుగా అన్నిశబ్దాలనూ అణిచివేస్తూ ఒక పెద్దకేక వినిపించింది.

"ఇదంతా మీరు చేసిందే నన్నమాట? మీరు..." ఆ కేకతోపాటు ఒకతిట్టు కూడా వినిపించింది.

అందరూ అది విని ఒకక్షణంపాటు స్తబ్ధులైపోయారు. ఆమాట అన్నది ఎవరా అని నలువైపులా కలయచూచారు. ఆ నిశ్శబ్దంలో ఇంజన్ విడుస్తున్న బరువైన శ్వాసలు తప్ప మరేమీ వినిపించడం లేదు

"ఎవరా మొరిగింది?" అన్నాడు కననోవ్, కోపోద్రిక్తుడై. అతని కనుబొమలు ముడివడ్డాయి.

"ఏదో ఒక గొడవ జరగకుండా మన పని సాఫీగా సాగిపోయేటట్టులేదే!" అన్నాడు రెజ్నికోవ్, నిశ్వసిస్తూ.

"అసలు ఆ మాటఅన్నదెవరు?" అన్నాడు మరోవ్యక్తి.

వర్తకుల ముఖాలన్నీ కలవరపడ్డాయి. ఆశ్చర్యంతోనూ ఔత్సుక్యంతోనూ, నిందాభావంతోనూ, కోపావేశంతోనూ చలించిపోయాయి. ఒక్క మయకిన్ మాత్రమే నిండుగా, నిబ్బరంగా, ప్రశాంతంగా ఉన్నాడు. జరిగినదానికి సంతోషిస్తున్నట్టు కూడా కనిపిస్తున్నాడు. మునివ్రేళ్ళపై నిల్చుని మెడ ముందుకు చాచి బల్ల చివరకు చూచాడు. అక్కడ అతనికి ఇష్టమైన విషయాన్ని దేన్నో చూచినట్టుగా అతని కళ్ళు తళతళలాడాయి.

"ఫోమా గార్డియెవ్!" అన్నాడు యోనా యుష్కోవ్ మెల్లగా.

తత్క్షణమే అందరి ముఖాలూ అటువైపు తిరిగాయి. మయకిన్ చూస్తున్నవైపుకే అందరూ చూడసాగారు.

అక్కడ ఫోమా బల్లమీద చేతులు ఆనించుకుని నిల్చునిఉన్నాడు. అతని ముఖం ఆగ్రహావేశాలతో వికృతమైఉంది.

పళ్ళు గట్టిగా బిగపట్టుకునిఉన్నాడు. విశాలంగా విప్పార్చిన అతని నేత్రాలు కణకణమండే నిప్పుకణికల్లాఉన్నాయి. వర్తకు లందరినీ కలయచూస్తున్నాడు. అతని క్రిందిదవుడ వణికిపో తోంది. అతని భుజాలు కంపిస్తున్నాయి. అతను చేతిప్రేళ్ళతో బల్లకొసను గట్టిగా పట్టుకునిఉన్నాడు. బల్లమీద పరిచిన గుడ్డను వణుకుతోన్న ప్రేళ్ళతో గీరుతున్నాడు. తోడేలు పిల్లలా ఉగ్రంతో నిండిఉన్న అతని ముఖాన్నీ, ఆవేశపూరితమైఉన్న అతని వైఖరినీ చూచి వర్తకులంతా మళ్ళీ ఒక క్షణంపాటు మౌనంవహించారు.

"ఎందుకలా గుడ్లప్పగించి, నోళ్ళు తెరుచుకుని చూ స్తారు?" అన్నాడు ఫోమా. అలా అంటూనే దాంతోపాటు ఏదో పెద్ద తిట్టు తిట్టాడు.

"అతను తాగిఉన్నాడు!" అన్నాడు బోబ్రోవ్, తల పంకిస్తూ.

"అసలతన్ని ఇక్కడికి ఎందుకు ఆహ్వానించారు?" అని మెల్లగా గొణిగాడు రెజ్నికోవ్.

"ఫోమా ఇగ్నాటిచ్! నీ విక్కడ నిందావాక్యాలతో గొడవ లేవదీయడం ఏమాత్రం మంచిపని కాదు. కానీ తాగుడు ఎక్కువై తలతిరుగుతూఉన్నట్టయితే, వెళ్ళిపో నాయనా! మెల్లగా ప్రశాంతంగా వెళ్ళి కాబిన్‌లో పడుకో! పడుకుని........"అంటూ కననోవ్, అతన్నేదో శాంతింప చేయడానికి ప్రయత్నించబోయాడు.

"నీవు నోరుమూసుకో!" అని గర్జించాడు ఫోమా, కననోవ్‌మీద దృష్టినిలిపి. "నాతో మాట్లాడడానికి సాహసిం

చకు! నేనేమీ తాగిలేను! మీలో ప్రతి ఒక్కరికంటె నేను తెలివిగా ఉన్నాను! తెలిసిందా?" అని మళ్ళీ అరిచాడు ఫోమా.

"ఒక్కనిముషం ఆగు నాయనా! అసలు నిన్నెవరు ఇక్కడికి ఆహ్వానించారు?" అని అడిగాడు కననోవ్, అతని అవమానకరమైన మాటలకు ముఖమంతా జేవురింపచేసుకుని.

"నేనే అతన్ని ఇక్కడికి తీసుకొచ్చాను!" అనిచెప్పాడు మయకిన్.

మయకిన్‌గొంతు వినిపించేసరికి కననోవ్ కొంచెం చల్లబడ్డాడు. "ఓ! అయితే సరే. ఫోమా ఇగ్నాటిచ్! నన్ను క్షమించు." అంటూ మళ్ళీ మయకిన్‌వైపు తిరిగి "కాని తారాసావిచ్! నీవు అతన్ని వెంటబెట్టుకొని వచ్చినప్పుడు, నీవే అతన్ని కాస్త అదుపు ఆజ్ఞలలో ఉంచాలి. లేకపోతే బాగుండదు." అన్నాడు కననోవ్.

ఫోమా మౌనంవహించి మందహాసంచేశాడు. తరువాత వర్తకులు కూడా అతనివంక చూస్తూ నిశ్శబ్దంగాఉన్నారు.

"ఏంనోయ్, ఫోమ్కా! మళ్ళీ నాకీ వృద్ధాప్యంలో తలవొంపులు తీసుకొస్తున్నావా?" అన్నాడు మయకిన్.

"రక్షకపితా! నేనింకా ఏమీ గొడవ మొదలెట్టనేలేదు, అప్పుడే నన్ను తిట్టడం ప్రారంభించారే. నేను తాగిలేను. నేనొక చుక్కకూడా తాగలేదు. ఊరకే కూచుని అన్నీ వింటున్నాను. కాని ఒక్క ఉపన్యాసం ఇవ్వడానికి నన్ను అనుమతించండి! మీరందరూ ఎంతో గౌరవించే నా రక్షకపితఉపన్యాసం

విన్నారు. ఇక ఆయన రక్షక కుమారుడనైన నామాటలు వినండి !" అన్నాడు ఫోమా.

"ఏమి టీ చర్చలు, ఉపన్యాసాలు? ఇక్కడేదో కులాసా కోసమని వస్తే?" అన్నాడు రెజ్నికోవ్.

"ఇక ఊరుకో నాయనా, ఫోమా !"

"నీకు కావలసుంటే ఏదైనా తాగు !"

"ఫోమా ! నీవు తండ్రికి తగిన కొడుకువు !"

ఫోమా బల్లదగ్గర్నుంచి కొంచెం అవతలికి జరిగి చిరునవ్వునవ్వుతూ వీరందరి మాటలూ వింటున్నాడు. అక్కడున్నవారందరిలోకీ అతను చిన్నవాడు, అందగాడు. చక్కటి రూపం. వంటికి అతికినట్టున్న కోటు వేసుకున్నాడు. ముఖం తీర్చి దిద్దినట్టుగా ఉంది. విశాలమైన కళ్ళు. జేబుల్లో చేతులు పెట్టుకుని నిల్చున్నాడు.

"పొగడ్తలతోనూ, లాలింపులతోనూ నా నోరు మూయించలేరు. మీరు విన్నా వినకపోయినా నేను మాట్లాడదలచుకున్నది మాట్లాడేదే ! నన్ను మీ రిక్కడనుంచి వెళ్ళగొట్టలేరు. తరిమెయ్యలేరు !" అన్నాడు ఫోమా బెదిరిస్తూ.

తలఊపి భుజాలెత్తి "మీలో ఎవరైనా నన్ను వేలేసి తాకారూ అంటే ఉన్నవాళ్ళను ఉన్నచోటే ఊపిరితీస్తాను ! నా ఇష్టంవచ్చినంతమందిని చంపేస్తాను ! తిరిగితే దేవుడిమీద ఒట్టు !" అన్నాడు ఫోమా.

అతను పళ్ళు పటపటకొరికాడు. వక్షస్థలాన్ని ఉబికించాడు. చేతులు ముందుకు చాచాడు.

గాలి విసురుకు పొదలు వెనక్కు తగ్గినట్టు అతనిమాటలు వినగానే జనం వెనక్కు తగ్గారు. అందరూ ఆందోళనతో గుసగుసలు మొదలెట్టారు. ఫోమాముఖం మరింత నల్లనైంది. అతని కళ్ళు గుండ్రంగామారాయి. కనుపాపలు పెద్దవైనాయి.

"జీవితాన్ని నిర్మించామనీ, అందరికంటేకూడా గొప్ప విషయాలు నిర్వహించామనీ అన్నారుకదూ, మీరు?' అంటూ ఫోమా ఒకమాటు బరువుగా నిట్టూర్చాడు. చెప్పరానంత అసహ్యంతో ఒకమాటు అందరిముఖాలవంక చూచాడు. ముఖాలన్నీ ఉబ్బినట్టుగా కనిపిస్తున్నాయి. వర్తకులు నిశ్శబ్దంగా, మెల్లగా ఒకరిపక్కకు ఒకరు చేరుకుని ఒత్తుకుంటూ నిల్చున్నారు. వెనుక వరుసల్లో ఎవరిదో గొంతు హఠాత్తుగా ఇలా వినిపించింది.

"ఏమి టితను ? పత్రికచూచి చదువుతున్నాడా ? లేక ఇంట్లో బట్టీపెట్టుకుని వచ్చి ఒప్పచెపుతున్నాడా ?"

"అరే, పుండాకోరుల్లారా ! ఏమిట్రా మీరు చేసింది ? మీరు చేసింది జీవితంకాదు ! మీరు కట్టింది ఒక ఖైదు ! వ్యవస్థకాదురా మీరు స్థాపించింది ! మనిషికి సంకెళ్ళురా మీరు వేసింది ! ఇక్కడ నిల్చోవడానికి చోటులేదు. ఇక్కడ ఊపిరాడదు. మనిషి క్షీణించి, నశించి, పతనమైపోతున్నాడు ! మీరంతా హంతకులు ! మానవజాతికి సహనమనేది ఉన్నది కాబట్టి ఇంకా మీరంతా ప్రాణాలతో నిల్చి ఉన్నారురా ! అర్థమైందా ?" అన్నాడు ఫోమా.

"ఏమిటి దీనికర్థం ? ఏమిటీ గొడవంతా ?" అన్నాడు రెజ్నికోవ్.

"గార్డియేవ్! నీవు మాట్లాడుతున్న మాటలు మంచివి కావు." అన్నాడు బాబ్రోవ్.

"ఇలాంటి మాటలకు నీకు తగినశిక్ష..." అన్నాడు జుబోవ్.

"అహ్హా, హ్హా, హా!" అని నవ్వారు ఎవరో.

"ఇక ఆపండి! నోరుమూయండి! పందుల్లారా!"అన్నాడు ఫోమా. అతని కళ్ళనుంచి రక్తం చిమ్ముతోంది.

"మహాశయులారా! మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. వాణ్ణి వదలిపెట్టండి! వాణ్ణి ముట్టుకోకండి! వాడివాగుడు వాణ్ణి వాగనివ్వండి! దానివల్ల మీ కేమీ హానిలేదు." అన్నాడు మయకిన్, ప్రశాంతంగా.

"సరేలే! వాణ్ణేమీ చెయ్యంలే" అన్నాడు యుషోక్వ్.

ఫోమా ప్రక్కనే నిల్చునిఉన్న స్మోలిన్, అతని చెవిలో "ఏమిటబ్బాయ్! ఏమిటీ గొడవ? ఊరుకో! నీకేమైనా పిచ్చెక్కిందా? ఇలాచేస్తే వాళ్ళు ఊరుకోరు." అన్నాడు.

"వెళ్ళు! వెళ్ళి నీబోధంతా ఆ మయకిన్‌దగ్గర చెప్పుకో ఏదైనా అక్కరకొస్తుంది. నీక్కావల్సింది అతను ఇస్తాడు." అన్నాడు ఫోమా, స్మోలిన్‌తో.

స్మోలిన్ ఈలవేసుకుంటూ వెళ్ళిపోయాడు. వర్తకులు కూడా ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. ఇది ఫోమాను మరింత ఉద్రిక్తపరచింది. తన మాటలవల్ల వాళ్ళందర్నీ కట్టిపడేయ్యాలనుకున్నాడు. కాని అంతశక్తివంతమైన మాటలు అతనికి తోచలేదు.

"మీరు జీవితాన్ని నిర్మించారా? ఎవరు మీరు? దొంగలు!" అన్నాడు మళ్ళీ.

కొందరు అతను పిలిచాడనుకుని అతనివంక తిరిగి చూచారు.

"కననోవ్! ఆ కన్నెపిల్లకోసం నిన్ను మళ్ళీ విచారణ చేస్తారుకదూ? నిన్ను బానిసచాకిరికి పంపుతారులే! సెలవు ఇవ్వా! ఈ స్త్రీమర్లన్నీ ఎందుకు వృథాగా కడతావు? నిన్ను సైబీరియాకు ప్రభుత్వంవారి సీమరే తీసుకుపోతుంది. తొందర పడబోకులే!" అన్నాడు మళ్ళీ ఫోమా.

కననోవ్ కుర్చీలో కుప్పకూలిపోయాడు. అతని ముఖం ఎర్రబడిపోయింది. పిడికిలి బిగించి నిశ్శబ్దంగా ఊపాడు.

మళ్ళీ ఫోమా కటువుగా అన్నాడు. "మంచిది, వెళ్ళిరా. నిన్ను మరిచిపోనులే!"

అప్పుడు ఫోమా కననోవ్ చెదిరినముఖాన్ని, కంపిస్తున్న పెదవులను చూచాడు. ఏ ఆయుధాలవల్ల వీళ్ళకు బలీయమైన ఆఘాతాలు తగులుతాయో, అప్పుడు గ్రహించాడు.

"అహ్హా, హ్హా, హా! జీవన నిర్మాతలారా! గుష్చిన్! నీవెప్పుడైనా నీమేనల్లుళ్ళకూ, నీమేనకోడళ్ళకూ – వాళ్ళు వీధుల్లో కనిపిస్తుంటే కాసబిచ్చమైనా పెడతావా? పాపం, వాళ్ళకు రోజు కొక్క కోపెక్ అయినా పడేస్తూఉండు! వాళ్ళ డబ్బు అరవై ఏడువేల రూబుళ్ళు నీవు అపహరించావు! అలాంటప్పుడు వాళ్ళకొక్కకొపెక్ పడేస్తేపోయిందేమిటిలే! బాబ్రోవ్! నీ ఉంపుడుగత్తెను గురించి అది నిన్ను దోపిడీచేసిందని ఎందుకోయ్ అబద్ధంచెప్పి దాన్ని జైలుపాలుచేశావ్? నీకు దాంతో

రోతవేస్తే, నీవుదాన్ని నీకొడుక్కువదిలేస్తే సరిపోదూ! అయినా వాడప్పుడే నీ కొత్తఉంపుడుగత్తెతో పొత్తు కలిపాడులే! నీకు తెలియదా ఎమిటి? ఆరి పందీ! అహ్హా, హా, హా! ఏయ్ లుప్! మళ్ళీ ముండలకంపెనీ మొదలుపెట్టరాదూ? పూర్వంలాగానే మళ్ళీ అక్కడికొచ్చే విటులందరినీ చేరవెయ్యరాదూ? వాళ్ళను మసిపూసి మారేడుకాయచేసి వళ్ళు అలవకుండా ఉన్నదంతా వల్చుకోరాదూ? అప్పుడు దేవుడో, దయ్యమో నిన్నుకూడా ఇంచక్కగా వల్చుకుంటుంది! పైకి యోగిలా లోపల భోగిలా ఉండే నీలాంటివాణ్ణి ఎవరు కనిపెడతారురా? పయోముఖ విషకుంభమా! అహ్హా, హా, హా! నీలాంటివాడికి ఈ దొంగ సన్యాసి ముఖం బాగా సరిపడదిలే! ఎవరినోయ్ అప్పుడు చంపింది నీవు? చంపినా నీముఖం చూచి కనుక్కోలేరులే, పుండాకోరా! అహ్హా, హా, హా!" అన్నాడు ఫోమా.

ఫోమా మధ్యమధ్యలో పెద్దగా నవ్వుతూ మాట్లాడు తున్నాడు. తన మాటలు వారిలో బాగా పనిచేస్తున్నాయని వారి ముఖాలనుబట్టి గ్రహించుకున్నాడు. ఇదివరకతను మాట్లాడుతూఉంటే, అందరూ అతనికి దూరంగా తొలగి నిల్చుని, గుంపులుగాచేరి, తనవైపు కోపంతో, అసహ్యంతో చూస్తుండేవారు. వాళ్ళ ముఖాలపై చిరునవ్వులుకూడా కని పించేవి. వాళ్ళ ప్రతి కదలికాకూడా, అతనికి కడుపులో దేవినట్లనిపించేది. రోతపుట్టేది. కాని ఇప్పుడు తను వాళ్ళకు కోపం తెప్పించగలిగానని అనుకున్నాడు. అయినా ఆ మాటలు ఊరికే కోపం తెప్పించాయేకాని, తాను అనుకున్నంతగా వాళ్ళ హృద యాలను గాయపరచలేదనికూడా అతను అనుకున్నాడు.

ఇదంతా అతని కోపాన్ని కొంతవరకు తగ్గించాయి. తను వాళ్ళ మీదచేసే దాడి విఫలమవుతుందని అనుకున్నాడు. కాని తాను వాళ్ళను ఒక్కొక్కరినీ పేరుపేరున పిలిచి నిందించిన తరువాత వారికి తనకూగల బాంధవ్యంలో ఒక పెద్ద మార్పు వచ్చినట్టు గ్రహించాడు.

ఫోమా మాటలధాటికి తాళలేనివాడిలా కననోవ్ కుర్చీలో కూలిపోయాడు. కొందరు వర్తకుల ముఖాలలో చిరు నవ్వులు కనిపిస్తున్నాయి. వాళ్ళతన్ని అభినందిస్తున్నారు: "మంచిమాటన్నావు! మంచిమాటన్నావు!" అంటున్నారు.

తనను వాళ్ళలా అభినందించడంవల్ల ఫోమాకి కిమరింత ఎక్కువైంది. వాళ్ళు తననుగురించి సంతోషంగా గుస గుస లాడడం చూచి మరీ పెచ్చుమీరిపోయాడు. పేరుపేరునా పిలుస్తున్నాడు. రకరకాలుగా తిట్టిపోస్తున్నాడు. నోటికి వచ్చిన మాటలు—అనరానిమాటలు—బండబూతులు తిడుతున్నాడు. కంటికి మనిషి కనిపించడమే పాపం! తిట్ల వర్షం కురిసిందే! అతన్ని మెచ్చుకునేవారు కొందరు అతనికి మరింత దగ్గరిగా జరిగి కూచుంటున్నారు

కొందరు వర్తకులు ఇందుకు తమ అసమ్మతిని తెలియచేయసాగారు కాని, పెద్దగాకాదు. మెల్లగా మాత్రమే. ముఖాలు చిట్లించుకుంటూ, మూతులూ, ముక్కులు కొరుక్కుంటూ గుస గుసలాడసాగారు. బాబ్రోవ్ వెగటుగా నవ్వాడు. లుప్ రేజ్నికోవ్ నోరు తెరుచుకుని రొప్పుతూ గాలిలో చేతులు అడ్డంపెట్టి ఆడించసాగాడు.

"మీరే నాకు సాక్ష్యం - ఈదారుణాన్ని నేను సహించలేను. ఎంత సాహసం! నేను కొట్టకుపోతున్నాను." అని కీచుగొంతుతో అరిచాడు రెజ్నికోవ్.

"అతన్ని కట్టిపడేయ్యండి!" అనికూడా అరిచాడు.

ఫోమా నిండుగా నవ్వుతున్నాడు.

"నిజాన్ని నిప్పునూ ఎవరూ కట్టెయ్యలేరు! కట్టేసినా నిజం నోరు కట్టుబడదు!" అన్నాడు ఫోమా.

"అ—లా—గా! అదేమిటో చూస్తాంగా!" అన్నాడు కనవోవ్ కటువుగా.

"అయ్యలారా! మిమ్మలను వేడుకుంటున్నాను. వాడు వట్టి అమాయకుడు! వాడిమాటలు పట్టించుకోకండి!" అన్నాడు మయకిన్, కీచుగొంతుతో.

ఒకరి తరువాత ఒకరు వర్తకులంతా ఫోమా దగ్గరికి చేరారు. వాళ్ళముఖాల్లో కోపం, ఆశ్చర్యం, ఒక విషపూరితమైన సంతృప్తి, భయం, కనిపిస్తున్నాయి. ఫోమాప్రక్కనేఉన్న సామాన్యుల్లో ఒకడు ఫోమాతో, "బాగామాట్లాడుతున్నావు, ఇంకామాట్లాడు! ఇలా మాట్లాడడంవల్ల నీకీర్తికి దోహదం చేస్తుంది!" అన్నాడు.

"అరేయ్, రుబొస్టోవ్! ఎందుకురా నవ్వుతున్నావు? ఏం చూచుకుని ఆ సంతోషమంతా? నిన్నూ ఖైదులో నెడతారులే!" అన్నాడు ఫోమా.

"ఇతన్ని తీసుకెళ్ళి ఒడ్డున పడేయ్యండి!" అని అరిచాడు రుబొస్టోవ్.

"స్టీమర్‌ను మళ్ళించు! ఊళ్ళోకి వెళ్ళాలి!" గవర్నరు దగ్గరకి వెళ్ళాలి! అని కననోవ్ కేకవేసి కెప్టెన్‌తో చెప్పాడు.

"ఇదంతా ఇతను కావాలనే చేశాడు. ఎవరో అతనికి ధైర్యంరావడంకోసం మస్తుగా తాగించారు. తాగించి ఇలా పిచ్చివాగుడు వాగిస్తున్నారు!" అన్నాడొక వ్యక్తి.

"కాదు. ఇది కేవలం తిరుగుబాటు!"

"అతన్ని కట్టెయ్యండి! వెంటనే కట్టెయ్యండి!"

ఫోమా ఒక షాంపేన్‌బుడ్డి తీసుకుని గాలిలోకి ఎగరేశాడు.

"ఇక రండి! మీకిష్టమైనా కాకున్నా నామాటలు విని తీరాలి!" అన్నాడు.

గుండెల్లో శూలాల్లా గుచ్చుకుంటున్న అతని మాటల ధాటికి వాళ్ళంతా తట్టుకోలేకపోతున్నారు. ముఖాలు చిన్న బుచ్చుకున్నారు. అందుకు ఫోమా మరింత సంతోషించాడు. కొత్త ఉత్సాహం పుట్టుకొచ్చింది అతనికి. వెర్రి ఆవేశంతో, ఆనందంతో చిందులు తొక్కుతూ మళ్ళీ వాళ్ళందరినీ పేరు పేరున పిలుస్తూ నోటికి వచ్చినట్టు తిట్టసాగాడు అక్కడి వారిలో కొందరు అతనివంకచూచి సంతోషం, సంతృప్తి వెలిబుచ్చుతున్నారు. అంగీకారాన్ని తెల్పుతున్నారు కూడా. వారిలోంచి నెరిసిన జుట్టుగల ఒక చిన్నవృద్ధుడు, తిట్లుతింటున్న ఆ వర్తకుల వైపు తిరిగాడు. తాను కూడా ఫోమాచేత తిట్లుతిన్నవాడే. అయినా తక్కినవారితో ఇలా చెప్పసాగాడు.

"ఇవి అతని అంతరాత్మలోనుంచి వెలువడుతున్న మాటలు! వాటిల్లో దోషంలేదు. మీరు వాటిని భరించి

తీరాలి! ప్రవక్తయొక్క నిందఇది! నిజంగా మనమంతా పాపాత్ములమే. ఎంచేతనంటే మనమంతా చాలా..."

అతనిలా చెప్తోంటే వాళ్లు "ఇష్!" అంటూ అతన్ని మాట్లాడనీయకుండా చేశారు. జుబోవ్ అతన్ని పక్కకునెట్టాడు. అతను మళ్ళీ గుంపులో కలిసిపోయాడు.

"జుబోవ్! ఎంతమంది జనాన్ని దోచుకుని వాళ్ళను బిచ్చగాళ్ళుగా చేశావో నీకు జ్ఞాపకముందా? నీమూలంగా ఇవాన్ పెట్రోవ్, మైకినికోవ్ ఉరిపోసుకుని ఊపిరివిడిచాడే! ఆవిషయం నీవెప్పుడైనా కలలోనైనా అనుకున్నావ్? చర్చిలో ప్రతి ఆదివారం దేవుడి దిబ్బెంలో వేసే దక్షిణ డబ్బుల్లోంచి తడవకు పదిరూబుల్లు కాజేస్తుంటావట! నిజమేనా?" అన్నాడు ఫోమా.

జుబోవ్‌నుకూడా ఇలా రెచ్చగొట్టేసరికి అతను చకితుడైపోయాడు. చెయ్యెత్తి నిల్చున్నవాడు నిల్చున్నట్టే ఉండిపోయాడు. తరువాత తేప్పరిల్లుకుని "నామీదకూడా ఎదురుతిరుగుతున్నావా? నామీదకూడా!" అంటూ పిడికిలి బిగించి ఫోమావంక చూస్తూ బుసలు విడువసాగాడు. "ఈ విషయం బిషప్‌తో ఫిర్యాదుచేస్తాను. నీవు నా సికుడవు! దేవుడులేడని అంటున్నావు. బిషప్‌తో చెపితే అప్పుడేవర్ని జైలుకు పంపిస్తారో నీకే తెలుస్తుంది." అన్నాడు జుబోవ్ ఉగ్రుడై.

స్టీమర్లో అల్లరి ఎక్కువైంది. ఆగ్రహంతోను, ఆందోళనతోను, అవమానంతోను తుకతుక ఉడికిపోతున్న ఈ జనాన్నంతా చూచేసరికి ఫోమాకు ఒక ఊహ తట్టింది. గంధర్వకథలలో బ్రహ్మరాక్షసులందరినీ చంపేసే కథానాయకుడైన

రాకుమారుడిలా ఇప్పుడు తానున్నట్టు అనిపించింది. అక్కడున్నవారిలో కొందరు, ముఖాలు ఎరుపుచేసుకుని అరుస్తూ, కేకలుపెడుతూ, చేతులాడిస్తూ, ఒకరినొకరు పిలుచుకుంటూ అటూ ఇటూ తిరగసాగారు. మరికొందరిముఖాల్లో నెత్తురు చుక్కలేదు. అయినా అందరూకూడా నిస్సహాయులై ఘోషాఘాటిని అరికట్టలేక, చేసేదేమీలేక, కీచుగొంతులతో ఏదో గొణుగుతూ గోలచేయసాగారు.

"నావికులను ఇక్కడికి పంపండి!" అని అరిచాడు రెజ్నికోవ్, కననోవ్ రెక్క పుచ్చుకునిలాగుతూ. "ఇల్యా! ఏమిటీపని? దీని అర్థమేమిటి? ఆహా! మమ్మలను అవమానించడానికేనా నీ విక్కడికి ఆహ్వానించింది?" అని అడిగాడు.

"ఒక కుక్కపిల్లచేత" అన్నాడు జుబోవ్.

ఒక గుంపు జనం యాకోవ్ తారాసొవిచ్ మయకిన్ చుట్టూ పోగయ్యారు. అతను వాళ్ళందరినీ సర్దుతూ, శాంతింపచేస్తూ మెల్లగా ఏదో ఉపన్యాసం చెప్పాడు. వాళ్ళు కోపంతో ముఖాలు ఎర్రచేసుకుని, మధ్యమధ్య తలలు పంకిస్తూ అతని మాటలు విన్నారు.

"సరే, అలాగేచెయ్యి యాకోవ్! మేమంతా సాక్ష్యమున్నాం. పద. ముందుకు పద! అన్నాడు రొబుస్టోవ్ బిగ్గరగా.

ఈ కంఠస్వరాల రొదను చీల్చుకుంటూ, బిగ్గరగా నిందారోపణచేస్తున్న ఫోమాకంఠం గంటకొట్టినట్టు వినిపించింది.

"మీరు నిర్మించింది జీవితంకాదు,—మీరు నిర్మించింది ఒక మురికిగుంట! మురికంతా పోగుచేసి కుళ్ళును సృష్టించారు! ఇదే మీరంతా చేసినపని! మీకు అంతరాత్మ ఉన్నదా?

మీకు దేవుడు జ్ఞాపకమున్నాడా? డబ్బు! డబ్బే మీకు దేవుడు! మీరు మీ అంతరాత్మను తరిమివేశారు. దాన్ని ఎక్కడికి తరిమివేశారురా? రక్తం తాగే రాక్షసులారా! నెత్తురుపీల్చే జలగల్లారా! మాట్లాడరేం? ఇతర్ల బలంతో మీరు బ్రతుకుతారు. ఇతర్ల చేతులతో మీరు పనిచేస్తారు! ఈ రుణమంతా మీరు తీర్చాలిరా! ఇదంతా మీరు కక్కాలిరా! మీరు నాశనమైన తరువాత ధర్మదేవతముందు నిలబడాలిరా! తిన్నదానికీ ఉన్నదానికీ అంతా లెక్క చెప్పాలిరా! చేసిన ప్రతిపనికీ సంజాయిషీ చెప్పుకోవాలిరా! ఆఖరుకు ఒక కన్నీటి బొట్టుకు కూడా. మీరు చేసిన "ఘనకార్యాల" వల్ల ఎంతమంది ప్రజలు కళ్ళవెంట రక్తధారలు కురిపించారు? మీరు నిర్వహించిన పాత్రకూ మీరు చేసిన పనులకూ – మీకు తగినస్థానం నరకం. నరకమే మీకు చాలా మంచిచోటు. 'మీవంటివుండాకోర్లకు' అదే తగిన శిక్ష! మిమ్మల్ని కాల్చేది నిప్పుల్లో పడేసి కాదురా. మిమ్మల్ని సలసల మరిగే బురదలో ముంచి దహించాలి! అలా ఒకనాడు కాదు, ఒకసారి కాదు. శతాబ్దాల తరబడి మీరలా యాతన అనుభవిస్తూ ఉండాలి. పిశాచాలు మిమ్మల్ని పట్టుకుని కాగులో విసిరేస్తాయి. మీ మీద సలసల మరిగే బురద తెచ్చి పోస్తాయి. అహ్హా, హా, హా! సలసల మరిగే బురద మీ మీద పోస్తాయి. అహా, హా, హా! గౌరవనీయమైన వర్తకవర్గమా! జీవిత నిర్మాతలట. ఓ! మీరు భూతాలు! పిశాచాలు!"

ఇలాఅని ఘోమా వెర్రిగా విరగబడి నవ్వసాగాడు. ఆ పిచ్చినవ్వులో అతనికి వళ్ళు తెలీడంలేదు. రెండు ప్రక్కలూ చేతులతో పట్టుకున్నాడు. తల వెనక్కు వ్రేలాడవేశాడు. తూలి పడబోతూ కాళ్ళమీద నిలబడలేక నిలబడి నవ్వసాగాడు.

ఆ క్షణంలో చాలామంది వర్తకులు త్వరత్వరగా ఒకరి కొకరు కనుసైగలు చేసుకున్నారు. అందరూ ఒకేమాటు దూకు తూవచ్చి ఘోమామీద పడ్డారు. అంతమంది వచ్చి మీదపడే సరికి ఆ భారానికి ఘోమా క్రిందపడిపోయాడు. అలా అతన్ని క్రిందపడేసి వాళ్ళు అతనిమీదపడి అతన్ని అణగద్రొక్కసాగారు. వెంటనే ఘర్షణ, అల్లరి మొదలైంది.

"ఇక ఇప్పుడు దొరికిపోయావు!" అన్నారు ఎవరో.

"ఇప్పుడు పట్టుపడ్డావు!" అన్నారు మరెవరో, ఉక్కిరి బిక్కిరి అవుతున్న కంఠస్వరంతో.

"అయ్యో! ఇదేనా మీరు చేసేపని?" అంటూ గద్గద స్వరంతో ఘోమా అరిచాడు.

నల్లటి దేహాలన్నీ ఒకే ఒకచోట పెద్దగుట్టగా కనిపిస్తు న్నాయి. దాదాపు అరనిముషంసేపు వాళ్ళంతా అతని మీద పడి బరువుగా కాళ్ళతోనూ చేతులతోనూ తొక్కుతూ అత నితో పెనగులాడారు. తరువాత మందంగా ఇలా అరుపులు వినిపించాయి;

"అతన్ని క్రింద పడెయ్యండి!"

"అతనిచెయ్యి పట్టుకోండి, అతనిచెయ్యి! అయ్యో!"

"అయ్యో, నా గడ్డం!"

"తువాళ్లు తీసుకురండి! తువాళ్ళతో అతన్ని కట్టెయ్యండి!"

"నీవు కొరుకుతావా? కొరుకుతావా?"

"అలాగ! అదీ! సరేనా? ఎలా ఉంది దబ్బాయ్? ఆహా!"

"కొట్టకు! కొట్టడానికి సాహసించావా...?"

"సిద్ధమేనా!"

"అబ్బ! ఎంత బలముందిరా మనిషిదగ్గర!"

"ఏమి కండలు, ఏమి దండలు!"

"అతన్ని అటు ఒకప్రక్కకు మోసుకపోదాం పదండి".

"ఆరుబయటికి మోసుకపదండి. బాగా గాలివస్తుంది. అహ్హా, హా, హా!"

వాళ్లు థోమాను దూరంగా ఒకవైపుకు లాక్కొని పోయారు. కెప్టెన్ ఉండే కాబిన్ గోడకు ఆనించి పడుకోబెట్టారు. తరువాత వాళ్ళు నలిగిపోయిన తమదుస్తులు సరిచేసుకుంటూ, ముఖాలపై కారే చెమటలు తుడుచుకుంటూ, అతన్ని వదిలేసి అవతలికి వెళ్ళిపోయారు. థోమా ఒంటిగా మిగిలిపోయాడు. పోరాటంలో అలసిపోయి, ఓడిపోయి, తలవొంపులతో ఒంటిగా నిశ్శబ్దంగా అక్కడ పడిఉన్నాడు. అతని బట్టలు చిరిగిపోయాయి. బట్టలమీద, వంటిమీద ఏదో అసహ్యమైన మురికితో మరకలు పడ్డాయి. అతనికాళ్ళూ చేతులూ తువాళ్ళతోను, రుమాళ్ళతోను గట్టిగా కట్టివేశారు. అతనికళ్లు ఎర్రగా రక్తం చిమ్మ

తున్నాయి. అవమానితుడై, అసహాయుడై మౌనంగా ఆకసం వంక చూస్తున్నాడు. అతని కళ్ళలో కాంతిలేదు. మందంగా, నిర్జీవంగా, పిచ్చివాడిలా పిచ్చిచూపులు చూస్తున్నాడు. అతని రొమ్ము హెచ్చు తగ్గులుగా ఉబ్బిపోయింది. ఎంతో బరువుగా, బాధగా ఊపిరితీస్తున్నాడు.

ఇక ఇప్పుడు వాళ్ళవంతు వచ్చింది. అతన్ని నిందించి పరిహసించడానికి ఇప్పుడు వాళ్ళకు అవకాశం చిక్కింది. ముందు జుబోవ్ మొదలెట్టాడు. జుబోవ్ ఫోమా దగ్గరికి వెళ్ళి, ఫోమా డొక్కలో ఒక తన్ను తన్నాడు. పగతీర్చుకుంటున్నాననే సంతోషంతో పొంగిపోతూ, దేహమంతా ప్రకంపిస్తుండగా జుబోవ్ మెల్లగా ఇలా అడిగాడు.

"మేఘంలా గర్జించిన ఓ ప్రవక్తా! దైవజ్ఞా! ఇప్పుడెలా ఉంది? బాగుందా? ఇక ఇప్పుడు నీవు బాబిలోనియా చెరలు ఎంత తియ్యగా ఉంటాయో రుచిచూస్తావు. హీ, హీ, హీ!"

"ఉండు చెప్తాను; నను కాస్త ఊపిరి పీల్చుకోనియ్యి. నీవు నా నాలుకను కట్టెయ్యలేదు." అన్నాడు ఫోమా గద్గద స్వరంతో, అతని వంక చూడకుండా.

ఫోమా ఇలా అన్నాడేకాని, ఇక తానేమీ చెయ్యగలిగిందిలేదనీ, చెప్పగలిగిందీలేదనీ, అతను గ్రహించుకున్నాడు. వాళ్ళు తనను కట్టివేసినందుకు కాదు, తనేమీ చెయ్యలేకపోవడము, చెప్పలేకపోవడమూను. అతనిలో ఏదో జ్యోతి ఆరిపో

యింది అతని హృదయం అంధకారము, శూన్యము అయి పోయింది. అందువల్లనే ఫోమా ఏమీ చెప్పలేకపోయాడు, ఏమీ చేయలేకపోయాడు.

అంతలో రెజ్నికోవ్ కూడా జుబోవుతో కలిశాడు. పిమ్మట ఒకరి తరువాత ఒకరు వంతులు వేసుకొని అతన్ని దూషించి అవమానించడానికి అందరూ అతన్ని సమీపించారు. బొబ్రోవు, కననోవ్ ఇంకా చాలామంది యాకోవ్ మయకిన్ వెంట కాబిన్ లోకి వెళ్ళారు. మెల్లని కంఠస్వరాలతో ఏదో ఆదుర్దాగా చర్చించుకుంటున్నారు.

స్టీమర్ శరవేగంతో నగరంవైపుకు ప్రయాణంచేస్తోంది. స్టీమర్ యొక్క వేగానికి స్టీమర్‌లో ఉన్న మనుష్యులు, వస్తువులు కంపించిపోతున్నాయి. బల్లలమీద ఉన్న సీసాలు అటూ ఇటూ ఊగుతూ, వణకిపోతూ గలగలమని చప్పుళ్ళు చేస్తున్నాయి. అన్ని ధ్వనులకంటె ఈ ధ్వనులు ఫోమా చెవులకు ఎక్కువగాను, అయిష్టంగాను, దుఃఖసూచకంగాను వినిపిస్తున్నాయి అతని సమీపంలో ఒకగుంపు జనం పోగయ్యారు. ద్వేషంతో అవమానకరంగా నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నారు.

ఫోమాకు వాళ్ళముఖాలు కనిపించడంలేదు. ఏవో తెరల చాటునుంచి, పొగమంచు పొరల మాటునుంచి చూస్తున్నట్లుగా ఉంది అతనికి. వాళ్ళముఖా లతనికి మసకమసగ్గా, లీలగా మాత్రమే గోచరిస్తున్నట్టున్నాయి. అంచాత వాళ్ళనేమాట

లేపేకూడా అతనికి తాకడంలేదు. కాని ఇప్పు డతనిలో, అతని హృదయాంతరాళంలోనుంచి ఏదో పెద్దబాధ, ఏదో అంతులేని దుఃఖం ఎగతన్నుకుని వస్తున్నట్టు అనిపించిం దతనికి. అది అంత కంతకూ పెరిగి అంతటా వ్యాపిస్తున్న విషయంకూడా అతను గమనిస్తూనే ఉన్నాడు. అయినప్పటికీ అదేమిటో అతనికి అర్థం కావడంలేదు. కాని అప్పటికే ఏదో దుఃఖం, నీచస్థితి, పతనావస్థ తానను భవిస్తున్నట్టు గ్రహించగలిగా డతను.

"పిచ్చివాడా! ప్రజ్ఞలు పలికావే, డంబాలు కొట్టావే! ఇక ఇప్పుడాలోచించుకో. నీ కెలాంటి దుర్దశపట్టిందో ఒక్కమాటు కళ్లువిప్పి చూడు! ఎలాంటి పతనావస్థను కొని తెచ్చుకున్నావో ఆలోచించు! ఇక ఇప్పుడు నీవేం చేయగలవు? నీ గతేమిటి? ఇక ఏరకంగా బ్రతకడం నీకు సాధ్యం? నీకు దిక్కెవరు? నీకు తెలుసా? మాలో ఒక్కరమూ కూడా — కనీసం నీమీద ఉమ్మేయ్యడానికి కూడా మాకు తీరిక, ఓపిక ఉండదు!" అన్నాడు రెజ్నికోవ్.

"ఏం? ఎందుకని? నేనేంచేశాను?" అన్నాడు ఫోమా, ఏదో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ. వర్తకులు చిక్కగా అల్లుకున్న నల్లటి మబ్బులాగా అతనిచుట్టూ చేరారు.

"సరే, ఫోమ్కా! ఇప్పుడు నీతో పనంతా పూర్తయింది. నీకు చేయాల్సినశాస్తి చేశాం" అన్నాడు యుష్చొవ్.

"ఉండు! ఇంకా ఉంది. ఇప్పుడే చూపిస్తాం!" అంటూ మెల్లగా శంకె వేశాడు జుబోవ్.

"నన్ను వదిలిపెట్టండి !" అన్నాడు ఫోమా.

"లేదు. నీవు బ్రతికినంతకాలం ఇంతే !"

"చచ్చినా వదిలిపెట్టం !"

"అయినా ఇప్పుడు బాగానే ఉందిలేవోయ్ ! అలా కట్టేసిఉంటే నీవు హాయిగా పండుకోవచ్చుకూడా !"

"నా రక్షకపితను పిలవండి." అన్నాడు ఫోమా.

కాని సరిగ్గా అదేసమయానికి యాకోవ్ మయకిన్ ఎవరూ పిలవకుండానే అక్కడికి వచ్చాడు. వచ్చి ఫోమా ముందు నిల్చున్నాడు. వేలపడిపోయి, చాచుకుని పడిఉన్న తన రక్షక కుమారుణ్ణి తీక్షణంగా పరిశీలించి చూచాడు మయకిన్. అలా చూచి ఒకమాటు బరువుగా, బాధగా నిశ్వసించాడు

"అయ్యో, ఫోమా!" అని మొదలెట్టాడు మయకిన్.

"నన్ను వదిలెయ్యమని వాళ్ళను ఆజ్ఞాపించండి." మెల్లగా దుఃఖిస్తూ బ్రతిమాలుకున్నాడు ఫోమా.

"వదిలేస్తే మళ్ళీ విచ్చలవిడిగా అల్లరిచేద్దామనా ? వీల్లేదు, వీల్లేదు. నీవిలా పడుండడమే మంచిది." అని అతని రక్షకపిత సమాధానం చెప్పాడు.

"ఇక ఒక్కమాటకూడా అనను. దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను ! మళ్ళీ మాట్లాడను. కట్లూడదీసి నన్నొదిలిపెట్టండి. ఇక్కడిలా పడుండడం నాకు సిగ్గుగాఉంది ! మీకు పుణ్యముంటుంది. నన్నొదిలిపెట్టండి ! చూడండి ! నేను తాగలేదు. పోనీ, చేతులూడదీయకపోతే మానేసు." మళ్ళీ వేడుకున్నాడు ఫోమా.

"అయితే మళ్ళీ అల్లరిచెయ్యననీ, సరిగా ప్రవర్తిస్తాననీ, దేవుడిమీద ప్రమాణంచేసి చెపుతావా ?" అనడిగాడు మయకిన్.

"చెపుతాను ఎన్నటికీచేయను, ఎన్నటికీచేయను! ఓ, భగవంతుడా!" అని దుఃఖించాడు ఫోమా.

వాళ్ళు ఫోమాకాళ్ళకు కట్టినకట్లు ఊడదీశారు. కాని చేతులు మాత్రం అలాగే ఉంచారు. తరువాత ఫోమా లేచి నిల్చున్నాడు వాళ్ళందరివంక కలయచూచాడు. విషాదపూరితమైన చిరునవ్వుతో మెల్లగా ఇలా అన్నాడు:

"మీరే గెల్చారు."

"ఎప్పుడూ మేమే గెలుస్తాం!" అని జవాబు చెప్పాడు అతని రక్షకపిత మయకిన్, పరుషంగా హసిస్తూ.

ఫోమా చేతులు వెనక్కి విరిచికట్టిఉండడం వల్ల అతను వంగి మెల్లగా నిశ్శబ్దంగా ఎవరివంక కన్నెత్తిచూడకుండా బల్లదగ్గరకి నడచి వెళ్ళాడు. అతని ఆకారం కుంచించుకు పోయినట్టు కనిపిస్తోంది మనిషి ఎత్తుతగ్గిపోయాడు. సన్నగా, పీలగా అయినాడు. చింపిరి చింపిరిగా చెదరిపోయిన అతని జుట్టు అతని నుదుటిమీద, కణతలమీద పడివుంది. అతను తొడుక్కున్న చొక్కా, వక్షస్థలంమీద చిరిగి, చీలికలై, అతని వేస్టుకోటు క్రింద వ్రేలాడుతోంది. చొక్కాకాలరు అతనిపెదవులను కప్పుతోంది. గడ్డంక్రింద కాలరును పక్కకు నెట్టుకుందామని అతను మెడ తిప్పాడు. కాని ఎంతప్రయత్నించినా ప్రయోజనం

కలగనందున ఊరుకున్నాడు అప్పుడు తలనెరిసిన చిన్నవృద్ధు డొకడు అతన్ని సమీపించి, అతని బట్టలు సరిచేశాడు తరు వాత చిరునవ్వు నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూచి ఇలా అన్నాడు.

"నీ పీ బాధను భరించాలి."

ఇందాకటినుంచి ఫోమాను దూషిస్తూ పరిహసిస్తున్న వాళ్ళంతా, ఇప్పుడు మయకిన్‌సమక్షంలో మౌనంగా ఊరు కున్నారు. మయకిన్‌వంక ప్రశ్నార్థకంగాను, కుతూహలంతో పరిశీలిస్తున్నట్టుగాను, అతన్ని ఏదో ఒకటి చెయ్యమని అడుగు తున్నట్టుగాను చూస్తూ నిల్చున్నారు. కాని మయకిన్ ప్రశాం తంగా ఉన్నాడు. అతని కళ్ళుమాత్రం ఆ పరిస్థితికి తగినట్టు కాకుండా, ఏదో సంతృప్తితోను, కాంతివంతంగాను తళతళ లాడాయి.

"నాకు కొంచెం సోడా ఇవ్వండి" అరిచాడు ఫోమా. ఫోమా ఒక బల్లముందు కూచుని, ఎదురొమ్మును బల్లఅంచుకు ఆనించుకున్నాడు. అతని వంగిపోయిన ఆకారం చూస్తోంటే జాలి గొలుపుతోంది. అతని నిస్సహాయతను తెలుపుతోంది. అతనిచుట్టూ ఉన్నవాళ్ళంతా మెల్లగా ఒకరితో ఒకరు గుసగుసలాడుకుంటూ నిశ్శబ్దంగా మునివ్రేళ్ళమీద అటూ ఇటూ నడువసాగారు. అక్కడున్న ప్రతిఒక్కరూ మొదట ఒక మాటు ఫోమావంక, తరువాత తమకు ఎదురుగా కూచున్న మయకిన్ వంక చూడసాగారు. ఆ వృద్ధుడు ఫోమాకు వెంటనే సోడా ఇవ్వలేదు. అతను మొదట ఫోమాను నిశ్చలంగా పరిశీ

లించాడు. పిమ్మట మెల్లగా ఒక గ్లాసునిండా వోడ్కాపోసి, ఒక్కమాట కూడా మాట్లాడకుండా ఫోమానోటికిఅందించాడు. ఫోమా వోడ్కాతాగి తరువాత "ఇంకా కొంచెం ఇవ్వండి" అని అడిగాడు.

"అదిచాలు!" అని సమాధానం చెప్పాడు మయకిన్.

ఇది జరిగిన వెంటనే ఒక నిముషంపాటు ఒక బాధాకరమైన, పరిపూర్ణమైన నిశ్శబ్దం అంతటా అలముకుంది వర్తకులు నిశ్శబ్దంగా మునివ్రేళ్ళపై నడుస్తూ బల్లదగ్గరికి వస్తున్నారు.

అలా వచ్చి మెడలు ముందుకుసాచి ఫోమావంక చూస్తున్నారు.

"సరే, ఫోమ్కా! నీవు చేసిన పనేమిటో ఇప్పుడైనా నీకర్థమైందా?" అన్నాడు మయకిన్. ఈ ప్రశ్న అతను ఎంతో నెమ్మదిగా అడిగాడు అయినా అది అందరికీ వినిపించింది.

ఫోమా తలపంకించి మళ్ళీ మౌనంవహించాడు.

"నీవు చేసిన పనికి క్షమాపణలేదు! నీవు క్షమార్హుడవు కావు. మేమంతా క్రైస్తవులమే అయినప్పటికీ, మానుంచి క్షమాపణ పొందలేవు. ఈ విషయం మాత్రం తెలుసుకో." అన్నాడు మయకిన్ నిశ్చితంగా, కంఠస్వరం హెచ్చిస్తూ.

ఫోమా తలయెత్తి సాలోచనగా ఇలా అన్నాడు.

"నీ విషయం మాట్లాడడం పూర్తిగా మర్చిపోయాను రక్షకపితా! నిన్ను గురించి నేనొక్కమాటకూడా అనలేదు"

"అదిగో! అది విను! విన్నావా?" అంటూ వెగటుగా, తన రక్షక కుమారునికి వేలుపెట్టి చూపించాడు మయకిన్.

క్రోధావేశాలతో నిండిన మెల్లని, రణగొణ ధ్వనులు అలజడి ఆరంభమైనాయి.

"అయితే ఏం ఇప్పుడు? ఎలాగైనా నా కొకటే! దాంతో నా కేం పని? దానివల్ల నాకు వచ్చే దేమీ లేదు." అన్నాడు ఫోమా నిశ్వసిస్తూ. ఇలా చెప్పి అతను మళ్ళీ బల్లమీదికి వంగాడు.

"అయితే నీకేం కావాలి?" అనడిగాడు మయకిన్ నిక్కచ్చిగా.

"నా కేం కావాలి?" అంటూ ఫోమా తలఎత్తి వర్తకుల వంక చూచాడు. చిరునవ్వు నవ్వాడు.

"నాకు కావాల్సింది .." అని మళ్ళీ ఏదో చెప్పబోయాడు.

"నీవు తాగుబోతువు! పుండాకోరువు! పచ్చి పోకిరీ వెధవవు!" అరిచారు వర్తకులు.

"నేను తాగిలేను! నేను తాగింది రెండు గ్లాసులు మాత్రమే. నేను మైకంలో లేను. పూర్తిగా తెలివితో ఉన్నాను" దుఃఖితవదనుడై సమాధానం చెప్పాడు ఫోమా.

"కనుక నే నీవు చెప్పింది నిజం యాకొవ్ తారాసొవిచ్! అతనికి మతిచలించింది." అన్నాడు బాబ్రోవ్.

"నా కా?" ఆశ్చర్యపోతున్నట్లు అడిగాడు ఫోమా.

కాని, వాళ్ళెవరూ అతని విషయం పట్టించుకోలేదు. రెజ్నికోవ్, జుబోవ్, బాబ్రోవ్—వీరు ముగ్గురూ మాయకిన్

మీదికి వంగి, అతనితో మెల్లగా ఏదో మాట్లాడడం మొదలెట్టారు.

"రక్షకత్వం!" అనే ఒక్కమాట మాత్రం ఫోమా చెవులకు వినిపించింది.

బాధాపూరితమైన నేత్రాలతో వర్తకులందరి వంక ఒకమాటు చూచి "నా మనస్సేమీ చెదిరిపోలేదు. నేను కోరిందేదో నాకు సరిగా తెలుసు! నేను మిమ్మల్ని నిందించాలనే అనుకున్నాను!" అన్నాడు ఫోమా.

మళ్ళీ అతను ఉద్రిక్తుడైనాడు. కట్లు విడిపించుకుందామనే యత్నంలో ఒకమాటు చేతులను గట్టిగా విదిలించుకున్నాడు.

"ఆగు! ఇతన్ని పట్టుకోండి!" అని అరుస్తూ బాబ్రోవ్ అతని భుజాలు గట్టిగా పట్టుకున్నాడు.

"పట్టుకోండి! పట్టుకొని ఏంచేస్తారు?" అన్నాడు ఫోమా, విషాదంతోనూ, విచారంతోనూ.

"మాట్లాడకుండా కూచో!" అన్నాడు, అతని రక్షకపిత మయకిన్.

ఫోమా మాట్లాడడం మానేశాడు. ఇప్పుడతనికి, తను చేసినపనివల్ల ఎలాంటి ఫలితమూ లేదనీ, తనమాటలు ఆ వర్తకులను ఏమాత్రం కదిలించలేదనీ అవగతమైంది. వారందరూ ఒక దట్టమైనగుంపుగా, గోడపెట్టినట్టు అతనిచుట్టూ నిల్చుని ఉన్నారు. నిశ్శబ్దంగా నిశ్చితంగా ఉన్నారు. అతన్ని

ఒక తాగుబోతు క్రింద ఒక కాడిక్రింద చూస్తున్నారు. అతనిమీద ఏదో కుట్ర పన్నుతున్నారు. దృఢత్వము, తెలివితేటలు, నిండుదనం గల ఆ గుంపునంతా చూచే సరికి ఫోమాకు తాను వాళ్ళముందు ఎందుకూ పనికిరాని వ్యర్థుడ ననీ, దుర్బలుడననీ, అన్నివిధాలా నలిగిపోయి అవమానింపబడి పతనమైపోయినవాడననీ అనిపించింది ఫోమాకు. అలాటి తన దుర్భర నీచస్థితిని, నిస్సహాయతను తలుచుకుని తనమీద తనే జాలిపడుతున్నట్టుగా దిగులుపడసాగాడు ఫోమా. తను వాళ్ళందరినీ నిందించి ఎంతోకాలం గడిచిపోయినట్టుగా, తాను వాళ్ళకు కేవలం అపరిచితుడైనట్టుగా భావించసాగాడు. అసలు తానాపని ఎందువల్ల చేయాల్సివచ్చిందో, వాళ్ళను ఎందుకు నిందించాల్సివచ్చిందో కూడా అతనికి దురవగాహంగా ఉంది. తానే ఒకపెద్ద నేరస్థుడిలాగా, తానుచేసిన పనికి తానే సిగ్గు పడుతున్నట్టు భావించుకుని బాధపడసాగాడు. అతని గొంతులో ఏదో గురగురలాడుతున్నట్టనిపించింది. అతని హృదయంలో ఏదో వినూత్నమైనదీ, తనదికానిదీ వచ్చి ప్రవేశించినట్టుగా అనిపించింది. ఏదో దుమ్ము, ధూళి, బూడిద, బుగ్గిలాంటివేవో తన హృదయంలో చల్లినట్లుగా తోచింది. అంచాత అతని హృదయం అసహ్యంగాను, అవరోధంగాను, బాధతోను, బరువు తోను కొట్టుకొనసాగింది. తనుచేసినపని, తానే వివరించుకుంటు న్నట్టుగా ఎవరివంక చూడకుండా తనలోతానే మెల్లగా ఇలా అనుకున్నాడు :

"నేను నిజంమాట్లాడదలచుకున్నాను! మీ మీద నేరం

ఆరోపించ దలచుకున్నాను! జీవితమంటే ఇదేనా అని అడగ దలుచుకున్నాను!"

"పిచ్చివాడా! నీవేం నిజం మాట్లాడగలవు? నీకేం నిజం తెలుసునని?" అన్నాడు మయకిన్, వెగటుగా.

"నా హృదయం గాయపడిందనే విషయం నాకు తెలుసు. ఈశ్వరునిముందు మీరు ఏం సంజాయిషీ చెప్పుకుంటారు? ఆయన ముందు మీరంతా ఏ ముఖంపెట్టుకుని నిలబడగలరు? మీ రెందుకోసం బ్రతుకుతున్నట్టు? అవును. నే ననుకున్నది సత్యమే! ముమ్మాటికీ సత్యమే!" అన్నాడు ఫోమా.

"పాపం! పశ్చాత్తాపపడుతున్నాడు!" అన్నాడు రెజ్నికోవ్, వ్యంగ్యపూరితమైన మందహాసంతో.

"పడనీయి! పడితేపడ్డాడులే!" అన్నాడు బాబ్రోవ్, అసహ్యించుకుంటూ.

"అతని మాటలనుబట్టి చూస్తేనే అతనికి మతి చలించినట్టు స్పష్టమౌతోంది." అన్నారు మరెవరో. గుంపులోంచి.

"నిజంమాట్లాడడమనేది అందరికీ చాతనయ్యేపని కాదు! నిజాన్ని హృదయంద్వారా తెలుసుకోలేం. నిజాన్ని కేవలం బుద్ధిద్వారానే తెలుసుకోగలం. ఆ విషయం తెలిసిందా నీకు? నీవు నీ హృదయోద్వేగమని చెపుతున్నావే—అది అర్థంలేని విషయం! ఆవుకుకూడా బాధ కలుగుతుంది, నీవు దాని తోక మెలిపెడితే! కాని నీవు అవగతంచేసుకోవాలి! ప్రతి విషయాన్నీ అవగతంచేసుకోవాలి. నీ శత్రువునుగూడా నీవు అవగతంచేసుకోవాలి! అతను కలలోకూడా ఏమనుకుంటాడో

ఇలాచెప్పి ఫోమా తాను కూచున్న కుర్చీలోంచి లేవ బోయాడు. అతనికళ్ళు కోపంతో జ్వలించాయి. "నాచేతికట్లు విప్పండి!" అని అరిచాడు.

వాళ్ళంతా అతన్ని సమీపించారు. వర్తకుల ముఖా లన్నీ మరింత తీవ్రమైనాయి. రెజ్నికోవ్ అతనితో గాఢంగా హత్తుకునేటట్టు ఇలాచెప్పాడు:

"గొడవపెట్టకు! ఊరకే గలభాచెయ్యకు! త్వరలోనే ఊళ్ళోకి పోతాం! అనవసరంగా నీకునీవే తలవొంపులు తెచ్చు కోకు. మాకూ తలవొంపులు తీసుకురాకు. నిన్నిక్కడ రేవునుంచే సరాసరి పిచ్చాసుపత్రికి తీసుకెళ్ళంలే!"

"అదావిషయం! అయితే మీరు నన్ను పిచ్చాసుపత్రికి చేరుస్తారన్నమాట!" అన్నాడు ఫోమా.

కాని అతనిమాట కెవరూ సమాధానం చెప్పలేదు. ఫోమా అందరిముఖాలవంక చూచి తలవొంచుకున్నాడు.

"మర్యాదగా ప్రవర్తించు! నీ కట్లు విప్పుతాంలే!" అన్నారు ఎవరో.

"అవసరం లేదు! ఎలాఉన్నా ఒకటే, ఏమైనా ఒక్కటే! నాకేమిటి లెక్క? ఉమ్మేసి ఊరుకుంటాను! ఎలా ఉన్నా జరిగేదేమీ లేదు!" అన్నాడు మళ్ళీ ఫోమా.

మళ్ళీ అతను సంధిలో ఉన్నట్టుగా మాట్లాడసాగాడు. "నేను దోవతప్పిపోయాను! నేను ఓడిపోయాను! నాకు తెలుసు. దీనికి కారణం మీ బలంమాత్రం కాదు నాబలహీనతే దీనికి కారణం! అవును. మీరూ భగవంతునిదృష్టిలో క్రిమి కీటకాల్లాంటివాళ్ళే! ఆగండి! మీకూ అంతిమ క్షణాలు ఆసన్న

మవుతాయి! నేను గుడ్డితనంవల్లనే దోవ తప్పాను. గుడ్డిగా బలా చాలా తీక్షణంగా, ఎక్కువగా చూచాను. అంచాతనే అంధుడనయ్యాను. నా చిన్నతనంలో నే నొక కొండగుహలో ఒకగుడ్లగూబను వెంటాడాను. నాకు జ్ఞాపకముంది. అది అటూ ఇటూ ఎగిరి దేనికో కొట్టుకుంది. సూర్యరశ్మికి దాని కళ్ళు పోయాయి. అది గుడ్డిదైంది అది అలా గుడ్డిగా ఎగిరెగిరి అన్నిటికీ కొట్టుకుని గాయపడింది. దాని వళ్ళంతా నెత్తురు మయమైంది. చివరకది ఎక్కడో అదృశ్యమైంది. అప్పుడు మా నాన్నతో ఈవిషయం చెప్పాను. మానాన్న ఇలా చెప్పాడు: 'మనిషికూడా ఇంతే! ఒక మనిషి ఊరకే అనవసరంగా అదనీ, ఇదనీ తాపత్రయంతో కొట్టుకుంటాడు. హైరానుపడతాడు. అలసిపోతాడు. చివరకు ఎక్కడో కాస్త కళ్ళుమూస్తే చాలు నని. విశ్రాంతికోసం వాలిపోతాడు.' నాకట్లు విప్పండి!"

అతనిముఖం వివర్ణమైంది. అతనికళ్ళు మూసుకుపోయాయి. అతని భుజాలు ప్రకంపించాయి. ఛిద్రమై నలిగిపోయి, కుడితిలో ఎలుకలాగా కుర్చీలో అటూ ఇటూ కొట్టుకుంటూ, బల్లమీదికి వాలిపోయి పిచ్చివాడిలా తనలోతాను ఏదో గొణుక్కుంటున్నాడు.

వర్తకులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకుని ఏదో అర్థవంతంగా కనుసైగలుచేసుకున్నారు. ఒకరినొకరు మోచేతులతో పొడుచుకుంటూ, ఫోమాను చూచి నిశ్శబ్దంగా తలలూపారు. యాకోవ్ మయకిన్‌ముఖం నల్లగా, మలిచిన శిలలాగా నిశ్చలంగాఉంది.

"పోనీ, అతనికట్లు విప్పుదామా ?" అన్నాడు మెల్లగా బ్రాబోవ్.

"ఊరు దగ్గరికి రానీయండి !" అన్నారు మరెవరో.

"అక్కర్లేదు. అతన్ని ఇక్కడే ఉండనీయండి ! ఎవ రైనా వెళ్ళి ఒక బండి తీసుకరాండి. ఇక్కణ్ణుంచే సరాసరి పిచ్చాసుపత్రికి తీసుకు వెడదాం!" అన్నాడు మయకిన్, మెల్లగా.

"నాకెక్కడ శాంతి? నాకెక్కడ విశ్రాంతి? నేనెందులో దూకాలి ?" అని గొణుక్కున్నాడు ఫోమా.

అతనలా బాధతో చెదిరిపోయిన ముఖంతో, ఛిద్రమై, శిథిలమై, భగ్నప్రతిమలా కూర్చుండిపోయాడు.

మయకిన్ అక్కణ్ణుంచి లేచి కాబిన్‌లోకి వెడుతూ "అతన్ని కాస్త కనిపెట్టి ఉండండి ! నదిలో దూకుతాడేమో !" అన్నాడు.

"అతన్ని చూస్తూంటే నాకు చాలా విచారం వేస్తోంది!" అన్నాడు బ్రాబోవ్, వెళ్ళిపోతున్న మయకిన్‌తో.

"అందుకెవరూ బాధ్యులుకారు! అతను పిచ్చెక్కి, కావాలని చేసుకున్నదే అదంతా !" అని సమాధాన మిచ్చాడు రెజ్నికోవ్.

"మరి యాకోవ్ !......" అన్నాడు జుబోవ్, వెడు తోన్న మయకిన్‌వంక చూచి తలపంకిస్తూ.

"యాకోవ్‌కేమిటి ? అతనికేం నష్టం ?" అన్నారు మరెవరో.

"అవును, ఇకముందు మయికినే...అహా, హ, హా!"

"ఇకముందు అతనే సర్వాధికారి. అవుతాడు! అహ్హా, హా, హా!"

వాళ్ళ మెల్లని నవ్వులు, గుసగుసమాటలు ఇంజను చప్పుడులో కలిసి ఫోమాకు వినిపించలేదు. ఫోమా నిశ్చలంగా, శూన్యంలోకి తదేకంగా చూస్తూ కూచుండిపోయాడు. అతని చూపులు మందంగా ఉన్నాయి. అతని పెదవులు మాత్రం స్వల్పంగా అదురుతున్నాయి.

"మయకిన్ కొడుకు మళ్ళీ వచ్చాట్టగా!" అన్నాడు రహస్యంగా బాబ్రోవ్.

"అతని కొడుకు నాకు తెలుసు. నేనతన్ని పెరమ్‌లో కలుసుకున్నాను." యుష్ప్రోవ్ అన్నాడు.

"అయితే అతనెలాంటివాడంటావు?"

"మంచి తెలివైనవాడు. లౌకికుడు! పక్కా వ్యాపారస్తుడు!"

"అలాగా!"

"ఉసోలీలో ఒక పెద్ద వ్యాపారాన్ని అతనే నడుపుతాట్ట."

"అంచాత ఇక మయకిన్‌కు ఫోమాతో అవసరంలేదు. అదీ సంగతి!"

"ఇంకేం అయితే! మయకిన్ కొడుకే ఆస్తికంతకూ యజమాని అవుతాడు!"

"చూడండి, పాపం, ఎలా ఏడుస్తున్నాడో!"

"అరె!"

ఫోమా కుర్చీకానుకుని, తల భుజంమీద వాల్చుకుని కూచునిఉన్నాడు. అతనికళ్ళు మూసుకునిపోయాయి. కనురెప్పల క్రింద నుంచి ఒక్కొక్కటే కన్నీటికణాలు రాలుతున్నాయి. రాలి చెక్కిళ్ళమీదనుంచి జారి మీసాల్లో కలుస్తున్నాయి. పెదవులు విపరీతంగా అదురుతున్నాయి. కన్నీటికణాలు మీసాల్లోంచి వక్షస్థలంమీద పడుతున్నాయి. అతను నిశ్శబ్దంగా, నిశ్చలంగా కూచున్నాడు. అతని వక్షస్థలం మాత్రమే అసమంగా, కష్టంగా, కొట్టుకుంటోంది. వర్తకులు అతని విషణ్ణ అశ్రుసిక్తవదనం వంక చూచారు. ఫోమాముఖం బాధతో శుష్కించిపోయి ఉంది. పెదవుల అంచులు క్రిందికి జారాయి. తరువాత వర్తకులు మాట్లాడకుండా అతనికి దూరంగా తొలగి, అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

ఫోమా ఒంటిగా మిగిలిపోయాడు. అతనిచేతులు వెనక్కు విరిచి కట్టబడి ఉన్నాయి. అతనిముందు బల్లమీద అసహ్యమైన ఆహారపదార్థాలు, అందరూ తినగా మిగిలిన ఎంగిలి పళ్ళాలు నిండి ఉన్నాయి. మధ్యమధ్య అతను మెల్లగా బరువుగా, ఉబ్బిన కళ్ళు తెరిచి, ఆ కన్నీళ్ళగుండా అక్కడ చెదిరి పోయి, శిథిలమైఉన్న ఆ బల్లవంక విచారంగా చూస్తూ కూచున్నాడు.

   

మూడేండ్లు గడిచిపోయాయి.

సుమారొక ఏడాదిక్రితం యాకోవ్ తారాసొవిచ్ మయకిన్ మరణించాడు అతను చనిపోయేటప్పుడు బాగా తెలివితో ఉన్నాడు. అప్పుడుకూడా అతను తన విశ్వాసాలను వదిలిపెట్టలేదు. ఇక కొద్దిగంటలలో చనిపోతాడనగా అతను తన కుమారుణ్ణీ, కుమార్తెనూ, అల్లుణ్ణీ దగ్గరికి పిలిచి వాళ్ళతో ఇలా చెప్పాడు:

"సరే, బిడ్డలారా! కలిమిలో జీవించండి! యాకోవ్ జీవితంలో అన్నీ చవి చూచాడు. అన్నీ అనుభవించాడు. ఇక ఇప్పుడు యాకోవ్ వెళ్ళిపోయేతరుణ మాసన్నమైంది. చూడండి, బిడ్డలారా! నేను మరణిస్తున్నాను. అయినప్పటికీ నాలో భయం లేదు. బలహీనతలేదు. అయినా ఇదికూడా నాలో ఒక మంచి గుణంగానే పరిగణిస్తాడు ఆ ఈశ్వరుడు. నేనాయన్ను నొప్పించాను, ఆయనకు విసుగెత్తించాను. కాని నాచమత్కారాలతోనూ, పరిహాసాలతోనూమాత్రమే నేనెన్నడూ ఆయన్ను, దుఃఖంతోనూ, అదిలేదనీ, యిదిలేదనీ ఫిర్యాదులతోనూ, అసంతృప్తితోనూ నొప్పించలేదు! —ఓ ప్రభూ! నీ కృపవల్ల నేనొక అర్థవంతమైన జీవితాన్ని గడిపినందుకు సంతోషిస్తున్నాను! —బిడ్డలారా! వెడతాను, సెలవు! తప్పటడుగులు వెయ్యకుండా, అపశ్రుతులు లేకుండా హాయిగా, ఆనందముగా జీవించండి. ఏవిషయాన్నైనా అతిగా చర్చించి అతివేదాంతంలో పడకండి ఎవడైతే పాపానికి భయపడి పడకటింట్లో దాగి ప్రశాంతంగా పడుకుంటాడో అతనెన్నటికీ సుఖి కాలేడు. ఈ విషయం జ్ఞాపకం ఉంచుకోండి.

పిరికితనం ఎప్పుడూ మిమ్మల్ని పాపంనుంచి రక్షించదు. ఇది పెద్దలు చెప్పిన నీతివాక్యం. ఎవడైతే తన జీవితంలో ఒక ఆదర్శాన్ని సాధించదలుచుకుంటాడో, ఒక గమ్యాన్ని చేరదలుచుకుంటాడో, వాడు పాపానికి భయపడవలసినపనిలేదు. భగవంతుడు అతని తప్పులను క్షమిస్తాడు. జీవితాన్ని అభివృద్ధిచేయడం కోసమే మనిషిని ఈశ్వరుడు సృష్టించాడు. కాని ఆయన అందుకు తగినంత బుద్ధినీ, జ్ఞానాన్నీ మనిషికి ప్రసాదించలేదు. అంచాత ఆ ప్రభువు మనిషిని అన్నివిధాలా ఆజ్ఞాపించడు. గొప్పతనమే ఆయన కరుణ, ధర్మవిచారణే ఆయన మార్గం...”

ఇలా చెప్పిన కాసేపటికి మయకిన్ కళ్ళుమూశాడు. కాని ఎంతో మరణయాతన అనుభవించాడు.

కననోవ్ స్ట్రీమర్ సంఘటనజరిగిన తరువాత ఎందుచేతనో కాని యెజోవ్‌ను నగరంనుంచి బహిష్కరించారు. నగరంలో “తారాస్ మయకిన్ అండ్ ఆఫ్రికన్ స్మోలిన్” అనే పేరుతో ఒకపెద్ద వ్యాపారసంస్థ వెలిసింది.

ఈ మూడు సంవత్సరాల్లో ఫోమాను గురించి ఎలాంటి వార్తలూ తెలీలేదు, పిచ్చాసుపత్రినుంచి విడుదల అయిన తరువాత మయకిన్ అతన్ని, యూరప్‌లోఉన్న అతని తల్లివైపు బంధువుల ఇంటికెక్కడికో పంపించాడని అనుకునేవారు.

ఇటీవలనే ఫోమా మళ్ళీ నగరవీధులలో కనిపిస్తున్నాడు. మాసిపోయిన బట్టలతో, చిక్కిపోయి, శిథిలమై, పిచ్చివాడిలా ఉన్నాడు. ఇంచుమించు ఎప్పుడూ తాగే ఉంటాడు. దిగులుగా, ముడివడిన కనుబొమలతో, వంగిపోయి, తల రొమ్ముమీదికి వాల్చుకుని, మధ్యమధ్య జాలిగొలిపే వెర్రినవ్వుతో వీధులవెంట

వెడుతూఉంటాడు ఎప్పుడైనా కాస్త ఉద్రేకంతో రెచ్చిపోయి నట్టు కనిపిస్తాడుకాని, ఎప్పుడూ సాధారణంగా అలా జరగదు. తన పెంపుడు చెల్లెలితో కలిసి ఆమెఇంట్లో పెరట్లో ఒకచిన్న గదిలో ఉంటున్నాడు. వర్తకుల్లో అతని పరిచితులూ, ఇంకా నగరవాసులూ అతన్ని చూచి తరుచుగా ఎగతాళిచేస్తుంటారు. ఫోమా నగరవీధుల్లో నడిచివెడుతూ ఉంటే ఎవరోఒకరు అతన్ని ఇలా కేకవేస్తారు:

"ఏయ్, ప్రవక్తా! ఇలా రా! నిన్నే పిలిచేది!"

అయినా ఎప్పుడోకాని అతను వాళ్ళదగ్గరికి వెళ్ళడు. మనుష్యులంటే అసహ్యించుకుంటాడు. వాళ్ళకు దూరంగా ఉంటాడు. వాళ్ళతో మాట్లాడడంకూడా సహించలేడు. కాని అతను ఎప్పుడైనా మనుష్యులదగ్గరికి వెడితే వాళ్ళు అతనితో ఇలా అంటారు:

"సరేకాని, ప్రవక్తా! ప్రపంచానికి శిక్ష విధించేరోజు (ప్రజలందరినీ విచారించి తీర్పు చెప్పేరోజు) ఎప్పుడో మాకు చెప్పు చెప్పవూ? అహ్హా, హ్హా, హా! ఎలాగైనా ప్రవక్తవు!"

సమాప్తం.

——

